# వెండి వెలుగులు

(స్రవంతి [illegible] పత్రికలో ధారావాహికగా వెలువడిన

నవల

రచన

డా॥ వాసా ప్రభావతి

వాసా ప్రచురణలు
మలక్ పేట, హైదరాబాదు

# VENDI VELUGULU

by

Dr. VASA PRABHAVATI

మొదటి ముద్రణ.
ఆగస్టు. 1991
వెల రూ. 40/-

ముఖచిత్రం 'బ్నిం' (బి.ఎస్. మూర్తి) హైదరాబాదు.

ప్రతులకు
వి.వి. మాధవి
వాసానిలయం,
మునిసిపల్ కాలనీ మలక్ పేట,
హైదరాబాదు-500 036.

విశాలాంధ్ర బుక్ హౌస్
విజ్ఞానభవనం.
బాంక్ స్ట్రీట్ కోఠీ, హైదరాబాదు.

నవోదయ బుక్ హౌస్
సుల్తాన్ బజార్ - (ఆర్యసమాజ్ మందిరమునకు ఎదురుగా)
హైదరాబాదు.

నవయుగ బుక్ హౌస్
సుల్తాన్ బజార్ - హైదరాబాదు.

ముద్రణ :
[illegible]య ప్రింటింగ్ ప్రెస్,
హా.సి. లింగంపల్లి, హైదరాబాదు.

ఆచార్య ఎస్వీ. రామారావు
తెలుగు శాఖాధ్యక్షులు
ఉస్మానియా విశ్వవిద్యాలయం.

నవల అంటే నాకు ఎంతో ఇష్టమైనా, నవలను చదివే ఓపికా, తీరికా కొరవడినందుకు చింతిస్తూ వుంటాను. అటువంటి పరిస్థితిలో ప్రభావతిగారు 'వెండి వెలుగులు' తెచ్చి నా చేతుల్లో పెట్టి అభిప్రాయం అడిగినప్పుడు ఇబ్బందిగా వున్నా కాదనలేకపోయాను. అయితే పుస్తకం చదవటం మొదలుపెట్టాక విడిచిపెట్టకుండా ఆసాంతమూ నన్ను చదివింపజేసింది.

డా॥ యాసా ప్రభావతిగారు ఆంధ్రోపన్యాసకురాలుగా పలు పాఠశాలల్లో అనుభవం గడించారు. కవితలు, వ్యాసాలు, కథలు వెలువరించారు. తెలుగులో హరిశ్చంద్రోపాఖ్యానాలను పరిశోధించి డాక్టరేట్ పట్టం పొందారు. రచయిత్రిగానే కాక పెక్కు సాహితీ సంస్థలకు అండగా వుంటూ, కళాశాల అధ్యాపకులకు ప్రాతినిధ్యం వహిస్తూ కార్యరంగంలో కూడా ముందంజలో వున్నారు. ఈ పుస్తకం ద్వారా నవలా రంగంలో కూడా అడుగు పెట్టటం ఆసక్తికరమైన అంశం.

'వెండి వెలుగులు' నవల ఆద్యంతమూ ఆహ్లాదకరంగా సాగుతూ పాఠకుల మనస్సుల్లో వెన్నెలలు కురిపిస్తుంది. శాంకరి, సుబ్బులు, కాసులు, కనకం అన్న నాలుగు పాత్రలే ఈ నవలలోని వెండివెలుగులు. పల్లెసీమలోని సరళసుందర వాతావరణంతో గుబాళించిన వారి స్నేహబంధం పరిమళాలూ, వారి జీవితాల్లోని మబ్బులూ మెరుపులూ ఈ నవలకు ఇతివృత్తమైనాయి. రచయిత్రికి పరిచయం వున్న కాలేజీ చదువులూ, రాగింగ్‌లూ, హాస్టల్ జీవితాలూ కూడా ఈ కథలో చోటు చేసుకొన్నాయి.

వర్తమాన సమస్యలైన వరకట్నపు చావులూ, హింసా రాజకీయాలూ ఈ నవలలో గోచరించవు. దానికి కారణం ప్రభావతిగారు పుట్టిపెరిగిన వాతావరణం, సహజ రమణీయ ప్రకృతి పరిసరాలూ ఆమెపై గాఢమైన ముద్ర వేయటం. నగర జీవిత కాలుష్యానికి దూరంగా, సుందర గ్రామీణ జీవితాన్ని ఛిన్నాభిన్నం చేస్తున్న హింసాత్మక ప్రవృత్తికి భిన్నంగా ఇంకా ఏ మారుమూలనో మిగిలి వున్న ప్రశాంత వాతావరణానికీ, సాధుమనస్కుల సరళ స్వభావానికీ దర్పణం పట్టింది 'వెండి వెలుగులు'.

రౌడీయిజం, రాజకీయ కశ్మలం నిండిన కథలతో విసుగెత్తిన పాఠకులకు 'వెరైటీ'గా వెండి వెలుగులు నవల ఒక 'రిలీఫ్' కలిగిస్తుంది. ఈనాడు సినిమాలపై నవలల ప్రభావం వుందా, నవలలపై సినిమాల ప్రభావం వుందా విడదీసి చెప్పటం కష్టం. ఏమైనా ఈ వ్యాపారధోరణి ప్రభావానికి గురికాకుండా నాసా ప్రభావతిగారు నవలారచయిత్రిగా రాణించాలని ఆశిస్తూ అభినందిస్తున్నాను.

28-8-1991

డా॥ ఎస్వీ రామారావు

# వెండి వెలుగులు

వచనరచనా ప్రక్రియలలో నవల ఒకటి. ఇది పాశ్చాత్య దేశాలలో పుట్టి, ప్రౌఢ అయిన తరువాత, మన దేశంలో పంద సంవత్స రాల క్రిందట అవతరించిందని సాహిత్యపరిశీలకులు అంచనా వేశారు. నవల పరిధి విస్తృతమైనది. సమకాలీన సమాజంలోని మానవ జీవిత చిత్రణే దీనికి ధ్యేయంగా ఉండాలని ప్రారంభ పరిమితి లేదని కొన్ని నవలలు చదువుతుంటే మనకర్థమవుతుంది. నవలకూ చిన్న కథకూ చాలా తేడా కనబడుతుంది. చిన్నకథ అల్లిక చిక్కనైనది. నవలకు చిన్నకథలోని కుదింపు అవసరములేదు. కాని వివరణాత్మకంగా ఉండ టము అవసరము. అన్నివిషయాలపైనా రచయిత వ్యాఖ్యానించే వీలు దీనిలో ప్రవేశం ఉన్నది. పాత్రల చిత్రణ, నడవడి వీని సంఘటనలను బలాన్ని చేకూరుస్తాయి. నవల మనోరంజకంగా ఉండటమేకాదు...విజ్ఞాన సము పార్జనకు కూడా దోహదంచెయ్యాలి. యదార్థ జీవితంలోనున్న అనేక సంఘటనలు సహజాలు. యదార్థజీవితంలోని సత్యంకంటె వాస్తవికతకు దగ్గరగా ఉండే సత్యంగాఢతరమైనది. వేదన భావుకత-లు కలయికలూ నవలకు ప్రేరణశక్తులు. సంఘటనలకు తగిన వర్ణనలు, పాత్రలకు ఉచితమైన శైలి సంభాషణలు నవలకు పరిపూర్ణతను చేకూరుస్తాయి.

అయితే పైన చెప్పబడిన లక్షణాలన్ని ప్రతి నవలలోను మనకు కనబడకపోవచ్చు. రచయిత తన ప్రతిభా విశేషాలతో కొత్త కొత్త పుంతలు తొక్కవచ్చు. అది సహజం. ఈ కొత్తదనమనేది తరతరానికీ విషయంలోనూ విస్తృతిలోను కూడా మార్పుచెందుతూ వస్తున్నది.

పాత్రలు కూడా పరిమితంగా కూడా ఉంటున్నాయి. ఈ పుంతలన్నిటికీ మూలం నవలా సృష్టికి ఆద్యులయిన పాశ్చాత్యులని వేరే చెప్పనవసరం లేదు.

డాక్టరు వాసాప్రభావతిగారు రచించిన 'వెండి వెలుగులు' నవలలో పైన చెప్పబడిన లక్షణాలతో పాటు ఆధునికుల కొత్తపోకడలు కూడా కనబడతాయి.

ఈ నవల కోనసీమలోని ఒక గ్రామానికి సంబంధించినది.

కోనసీమలో ఎక్కడచూసినా వేదపండితులు, ఘనాపాఠీలు, వేదాలు పనసలు వల్లెవేసే విద్యార్థులు పనస, సపోటాచెట్ల నీడల క్రింద కనబడతారు, మామిడి, పనస, కొబ్బరి, సపోటా, అరటితోటలు గోదావరి నదీజలాలు కాలవల ద్వారా పుష్కలంగా అందుతూ ఉండే, నవనవలాడుతూ ఏపుగా పెరిగి, ఫలభరితాలై ఉంటాయి. ఎవరి యింట చూసినా అరటిగెలలు వేలాడుతూ ఉంటాయి. పనస, సపోటా, మామిడి, అరటి కాయలు గడ్డిలో మగ్గుతూ ఉంటాయి. పూచుట్లు కుండలలో మాగుతూ ఉంటాయి. అక్కడి వారికి పండ్లుకూరగాయలు పుష్కలంగా లభిస్తాయి. అక్కడి ప్రజలు చాలావరకు సదాచారసంపన్నులు. దేవాలయాలకువెళ్ళి అర్చనలు అభిషేకాలూ చేయించి ఉపవాసాలుండే భక్తిపరులు. పర్వదినాలలో తలారా స్నానాలుచేసి అరటి దొప్పలలో నేలదీపాలు వెలిగించి నదిలో వదలిపెట్టూ 'పోయిరా మాతల్లి పోయి రావమ్మా' అంటూ పాటలుపాడే స్త్రీలు కనబడతారు. ఎత్తిన తేరచాపతో నదిలో సాగిపోయే పడవలు చూడముచ్చటగా ఉంటాయి. పడవ పాటలు శ్రుతపేయంగా ఉంటాయి.

అక్కడి పిల్లలకు, పెద్దలకు పిక్‌నిక్ అంటే వాడపల్లి తీర్థమప్పుడు వెంకటేశ్వరస్వామిని దర్శించుకుని రథోత్సవములో పాల్గొనటానికి

వెళ్ళడమే, ఉపాహారాలు అరటిపండ్లు బుట్టలలో సర్దుకుని పిల్లలు పెద్దలు బయలుదేరుతారు ఎడ్లబండ్లలో. ఆ బండ్లను పోటీలుపడుతూ ఆడపిల్లలు తోలటం కూడా జరుగుతుంది.

ఆ గ్రామంలోని కుటుంబాలు మగవారినీ ఆడవారినీ వరసలు పెట్టి పిలుచుకుంటూ, కష్టసుఖాలను పంచుకుంటూ, ఆత్మీయులుగా జీవిస్తారు, ఎక్కువ తక్కువ లేకుండా పరస్పరం గౌరవించుకుంటూ సహకరించుకుంటారు. ఇదీ దాదాపు కోనసీమలోని గ్రామీణ వాతావరణం.

ఇటువంటి వాతావరణంలో డాక్టరు వాసా ప్రభావతిగారు నవీన నాగరికత, సంఘసంస్కరణలను ప్రవేశపెట్టి వెండి వెలుగులు ప్రసరింప చేశారు.

వెండి వెలుగులు నవలలో శాంకరి, సుబ్బులు, కాసులు, రమణం సూర్యం రాజు ఇంటర్మిడియెట్ పరీక్ష వ్రాసిన విద్యార్థినీ విద్యార్థులు. ఆడపిల్లలు మగపిల్లలతో పాటు సమానంగా చదువుకుంటారు. కాలవలో ఈదుతారు. ఎడ్లబండ్లను తోలుతారు. ఈ పిల్లలందరిలోకి శాంకరి ధైర్య సాహసాలు పదిరెట్లు ఎక్కువకలది. సంస్కారభావాలు ఆదర్శాలు కలిది. తన ఆదర్శాలను ఎట్టి పరిస్థితులలోను వదలుకోని పట్టుదల గలది. వీటితోపాటు అందచందాలు గలది.

పరీక్షాఫలితాలు తెలిసిన నాడు కొందరికి ఆనందం, కొందరికి విచారం కలుగుతుంది. పరీక్షలో నెగ్గనివాళ్ళు కుటుంబ పరిస్థితులవల్ల తిరిగి పరీక్ష వ్రాయలేకపోతారు. కొందరమ్మాయిలు పెళ్ళిచేసుకుంటారు సూర్యం వ్యవసాయం చేయటంలో తండ్రికి సహాయపడతాడు. ప్రథమ శ్రేణిలో విజయము సాధించిన శాంకరికి పైచదువు చదవాలన్న ఆశలు మోసులెత్తుతాయి. కాని తండ్రి ఆర్థికపరిస్థితి అందుకు తూగలేకపోయినా,

బామ్మగారి పెట్టెలోని మూటతో విశాఖపట్నంలోని మెడికల్ కాలేజీలో ప్రవేశించగలుగుతుంది.

చిచింద్రీవంటి శాంకరి కాలేజిలో ప్రవేశించిన తరువాత విద్యార్థినీ విద్యార్థులలో ఉండే రాగింగ్‌ను నిషేధింపచేస్తుంది తుపాకీ జర్గపు బుద్ధిచెబుతుంది. అమ్మాయిలను మోసంచేసిన అబ్బాయిలను దూరంగా ఉంచుతుంది. కాలేజి విద్యార్థినులకు పెద్దక్కగా సలహాలిస్తూ ఉంటుంది. సెలవుల్లో స్వగ్రామం వెళ్ళినప్పుడు, చదువు చాలించిన అమ్మాయిలచేత తిరిగి పరీక్షవ్రాసేటట్టుచేస్తుంది. ఆ గ్రామస్త్రీలకు ఉపాధి కల్పనా పథకాలను సహకార సంస్థద్వారా కల్పిస్తుంది. వితంతువులకు పునర్వివాహాలు చేయమని ప్రోద్బలం చేస్తుంది. వారునలుగురితో కలిసి తిరగగలిగే విధంగా వేషాలంకరణలలో మార్పులు తీసుకువస్తుంది.

శాంకరి వివాహానికి తొందరపడక నిగ్రహశక్తితో విద్యాభ్యాస, శిక్షణాకాలం పూర్తి అయిన తరువాత తను ప్రేమించిన యువకుడిని వివాహం చేసుకుని స్వగ్రామంలో వైద్యురాలిగా గ్రామస్థులకు సేవచేస్తూ పేరు ప్రఖ్యాతులు గడించుతుంది.

డాక్టరు వాసా ప్రభావతిగారు సందర్భానుకూలమైన వర్ణనలతో జాతీయాలు గుప్పించే సరససంభాషణలతో 368 పేజీలలో ఈ నవలను నడిపించారు. ప్రభుత్వ సహాయమపేక్షించకుండా గ్రామాభ్యుదయాన్ని సాధించే తీరును చక్కగా నిరూపించారు. సాహిత్య ప్రక్రియలన్నిటిలో ప్రవేశముగల డాక్టరు ప్రభావతిగారు బహుముఖ ప్రజ్ఞాశాలినిగా చిరకాలం పాఠకుల హృదయాలలో నిలిచిపోవాలని ఆకాంక్షిస్తున్నాను.

ఇల్లిందల సరస్వతీదేవి

'సువర్ణ'
2-2-1118 1/2.
న్యూనల్లకుంట,
హైదరాబాదు-44.



ప్రముఖ విద్యావేత్తయై సంఘసేవా పరాయణత్వముతో
కార్యకర్తగా, కర్తవ్యశీలిగా పేరుగాంచి బహుముఖ ప్రజ్ఞాశాలియై
దేశసేవకై జీవితము అంకితము చేసిన మాన్యులు
ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖా మాత్యులు

**డా॥ పి. వి. రంగారావుగారికి**

వెండి వెలుగులు సాంఘిక నవలను కానుకగా సమర్పిస్తున్నాను.

**డా॥ వాసా ప్రభావతి**

# వందనం – అభివందనం

ఒకనాడు ఆంధ్రదేశాన్ని ఉర్రూత లూగించిన పత్రిక కృష్ణా పత్రిక! తిరిగి హైదరాబాదు నగరంలో దినపత్రికగా అవతరించింది. పిరాట్ల వెంకటేశ్వర్లుగారు రథ సారథులు. రచయిత, మేధావి, సంపాదకులే కాదు పిరాట్లగారు సహృదయులు. నగరంలోని రచయిత్రులతో పాటు నన్నుకూడా వారి ఆఫీసుకు పిలిచారు. ఏ కవితో, ఏ వ్యాసమో రాయమంటారని ఉత్సాహంగా బయలు దేరి వెళ్ళారు కొత్తాఫీసు భవనం చూసాను. సంతోషమనిపించింది. కమ్మగా కాఫీలు తాగించారు. "ఈసారి మీరుకూడా నవల రాయాలండి" అన్నారు. "నేనా?" కొంచెం కంగారు పడ్డాను. కొంచెం సమయంకావాలన్నాను. సరేనన్నారు. వారి ప్రోత్సాహంతో మొదలు పెట్టాను. వారి మంచి రిమార్కులతో పాఠకుల మంచి తీర్పులతో ఉత్సాహంగా ముగించాను. ఈ విధంగా "వెండి వెలుగులు" నవలను నాచే రాయించి కృష్ణా పత్రికలో ధారావాహికంగా ప్రచురించిన ప్రధాన సంపాదకులు పిరాట్ల వెంకటేశ్వర్లుగారికి, ఆ పత్రిక యాజమాన్యానికి నా కృతజ్ఞతలు అందజేస్తున్నాను.

ప్రతి రోజు ముందు కథను రాస్తూ మధ్యలో నవలకు పరవళ్ళు తొక్కించే పాదాలలో కూర్చుచేసి పాఠకలోక హృదయాన్ని పరవసింప చేసిన ప్రముఖ రచయిత్రి నా స్నేహితురాలు కృష్ణాపత్రికలో వనితా శీర్షిక ఇన్‌ఛార్జ్ శ్రీమతి వేదుల శకుంతలగారికి నా కృతజ్ఞతలు. ప్రతి రోజు కథను చదివి చక్కటి చిత్రాన్ని వేసి నవలకు అలంకారాన్ని అందించిన రావుగారికి నా కృతజ్ఞతలు. నవలను చదివి మంచి రిమార్కులు చేసి ఆదరించిన పాఠక లోకానికి నా కృతజ్ఞతలు.

అడగగానె అభిప్రాయాన్ని రాసియిచ్చిన ప్రముఖ సాహితీవేత్త సహృదయులు ఉస్మానియా యునివర్సిటీ తెలుగు శాఖాధిపతులు ఆచార్య ఎస్. వి. రామారావు గారికి, ప్రముఖ రచయిత్రి రాష్ట్ర కేంద్ర సాహిత్య ఎకాడామి అవార్డ్ గ్రహితా సహృదయి శ్రీమతి ఇల్లిందల సరస్వతీ దేవిగారికి నా కృతజ్ఞతలు.

సకాలంలో ప్రింటుచేసి యిచ్చిన శ్రీ వి. మహేందర్ (అనసూయ ప్రింటింగ్ ప్రెస్) చక్కటి ముఖపత్ర రచన చేసియిచ్చిన ప్రముఖ ఆర్టిస్ట్ బ్నింకి నా కృతజ్ఞతలు అందజేస్తున్నాను.

— వాసా ప్రభావతి,
హైదరాబాద్.

# వెండి వెలుగులు

## 1

సాయంకాలం 6 గం.లయింది. సూర్యుడు పడమటి కొండ చేరుకుంటున్నాడు. అంతవరకు నీరెండలో మిలమిల మెరిసిన గోదావరి ఎరుపు-పసుపు రంగులు అద్దుకుంటోంది. నీటికొంగలు కేర్ కేర్ మంటూ గుంపులు, గుంపులుగా ఎగురుతున్నాయి.

శాంకరి రెండుకాళ్ళ నీళ్ళలో పెట్టి ఇసుకలో వెల్లకిల్లా పడుకుంది. ఆమె ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లు ఆమె ముఖమే చెబుతుంది.

"శాంకరి! ఆకాశం కేసి చూడవే" అంది ఆమెకు కాస్త దూరంగా కూర్చున్న కాసులు. శాంకరి తలతిప్పి కూడా చూడలేదు.

"శాంకరి! చూడవే! ఆకాశం ఎంత ఎర్రగా ఉందో" తిరిగి కనకమే ఉత్సాహంగా అంది.

"పేరాసి పెద్దమ్మ కుంకమ ఆరబెట్టుకుందే" ఆ పక్కనే కూర్చున్న కాసులు ఉత్సాహంగా అంది.

"అవును అదిగో! ఆ పక్కనే చూడవే ఎంత పచ్చగా ఉందో, అక్కడ పేరాసి పెద్దమ్మ పసుపు ఆరబెట్టుకుందే" అంది సుబ్బులు ఆకాశం కేసి చూస్తూ.

అయినా శాంకరి మాట్లాడలేదు.

ఈసారి కాసులు, కనకం, సుబ్బులు కోపంతో పళ్ళుకొరుక్కున్నారు.

"అదేమిటే తల్లీ! ఆ పరధ్యానం. ఆకాశంలో ఏ రాజకుమారుడైనా కనబడుతున్నాడా ఏమిటి?" అంది కనకం కోపం తగ్గించుకుని.

"నోర్ముయ్యవే! నోటికొచ్చినట్లు మాట్లాడకు" కోపంగా సమాధానం యిచ్చింది శాంకరీ దేవి.

"శంకరమ్మ తల్లీ! ఈ లోకానికొచ్చావ" అడిగింది కాసులు.

"తల్లీ! ఏ యే లోకాలు తిరిగొచ్చావు" అడిగింది సుబ్బులు.

"ఆ! ఆ! పద్నాలుగు లోకాలు తిరిగొచ్చాను. మిమ్మల్ని కూడ తిప్పమంటారా! ఊరుకుంటుంటే మరింత రెచ్చిపోతున్నారు" కసిరింది శాంకరి.

"ఇంకాస్సేపు ఇక్కడే కూర్చుంటే అంతపని జరుగుతుంది. కదులుతావా లేదా!" సీరియస్‌గా అడిగింది కాసులు.

నీళ్ళు చేత్తో తీసి- "అబ్బా నీళ్ళు ఎంత బాగున్నాయో" శాంకరి వాళ్ళ మాటలు వినిపించుకోనట్లే అంది.

"ఎప్పుడూ! ఇంతే! నువ్వు! నీ నీళ్ళును. నీటి గుఱ్ఱంలా నీళ్ళు చూస్తే కళేబరాన్ని కదిలించవు" కనకం విసుక్కుంది.

"అవును దానికేం! వాళ్ళమ్మ దాన్ని ఏమీ అనదు. చీకటి పడితే మా అమ్మ తిడుతుంది. మనం వెళ్ళిపోదామె" సుబ్బులు భయపడింది.

"మా అమ్మ కొడుతుంది కూడా. మనం వెళ్ళిపోదాం పదండి." అంది కాసులు.

"అవును దీన్ని ఇక్కడి వదిలెసి వెళ్ళిపోదాం! అప్పుడు తిక్క బాగా కుదురు తుంది" అంది కనకం.

ఆ మాటలు వినిపించుకోనట్లే వుండి పోయింది శాంకరి.

"ఓం! శాంకరీ దేవీ! మహా తల్లీ! లేచి వస్తావా? అమ్మవారి గుళ్ళో కొబ్బరికాయలు కొడతాం!" కోపంగా అరిచింది సుబ్బులు.

"దాని మొఖానికే కొడితేసరపడుతుంది. రోడ్లమీద గిత్తలా పరుగెత్తుతుంది. నీళ్ళలో తాబేల్లా అతుక్కుపోతుంది. దీంతో మనకొచ్చి పడిందే" కాసులు మొత్తుకుంది.

"ఇదిగో! శాంకరీ! శంకూ! నిన్నే! ఆఖరి సారి చెబుతున్నా! లేస్తావా! లేదా! లేవకపోతే! ముగ్గురం కలసి లాక్కుపోతాం!" బెదిరించింది కనకం.

శాంకరి ఆకాశం కేసి చూసింది. తర్వాత చుట్టూచూసింది. ఎరుపు రంగు తగ్గి చీకట్లుముసురుకుంటున్నాయి. తలతిప్పి వాళ్ళ కేసి చూసి నవ్వింది. కాని లేవ లేదు.

వాళ్ల కోపం తారాస్థాయికి చేరింది. ముగ్గురు కలసి ఆమెను నీళ్ళలోనించి లాక్కొచ్చారు. తర్వాత ఇసుకలో ఈడ్చుకుంటు గట్టు వరకు లాక్కొచ్చారు. అక్కడ ఎవరివో మాటలు వినబడ్డాయి- చటుక్కున శాంకరి వారిని విడిపించుకుని లేచి కూర్చుంది. అది చూసిన వారి ముఖాలు చేటలంతయ్యాయి.

అది వారికి అప్పుడప్పుడు అలవాటే. శాంకరి మధ్య మధ్యలో పెంకితనం చేస్తూనే ఉంటుంది. అది మిగిలిన వారికి సరదా! వారిచేత బతిమాలించుకోవడం ఆ శాంకరికి సరదా.

నలుగురు కాళ్ళకు అంటుకున్న ఇసుక దులుపుకుని యేటవాలుగా వున్నబాటలో నుంచి గట్టెక్కడం ప్రారంభించారు. పరుగెత్తుతూ ఎక్కాలని ఎంత ప్రయత్నించినా వారి వేగం కుంటు పడింది. చివరకు ఆయాసపడుతూ పైకి వచ్చారు. గట్టుమిద కూర్చున్న జాలరి రంగన్న వారిని ఇట్టేగుర్తు పట్టాడు.

"అమ్మాయి గోరు! ఇంత పొద్దుపోయే వరకున్నా రేంటమ్మా! సాయం రమ్మన్నా రేటి"

అక్కర్లేదు రంగన్నా! చిటెకకో వెళ్ళిపోతాం!" అంటూనె పరుగు లంకించు కున్నారు.

"జాగ్రత్తగా వెళ్ళండమ్మా!" రంగయ్య మాటలు వారిని చేరకుండానె గాలిలో కలిసిపోయాయి.

అయిదు నిమిషాల్లో పరుగెత్తుతూ గట్టుదాటి, అర నిమిషంతో కిందకిదిగారు.

గట్టు దిగగానె పొలాల మధ్యలో నుంచి నడిస్తేకాని పూరు రాదు. బాట కిరుపక్కలా అన్నీ పంట పొలాలె మూలంగా బాట మరింత చీకటిగా కనబడుతోంది. కీచురాళ్ళ శబ్దం 'గుయ్' మంటూ వినబడుతోంది! వెనక దుబ్బుల్లోంచి వచ్చే నక్కల అరుపులు వినబడగానె వారి సరదాకాస్త భయంగా మారిపోయింది.

"త్వరగా వెళ్ళిపోదామంటె విన్నావుకాదు. ఇప్పుడు చూడవే" కంఠం వణుకుతుంటే మెల్లిగా అంది కాసులు.

"అక్కడ ఇసుక తిప్పల్లోనే శవాలకు దహన సంస్కారాలు చేస్తారు. చింత చెట్టు రేవులో దెయ్యాలు కూడా తిరుగుతాయంటారు". అవన్నీ జ్ఞాపకమొచ్చి కనకం వణకడం మొదలు పెట్టింది.

సుబ్బులు స్పృహ తప్పే స్థితిలో వుంది. శాంకరికి కూడా చెప్పలేని భయంగా ఉంది. కాని పైకి లేని ధైర్యాం నటిస్తూ అడ్డం వస్తున్న చెట్లను రెండుచేతులతో తీసుకుంటూ మెల్లిగా ముందుకు నడుస్తోంది.

"భయపడకండి నాతోరండి" మెల్లగా చెప్పింది. చెట్లు కదిలిన శబ్దం దెయ్యం అరుపుల్లా వినబడుతుంటే ఆమె వెనకే మెల్లిగా కాలుతీసి కాలు పెడుతున్నారు.

పొలాలు దాటి ఊళ్ళోకి రాగానే గుండెలు మిద చేతులు వేసుకుని "అమ్మయ్య" అనుకున్నారు

"ఎందుకర్రా అంత భయం నేనున్నాగా" శాంకరి గర్వంగా అంది.

"అయ్యో నాతల్లే! ఈమాట అప్పుడనక ఇప్పుడంటున్నావేం తల్లీ" ముగ్గురు ఒకేసారి అన్నారు.

"నేను కాదేమి చెట్లను తోసుకుంటూ మిమ్మల్ని తోలుకొచ్చాను." బుంగ మూతి పెట్టింది శాంకరి.

"మహాతల్లీ! మంచివని చేసావుగాని. ఇంటిదగ్గర వున్నాయి మనకు చివాట్లు. నడు నడు". అంది అరిందాల కాసులు.

ముందుగా శాంకరి ఇల్లే వచ్చింది. శాంకరి తండ్రి ఎవరితోనో మాట్లాడుతూ వీధి అరుగుమీదె కూర్చుని వున్నారు. ఆయనచూడకుండా ఇంట్లోకి వెళ్ళాలని శాంకరి ప్రయత్నం. రెండు అడుగులు వేసిందో లేదో ఆయన చూడనే చూసారు.

"ఇంతవరకు ఎక్కడున్నారమ్మా"

"మేమంతా కలిసి గోదావరికి వెళ్ళాము!" నసిగింది శాంకరి, మిగిలిన ముగ్గురు అక్కడే నిలబడి చూస్తున్నారు.

"నీకెన్ని సార్లు చెప్పానమ్మా! ఇంత చీకటి పడే వరకు అక్కడ వుండడం మంచిది కాదని చెబితే వినరేం" గట్టిగా మందలించాడు రామనాధంగారు.

"కాదు నాన్నా! రంగన్న అంతవరకు సాయమొచ్చాడు". కారణం దొరికినందుకు కాస్తధైర్యంగా అంది.

"సరేలే లోపలికెళ్ళు! రేపటి నుంచి. మీరసలు ఆ ప్రాంతాలకు వెళ్ళకండి" అన్నారు. మందలింపుగా.

ఏం సమాధానం చెప్పాలో తెలుసుకున్న మిగిలిన ముగ్గురు తేలిగ్గా వూపిరి పీల్చుకుని ఇళ్ళవైపు పరుగులెట్టారు.

తలొంచుకుని లోపలకి పదుగెత్తింది శాంకరి. అదే సమయమను కున్న తమ్ముడు రవి "బాగా అయింది! మంచి బాగా అయింది! చంకలెగరేస్తూ గంతులేసాడు" "నీపని చెబుతానుండు రాకాసి" వెంటపరుగెత్తింది శాంకరి. "మధ్య వాడిని పట్టికోడతా వెందుకే! నీకు వయస్సు వచ్చింది కాని బుర్ర పెరగలేదే? చీకటిపడేవరకు ఆ గట్లమ్మట, పుంతలమ్మట తిరగొద్దని నీకెన్నిసార్లు చెప్పాలే" ఎదురొచ్చిన తల్లి నిలదీసి అడిగింది.

"నీ యీడుకి నన్ను ఇల్లు కదలినిచ్చేవారు కాదు. చదువు కుంటున్నావని వదిలేస్తే భయంలేకుండా తిరుగుతున్నావు?" అక్క మాటలు విని ఆశ్చర్యపోయింది శాంకరి. అసలు ఆమె ఎప్పుడు వచ్చిందికూడా శాంకరికి తెలియదు. ఆమె మాటలకి మాత్రం విపరీతమైన కోపంవచ్చింది.

"ఇదిగో! నాయిష్టం వచ్చినట్టు తిరుగుతాను. నేను నిజంగా తిరుగుతాను! అయితే ఏం చేస్తావో? చేసుకో!" అంటూ కాళ్ళు కడుక్కో డానికి బోరింగు దగ్గరకు పరుగెత్తింది శాంకరి. "చూసావా అమ్మా! నన్నెలా అంటుందో! పెద్దదాన్ననే గౌరవం కూడా లేదు దానికి" తల్లితో పితూరి చేసింది అక్క "అదో మొండిఘటం. దాన్ని మీ నాన్న గారే అలా తయారు చేస్తున్నారు. దానితో వాదనసీనెందుకు గాని ఆకులెయ్యండమ్మా భోజనాలు వడ్డిస్తాను." అనసూయమ్మ వంటింట్లోకి వెళ్ళింది.

శాంకరి కాళ్ళు కడుక్కుని వచ్చింది. తల్లి మాటలు వినడంచేత చీపురు పట్టుకొచ్చి వసారా శుభ్రంగా తుడిచి నీళ్ళు జల్లింది. తర్వాత అరిటాకులు పట్టుకొచ్చి చిన్న ఆకులుకోసి పిల్లలకు వేరుగా వేసింది. చిగురున్న ఆకు వేరుగా తండ్రికి వేసింది. తర్వాత పీటలు పట్టుకొచ్చి పెద్దపీట తండ్రికి వేసి చిన్న పీటలు పిల్లలకు వేసింది. అవన్నీ చూసిన అక్కగారు "ఈ పనులన్ని చెల్లెలు ఎప్పుడు నేర్చుకుందా అని ఆశ్చర్యంగా చూసింది." ఆమె మంచినీళ్ళు అందరికీ పెట్టింది. శాంకరి గదిలోకి వెళ్ళి బట్టలు మార్చుకుని వచ్చింది. అక్క పిల్లలకు అన్నాలు కలిపి పెట్టాలని కూర్చుంది.

"అమ్మా! నెయ్యి వడ్డించనా?" శాంకరి మాటలకు వడ్డిస్తున్న తల్లి తలెత్తి చూసింది.

"నువ్వు కూడా వచ్చి కూర్చో! నెయ్యి నేవేస్తాలే" శాంకరి పని, మాటాకూడా తీరుప్పుగా వుంటాయి అనుకుంది తల్లి. అందరితో పాటు శాంకరి కూడా అన్నం కలుపుకుంది.

"ఏం సుశీలా! అల్లుడుగారు రాలేదు" పెద్దకూతుర్ని చూస్తూ అడిగాడు తండ్రి.

"ఆయన రావడానికి టైంలేదుట., పనులు ఎక్కువద వున్నాయిట" అంది సుశీల నసుగుతూ.

"అలాగా! అయిన ఆఫీసులో ఎప్పుడూ వుండే పనులేగా! సరదగా అతను కూడా వస్తే బాగుండేది."

"ఆయనకి అలాంటి సరదాలేమి లేవు నాన్నా! ఆయనకి ఆఫీసుకి వెళ్ళడానికి చాలా కష్టమవుతోంది నాన్నా! పెళ్ళయ్యాక అయనకి ఏ అచ్చటా, ముచ్చటా తీరలేదట, కనీసం ఈసారి స్కూటరైనా కొనిమ్మని చెప్పమన్నారు మా అత్తగారు." సుశీల కంఠం బొంగురుపోయి ఇంక చెప్పలేక వూరుకుంది.

"స్కూటరా అమ్మా! అది కొనడం మామూలు కాదమ్మా!" భోజనం పూర్తిచేసిన తండ్రి చెయ్యికడుక్కోడానికి లేచారు.

"అయ్యో, గొప్పత్తగారే! అవిడ సిగ్గులేక అడిగితే మాత్రం నువ్వెలా పట్టుకొస్తానని బయలు దేరావ్?" శాంకరి వెటకారం చేసింది.

"శాంకరీ! నోరు మూసుకోవే! నీకెందుకీ పెద్దవాళ్ళ విషయాలు" తల్లి మందలించింది.

"నాకాక ఇంకెవరికమ్మా! నాన్న అంత డబ్బు ఎక్కడనుండి పట్టుకొస్తారే? అయినా బావ ఆఫీసులో లోను తీసుకుని కొనుక్కోవచ్చుకదా! అవునా అక్కా."

"బుద్ధిలేక వచ్చాను. దీనిచేతకూడా చివాట్లు తినడానికి, ఇంతకీ నా అదృష్టం ఇలావుంది. మా పక్కింటి విజయకు వాళ్ళనాన్న ఇల్లే కొనిచ్చాడు. ఏబై రూపాయలు ఖర్చు పెట్టుకొని అనవసరంగా వచ్చాను" అంటూ ముక్కు చీదుకుంటూ అన్నం తింటున్న పిల్లల్ని బరబరా లాక్కువెళ్ళి చేతులు కడగడం ప్రారంభించింది. పిల్లలు భోరున ఎడుపులు ప్రారంభించారు.

అనుకోని ఆ సంఘటనకు శాంకరి భయపడి మెల్లిగా అక్కడనుంచి జారుకుంది.

హాల్లో వాలు కుర్చీలో కూర్చున్న తండ్రికి ఆ మాటలు వినబడే వుంటాయి. కాని ఆయన ఏమీ మాట్లాడలేదు.

"కొనిచ్చేది మీ నాన్న, పట్టుకెళ్ళేది నువ్వు. మధ్యదాని పెత్తనం ఏమిటే. అవాకులు, చవాకులు అలా వాగుతూనే వుంటుంది. ఆవేం పట్టించుకోకు నువ్వు. ఆ పిల్లల్ని సరిగా అన్నాలు తిననియ్యి" అనునయంగా అంది తల్లి. ఇటు కుటుంబ పరిస్థితి తెలుసు. అటు అత్తచాటు కోడలి పరిస్థితి తెలుసు, అయినా పైకి ఏమీ తేలని నిండుకుండ ఆ యిల్లాలు.

"ఇంకేం తింటారు ముష్టి పిల్లలు" అంటూ ఇటు తిరిగింది.

"నేను మీనాన్నగారితో చెబుతాలే తల్లీ! రా! అన్నానికి రా! పొద్దుటనగా ఎప్పుడు తిన్నవో ఏమో!" అంటూ అన్నాలు వడ్డించిది ఆ తల్లి.

ఆ కన్నతల్లి మాటలకు ఆ కూతురికి చెప్పలేని ఓదార్పు కలిగింది. స్కూటరు కొనిచ్చినంత సంబరపడింది.

స్కూటరు లేకుండా వెడితే అత్తగారు ఎంత తిడుతుందో, భర్త ఎంత విసుక్కుంటాడో అన్న బెంగ తీరిపోయింది. తల్లితో పాటు అన్నానికి కూర్చుంది. "పిచ్చిపిల్ల" అత్తారింట్లో ఎన్ని కష్టాలు పడుతుందో! ఏమో? లేకపోతే సిగ్గువిడిచి తండ్రిని స్కూటరు కొనిమ్మని ఏ కూతురైన అడగ్గలదా! ఉన్నవారైతే ఏదైనా పెట్టగలరు? కాని లేని వారి ఆడపిల్లలకు అత్తవారింట్లో ఆగచాట్లేనా?" తల్లి మనస్సు కలుక్కుమంది. వచ్చే కన్నీళ్ళు కూతురు చూడకుండా తుడుచుకుంది ఆయిల్లాలు.

శాంకరి వసారాలో వారగా మంచాలువాల్చి పక్కవేసింది. పిల్లలు వెళ్ళి పడుక్కున్నారు.

తల్లీకూతుళ్ళు ఎక్కువ సంభాషణలు లేకుండానే భోజనాలు ముగించారు.

గిన్నెలన్నీ సర్ది, "అమ్మా! శాంకరీ! కాస్త వసారా కడిగెయ్యి" అంటూ పిలిచింది. శాంకరి నిద్రపోతున్నట్లు నటించి, లేవలేదు.

"నేను కడుగుతాలే. ఆవిడ చదువుకున్న మహారాణి కదా!

పెళ్ళయ్యాక చూస్తాలే దాని సంగతి" నీళ్ళుపోసి కొబ్బరి చీపురుతో కడగడం మొదలు పెట్టింది.

"నువ్వేం చూస్తావే? నేనసలు పెళ్ళిచేసుకోను. చదువుకుని ఉద్యోగం చేసి నాన్న అప్పులన్నీ తీరుస్తానే? ఏమనుకుంటున్నావు?" నిద్ర నటించిన శాంకరి లేచి కూర్చుని అక్కకి సమాధానం చెప్పిం.

ఈసారి చెల్లి మాటలు సుశీలకు ఆశ్చర్యంగా అనిపించాయి. "నిజంగా ఆడవారు చదువుకుంటే ఎందుకురాదు చదవు. చదువుకుని ఉద్యోగం ఎందుకు చెయ్యకూడదు?" చెల్లెలు మాటలు ఆలోచిస్తూ కడగడం పూర్తి చేసి ముగ్గువేసింది. "నాకు ఎలాగూ చదువులేదు దానికైనా చదువు చెప్పించి ఉద్యోగంలో పెట్టించండి. అదేనా సుఖపడుతుంది." అంటున్నా సుశీల మాటలకు ఆ తల్లి ఆశ్చర్య పోయింది.

"ఏదైనా చిన్న కూతురికి వున్న తెలివి ఆలోచన పెద్ద కూతురికి లేవు? కాస్త మెత్తని మనిషి. ఇది గడుగ్గాయి. ఎలాగైనా నెగ్గుకొస్తుంది" అనుకుని తృప్తిపడిన అన్నపూర్ణమ్మ నిద్రలోకి జారుకుంది.

ఆ మాటలన్నీ వింటూనే వున్నారు రామనాథంగారు.

అల్లుడికి ఎట్టి పరిస్థితుల్లోను స్కూటరు కొనివ్వలేనని నిశ్చయించుకున్నారు. అప్పటికే పూరంతా అప్పులున్నాయి. ఇంక అప్పు పుట్టే అవకాశం లేదు. ఆపిల్ల పెళ్ళప్పులే తీర్చలేదు. పెంచ వలసిన కూతురు, కొడుకు వున్నారు. "ఈ రోజు స్కూటరు కొనిస్తే రేపు మరొకటి. ఎట్టి పరిస్థితుల్లోను స్కూటరు కొనివ్వకూడదు. కూతుర్కి ఏదైనా అంటే వారి సంగతి చూస్తా" ఆయన మనస్సు తేలికయింది. మెల్లిగా కునుకు పట్టి నిద్రలోకి జారుకున్నారు.

## 2

మర్నాడు ఆదివారం. సాయంకాలం 5 గంటలయింది. పొగలు కక్కే వేసవి ఎండ తగ్గి చల్లబడింది. అంతవరకు వీథి అరుగు మీద

కూర్చొని కబుర్లు చెప్పిన రామనాథం గారు పొలాలవైపు వెళ్ళారు. ఆయనతో పాటు అంతవరకు కబుర్లు చెప్పిన వాళ్ళు కూడా కదిలారు.

అదే అదననుకున్న శాంకరి వీధి అరుగుమీద వారగా పెట్టిన సైకిలు కిందికి దింపి రెండు వేళ్ళు నోట్లో పెట్టి ఈల వేసింది. అది విన్న కనకం ఒక్క పరుగున బయటకు వచ్చి తొంగి చూసింది. వెంటనే మెల్లిగా వీధి మెట్ల మీంచి సైకిలు కిందికి దింపింది.

ఇద్దరూ కలసి ముందుకు వెళ్ళి మరోసారి ఈలవేశారు. రెండిళ్ళ వతల వున్న కాసులు, సుబ్బులు వీధుల్లోకి వచ్చి చూసారు. వాళ్ళిద్దరికి సైకిళ్ళు లేవు. వీళ్ళ సైకిలు సీట్ల వెనక కూర్చోడం వారికి అలవాటు.

ఆ సమయంలో సాధారణంగా మగవారు ఇళ్ళల్లో వుండరు. ఆడపిల్లలు అలా సైకిళ్ళు ఎక్కి తిరుగుతుంటే వారి తల్లులు, అమ్మమ్మలు, బామ్మలు కూడా పైకి కోపం చేసినా లోపల ముచ్చట పడేవారు.

ఆ వూళ్ళోఇద్దరు ఆడవాళ్ళు స్వాతంత్ర్య సమయంలో జైలుకి వెళ్ళిన వారు, మహాత్మునికి సర్వం వొలిచి ఇచ్చిన వారు వున్నారు. వారి ప్రోత్సాహమే ఆ ఆడపిల్లలకు అండ. ఏ కష్టాలు బరువులు వంటపట్టని ఆ యువతులు నవ్వుతూ, సైకిళ్ళతో ముందుకు కదిలారు.

"శంకూ! రేపే మన ఫస్టియర్ రిజల్ట్సు వస్తాయిట" కనకం మాటలకు అందరు తలెత్తి చూసారు.

"నీకెవరు చెప్పారే?" అడిగింది కాసులు.

"ఇందాక సూర్యం చెప్పాడు రేపు మన కాలేజీకి వస్తాయిట" తిరిగి కనకమే చెప్పింది.

"నాకెందుకో భయంగా వుంది. పరీక్ష పాసయితే సరే, ఫేలయితే మా నాన్న చదువు మాన్పిస్తానంటున్నారు" భయంగా చెప్పింది కాసులు.

"పాసయినా, ఫేలయినా ఒక్కటే! మా నాన్న ఇంక చదివించడట" చెప్పింది సుబ్బులు.

"మీ వాళ్ళు వద్దంటే వెంటనే మానేస్తావా?" అడిగింది కనకం.

"పేచి పెడతాలే? అయినా పెద్ద వాళ్ళు చెప్పింది వినాలి కదా? ఎదిరించే శక్తి మాత్రం నాకు లేదు?" తన అభిప్రాయం చెప్పింది సుబ్బులు.

"అయితే పెళ్ళి చేసుకుని బుద్ధిమంతురాలిలా అత్తారింటి కెళ్ళవే సుబ్బులూ! కనకం సాగదీసింది.

"ఆపండే! అపశకున పక్షుల్లా ఏమిటా గోల! మనందరం పరీక్ష పాసవుతాం! హాయిగా అందరూ కలిసి చదువుకుందా" అందరిని సమాధాన పరిచింది శాంకరి.

"తల్లీ! శాంకరీ! ఇక్కడ ఇంత చురుగ్గా సైకిలు తొక్కుతున్నావే నిన్న అలా నీళ్ళల్లో కాగితంలా పడివున్నావేమే?" అడిగింది కాసులు.

"ఏదో! అంత సీరియస్‌గా ఆలోచించావ్? మాతో చెప్పకూడనిదా?" కనకం రెట్టించింది.

"ఏంలేదు? మన సంగతే? కట్నాలు, కానుకలు అడిగిన వాణ్ణి పెళ్ళి చేసుకోకూడదని ఆలోచిస్తూ కూర్చున్నాను".

అదా సంగతి! "అయినాతల్లీ! మన మాట ఎవరు వింటారే? కనీసం మనింట్లో వాళ్ళైనా వినరు? ఇంక పైవాళ్ళు ఏం వింటారు?" సుబ్బులు అడిగింది.

"అదిగో అక్కడే వుంది తమాషా! మనింట్లో వాళ్ళు వింటే చాలు పైవాళ్ళ సంగతి మనకి అవసరం లేదు" శాంకరి మాటలు మిగిలిన వారు ఆశ్చర్యంగా విన్నారు.

"అదీ నిజమే?" అంది కనకం.

"అవన్నీ పెద్ద వాళ్ళ విషయాలే, మనకెందుకు చెప్పు. మన సంగతి మనం చూసుకుందాం" సుబ్బులు, కాసులు నసిగారు.

అంతలో వెనకనించి సైకిలు బెల్ మోగింది. అంతవరకు రోడ్డంతా ఆక్రమించి వెడుతున్న నలుగురు యువతులు ఉలిక్కిపడి వెనక్కి తలతిప్పి చూసారు.

సూర్యం, రాజా కాకుండా, మరో కొత్తబ్బాయి వాళ్ళతో ఉండటం గమనించారు.

వారికి దారి యివ్వకుండా శాంకరి, కనకం వేగంగా తొక్కుతున్నారు. వెనక కూర్చున కాసులు, సుబ్బులు, పోనీ పోనీ అంటున్నారు.

వెనకవారు మరింత వేగం హెచ్చించారు.

"బెల్ కొడుతుంటే కూడా మీ వూళ్ళో వాళ్ళు తప్పుకోరా?" ఆ కొత్తబ్బాయి సూర్యాన్ని అడిగాడు.

"ఊరుకో శివా? వాళ్ల వెనక మనం వెడదాం!" మెల్లిగా అన్న సూర్యం మాటలు శాంకరి చెవున పడ్డాయి.

"ఇదెక్కడి బాధరా బాబు! కాస్త తప్పుకుని దారి ఇమ్మనరా!" శివా సూర్యాన్ని వేడుకున్నాడు.

"మనం తప్పుకోం! దారి యివ్వంచెప్పవే కాసులు" కనకం, శాంకరి ప్రోత్సాహంతో హెచ్చరిక చేసింది.

కాసులు, సుబ్బులు పక పకా నవ్వారు.

సూర్యం కూడా వాళ్ళతో పాటు నవ్వాడు. రాజా పెదాలువిప్పి చిరునవ్వు నవ్వాడు. శివాకు మాత్రం చెప్పలేని కోపంవచ్చింది. వారి నవ్వులు తనని అవమానించినట్లు భావించాడు.

సూర్యం ఆపినా ఆగకుండా సైకిలు స్పీడు హెచ్చించి, వారిని దాటుకుని ముందుకు పోబోయాడు. కుడిచేతి వైపునుంచి అయితే అతను దాటుకు పోయేవాడే. ఎడమవైపు శాంకరి వుంది. పైగా ఆ పక్క పెద్ద నీళ్ళ గొయ్యి వుంది.

శాంకరి కూడా మరింత వేగం హెచ్చించ్చింది. అతని సైకిల్ని ఆప బోయింది. సైకిలు పక్క ఖాళీలేక అతను వెళ్ళి నీళ్ళ గుంటలో పడ్డాడు.

ఒకసారి ఆ నలుగురు యువతులు విజిల్సు వేసుకుంటూ ముందుకు వెళ్ళిపోయారు.

"చెబితే విన్నావుకాదు. వాళ్ళ జోలి మనంకెందురా!" సూర్యం మందలించాడు.

"ఇన్ని వూళ్ళు తిరిగాను కాని. ఇంత పొగరుబోతు ఆడ పిల్లల్ని మాత్రం చూడలేదురా!" నెత్తి పట్టుకున్నాడు శివా! కాని లోపల మాత్రం చాలా బాధపడ్డాడు. ఆడపిల్ల చేతిలో అవమానం పాలయ్యాననుకున్నాడు. సూర్యం, రాజాలు ఒకరి ముఖాలు ఒకరు చూసుకుని నవ్వుకున్నారు.

శివా ఆమెను గురించి ఎన్నో అడగాలనుకున్నాడు. రాజా వుండడం వల్ల ఏమీ అడగలేకపోయాడు. శాంకరి విషయం తెలుసు కోవాలనుకున్నాడు.

# 3

రాజా తన యిల్లు రాగానే వెళ్ళిపోయాడు. సూర్యం వెంట శివా వాళ్ళింట్లోకి వెళ్ళాడు. తరువాత తలకు స్నానం చేసి బట్టలు మార్చుకున్నాడు.

సూర్యం ఇద్దరికీ వీధిలో కుర్చీలు వేశాడు. శివా మనస్సు ఏదోలా వుంది. శాంకరి మీద కోపం భగభగ మండుతోంది. రేడియో పట్టుకుని కుర్చీలో కూర్చున్నాడు.

చల్లని గాలి వచ్చి చుట్టుముడుతోంది.

"శివా! దెబ్బలేమైనా తగిలాయా? అనవసరంగా తొందరపడ్డావు" అన్నాడు సూర్యం.

దెబ్బలేం తగల్లేదు కాని ఆవిడగారు నీకు చుట్టమా? విసుగ్గా అడిగాడు శివా?

"చుట్టమా? అని అడుగుతావేమిటి ఆమె మా రామనాథం మామయ్య కూతురు. పేరు శాంకరీదేవి. కొందరు శాంకూ అంటారు. నాతోచే ఇంటర్ చదువుతోంది.

"నీకు క్లాస్‌మీటా? ఎలా వేగుతున్నావురా? అందుకే ఇంత పీలగా, మెత్తగా అయిపోయివుంటావు?"

శివా మాటలకి పకపక నవ్వాడు సూర్యం. అంతలో అటుగా వస్తున్నా సూర్యం తండ్రి జగన్నాధంగారు, రామనాథం గారు కనిపించారు.

"అదిగో, ఆయనే మా మేనమామ. శాంకరి తండ్రి" సూర్యం చూపించిన వైపు చూశాడు శివా.

"ఎవరు ఆ కుర్చీలో" శివాను చూసిన రామనాధం గారు అడిగారు..

"ఇతను మన నారాయణ రావుగారి అబ్బాయి, శివకుమార్ ఇంజనీర్ చదువుతున్నాడు" జచన్నాధం గారు సమాధానమిచ్చారు.

"రా మామయ్యా! ఈ కుర్చీలో కూర్చో" సూర్యం లేచి తన కుర్చీ చూపించి అరుగు మీదున్న మరో కుర్చీ తండ్రికి వేశాడు.

"నారాయణ రావు కొడుకు ఇంత పెద్ద వాడయ్యాడా? అతను ఈ వూరు వచ్చి చాలా రోజులయింది. మీ నాన్న గారు ఎలా వున్నారు? బాబూ! శివావైపు తిరిగి అడిగారు రామనాధంగారు.

"ఈ మధ్య కొంచెం నీరసంగా వున్నారండీ! ఒకటే కేసులు, చెబితే వినరండీ! మా నాన్న గారు ఈవూరు రాలేక నన్ను పంపించారండీ!"

"అయ్యో పాపం అలాగా?"

"ఆ మల్లయ శిస్తులు సరిగా ఇవ్వడం లేదు. పైగా భూమి వదలనని పేచీ పెడుతున్నాడు" జగన్నాధం గారి మాటలు విన్న రామనాధంగారు, మల్లయ్య అలాంటి వాడు కాదే? అతను కూడా పేచీ పెడుతున్నాడంటే ఆశ్చర్యంగా వుంది" అన్నారు.

"అందుకే నా భూములు నేనే చేసుకుంటున్నాను" జగన్నాధం గారు నవ్వుతూ అన్నారు.

"సూర్యం నీ చేతికి అందొచ్చాడు కనుక నువ్వు యేదైన చెయ్యగలవు. నాకు ముందు ఆడపిల్లలు. ఆ పదేళ్ళ పిల్లాడు ఎప్పటికి చేతికందుకుంటాడు. అయినా నువ్వు అదృష్టవంతుడివి. అందరికి ఆ అదృష్టం పట్టొద్దూ!"

మా సూర్యం ఏదో నన్ను ఉద్ధరిస్తున్నాడను కుంటున్నావా? సొంత వ్యవసాయం చేసి ఏమీ బాముకోడం లేదనుకో! ఎంత అప్పుతెచ్చినా పెట్టుబడికే చాలడం లేదు, పంట మాటంటావా? ప్రతి యేడు వానలు, వరదలు ఒక్క యకరం కొనడం లేదుకదా!.

" అదీ నిజమే అనుకో జగన్నాధం"

"ఏం నిజమో కాని ఆ నారాయణరావుని చూడవయ్యా! ఒక పక్క లాయరు. మరో పక్క కొడుకు ఇంజనీరు. ఇక రెండు చేతులా సంపాదిస్తారనుకో! ఏం శివకుమార్ నిజమేనా? అందుకే పట్నాల్లో చదువుకున్న వారే బాగుపడ్డారయ్యా!

"ఇంకా చదువు పూర్తి కావాలి కదండీ! అప్పుడే ఉద్యోగం, సంపాదనా ఎక్కడండీ? మా నాన్నగారు ఫారిన్ పంపిస్తానంటున్నారండీ!"

"ఓ పని చెయ్యరా శివా! ఫారిన్ నుండి డైరెక్టుగా ఇక్కడికే వచ్చే సెయ్యి. ఈ చుట్టుపక్కల ఆనకట్టలు, బ్రిడ్జిలు చూసుకోవచ్చు. "భూములు బేరం పెట్టకూరా!" సూర్యం ఖతిమాలే ధోరణితో అన్నారు.

"ఇంత మంది వున్నాం కదా! అప్పుడే భూములు అమ్మకు" అన్నారు జగన్నాధం గారు.

"అదే మంచిమాట. భూమి అమ్ముకోడం దేనికి" రామనాధం గారు కుర్చీలోంచి లేచారు.

జగన్నాధం గారు కూడా లేచి ఆయనతో ఒక రెండు అడుగులు వేసి ఆగి ఇంట్లోకి నడిచారు. సూర్యం, శివా లేచి కుర్చీలు మడిచారు.

# 4

పొద్దుటే శివకుమార్, సూర్యం వెంట మామిడితోటకు బయలు దేరి వెళ్ళాడు. వారి వెంట పాలేరు వెంకన్న బుట్టలు పట్టుకు వెళ్ళాడు.

గుబురుగా ఉన్న మామిడి చెట్లను, వాటికి గుత్తులుగా వేలాడు తున్న కాయలను చూసేటప్పటికి శివాకు చెప్పలేని ఆనందం కలిగింది.

అంతలో దగ్గర్లో వున్న ఓ చెట్టు కొమ్మ మధ్య కూర్చుని కోయిల రాగాలు ప్రారంభించింది.

"కోయిల పాటను ఎన్నాళ్ళకు విన్నాను సూర్యం", "మనం 'కూ-కూ' అని అంటేచాలు అది పంతానికొచ్చి మరింత గట్టిగా, వేగంగా కూస్తుంది తెలుసా?"

"అలాగా"

అంతలో ఒక పాలపిట్ట ఎగురుతూ వచ్చి అక్కడ వాలింది.

దానిని ఆశ్చర్యంగా చూసాడు శివా. అంతలో అటు, ఇటు గంతులు వేస్తున్న రామచిలుకలు అతని కంట పడ్డాయి.

"ఎంత అందంగా వున్నాయి ఆ చిలుకలు అసలు అందమైన సృష్టి అంతా ఈ మామిడితోటలో "వుందనుకుంటాను సూర్యం"

"అవును శివా! అందుకే రోజు ఇక్కడికి వస్తాం"

చెట్టు కింద ఎండుటాకులు పేర్చి వున్నాయి. నడుస్తుంటే గలగల శబ్దమవుతోంది.

ఆ శబ్దానికి ఆశ్చర్యపోయిన శివా నేలవైపు చూసాడు. నేలంతా పచ్చని మామిడి పిందెలు రాలిపడి వున్నాయి.

ఏదో చప్పుడయిందని చూస్తే మామిడి పిందెలు ఎవరో తెంపి పడేసినట్లు నేల మీద పడుతున్నాయి.

"ఎన్నికాయలు రాలుతున్నాయో" శివా ఆనందంగా కాయలు ఏరి బుట్టలో వెయ్యడం ప్రారంభించాడు.

"మరీ చిన్న పిందెలు ఏరకు? పెద్దవి ఏరు చాలు"

అన్న సూర్యం మాటలు అర్థం కాని శివా "ఎందుకూ" అని ప్రశ్నించాడు.

"నీకే తెలుస్తుంది లే" నవ్వుతూ సమాధానమిచ్చాడు సూర్యం.

"రెండు బుట్టలు నిండి పోయాయి సూర్యం"

"అందుకే పెద్ద పిందెలు ఏరితే చాలన్నాను."

"ఇవన్నీ పిందెలేనా?"

అవును వీటినన్నిటినీ పిందెలనే అంటాము. కాయలు ముదిరిన తర్వాత ఎక్కువ రాలవు. పండిన కాయలయితే చిలకలే కొరికి పడేస్తాయి."

ఆశ్చర్యంగా విన్నాడు శివా.

"ఇంక ఏరకు శివా!"

"ఎవరో ఒకరు వచ్చి ఏరుకు పోతూవుంటారు అందుకని. మనం బోరింగ్ దగ్గర స్నానాలు చేద్దామా?"

"ఓ! నాకు చాలా సరదాయే"

ఇద్దరూ బోరింగు దగ్గరకు బయలుదేరారు. వారి వెనక బుట్టలు పట్టుకొచ్చి వెంకన్న వారికి దగ్గరలో పెట్టి తన పని మీద వెళ్ళిపోయాడు.

భుజాల మీద కప్పుకున్న టవల్స్, చొక్కాలు, లుంగీలు తీసి పక్కగా పెట్టారు. సూర్యం నీళ్ళ దగ్గరకు వెళ్ళాడు.

"రా! శివా" అంటూనే స్నానం మొదలు పెట్టాడు.

అంత లావు నీటిధారలో స్నానం చెయ్యడానికి శివాకు కాస్త భయమనిపించింది. కాని లోపల ఉత్సాహంగానే వుంది. శివా ధైర్యం చేసి వెళ్ళాడు. ఆ చల్లని నీటిధార వంటి మీద పడగానే అతను సంతోషంతో గంతులు వేసాడు. ఇద్దరూ టైం తెలీకుండా స్నానాలు చేస్తూనే వున్నారు.

అంతలో వెంకన్న అక్కడకు వచ్చి "నాన్నగారు వస్తున్నారు." అన్నాడు.

వెంటనే ఇద్దరు స్నానాలు ఆపి ఇవతలకు వచ్చి తల, ఒళ్ళు తుడుచుకుని బట్టలు వేసుకున్నారు.

"అప్పటినుంచి ఏం చేస్తున్నారిక్కడ"

"మామిడి తోటలో కాయలు ఏరి ఇటు వచ్చాము"

తండ్రి మాటలకు సమాధానమిచ్చాడు సూర్యం.

"ఇంక ఇంటికి వెళ్ళండి" అంటూనే ఆయన అరటితోట వైపు కదిలాడు. వెంకన్న తిరిగి ఆయనను అనుసరించాడు.

సూర్యం ఒక అరిటాకు తెంపి అందులో సంపెంగ, గులాబీ పూలు తెంపి వేసి పొట్లం కట్టాడు.

"ఇవెందుకు సూర్యం" ఆశ్చర్యంగా అడిగాడు శివా.

"ఎందుకేమిటి శివా? శాంకరికి. నేను తోటలోకి వచ్చానని తెలిసిందనుకో! పువ్వులు తేలేదని ఇక నాతో మాట్లాడదు అందుకే"

సూర్యం వైపు ఆశ్చర్యంగా చూసాడు శివా! సూర్యం వెంట అడుగులు వేసాడు శివా.

శాంకరి, కాసులు, కనకం చేరి శాంకరి అరుగుమీద కబుర్లు చెప్పుకుంటున్నారు.

వారిని చూడగానే శివా పులిక్కిపడి "తెల్లారిందో లేదో అప్పుడే చేరి కబుర్లు ప్రారంభించారు" విసుక్కున్నాడు.

వారిని చూడగనే సూర్యం ముఖం సంతోషంతో నిండింది.

"శాంకరీ" అంటూ పిలిచాడు.

"తోటలోకి వెళ్ళి వచ్చావా?"

"అవును శాంకరీ! ఇవిగో పూలు తీసుకో" అంటూ పొట్లం అందించాడు.

కాసులు, కనకం సూర్యాన్ని చుట్టుముట్టి బుట్టలోని మామిడి కాయలు ఏరుకోవడం మొదలు పెట్టారు. సూర్యం వాళ్ళకిస్తున్న చనువుకి శివాకు చెప్పలేని కోపమొచ్చింది. నిన్నటి సైకిలు సంఘటన గుర్తుకొచ్చి పళ్ళు నూరుకుంటూ దూరంగా నుంచున్నాడు.

అతనున్నాడనే పట్టించుకోని వాళ్ళు సగం బుట్టలు ఖాళీ చేసి సూర్యానికి అందించారు.

"అబ్బా ఈ గులాబీ చూసావా ఎంత బాగుందో! ఈ సంపెంగి మరీ వాసనేస్తోంది చూసావా?" అంటూ గట్టిగా వాసన చూసింది శాంకరి.

"సూర్యం తోటలో పూలు చాలా బాగుంటాయి".

"పూలన్నీ నీకేనా? మాకేం లేవా!" కనకం అడిగింది.

"పోనీలే దాన్నే అన్నీ తలనిండా పెట్టుకోమను. మనం చూసి ఆనందిద్దాంలే" అంది కాసులు.

"ఇవిగో మీరు తీసుకోండి" రెండేసి పూలు అందించింది శాంకరి.

"థ్యాంక్యూ సూర్యం" అంది శాంకరి. మిగిలిన ఇద్దరు కూడా అలాగే అన్నారు.

"సూర్యం మనస్సు ఆనందంతో గంతులు వేసింది. "సూర్యం! ఈ రోజు మన రిజల్ట్సు వస్తాయని చెప్పావుగా! కాలేజీకి వెడదామా!" అడిగింది కనకం.

"మీరంతా ఎందుకు! నేను వెళ్ళి కనుక్కు వస్తాలెండి"

"అయితే మరీ మంచిది". అంది శాంకరి.

"ఇక వెడతా" నంటూ బుట్టలతో బయలుదేరాడు సూర్యం.

అతనితో నడిచాడు శివా!

శివాకి చెప్పలేని కోపంగా వుంది సూర్యం మీద. ఒకసారి గట్టిగా చెప్పాలనుకున్నాడు.

"సూర్యం! లేచింది మొదలు ఆ ఆడపిల్లల వెంట ఎందుకు తిరుగితావు. పైగా ఆవిడగారంటే ఎందుకు మురిసి పోతావు" నిలదీసి అడిగాడు శివా.

"శివా! ఎందుకిలా అనుకుంటావు. చిన్నతనం నుంచి ఆడ, మగ భేదం లేకుండా అందరం కలిసి మెలిసి పెరిగాం. పైగా అందరం ఒకే క్లాసు చదువుతున్నాం. అందరిలో శాంకరి చాలా తెలివైంది. బాగా చదువుతుంది కూడా. అందుకే ఆమె అంటే నాకు చెప్పలేని అభిమానం. ఆమె ఏది అంటే నేను అదే చేస్తాను."

సూర్యం సమాధానం విని శివా ఆశ్చర్యపోయాడు.

శాంకరి ప్రవర్తనలోని తప్పులు ఎత్తి చూపాలనుకున్నాడు సూర్యానికి. ఆమెపై గల అభిమానం తగ్గించాలనుకున్నాడు. సూర్యం అవకాశం ఇవ్వలేదు. అయినా లోపలవున్న కోపం అణుచుకోలేక పోయాడు.

"సూర్యం! నీ మెత్తదనం చూసే ఆ శాంకరికి అంత గర్వం" కాస్త నువ్వు చనువు తగ్గించు. ఆమె దిగివస్తుంది.

"ఆమెలో గర్వం నాకెక్కడా కనబడదు శివా! ఆమె ఏది అన్నా నాకు చాలా యిష్టం. నాకసలు తప్పుగానే అనిపించదు. ఆమె ముఖం ముడుచుకుంటే నాకసలు తోచదు".

సూర్యం మనసులోని మాట పైకి అన్నాడు.

ఏదైనా శివా మనస్సులో పేరుకున్న కోపం తగ్గలేదు. సమయం చూసి శాంకరికి బుద్ధి చెప్పాలనుకున్నాడు. అదెలా చెప్పాలో తెలియక అతను తికమక పడ్డాడు. పైగా వాళ్ళవూళ్ళో తనున్నాడు. అందరూ ఆమెకు ఆత్మీయులే. తనకా ఆమెపై పంతం పెరిగింది.

తన పంతమే ఎప్పటికైనా నెగ్గాలనుకున్నాడు. శాంకరి మనస్సులో ఏముందో కాని శివాకు అంతుపట్టలేదు. అలా ఆలోచిస్తూనే వున్నాడు.

"ఈ రోజు కాకపోతే మరెప్పుడైనా అవకాశం చిక్కకపోదు" అనుకున్నాడు.

శివా మనస్సు కాస్త కుదుటపడింది.

# 5

ఆరోజు చైత్ర శుద్ధ ఏకాదశి. వాడపల్లి తీర్థం. ఉదయం లేచింది మొదలు శాంకరి వాళ్ళు ఒకటే హడావిడి పడుతున్నారు. అందరు తలకి స్నానాలు చేసారు. పెందరాళే భోజనాలు చేసారు.

పదకొండు గంటలు కల్లా బళ్ళు వచ్చి వీధుల్లో నిలబడ్డాయి. ఎండ తగలకుండా యీత చాపలతో బళ్ళకు గూళ్ళు తయారు చేసారు. బండిలోకూర్చోడానికి వత్తుగా గడ్డివేసి జంబుఖానాలు పరిచారు.

శాంకరి ఎర్రటి రంగుకు ఆకుపచ్చ రంగు జరి అంచున్న పట్టులంగా కట్టుకుని ఎర్రని పట్టు జాకెట్టు వేసుకుంది. ఆకుపచ్చ రంగు నైలాన్ ఓణి వేసుకుంది. బారెడు జడకు జడగంటలు పెట్టి అల్లుకుంది. తల నిండా మల్లె, కనకాంబరాలు కలిపి కట్టిన మాల పెట్టుకుంది. చెవులకు జూకాలు, కుడి ముక్కుకు బేసరి, మెడలో మూడు వరసల చంద్రహారాలు వేసుకుని చేతులకు ఎరుపు, ఆకుపచ్చ రంగు గాజులు వేసుకుంది. కాళ్ళకు పాంజేబు పట్టాలు ఘల్లు మంటుంటే అటు ఇటు నడుస్తోంది.

ఆ రోజు కాసులు, కనకం, సుబ్బులు, శాంకరి అందరు ఒకే వేషధారణలో ఉన్నారు. కాని అందరిలోకి పురివిప్పి నాట్యం చేస్తున్న మయూరిలా, జల జలపారే కొండ వాగులా వుంది శాంకరి.

అందరిలో దీపంలా వున్న కూతుర్ని చూసుకుని మురిసిపోయింది అన్నపూర్ణమ్మ. ఆ పిల్ల తనింటికే దీపం అనుకుంది.

బండి కదలాడానికి సిద్ధంగా వుంది. శాంకరి నీళ్ళ బిందెను పట్టుకొచ్చి బండి తొట్టెలో పెడుతోంటే లోపలున్న నీళ్ళ గ్లాసు గల గల మంది. నీళ్ళు పోకుండా బిందె మూతకు తెల్లని బట్టకట్టింది.

వెంకన్న ముక్కాలి పీట పట్టుకొచ్చి వేసాడు. తల్లి అక్కగారు పిల్లలు, తమ్ముడు బండి ఎక్కారు, శాంకరి వచ్చి బండి ముందు భాగంలో కూర్చుంది.

బండి కదులుతుంటే కనకం పరుగెత్తుకుంటూ వచ్చింది. "నిన్నటి పీరుడు తయారు అవుతున్నాడే" శాంకరి చెవిలో చెప్పింది.

"రానీ! నిన్న పళ్ళురాలినట్టున్నాయి. ఈ రోజు కాళ్ళు విరిచేస్తే సరిపడుతుంది".

"కాళ్ళు విరగొట్టడం ఏమిటే శాంకరి"

"ఏంలేదమ్మా!" తల్లి అడిగిన దానికి సమాధానమిచ్చింది.

కనకాన్ని వెళ్ళిపొమ్మని సంజ్ఞ చేసింది. కనకం తూనీగలా ఎగురుతూ వెళ్ళిపోయింది.

"ఆ కనకం వచ్చి ఏం చెప్పిందే? అయినా ఏమిటే ఆ దేవరహస్యాలు" అక్క నిలదీసింది.

"అబ్బా! నీకన్నీ కావాలే! నా జోలికి ఎవరైనా వస్తే వాళ్ళ కాళ్ళు విరిచేస్తానని చెప్పాను. అంతే!"

"ఆ పెంకితన మేమిటే. చదువే కాదు కాస్త వినయం నేర్చుకోవాలి"

తల్లి మందలించిలది.

"అన్నీ నేర్చుకుంటాలే అత్తారింటి కెళ్ళేటప్పుడు లిస్టురాసి ఇద్దువుగాని. ఇప్పుడవన్నీ ఎందుకమ్మా!"

కూతురు సమాధానం విని విస్తుపోయింది ఆ తల్లి.

చెల్లెలు నోటికి భయపడి మరి అక్కగారు ఏమీ అనలేక వూరుకుంది.

ఎడ్లను అదలించాడు వెంకన్న. ఎడ్లు గణగణ గంటలు చప్పుడు చేసుకుంటూ కదిలాయి. దాని వెనక మిగిన బళ్ళు కదిలాయి.

"అమ్మాయిగారు! బండి తోలుతారా!

"ఓ! అంటు వెంకన్న చేతిలోని తోలే కర్రలాక్కుంది శాంకరి. శాంకరికి ఎన్నాళ్ళ నుంచో బండి తోలాలని వుంది. ఎప్పుడో కాని అటువంటి అవకాశం దొరకదు. పైగా తండ్రి బండిలో లేడు. సాధారణంగా మగ వారంతా నడిచే వెళతారు. కాసులు వాళ్ళకి అలాటి

పనులంటె కొంచెం భయం అందుకే "పోనీ బండిని" అంటూ వెనక నుంచి హెచ్చరికయి ప్రారంభించారు. అదే పంతంలోకి దిగుతుందని వారను కోలేదు.

అందరి కంటే సూర్యం బండి చివరిలో వుంది. అందులో శివకుమార్ మరికొందరు కూర్చుని వున్నారు. వాళ్ళమ్మగారు కనకం వాళ్ళమ్మగారితో పాటు కూర్చుంది.

సూర్యానికి బండి తోలడం బాగావచ్చు. కాని శాంకరి బండి దాటి ముందు కెళ్ళాలనే పంతం అతనికి లేదు.

కాని శివకుమార్ వూరుకోలేదు. "సూర్యం! పోనీ బండిని. మనం మగవాళ్ళం పేరు నిలబెట్టు" అంటు పక్కనే కూర్చుని తొందర చేసాడు.

అతని మాట కాదన లేక అన్ని బళ్ళు దాటించి శాంకరి వాళ్ళ బండి వెనక వరకు తోలుకొచ్చాడు.

"సూర్యం పోనీ! పోనీ!" శివ మరింత తొందర చేసాడు.

"శాంకరీ! ముందుకు పోనీ! పోనీ!" కాసులు, కనకం హెచ్చరించారు.

"మన బండే ముందుడాలి. వెంకన్నా జాగ్రత్త! వెనక బండిని రానీకు" తోలే కర్ర తిరిగి వెంకన్నకిస్తూ హెచ్చరించింది శాంకరి. ఆమె పక్కకు జరిగి కూర్చుంది.

"ప-వ- ద" అంటూ ఎడ్లను అదలించాడు వెంకన్న, తెల్లని మైసూరు ఏడ్లవి. మెడ నిండా గజ్జెలతో, నడుముకు నల్లని బెల్టులతో, కొమ్ములకు కుచ్చులతో పాల నురుగు వంటి నురుగులు కక్కుతూ శివుని నందీశ్వరునితో పోటీపడుతూ పరుగు లెత్తుతున్నాయి. ముందు కూర్చున్న శాంకరి ముఖం ఎండకు ఎర్రబడి పద్మంలా మిల మిలా లాడుతోంది.

శివకుమార్ అంత పంతంలోనూ మాటి మాటికి ఆమె ముఖాన్నె చూస్తున్నాడు.

అన్ని బళ్ళు వరుసగా ఏటి గట్టు ఎక్కాయి. గట్టుపొడుగునా-చింత, మామిడి, జమ్మి, రావి, మర్రిచెట్లు వ్యాపించి, వున్నాయి. అంత మిట్ట మధ్యాహ్నం వేళలో గోదావరి నదిపై నుంచి వచ్చె చల్లగాలి అందరి సేద తీరుస్తోంది.

బళ్ళలో కూర్చున్న పెద్ద వాళ్ళు కబుర్లలోకి దిగారు. చిన్న పిల్లలు కునికిపాట్లు పడుతున్నారు యువకులంతా మధ్య మధ్యహుషారు ఎక్కువై చప్పట్లు కొడుతూ ఈలలు వేస్తున్నారు. శాంకరి, కాసులు కనకం, సుబ్బులు పాటలు ప్రారంభించారు. కొందరు కొంటెకుర్రాళ్ళు వారికి వంత పాడుతున్నారు. వారిని గమనించిన కొందరు ముసి ముసి నవ్వులు నవ్వుతున్నారు.

# 6

అంతలో వాడపల్లి రానే వచ్చింది. బళ్ళు మెల్లగా ఎటవాలుగా వున్న ఏటిగట్టు దిగాయి. గుడికి దూరంగ బళ్ళను ఆపారు. అందరు బళ్ళు దిగారు. నడవలేని పిల్లలను చంకన వేసుకున్నారు పెద్దలు. శాంకరి వాళ్ళు చట్ట పట్టాలేసుకుని పెద్దల వెంట గుడికి బయలుదేరారు. ఆదారంతా జనంతో కిక్కిరిసి వుంది.

"జాగ్రత్త అమ్మాయి" అంటు ఎవరి వాళ్ళు వాళ్ళని హెచ్చరికలు చేసారు. అందరు వస్తువులు కనబడకుండా మెడ చుట్టూ పమిట కొంగులు కప్పుకున్నారు. నగల కంటె కూడా పెళ్ళీడు పిల్లలను కాపాడుకోవడం కష్టమని వారి తలంపు. అందుకే మరోసారి హెచ్చరించారు. జనాన్ని తోసుకుంటు అందరూ గుడిలో అడుగు పెట్టారు.

"వాడపల్లి ఎంకన్నా! గోయిందా! గోయిందా!" అంటున్న భక్తులకోలాహలంతో అక్కడ మరింత రద్దీగా వుంది.

అక్కడ వున్న భక్తులలో చాలా మందికి బోడిగుళ్ళే. పిల్లలు పెద్ద లు ఆడవారు, మగవారు అనె బేధం లేకుండా అలా వున్న భక్తుల్ని చూ సేటప్పటికి కాసులు వాళ్ళు పక పకా నవ్వడం మొదలు పెట్టారు.

అన్నీ తెలిసున్నా వారిలోని ఆ చిలిపితనం వల్లనే వారిని పిల్లలు అన్నారు. నవ్వు వస్తే నిష్కల్మషంగా నవ్వుతారు. మాటా, చేతా కూడా అంతేఎదుటివారు ఏమనుకుంటారో అన్న విషయం కూడా మర్చిపోతూ ఉంటారు.

"అలా నవ్వుతారేమిటి? దేవునికి ఆచ్చాం సీలాలు. అలా నవ్వితే వెంకన్న బాబుకి కోపమొస్తుంది" అన్నారు ఆ భక్తులు. వారి మాటలకు కాస్త భయపడిన వాళ్ళు నవ్వాపుకుంటూ ముందుకు నడిచారు.

శాంకరి చేతి సంచీతో పట్టుకొచ్చిన అరటి పళ్ళు, పువ్వులు, అగరబత్తులు, కర్పూరం, కొబ్బరికాయలు తీసి పూజారి పళ్ళెంలో పెట్టింది. పూజార్లు శ్రవణ పేయంగా మంత్రాలు చదువుతూ పూలు దేవుని మీద వేసారు. అగర బత్తులు వెలిగించారు. కొబ్బరికాయలు కొట్టి నవేద్యం పెట్టారు.

శాంకరి రెండు చేతులు జోడించి ఆ వేకంటేశ్వర తేజో మూర్తిని తలుచుకుంటూ కళ్ళు మూసుకుంది.

పూజారి హారతి పళ్ళెం తీసుకురాగానే కళ్ళ కద్దుకుని తీర్థ ప్రసాదాలు అందుకుంది. తర్వాత శఠగోపం పెట్టించుకోడానికి తల వంచింది.

పూజారి ఆమె తలపై పెట్టి తీసి చేతిలో తులసి దళం వేసి పక్కనున్న మరొకరికి తలపై పెట్టాడు.

తనను ఆనుకునే వున్న ఆ వ్యక్తి ఎవరో తెలియక తల తిప్పి చూసి వులిక్కిపడింది.

అతని చిరునవ్వు చూడగానే ఆమెకు అరికాలి మంట నెత్తికెక్కింది. అంత మందిలో అతనిని ఏమీ చెయ్యలేక పళ్ళు కొరుక్కుంది.

"సిగ్గులేక పోతేసరి"

ఆమె మాటలకు అతను మరికాస్త గట్టిగా నవ్వి అక్కడ నుండి కదిలాడు.

"ఇందుకన్న మాట ఈ మహానుభావుడు తీర్థాని కొచ్చింది. వీడికి బాగా బుద్ధి చెప్పాలి". కనకం వాళ్ళను వెతుక్కుంటూ వెళ్ళింది వాళ్ళని చూడగానే శివా సంగతి చెప్పలేక పోయింది. కనకం వాళ్ళ తనను వదలి వెళ్ళిపోయినందుకు మాత్రం బాగా కోపం చేసింది.

"సారీ! సంకూ" అన్నాక వాళ్ళను తిట్టడం మానేసింది.

తర్వాత అందరూ రథోత్సవం వైపు కదిలారు. అంత ఎత్తయిన రథం ఆ చుట్టుపక్కల ఏ దేవాలయనికి లేదు. అప్పటికీ అది పాత గిల్లింది. కదపడానికీ భయపడుతున్నారు. అయినా మామిడి తోరణాలతో, రంగు రంగు కాగితాలతో పూలతో అలంకరించారు.

పోలీసులు హెచ్చరికలు చేస్తున్నారు. మంగళ వాయిద్యాలు మోగుతున్నాయి పురోహితులువేదపఠనాలు చేస్తున్నారు. రథంకదిలే సమయమయింది. వేలాది భక్తులు ఆ వేంకటేశ్వర స్వామికి జేః జేలు చెబుతున్నారు.

"వెంకన్నా! గోయిందా!" అంటూ మెల్లిగా పగ్గాలు లాగారు. రథం కదిలింది.

భక్తుల మనస్సు భక్తితో పరవళ్ళు తొక్కుతోంది. భక్తులంతా అరటి పళ్ళు శక్తికొలదిరథంమీదకి విసురుతున్నారు. రథంమీద కూర్చున్న దేవుని మీద పడాలని వారి తలంపు. కాని అవి టప టపా జనంమీద పడుతున్నాయి.

శాంకరి, కాసులు వాళ్ళు వేసిన పళ్ళు రథం మీద పడ్డాయి. అది చూసిన పిల్లలంతా చప్పట్లు కొట్టారు.

శివకుమార్, సూర్యం శక్తి కొలది వేసిన పళ్ళు వెళ్ళి పగ్గాలు లాగే భక్తుల నెత్తికి తగిలి నేల పడ్డాయి. శాంకరి వాళ్ళు 'ఇ-ఇ-ఇ-!' అంటు నవ్వుతూ అక్కడనుండి ముందుకు కదిలిదుకాణాల వైపువెళ్ళారు. మట్టితో తయారు చేసిన రంగు రంగుల బొమ్మలు కొలువు తీరివున్నాయి.

ఆ కన్యల దృష్టి వాటి మీద పడింది. తమ దగ్గర లేని బొమ్మలు బేరమాడి కొన్నారు. గడ్డి చుట్టి జాగ్రత్తగా కట్టి ఇచ్చాడు ఆ వర్తకుడు. తర్వాత వరుసగా రిబ్బనులు, పట్టు జడ కుచ్చులు, ప్లాస్టిక్ జడ పువ్వులు, జడ పిన్నులు కొని చేతి సంచుల్లో వేసుకున్నారు. అప్పుడు కనిపించింది వారికి అత్యంత ప్రీతి పాత్రమైన రంగులరాట్నం. జన్మకో శివరాత్రి అన్నట్టుగా ఏడాదికోసారి అది ప్రత్యక్షమవుతుంది. వారి ఉత్సాహానికి అంతులేదు.

చిన్న పిల్లలను ముందుగా చిన్న రాట్నం ఎక్కించి తిప్పించి రంగురంగుల బుడగలు కొని చేతిలోపెట్టి పెద్దల దగ్గరకు పంపించారు. తర్వాత ఆ నలుగురు కన్యలు వెళ్ళి వరుసగావున్న గుర్రాలు ఎక్కికూర్చున్నారు.

అంతలో అక్కడకు రాట్నం తిప్పేవ్యక్తి వచ్చాడు. నలుగురు పైసలు ఇచ్చారు.

"మనకి కూడా ఎవరైన టికెట్టు కొంటె ఎంత బాగుండునో అన్న మాటలు వినబడ్డాయి.

శాంకరి వాళ్ళు తలలు తిప్పి చూసి ఆశ్చర్యపోయారు. తర్వాత కోపం వచ్చి దిగివెళ్ళిపోదామనుకున్నారు. టికెట్లు కోనడంవల్ల ఉండి పోయారు.

శివకుమార్ ప్రోత్సాహంతో సూర్యంవాళ్ళు కూడా గుర్రాలే ఎక్కారు. శివకుమార్ మాత్రం వెళ్ళి తొట్టిలో కూర్చున్నాడు. అది చూసిన శాంకరి వాళ్ళు నవ్వుకోలేక నోటికి చేతులు అడ్డుపెట్టుకున్నారు. సూర్యం వాళ్ళని చూసి నవ్వాపుకోలేకపోయాడు. అర్థంకాని శివా వాళ్ళను అయోమయంగా చూసాడు. రంగుల రట్నం తిప్పడం ప్రారంభించారు. క్రమంగా వేగాన్ని పుంజుకుంది. కూర్చున్న వారంతా కేరింతాలు కొడుతున్నారు. కొందరు ఇంకా జోరుగా తిప్పమని అతనికి హెచ్చరికలు చేస్తున్నారు. శాంకరి వాళ్ళు ఆనందంతో నవ్వుకుంటున్నారు.

అలవాటులేని శివకుమార్ ఆ వేగానికి ఉక్కిరి బిక్కిరి అయ్యాడు. ఎవరి ధోరణిలో వారు ఉండడంవల్ల అతనిని ఎవరు గమనించలేదు. ఎందుకో తలతిప్పి వెనక్కి చూసిన సూర్యం కంగారుపడ్డాడు.

"శివా! శివా! ఏమైందిరా" అరిచినట్లే అడిగాడు. అతను గుడ్లు తేలవేసే స్థితికి వచ్చాడు. అది గ్రహించిన సూర్యం "ఆపండి! ఆపండి" అంటు అరిచాడు. అంత గోలలోను అతని అరుపులు ఉరుముల్లా వినబడ్డాయి. వెంటనే వేగంతగ్గి ఆగడం ప్రారంభించింది.

శివకుమార్ మెల్లిగా కోల్కోడం ప్రారంభించాడు. పూర్తిగా ఆగకుండానే సూర్యం నేలకు ఉరికి అతని తొట్టెపట్టుకొని ఆపాడు. ఒక సోడా కొట్టించి అతనిచేత బలవంతంగా తాగించాడు.

"అలవాటు లేనివాళ్ళు ఎందుకు ఎక్కడం" అంటున్నారు కొందరు.

ఈ కాలం కుర్రాళ్ళు ఇంతేనండి? ఎందుకూ పనికిరారు? అంటున్నారు మరికొందరు.

మధ్యలో ఆపించినందుకు కొందరు సూర్యంపై ఎగబడ్డారు. అతని స్నేహితులు సర్దుబాటు చేసి వారిని పంపించారు. సూర్యం మెల్లిగా శివకుమార్‌ని తొట్టిలో నుంచి దించి నడిపించుకుంటు ఇవతలకు తీసుకువచ్చాడు.

శాంకరి వాళ్ళకి చాలా సంతోషమనిపించింది. "మంచి బాగా అయింది." అంటూ అక్కడ నుంచి కదిలి వెళ్ళిపోయారు.

ఆ మాటలు విన్న శివకుమార్ తెల్లమొహం వేసాడు. "ఏదైన ఈ ఆడపిల్లలు మాత్రం సామాన్యులు కారు. తెలివి ఎక్కువే- పంతాలు ఎక్కువే" అనుకున్నాడు మనస్సులో.

ఆ తర్వాత శాంకరి వాళ్ళు తినుబండారాలవైపు వెళ్ళి సంచులు నింపారు. తీర్థంలో తప్ప ఇత్తడి సామాను బయట దొరకవు. అందుకే అన్నపూర్ణమ్మగారు వాళ్ళు వాళ్ళకి కావలసిన ఇత్తడి గిన్నెలు కొనుకున్నారు.

కనకం నాయనమ్మ, కాసులు అమ్మమ్మ వాళ్ళు రాత్రి కళ్యాణం చూడ్డానికి ఆగిపోయారు. కొందరు పిల్లలు కూడా ఆగారు. తిరిగి బళ్ళు బయలుదేరాయి. ఈసారి శాంకరి, కాసులు వాళ్ళు ఒకేబండి ఎక్కారు. ఇంటిదారి తెలుసుకున్న ఎడ్లు అదలించకుండానె చురుగ్గా నడుస్తున్నాయి.

కూర్చున్న వారంతా అలసిపోయి నీరసంగా వాలిపోయివున్నారు. శాంకరి వాళ్ళు మాత్రం శివాకు తగిన గుణపాఠం నేర్పామని మరింత ఉత్సాహంగా ఉన్నారు. వారి కబుర్లకు, నవ్వులకు, అంతేలేదు. నడిచే ఎద్దులకు మరింత ఉత్సాహాన్ని కలిగిస్తున్నారు.

ఇళ్ళకు చేరేటప్పటికి సాయంకాలమయింది. అందరూ బళ్ళుదిగి లోపలికి వెళ్ళారు. అన్నపూర్ణమ్మగారు కొనితెచ్చుకున్న గిన్నెలు పదిసార్లైనా అటు ఇటు తిప్పి చూసుకుంది.

"గిన్నెలు దళసరిగానే ఉన్నాయి అమ్మాయి" అంది ఆవిడ ఎన్నోసార్లు.

"అవునమ్మా! చాలా బాగున్నాయి" అంటూనే ఉంది పెద్ద కుతూరు. "ఏమిటమ్మా! ఒకటే ఛాదస్తం నువ్వూను. ఎన్నిసార్లుఅడుగుతావు" శాంకరి విసుక్కుంది.

తర్వాత ఆవిడ అన్ని గిన్నెల నిండా నీళ్ళు పోసుకుని చూసుకుంది. దుకాణంలో అతను చూపించినా ఆవిడకు తృప్తిలేదు. అందుకే మళ్ళీపోసి చూసింది. ఎక్కడా కారుతున్నట్లు లేదు.

"అమ్మయ్యా! ఎక్కడా కారడం లేదమ్మాయి. అంత డబ్బు పోసికొన్నామా, ఆ మాత్రం చూసుకోకపోతే ఎలా చెప్పు! శాంకరి దుడుకుపిల్లా" అని తేల్చింది ఆవిడ. "చాలా దుడుకు. కాస్త నువ్వు భయం చెప్పాలమ్మా! మగపిల్లలన్న సిగ్గేలేదు దానికి. వాళ్ళ మీదికి ఎలా వెడుతుందో చూసావా?"

"ఆ! ఆ! చూసానె! మీదికి వెళ్ళడం కాదు. నామీదికి వస్తే మొత్తుతానే. మధ్య నీకెందుకే" శాంకరి మాటలకు మరి సమాధానమీయకుండా అక్కగారు అక్కడ నుంచి వెళ్ళిపోయింది.

శాంకరి పట్టుకొచ్చిన తినుబండారాలన్నీ పిల్లలందరికి పెట్టింది. అంతవరకు ఏడుపు మొహాలతో ఉన్న పిల్లలంతా సంతోషంతో గంతు లేసారు.

తర్వాత జీడిలు, పకోడీలు, కజ్జూరంపళ్ళు తీసుకుని వీధి అరుగు మీదికి చేరింది శాంకరి.

ఆమెను చూసి కాసులు, సుబ్బులుకూడా అక్కడకు చేరారు.

కనీసం పరుగెత్తుకుంటూ వచ్చి "పోతురాయుడు పొద్దుటే వెళ్ళి పోతాట్టే" అంది అయాసపడుతూ.

అర్థం కాని సుబ్బులు ఎవరే అంది.

నీ మొహంలా వుంది. అర్థం కాలేదా? అడిగింది కాసులు. "మనం పోతురాయుణ్ణి ఓడించినట్టేనా" అన్న శాంకరి మాటలకు అందరు సంతోషంతో చప్పట్లు కొట్టారు. అంతలో అన్నపూర్ణమ్మగారు పిలవడంతోఎవరిళ్ళకు వాళ్ళు జారుకున్నారు. కానీ శివా, సూర్యం బలవంతం మీద మరికొన్నాళ్ళు ఆగి పోయాడనితర్వాత తెలుసు కున్నారు శాంకరి బృందం! ఇంకా వున్నాడన్నమాట! హూ! అని పళ్ళు కొరుక్కుంది శాంకరి.

# 7

సూర్యం కాలేజికి వెళ్ళి రిజల్ట్సు కనుక్కు వచ్చాడు. అందరూ పాసయ్యారు. మార్కులు కూడా వచ్చాయి కాని ఇంకా ఆఫీసులో ఇవ్వడం లేదు. విద్యార్థులంతా ఆఫీసు చుట్టూ గుమిగూడి వున్నారు.

సూర్యం అందరిని తోసుకుంటూ ఆఫీసులో ప్రవేశించాడు. క్లర్కుని బతిమాలి తనకు కావలసిన వారి మార్కులన్నీ నోట్ చేసుకుని ఇవతలకు వచ్చాడు. రాజు ఒక్కడు మాత్రమే అతన్ని గమనిస్తున్నాడు. మిగిలిన వారంతా ఒకర్ని ఒకరు తోసుకుంటు "మార్కులు-మార్కులు" అంటూ అరుస్తూనే వున్నారు.

సూర్యం, రాజు కలిసి శాంకరి ఇంటికి వెళ్ళి మార్కులు చూపించాడు. అందరి కంటే శాంకరికి ఎక్కువ వచ్చాయి. ఆమె కాలేజి ఫస్టు వచ్చింది. అందరి కంటే తక్కువ సూర్యానికి వచ్చాయి. సూర్యానికి ఎక్కువ చదువు మీద శ్రద్ధలేదు. అందుకే మార్కులు తక్కువ వచ్చినా బాధ పడలేదు. శాంకరికి అందరికంటే ఎక్కువ వచ్చినందుకు చాలా సంతోష పడ్డాడు.

శాంకరి మార్కులు చూసి తల్లి మరింత సంతోషించింది. తన కూతురైనా బాగా చదువుకుని హాయిగా బ్రతకాలని ఆమె కోరిక. ఆ వార్త విన్న అందరు చాలా సంతోషించారు.

"మేం కబడ్డీ ఆడుకుంటాము. మీరు కూడా వస్తారా!" శాంకరికి దగ్గరగా వెళ్ళి నెమ్మదిగా అడిగాడు సూర్యం.

శలవుల్లో మగ పిల్లలు, ఆడపిల్లలు కలిసి కబడ్డీ ఆడటం వారికి అలవాటు. పెద్దవారికి తెలీదు. అందుకే కంఠం తగ్గించి అడిగాడు సూర్యం.

అప్పుడే అక్కడకు వచ్చిన కాసులు, కనకం, సుబ్బులు ఆ మాటలు విన్నారు. అందరుకలిసి సరేనన్నారు.

ముందుగా సూర్యం, రాజు కదిలారు. వారి వెనక నలుగురు కన్యలు బయలుదేరారు. వారి వెనక మిగిలినవారు కదిలారు.

మగపిల్లలంతా ఒక పార్టీ, ఆడ పిల్లలంతా ఒక పార్టీ.

మగ వారి మధ్యలో నిన్నటి శివకుమార్‌ని చూసి వులిక్కిపడింది శాంకరి.

ఆడవారి మధ్యలో శాంకరిని చూసి ఈల వేసాడు శివా. శాంకరి ఒక్కసారి వెనక్కి తిరిగి "కనకం, కాసులు, సుబ్బులు రండి వెళ్ళిపోదామే" అంది కోపంగా.

అనుకోని సంఘటనకు సూర్యం బాధపడ్డాడు. శాంకరిని వెళ్ళిపోవద్దని బతిమాలాడు, ఆట ప్రారంభమయింది. ఎంతో మంది మగ పిల్లలు, కూడా అవుటయ్యారు.

తానే బాగా ఆడుతాననుకునే శివకుమార్ బయలుదేరాడు. అతను అలిసి పోయే వరకు అటు, ఇటు రానిచ్చి తర్వాత అతన్ని అవలీలగా పట్టుకున్నారుశాంకరి, కాసులు, కనకం, సుబ్బులు కలిసి.

శివకుమార్ పిల్లి నోట పడ్డ పిట్టలా కిక్కురుమనలేక పోయాడు. తర్వాత మిగిలిన మగ పిల్లలు ఓడిపోయారు.

ఆడవారికే విజయం.

కబడ్డీ ఆటతో ఆడవారు గెలిచారంటే నమ్మలేకపోయాడు శివా. అతనికి చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. తనను ఓడించినందుకు వారి మీద మరింత కోపం పెరిగింది.

"ఈ వాళ్ళో ఆడి పిల్లలు, ఆడ పిల్లలుకాదురా పోట్లగిత్తలు" అన్నాడు పళ్ళు నూరుకుంటూ.

ఆ మాటలువిన్న సూర్యం భయపడ్డాడు.

"మెల్లగా అనరా! బాబూ! ఆమె విన్నదంటే వెనక్కి తిరిగి వస్తుంది". అన్నాడు గొంతు తగ్గించి.

"వస్తే ఏం చేస్తుందిరా? సూర్యం".

ఆ మాటలువిన్న శాంకరికి కోపం తారాస్థాయికి చేరుకుంది. అతనికి మరోసారి బుద్ధి చెప్పాలనుకుంది. ఎలా చెప్పాలో తెలీకుండానే వెనక్కి తిరిగి అతని వైపు అడుగులేసింది. కాసులు, కనకం, సుబ్బులూ కూడా ఆమెవెంట వెళ్ళారు.

"శంకూ! వెళ్ళిపోదం రా! అతనితో మనకెందుకు గోల ఇళ్ళలో తెలిస్తే బాగుండదు. అంటూనే వున్నారు. కాసులు వాళ్ళు. ఆమె చేయి పట్టుకుని ముందుకు లాగుతూనే వున్నారు. అయినా ఆమె చెయ్యి గాలిలోకి లేచింది.

శివకుమార్ దవడ మీద బలంగా పడింది. అనుకోని ఆ సంఘ టనకు అందరూ తెల్లబోయారు.

శివకుమార్ నోటమాట రాలేదు. శాంకరి అందరితో కలిసి ఇంటికి బయలుదేరి వెళ్ళిపోయింది.

రెండు నిమిషాలు శివకుమార్ తలెత్త లేకపోయాడు. మిగిలిన మగపిల్లలంతా అతనిని చూడలేక అక్కడ నుండి జారుకున్నారు. శివకుమార్ కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. మెల్లిగా దవడ పాముకున్నాడు. సూర్యం అతనిని పలకరించడానికి భయపడి చూస్తూ నిలబడ్డాడు.

శాంకరిపై నున్న కోపం అతని మనసులో మరో మలుపు తిరి గింది. శాంకరి గాంభీర్యమైన విగ్రహం, వింతగా మెరిసే కళ్ళు, శివా గుండెల్లో నిలిచిపోయాయి. అతని మనస్సులో మెరుపులాంటి ఆలోచన గుసగుస లాడింది. ఆమెను మరోలా జయించాలనుకున్నాడు.

అతని ముఖంలో చిరునవ్వు చోటు చేసుకుంది.

"రా! సూర్యం ఇంక వెడదామా!" అతని మాటలను, అతని చిరునవ్వును అర్థం చేసుకోలేని సూర్యం సరేనన్నాడు.

ఇద్దరూ ఇంటి ముఖం పట్టారు. దారిలో ఇద్దరూ ఎక్కువ మాట్లాడుకోలేదు. ఎవరి ఆలోచనలు వారివి.

"శాంకరి అలా కొట్టకుండా వుండవలసింది. చాలా తొందర పడింది." మనస్సులోనే అనుకున్నాడు సూర్యం.

"నిజమే శివా ఆమెను అలా అనకుండా వుండవలసింది. ఆమె ఎంత బాధ పడిందో. అందకే అలా చేసింది. అయినా మగవారు ఆడ వారిని, ఆడవారు మగ వారిని అనకుండా వుంటేనే మర్యాద. "మనస్సు లోని మాట పైకి అనలేక పోయాడు సూర్యం.

సూర్యం ఇల్లు చేరుకోగానే ఇద్దరూ లోపలికి నడిచి ఎవరి గదులకు వారు వెళ్ళిపోయారు.

ఇంత జరిగినా యిళ్ళలోని పెద్దలకు మాత్రం ఏ విషయం తెలియలేదు.

# 8

అన్నపూర్ణమ్మగారు భర్తకు అన్నం వడ్డించింది. రామనాథం గారు వచ్చి పీటమీద కూర్చుని అన్నం కలుపుకు తింటున్నారు. ఆయన పక్కనే మరో పీటుమీద ఆవిడ కూర్చుని ఆయనకు ఎడమచేత్తో విసిన కర్రతో విసురుతోంది. కుడి చేత్తో ఆయనకు కావలసినవి వడ్డిస్తోంది. అలాటి ఇళ్ళల్లో భోజనాలప్పుడేకొన్ని సంభాషణలు జరుగుతాయి. "పెద్దల్లుడు స్కూటరు కావాలన్నాడు కదా! ఏం చేసారు?" ఆవిడ మెల్లిగా అడిగింది.

"చెయ్యడానికేముంది? దాని పెళ్ళినాటి అప్పే ఇంకా తీరలేదు. పైగా కాన్పులకి చాలా అయింది. పండుగులకి, పబ్బాలకి అడిగిన దల్లా ఇస్తూనే ఉన్నాం! ఇంక ఎక్కడ నుంచి అప్పు తెమ్మన్నావుచెప్పు".

"అతనికి కోపం వస్తుందేమో?"

"వస్తేరానీ! ఏం చేస్తాం! గాలి వానకి పంటలన్నీ పాడయ్యాయి. ఈ యేడు మళ్ళీ అధిక వర్షాలు. పైగా ఇప్పుడు స్కూటరన్నాడు? రేపు ఏమంటాడో? ఇంతటితో ఆపాలి. ఈ సారికి బట్టలేకొనిచ్చి పంపిద్దాం!".

ఆయన భోజనం పూర్తయింది. ఆవిడ మరోమాట అనలేక పోయింది. భర్త మాట సమంజసంగానే ఉంది. "అయినా పీళ్ళిద్దరి మధ్య నేను ఛస్తున్నాను" అనుకుంది మనస్సులో. ఆయన చేతులు కడుక్కుని వెళ్ళిపోయారు.

సావిట్లో కూర్చున్న శాంకరి, సుశీల ఆసంభాషణ వింటూనే ఉన్నారు.

శాంకరి తండ్రి తిరిగి అప్పుచెయ్యనందుకు కాస్త తృప్తిపడింది.

సుశీల తండ్రి మాటలు తిరిగి మననంచేసుకుంది. ఆయన మాటల్లో నిజంగా యథార్థముందనుకుంది. పెళ్ళయిన తను తండ్రిని అలా దోచుకుతింటుంటే చెల్లిగతి, తమ్ముడు గతి ఏమవుతుందోనని భయ పడింది. నిజంగా తాను ఇన్నాళ్ళు అజ్ఞానంలో వుంది. ఇక మీదట అలా

జరక్కూడదని నిశ్చయించుకుంది. అలాగే కూర్చుండిపోయిన అక్కగారిని ఆశ్చర్యంగా చూసింది.

ఆమె తిడుతుందో, ఏడుస్తుందో అనుకున్న శాంకరి అక్కగారినే చూస్తూ నిలబడింది.

తల్లి భోజనాలకు పిలవడంతో ఇద్దరూ కదిలారు. "అమ్మా! నేను రేపే వెళ్లిపోతాను" అంది సుశీల. "ఏమ్మా! మీనాన్నగారి మాటలు విన్నావా?"

"అవునమ్మా! విన్నాను. ఆయన మాటల్లో యథార్థముందమ్మా! ఇన్నాళ్లు అజ్ఞానంలో బతికాను. ఇక ఆ లోపం సవరించుకుంటాను. మా అత్తా! భర్తా చెప్పిన దానికల్లా తలూపాను. కాని తండ్రికి ఎంత భారమవుతుందో తెలుసుకోలేక పోయాను. ఇప్పుడే నాకర్థమయింది" ఆమె కళ్ళలో నీళ్లు నిలిచాయి. ఆమెలో వచ్చిన మార్పుకి తల్లి, చెల్లెలు ఆశ్చర్యంగా చూసారు.

"మనింటికి మంచి రోజులొచ్చాయమ్మా! "శాంకరి మాటలకు తల్లి తలూపింది. మరునాడు తండ్రి పెట్టిన బట్టలు కట్టుకుని సంతోషంతో అత్తారింటికి బయలు దేరింది సుశీల.

# 9

శివకుమార్ మద్రాసు వెళ్ళాడు. కొడుకుని వదలి ఆతల్లి ఎన్నడూ అన్నాళ్ళు ఉండి ఎరగదు. కొడుకుని చూడగానే ఆమెకు దుఃఖం పొంగివచ్చింది.

"ఏన్నాళ్ళయిందిరా నిన్నుచూసి" అంటు కొడుకుని దగ్గరగా తీసుకుంది.

"ఎందుకమ్మా! ఏడుస్తావు? ఇప్పుడేమయిందని".

"ఏంలేదురా! ఇన్నాళ్ళు నువ్వు అక్కడ ఉండిపోతే ఇక్కడ మేమెలా ఉంటామనుకున్నావు"

"మీరేకదమ్మా? పంపించింది" అన్నాడు గారాలుపోతు.

"గుమ్మంలో అలా నిలబెట్టే మాట్లాడుతావా?" నారాయణరావు గారి మాటలతో శివా నవ్వుతూ లోపలికి వచ్చాడు.

"కాళ్ళు కడుక్కో- కాఫీ తాగుదువుగాని?"

"కాఫీ రైల్లోనె తాగానమ్మా!".

"పోనీ; ఇడ్లీ తిందువుగాని" ఆవిడ వంటింట్లోకి వెళ్ళింది.

"మీ వంట్లో ఎలాగున్నదండి" తండ్రిని పలకరించాడు.

"ఉండడానికేముందిగాని, కాస్త నీరసంగా ఉంటోంది"

"డాక్టరు దగ్గరకు మళ్ళీ వెళ్ళారా!"

"ఆ వెళ్ళాను. నిన్ననే అన్ని పరీక్షలు మళ్ళీ చేసారు! ఏంలేదనీ అన్నారు".

"శివా! నేచెబుతారా మీనాన్నగారి సంగతి? డాక్టరు రెస్టు చాలా అవసరమంటున్నారు. ఈయనగారు వినిపించుకోరు. నెలరోజులు మంచంమీద పడుకోవాలిరా! అప్పుడు కాని మామూలు స్థితికి రారు."

"మీరు డాక్టరు చెప్పినట్లు వినాలండీ; లేకపోతే మందులు పుచ్చుకొని ప్రయోజనం లేదు.

కేసులన్నీ మీ జూనియర్లకి అప్పచెప్పాలండీ".

కొడుకు మాటలకు "సరే" అన్నాడాయన.

శివా లోపలికి వెళ్ళి ముఖం కాళ్ళు చేతులు కడుక్కుని వచ్చాడు.

వంటచేసే సత్యం ఇడ్లీ ప్లేట్లతో వచ్చి అందరికి తలొకటి అందించాడు.

ఆవిడ కూడా వంటింట్లోంచి అక్కడకు వచ్చింది. ముగ్గురూ టిఫిన్ తినడం ప్రారంభించారు.

"ఈమధ్య మీ మామయ్య వచ్చి వెళ్ళాడురా"

"ఎందుకట"

"ఎందుకంటావేమిట్రా! మీ మామయ్య పిల్లనిస్తానని గిరిజ పుట్టినప్పటినుంచి అంటున్నాడు గదా! అందుకని" అంది రాజేశ్వరమ్మ.

"అప్పుడే నాకు పెళ్ళేమిటమ్మా! తర్వాత చూద్దామని చెప్పు. అయినా ఇంకా నా చదువు పూర్తికాలేదు. ఓ ఉద్యోగంలేదు. ఇప్పటి నుంచి నేను పెళ్ళిచేసుకోనమ్మా!"

"అబ్బాయిమాటలు వింటున్నావా?" నారాయణమూర్తిగారు అన్నారు.

ఆ దంపతులకి శివకుమార్ ఒక్కడే కొడుకు. ఆయన మద్రాసు లోని న్యాయవాదులందరిలో గొప్ప ప్రాక్టీసు ఉన్నవాడు. ఆ దంపతులు శివకుమార్‌ని కంటికి రెప్పలా పెంచారు. అతని మనస్సును బాధపెట్టే పని వాళ్ళు చెయ్యరు, శివకుమార్ కూడా అంతే.

"మీ మామయ్య మళ్ళీ వస్తానన్నాడురా!" అన్నాడు తండ్రి "రానీయండి ఆయన వచ్చినప్పుడు ఇదే మాట చెప్పండి"

"మరి అక్కడి సంగతులు చెప్పనేలేదు. శివా?" తల్లి మాట మార్చి అడిగింది.

"ఇంతకీ భూములు సంగతి ఏంచేస్తార్రా!" తండ్రి అడిగాడు.

"మన భూములను సూర్యం, వాళ్ళనాన్న జగన్నాథం గారు కలిసి వ్యవసాయం చేస్తారు. వాళ్ళు చాలా మంచివాళ్ళునానా? "ఆ వూరు చాలా బాగుంది. వదలి రాబుద్ధికాలేదనుకో!. స్నేహానికి ప్రాణమిస్తారు". అన్నాడు తల్లివైపు తిరిగి.

"చిన్నప్పుడు నేను కూడా అక్కడ పెరిగిందాన్నే కదా" అన్న తల్లి మాటలకు "అలాగా" అన్నాడు శివకుమార్.

అంతలో దగ్గరగా ఉన్న తలుపులు తోసుకుంటూ లోపలికొచ్చాడు ఆమె తమ్ముడు చలపతిరావు.

"రా!రా! తమ్ముడు "ఆహ్వానించింది రాజేశ్వరీదేవి.

"రావయ్యా! రా!రా!" పక్కకుర్చీ చూపించాడు నారాయణమూర్తి.

"ఎప్పుడొచ్చావురా!" ఎదురుగాకూర్చున్న శివాని పలకరించాడు.

"పొద్దుటే" ముక్తసరిగా సమాధానమిచ్చాడు శివా; తమ్ముడు రాక రాజేశ్వరమ్మగారికి సంతోషాన్ని కలిగించలేదు. పెళ్ళి మాట ఎక్కడ తలపెడతాడోనని ఇబ్బంది పడుతోంది.

"మేన మామతో ముక్తసరిగా ఉండడం ఆవిడ గమనించింది మునుపు ఎంతో సంతోషంతో గంటల తరబడి కబుర్లు చెప్పేవాడు. ఇప్పుడు పలకరిస్తే సమాధానం ఇవ్వడానికే ఇబ్బంది పడుతున్నాడనుకుంది."

నారాయణమూర్తిగారు కూడా అలాగే అనుకున్నారు.

"శివ అక్కడ నుంచి వెళ్ళిపోవాలని కూర్చీలోంచి లేవబోయాడు.

"అల్లుడూ! నువ్వెళ్ళిపోతే ఎలాగా! కూర్చో! మీ పెళ్ళి ముహూర్తాలు పెట్టిద్దామని వచ్చాను."

శివా మాట్లాడలేదు. రాజేశ్వరిదేవి, నారాయణమూర్తి తెల్లబోయి చూసారు. అంత డైరెక్టుగా కొడుకు ఎదురుగా అలా చెప్పడం వాళికి ఆశ్చర్యాన్ని కలిగించింది.

చలపతి ఆ మాటలు మళ్ళీ రెట్టించాడు.

"అదేమిటి మామయ్యా అలా అంటావు? ఇంకా నాకు చదువు పూర్తికాలేదు, పైగా ఉద్యోగం లేదు. ఇప్పుడే పెళ్ళేమిటి మావయ్యా!"

"పోని ఎప్పుడు చేసుకుంటావో చెప్పరా!"

"చదువు పూర్తయితే తప్ప నేనేం చెప్పలేను." అతను కుర్చీలోంచి లేచి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

"మీరేమంటారక్కా! ఈ ఏడాది పెళ్ళి చెయ్యాలనుకున్నాను". చలపతి తన నిరుత్సాహాన్ని దాచుకోలేకపోయాడు.

"నేనేం చెప్పనురా తమ్ముడు. మరి వాడిమాట కూడా మనం ఆలోచించాలి కదా!"

"అయితే నే వెడతానక్కా! వాడు ఎప్పుడు పెళ్ళి చేసుకుంటానంటే అప్పుడే చేద్దాం! నాకు తెలియచేస్తే నేనేళ్ళివస్తాను. అయినా

ఒక్కమాటక్కా! ఇది ఆఖరి సంవత్సరమేకదా! కార్తీక మాసంలోకాని, మార్గశిర మాసంలోకాని ముహూర్తాలు పెట్టుకుంటే బాగుంటుంది. వైశాఖంలో పరీక్షలంటాడు."

"సరే చూద్దాం! చలపతి" అంటు నారాయణమూర్తిగారు కుర్చీ లోంచి లేచారు.

"అన్నం తిని బయలుదేర్రా! ఇప్పుడెక్కడికి వెడతావు" రాజేశ్వరమ్మ మాటలు వినిపించుకోకుండానె "నేవెడతా! ఆఫీసు పనిమీద వచ్చాను. వస్తాను బావగారూ!"

"అదేం వెళ్ళడమయ్యా! భోజనం చేసి వెళ్ళు"

"మరోసారి చేస్తాను. ఇప్పుడు కాదు." చలపతి వీధి తలుపులు తెరచుకుని గబగబా వెళ్ళిపోయాడు.

"శివా పెళ్ళి సంగతి ఎత్తితే ముభావంగా వున్నాడు. అసలు ఆ పిల్లను చేసుకుంటాడోలేదో!" భార్యా భర్తలిద్దరికి అనుమానంగానే వుంది. కానీ, కాదని అనలేకపోయారు. వేరే సంబంధం చూసి అమ్మాయికి చేస్తే బాగుంటుందని చెప్పలేక పోయారు. ఏదైన శివాని మాత్రం ఆ విషయం గట్టిగా అడగాలనుకున్నారు ఆ దంపతులు.

రాజేశ్వరమ్మగారికి ఒకే తమ్ముడు. ఆ తమ్ముడుకి ఒకే అక్క. చలపతి కూతురు గిరిజ పుట్టింది మొదలు అందరూ శివా భార్య అనే అంటున్నారు. అందులో చలపతి భార్య మరీను. పదే పదే అనేది గిరిజ, శివా కూడా పెద్దలు అడ్డుపెట్టకపోవడంతో ఇద్దరు చనువుగానే తిరిగే వారు.

కాని వూరు నుంచి వచ్చింది మొదలు శివాలో పెళ్ళి విషయంలో ఏదో మార్పు కనబడుతోంది. వేరే అమ్మాయి వాడి దృష్టిలో పడిందో! లేక నిజంగా చదువు పూర్తి కావాలంటున్నాడో వారికి అర్థం కావేదు.

"మెల్లిగా అడిగి చూడు. రాజేశ్వరీ" అన్నారు నారాయణమూర్తి గారు. ఆ రాత్రి భోజనాలయ్యాక శివా గదిలో మంచం మీద వాలి ఏదో

ఆలోచిస్తూ పడుకున్నాడు. అదే సమయమనుకున్న ఆ తల్లి ఆ గదిలోకి వచ్చింది "శివా" అనుకుంటూ.

"అదేమిటమ్మా ఇంత! రాత్రివేళ నువ్వెందుకొచ్చావు" అంటూ లేచికూర్చున్నాడు శివా.

"ఏం లేదురా! మీ మామయ్య అడిగిన సంగతి తెలుసుకుందామని".

"అదేమిటమ్మా అలా అంటావు. నిజంగా నా చదువుకాలేదు. నేను ఫారిన్ వెడతానో, పై చదువు చదువుతానో నిర్ణయం కాలేదు. గిరిజను పెళ్ళిచేసుకుని నా చదువు పాడుచేసుకోమంటావా అమ్మా నువ్వే చెప్పు".

నిజంగా ఆ కొడుక్కి సమాధానం చెప్పలేక పోయింది. "ఈ కాలం కుర్రాళ్ళ ఆలోచనలే వేరు. బలవంతగా పెళ్ళి చెయ్యకూడదు", అనుకుని "సరే! నీ యిష్టం" ఆవిడ కిందికి వెళ్ళింది. శివా ఆలోచనలు శాంకరి చుట్టు తిరుగుతున్నాయి. "ఏవంక పెట్టుకుని ఆమెను చూడాలో" ఆలోచిస్తూ నిద్రలోకి జారుకున్నాడు.

# 10

అంతలో కార్తీక మాసం రానేవచ్చింది. ఆ మాసం అంటే పిల్లలకు చాలా యిష్టం, ప్రతి సోమవారం పెద్దలతో పాటు గోదావరి స్నానాలు చేయవచ్చు. సాయంకాలం గుళ్ళలో ప్రసాదాలు తినవచ్చు. రాత్రి వరకు ఉపవాసాలు వున్న వారు రాత్రి పిండి వంటలతో భోజనాలు చేయవచ్చు. చలి, ఆకలి ఆ సందడిలో వారికి తెలియనే తెలియవు.

ఆ రోజు అమావాస్య. పోలి స్వర్గానికి వెళ్ళిన రోజు. అందరూ తెల్లవారకట్ల నాలుగు గంటలకే లేచారు. రాత్రి ఆరేసుకున్న మడి బట్టలన్నీ వెదురు పేళ్ళ సజ్జలో పెట్టుకున్నారు. దీపపు కుందులు, పూజ సామానులు, అగ్గిపెట్టె వత్తులు అన్నీ ఆ సజ్జలో సర్దుకున్నారు.

అన్నపూర్ణమ్మగారి వెంట శాంకరి వాళ్ళు బయలుదేరారు. బాగా చీకటిగా వుంది. కళ్ళు విశాలం చేసి చూస్తూ ఒకరి వెనక ఒకరు నడు-

స్తున్నారు. కాస్త నల్లగా రోడ్డుమీద కనబడితే హరికెన్ లాంతరు పెట్టి చూస్తున్నారు.

"ఫోజులరాయుడు రాత్రి దిగాడే" వార్త అందించింది కాసులు. "ఏడువలేక పోయాడు" శాంకరి పళ్ళు నూరింది. "వాళ్ళు కూడా మన వెనకే వస్తున్నారు". శాంకరి చెవిలో చెప్పింది కనకం.

"ఈ న్యూసెన్సు అంతా మీకెవ్వరు చెప్పారే" విసుక్కుంది శాంకరి. "మా అన్నయ్య" అంది కాసులు.

"ఈ మాటు మన జోలికొస్తే తడిబట్టలతో దుబ్బులకు కట్టేద్దాం"

శాంకరి కోపంతో బుసబుసలాడి విసవిస నడిచి ముందుకెళ్ళింది. ఆమె వెనకే కాసులు, కనకం, సుబ్బులు ముందుకు వెళ్ళారు.

గోదావరి నీళ్ళను చూడగానే పిల్లలందరికి చెప్పలేని వుత్సాహం వచ్చింది. అన్నపూర్ణమ్మగారు, తాయారమ్మగారు వాళ్ళు 'వుండండర్రా' అంటున్నా వినిపించుకోకుండా నీళ్ళల్లోకి కప్పల్లా వురికారు. చేపల్లా ఈదడం మొదలుపెట్టారు.

అన్నపూర్ణమ్మగారు వాళ్ళూ స్నానాలు పూర్తిచేసి పూజలు చేసారు. శాంకరి వాళ్ళూ యింకా స్నానాలు చేస్తూనే వున్నారు. అసలు వాళ్ళు ఈ లోకాన్నే మరిచిపోయారు. కొంతసేపు నీళ్ళలో వెల్లకిలా పడుకున్నారు. కొంతసేపు ముక్కు మూసుకుని నీళ్ళలో మునిగారు. ఇంకా వెలుగు రాలేదు. ఆ చీకట్లో ఎవరు ఎక్కడ వున్నారో తెలియడం లేదు.

నదిలో నీళ్ళు ఎక్కువగా లేకపోవడంవల్ల అందరూ తలో వైపు నుంచి ముందుకు వెళ్ళారు. అంతలో శాంకరికి తన వెనుక నీళ్ళ చప్పుడయితే తలతిప్పి చూసింది. ఎవరూ కనబడలేదు. మళ్ళీ కాస్తముందుకు వెళ్ళింది. ఈసారి మరింత దగ్గరలో వినబడింది నీళ్ళ చప్పుడు. తల తిప్పి చూసేటంతలోనే ఎవరివో బలమైన హస్తాలు ఆమెనుపట్టి బంధించాయి. శాంకరి అతనెవరో ఇట్టే గ్రహించింది.

"నన్ను వదులుతావా లేదా" అంటూ శక్తికొలది విదిలించుకో

పోయింది. కాని ఆమెకు శక్తి చాలలేదు. ఆమె గట్టిగా అరవాలని నోరు తెరిచింది.

ఎవరో "శాంకరీ! శాంకరీ! ఇంక వెడదాం రా" అంటు పిలుస్తున్నారు. ఆ పిలుపు అందుకునే స్థితిలో లేరు వాళ్ళు. పిలవగా పిలవగా ఈ లోకంలోకి వచ్చారు. ఆమె ఒక్కసారి విదిలించుకోడానికి తిరిగి ప్రయత్నించింది.

మోకాళ్ళమీద నిలబడిన శివా ఆమెను మరోసారి హృదయానికి హత్తుకుని "శాంకరీ" అన్నాడు. ఆ పిలుపులో కోటి మధుర వీణలు మ్రోగినట్లు ఆమె హృదయాన్ని తాకాయి. మనస్సు, శరీరాన్ని స్వాధీనంలోకి తెచ్చుకుని అతన్ని వదిలి ఇసుక తిప్పలపై కాలు మోపింది శాంకరి.

పులకరించిన శరీరంతో కాసేపు శివకుమార్ అలాగే వుండిపోయాడు. తర్వాత మెల్లిగా ఈదుకుంటు సూర్యం వాళ్ళను చేరుకున్నాడు.

"ఇంత వరకు ఎక్కడికి పోయావు శివా! నీకు నీరు కొత్తకదా! మేం ఎంత కంగారు పడ్డామో నీకు తెలుసా!" అన్నాడు సూర్యం. "మాకు పక్కనే సముద్రముంది. అవలీలగా ఈదగలను తెలుసా" "మాకేం తెలుసు. ఆ రోజు రంగుల రాట్నం తొట్టిలో కళ్ళు తేలవేసావు కదా!"

"ఓ! ఆదా! నాకు అలవాటు లేదు అందుకని. ఇప్పుడు ఎక్కించు చూద్దువుగాని".

"అంటే" కొంటెగా అడిగాడు రాజు.

"నేను ఈ మధ్య ఈత నేర్చుకున్నా! గుర్రపు స్వారీ కూడా ఈ ఆరు నెలల్లో నేర్చుకున్నా! మీ బండి కూడా తోలేస్తాను". ఆ మాటలు విని సూర్యంతో పాటు అందరు ఆశ్చర్యపోయారు. "అయితే ఈమాటు ఆడపిల్లలతో పోటీపడితే మనకే విజయమన్నమాట" అన్నాడు రాజు.

శాంకరి అతన్ని విడిపించుకుని వచ్చింది. కాని ఏదో తీయని బాధ ఆమెను నిలవనీకుండా చేసింది. ఏదో కొత్త కోరికలు ఆమె

గుండెల్లో గుసగుస లాడాయి. ఏదో తెలియని లోకం కళ్ళ ముందు కదలాడింది.

ఆమె కల కాసేపటికి కరిగింది ఆమె నిజస్థితిలోకి వచ్చింది. నిజంగా ఆ సంఘటన జరిగిందా లేదా! అనుకుంది, చీకట్లో శాంకరి ముఖం ఎలా వుందో వారికి కనపడలేదు. కాని ఆమెను చూడగానే వాళ్ళ ముఖాలు మాత్రం వికసించాయి.

"తల్లీ వచ్చావా?" అంది కనకం.

"అరవలేక అరవలేక మా గొంతులు నొప్పి పుట్టాయి" అంది కాసులు.

"రా! రా! బట్టలు మార్చుకో" అంది సుబ్బులు.

శాంకరి ఏ సమాధానం చెప్పకుండా సజ్జ వరకు వెళ్ళింది. పట్టులంగా అందు కోవాలని.

"అతను ముట్టుకున్న శరీరం మైలపడిందనుకున్న భావంతో తిరిగి నదిలోకి వెళ్ళి స్నానం చేసి వచ్చింది.

ఆమెను అర్థం చేసుకోలేని కాసులు వాళ్ళు ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

తల్లీ వాళ్ళెంత బతిమాలినా ఆమె దీపాలు వెలిగించలేదు. మౌనంగా చూస్తూ కూర్చుంది. వాళ్ళు కూడా బలవంతం చెయ్యలేదు. అరటి దొన్నెల్లో దీపాలు వెలిగించి నీళ్ళలోకి వదిలారు. నీళ్ళతో అలా సాగిపోతున్న దీపాలు నదుచుకు పోతున్నట్లు అనిపించాయి.

అందరూ ఇళ్ళకు బయలు దేరారు. శాంకరి మౌనంగానే నడుస్తోంది. ఆమెను అర్థం చేసుకోలేని వాళ్ళు ఎన్ని విధాల ఆలోచించారో కాని ఏదో జరిగిందని మాత్రం నిశ్చయించుకున్నారు. ఏదైన ఆమెను తిరిగి పలకరించే ప్రయత్నం చెయ్యలేదు.

అది గ్రహించిన శాంకరి మౌనం వదిలి "మనం పిచ్చుక గూళ్ళు కట్టుకోనే లేదు" అంది.

అది విని కాసులూ వాళ్ళూ ఆశ్చర్యంగా తలెత్తి చూసారు.

"మనం కాసేపు ఆగి ఆడుకుందామా" అంది కాసులు.

"ఇప్పుడు వెళ్ళిపోదాం! తిరిగి సాయంకాలం వద్దాం" అంటూ శాంకరి పకపకా నవ్వింది. మిగిలిన వారు నవ్వారు. ఆమె పరుగు పెడుతూంటే సీతాకోకచిలుకల్లా ఆమె వెంట పరుగెత్తుతూ "మన్ని ఏడిపించాలని అలా చేసిందన్నమాట" అనుకుని తృప్తిపడ్డారు.

ఆ రాత్రి శివకుమార్ కంటికి నిద్ర లేదు. అతని మనస్సు శాంకరి చుట్టూ తిరుగుతోంది. ఎలాగైనా ఆమెను సొంతం చేసుకోవాలి. ఆమె లేనిదే తన జీవితమే లేదనుకున్నాడు. పొద్దుట సంఘటన తలుచుకుంటూ నిద్రలోకి జారుకున్నాడు.

మరునాడు సాయంకాలం శివకుమార్, సూర్యం, రాజు కలిసి పొలాలవైపు బయలుదేరారు. వెళ్ళి వెళ్ళి కంది చేను గట్టు మీద కూర్చున్నారు.

పొద్దుట నుంచి శివకుమార్ ఎందుకో పరధ్యాన్నంలో వున్నాడని గ్రహించాడు సూర్యం. అయినా అడగలేక పోయాడు. మొన్న వేసవిలో వచ్చింది మొదలు శివకుమార్ దృష్టి అంతా శాంకరి మీదే వుందనే అనుమానం సూర్యానికి కలిగింది. అంతక్రితం ఎన్నో సార్లు శివకుమార్ వచ్చాడు. కాని శాంకరి వాళ్ళని గుర్తేపట్టలేదు. కాని ఇప్పుడో అతని పంతమాంతా శాంకరితోటే, సూర్యంఆలోచన పరిపరి విధాల పోయింది.

శివా మనస్సు మరెటో పోయి వుదయం సంఘటన దగ్గర ఆగింది.

"తను అనుకున్నట్లు గానే సీటిలో బలే ఛాన్సు దొరికింది. ఆమె వెచ్చని కౌగిట్లో చెప్పలేని సుఖం అందుకున్నాననుకున్నాడు.

ఆమెకళ్ళముందు నిలబడి నట్టయింది. అతని ముఖంలో చిరునవ్వు మెరిసింది.

"అదేమిటి శివా నీలో నువ్వే నవ్వుకుంటున్నావు" అడిగాడు సూర్యం. "నవ్వా! అబ్బే ఏమీ లేదు" తత్తర పాటును సద్దుకున్నాడు.

శాంకరికి సూర్యం అంటే చాలా అభిమానం. ఆమె అంటే అతనికీ చెప్పలేని అభిమానం. ఆమె ఏపని చెప్పినా వెంటనే చేస్తాడు. పైగా కిందటి సారి శివాతో గొడవలు వచ్చింది మొదలు సూర్యం తన తప్పు లేదంటూ ఆమెను ఎన్నోసార్లు బతిమిలాడుకున్నాడు. ఆడ మగ భేదం లేకుండా. అందరు చిన్నతనం నుంచి కలిసి మెలిసి చదువు కుంటున్నారు. కలిసి మెలసి తిరుగుతున్నారు.

అందరికంటే సూర్యంతో ఎక్కువ చనువుగా వుంటుంది శాంకరి. అతనికికూడా ఆమె అంటే ప్రాణం. ఆ చనువు, ఆయిష్టత క్రమంగా సూర్యంమనస్సులో ప్రేమవాహినిగా మారుతున్నాయి. శాంకరి, కాసులు, కనకం, సుబ్బులు అందరు ఒకే వయస్సువారు. కాని సూర్యం వాళ్ళకంటే అయిదు సంవత్సరాలు పెద్ద. అప్పాళ్ళో జూనియర్ కాలేజీ ఆలస్యంగా పెట్టడం వల్ల సూర్యం వాళ్ళతో కలిసి ఇంటర్ చదువుతున్నాడు. అయినా చిన్నతనం నుంచి సూర్యానికి చదువు మీద శ్రద్ధ తక్కువే, పైగా వెనక ఆస్తి వుండడంవల్ల, ఒకే కొడుకు అవడం వల్ల, తల్లి తండ్రులు కూడా అతని చదువుపై అంత శ్రద్ధ చూపించలేదు.

సూర్యం ప్రేమ అప్పుడప్పుడే మొగ్గతొడగడం వల్ల అతని ఆలోచనలన్నీ శాంకరి చుట్టే తిరుగుతున్నాయి. పైగా అతని మనస్సు కూడా అతనిలాగే మెత్తనిది. ఏమాత్రం శాంకరికి కోపం వచ్చినా అతను సహించలేడు.

"శివా! ఈ రోజు ఎందుకోగాని శాంకరి దుమదుమలాడుతోంది" శివాకాసేపు వూపిరి పీల్చలేక పోయాడు. తర్వాత సర్దుకుని "నీకెలా తెలుసు" అని అడిగాడు.

"ఈ వేళ గోదావరి నుంచి వచ్చింది మొదలు నాకు కనపడలేదు అందుకే ఇందాక పలకరిద్దామని వెళ్ళాను.

"శాంకరీ! అంటు నేను పిలవగానే ఎక్కడున్నా 'హలో' అంటు వస్తుంది. కాని ఈ రోజు గదిలోనుంచి బయటకు రాలేదు".

"అంతమాత్రంచేత ఆమె కోపంగావుందని ఎలా అనుకున్నావు?"

"ఆమెకు కోపం వస్తే ఎవరితోను మాట్లాడదు".

"అలాగా! పోనీ నువ్వే గదిలోకి వెళ్ళి పలకరించక పోయావా"

"వెళ్ళాను కాని ఆమె నిద్రపోతున్నట్లు కళ్ళుమూసుకుని పడుకుంది. ఆమె పైకి ఎంత కోపంగా వుంటుందో లోపల అంతమంచిది. నాకంటే చిన్నదైన ఇద్దరం కలిసి చదువుకున్నాం. రోజు నేను కనబడగానే గుక్కతిప్పుకోకుండా కబుర్లు చెప్పేది. కాని ఈ రోజు నోటమాట లేదు".

"అయితే సూర్యం నువ్వు చాలా అదృష్టవంతుడివి".

"అదేం మాట శివా?" ఆశ్చర్యంగా అడిగాడు సూర్యం.

"అదికాదు సూర్యం, ఆమె నీతో అంత చనువుగా వుంటుందా! నన్ను చూస్తే చాలు తిట్టిపోస్తుంది. అందుకే! నువ్వు అదృష్ట వంతుడినికావా?" మనస్సులోని మాట పైకి చెప్పలేక మరో విధంగా సమర్ధించుకున్నాడు. మరెప్పుడూ నోరు జారకూడదనుకున్నాడు.

"అలాగా! ఇదిగో శివా! నా మనస్సులోని మాట చెబుతున్నా శాంకరిని చూడందే నేను ఒక్కరోజు కూడా వుండలేను. పైగా ఆమెకు గోటీలు ఆడటం నేర్పాను".

శివకుమార్ ఒక్కసారి ఆమె వేళ్ళపై తన వేళ్ళు పెట్టి తానే ఆట నేర్పుతున్న దృశ్యం కళ్ళముందు మెలదగా చేతివేళ్ళు పాము కున్నాడు.

"ఆమెనాకు చింతగింజలు, గచ్చకాయలు, గవ్వలు ఆడటం నేర్పింది?"

"నాకూ్కడా నేర్పితే ఎంతబాగుండేది?" ఆ మాటలు శివ గొంతు లోనే వుండిపోయాయి.

"కబడ్డీ ఆట కూడా నేనే నేర్పించాను".

ఆరోజు ఆమెతో ఆడిన దృశ్యం కళ్ళముందు మెదలగా ఆ చేతిని పెదాలకు తాకించుకున్నాడు శివా!"

"ఈత నేర్పింది కూడా నేనే" అన్నాడు సూర్యం గర్వంగా చూస్తూ.

పొద్దుట దృశ్యం కళ్ళముందు మెదలగా శివా కంగారుపడుతూ- "ఎన్నాళ్ళయింది సూర్యం" ఎంత మామూలుగా అడగాలనుకున్నా తడబడ్డాయి మాటలు.

"ఆమెకు సుమారు 10 సంవత్సరాలు ఉండవచ్చు".

అమ్మయ్య! అని వూపిరిపీల్చుకున్నాడు శివా.

సూర్యం అలా చెబుతున్నప్పుడు సూర్యం ముఖం వికసించడం కళ్ళలో వింత కాంతి తళుక్కు మనడం గమనించిన శివా కొంచెం నిరుత్సాహపడ్డాడు. నిజంగా అతను శాంకరిని ప్రేమిస్తునాడనే అనుమానం అతనికి వచ్చింది. ఒక్కసారి అతని హృదయం గాలి తీసిన ట్యూబులా వేలాడింది. అంతలోనే నల్లని మేఘాల మధ్యలో మెరిసే మెరుపుతీగలా ఒక్క ఆలోచన మెరిసింది. "శాంకరిని పరిశీలించాలి, ఆమె మనస్సులో సూర్యంపై ఎటువంటి భావం వుందో తెలుసుకోవాలి" అనుకున్నాడు. అది కనుక్కునే వుపాయం మాత్రం అతనికి అంతు చిక్కలేదు. శాంకరి బయటకు వస్తుందో లేదో? తెల్లవారితే తిరిగి తన ప్రయాణం. ఈ లోపుగా అవకాశం చిక్కుతుందో లేదో? అయినా తను శాంకరిని తన వైపుకు తిప్పుకునే ప్రయత్నం చెయ్యాలి. పరిపరి విధాల పోతున్నాయి అతని ఆలోచనలు.

అంతలో మెరుపుతీగలా నడుచుకుంటు కాసులు, కనకం, సుబ్బులు వెంట వస్తున్న శాంకరిని ఇద్దరూ ఒకేసారి చూసారు.

"ఇది కలా! నిజమా!" అనుకున్నారు ఇద్దరు.

"శివా! శాంకరి వస్తోంది" సూర్యం ఎదురు వెళ్ళాడు. అప్పుడే సూర్యాస్తమయమవుతోంది. ఆకాశమంతా ఎర్రని కాంతితో నిండి, లోకాన్ని మరింత, సోభాయమానం చేస్తోంది. శివా మనస్సు కోటి రాగాలతో వూగుతోంది. సూర్యంతో మాట్లాడుతున్నా శాంకరి ముఖాన్నే చూస్తున్నాడు.

"హలో శాంకరీ!" పలకరించాడు సూర్యం.

"హలో సూర్యం"

"ఇంత ఆలస్యంగా బయలుదేరారేం".

"మహానుభావులు గ్రామంలో ఉన్నారుగా దర్శనం చేసుకుపోదామని। మూతి మూడు వంకర్లు తిప్పుతూ చెప్పింది కనకం.

కనకం సూర్యంతో మాట్లాడాలంటే చాలా సరదాపడుతుంది. అతను ఆ అవకాశం కలిగించడు.

తెల్లగా, సన్నగా, అతినాజూకుగా ఉండి ఎప్పుడు తెల్లటి లాల్చీ పైజామా ధరించి తిరిగే సూర్యమంటే కనకానికి ప్రాణం. ఆమె కంటికి మన్మథునిలా కనబడతాడు. ఏదోవిధంగా అతన్ని పలకరించడానికి తాపత్రయ పడుతుంది.

"కనకంగారూ। తమరిని ఎవరు అడగలేదు" అన్నాడు చిరాగ్గా సూర్యం.

"అంతా ఒక్కటే। ఎవరైన సమాధానమిస్తాం అవునా శాంకరీ"

"అవునవును కనకం చెప్పింది కరెక్టే" సమాధానమిచ్చింది కాసులు। శాంకరి సమాధానం ఇవ్వలేదు. ఎటో చూస్తూ నిలబడింది. మీ షోకులరాయుడికి యీ వూళ్ళో ఏం పనట"

"కనకం కాస్త నెమ్మదిగా చెప్పు, వినబడితే బాగుండదు" సూర్యం కాస గొంతు తగ్గించి అన్నాడు.

"వింటే భయమా?" అంది కాసులు.

"ఏం తలతీసి మొలేస్తాడా" అడిగింది కనకం.

ఆ మాటలు విన్న సూర్యం వారికి సమాధానం ఇవ్వలేక పోయాడు.

శివా! అంటే వారికెందుకంత కోపమో అతనికి అర్థం కాలేదు.

శాంకరి చాలా కోపంగా వుందని మాత్రం గ్రహించాడు.

ఆ ప్రసంగం ఇష్టం లేనట్లుగా శాంకరి "ఇక నడవండే" అంటూ ముందుకు నడిచింది.

మూతి మూడు వంకర్లు తిప్పుతూ ఆమె వెనకే నడిచారు మిగిలిన వారు.

వారి ప్రవర్తన అర్థంకాని సూర్యం వెనక్కి తిరిగి శివాను కలుసుకున్నాడు.

శాంకరి ప్రతి చిన్న విషయం కనకం వాళ్ళకి వెంటనే చెబుతుంది. కాని పొద్దుట జరిగిన విషయం మాత్రం వాళ్ళతో చెప్పలేక పోయింది. పైగా శివా మీదున్న కోపం కూడా మునుపటిలా పైకి చూపించలేకపోయింది. ఆమెలో ఆమెకు తెలీయకుండానే మార్పు ప్రారంభమైంది. ఆమెలోని చిలిపితనం గాంభీర్యం వైపు జరగడం మొదలు పెట్టింది.

అంతవరకు జాగ్రత్తగా శాంకరిని పరిశీలించిన శివకుమార్‌కు ఆమె ముఖంలో ఏ భావం అతనికి అంతుపట్టలేదు. సూర్యానికి వున్న ప్రేమ వట్టి భ్రమేమో అన్న అనుమానం అతనికి కలిగింది. పైగా శాంకరిపై సూర్యానికిగల ప్రేమ కేవలం వన్‌సైడే అని అనిపించింది. శాంకరిని తన దాన్ని చేసుకోగలననే ధైర్యం అతనిలో రూపుదాల్చింది.

శాంకరి ప్రవర్తన సూర్యానికి చాలా బాధ కలిగించింది. అతనిలోని ఉత్సాహం గాలితీసిన రబ్బరు బుడగలా అయింది. ఎక్కువ మాటలు లేకుండానే ఇద్దరు స్నేహితులు ఇల్లు చేరుకున్నారు.

ఆ రాత్రి శివా తీయని కలలతో రొమ్మున చేయివేసుకుని నిద్రపోయాడు. సూర్యానికి మాత్రం కంటికి కునుకు రాలేదు. ఎవరో తన నుండి బలవంతంగా శాంకరిని దూరం చేస్తున్నారనే బాధ కలిగింది. మగత నిద్రలో పీడకలలు కూడా వచ్చాయి. శివా వెళ్ళిపోయిన తరువాత శాంకరికి కోపం కలిగించే పని చెయ్యకూడదనుకున్నాడు. అతని మనస్సు బాధను గుమ్మరించుకుంటూనే వుంది.

# 11

ఇంకా బాగా వెలుగు రాలేదు. శివకుమార్‌కు మెళకువ వచ్చింది. ఆరోజే అతని మద్రాసు ప్రయాణం. ఒకసారి శాంకరిని వంటరిగా కలుసుకుని మాట్లాడాలనే సంకల్పం అతనిలో కలిగింది. సూర్యం

పక్క మంచంమీదే పడుకుని నిద్రపోతున్నాడు. అతనికి మెళకువ రాకుండా మెల్లిగా లేచి బయటకువచ్చాడు.

పొగమంచు తెరలలో వీధి అంతా మసక మసకగా వుంది దూరంగా వున్న ఇళ్ళు, చెట్లు కనపడ్డమే లేదు. ఆ సమయంలో శాంకరి పెరట్లో పూలు కోస్తూ వుంటుందని నిన్న సూర్యం చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి. ఆశగా అటు కదిలాడు.

ఆ పెరడుకు గోడలేదు. చెట్లన్నీ మంచు పొరతో నిండి వున్నాయి. ఏ చెట్టు ఏమిటో దగ్గరకు వెళ్ళి పరిశీలనగా చూస్తే గాని తెలియడం లేదు. నందివర్ధనం, పారిజాతం, నైట్‌క్వీన్ వాసన ఎటునుంచి వస్తోందో అలవాటైన వారికి తెలిసిపోతుంది. పూల చెట్లతో పరిచయం లేని శివాకు తెలియలేదు. పక్షులు ఆ చెట్టునుంచి ఈ చెట్టుకి ఎగురుతూ వింతగా రాగాలు తీస్తున్నాయి. ఆ రమణీయమైన వాతావరణంలో ప్రతిచెట్టును పరిశీలనగా చూస్తూ కట్టవదాటి వెట్ల ఆవరణలో అడుగుపెట్టాడు శివా!

గులాబీ కొమ్మను వంచి ఎర్రగులాబీని కోస్తోంది శాంకరి. అప్పుడే యవ్వనంలో అడుగుపెట్టిన ఆ కన్య గులాబీ కన్యలా అతని కంటికి కనబడింది. అతని వయస్సు రెపరెపలాడింది. అతని మనస్సు మంచుతో తడిసిన గులాబీలా మెత్తబడింది. అతని పలుకు కూనిరాగం తీసింది.

"శాంకరీ" తీయగా పిలిచాడు.

ఆ పిలుపుకు ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూసింది శాంకరి.

కంగారుగా అటుఇటు తలతిప్పింది. అయినా ఎవరూ కనబడలేదు. భ్రమ పడ్డానేమో అనుకుంది.

"శాంకరీ"

ఈ సారి శాంకరికి ఆ పిలుపు మరింత దగ్గరగా వినబడింది. ఆ తీయని పిలుపుకు ఆమె హృదయం మొయిళ్ళను చూసిన నెమలిలా నాట్యమాడింది. ఆమె చూపులు లేళ్ళలా పరుగులు పెట్టాయి. ఆమె శరీరం చిరుగాలికి వూగే కొమ్మల్లా, కదలాడింది. ఎదురుగా శివకుమార్

రూపం కనిపించింది. 'కలా, నిజమా' అర్థంకాలేదు ఆమెకు. "శాంకరీ" అనీ మళ్ళీ పిలిచాడు.

ఆ పిలుపుకు ఈ లోకానికి వచ్చింది శాంకరి. ఎదురుగా శివకుమార్ కనిపించాడు.

ఆమె కనుబొమలు ముడిపడ్డాయి. ఆమె చూపులు "ఎందు కొచ్చావ్" అన్నట్లు ప్రశ్నించాయి.

"ఈ రోజే మద్రాసు వెడుతున్నా: నీతో చెప్పి పోదామని వచ్చాను." అతని మాటలు తడబడ్డాయి.

శాంకరి ఎటో చూస్తూ నిలబడింది.

"నన్ను క్షమించు శాంకరీ: నీ అందం నీ పెంకితనం నన్ను రెచ్చగొట్టాయి. నీమీద కోపం లేదు. నిన్ను అవమానించాలని నా వుద్దేశం కాదు నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను". శివా మాట పూర్తికాలేదు. శాంకరి పూలబుట్టలోని పూలు తీసి అతని మొహానికి కొట్టి లోపలికి పరుగెత్తింది.

తెల్లబోయిన శివా క్షణంలో తేరుకున్నాడు.

"శాంకరీ: ఎప్పటికైనా నువ్వు నాదానివే" అన్నాడు గట్టిగా.

పెరటి గుమ్మం గడప దాటబోయిన శాంకరికి ఆ మాటలు వినబడ్డాయి. ఆమెలోనిపంతం బుసగొట్టింది.

ఒక్క సెకను తలతిప్పి వెనక్కి తిరిగింది.

"కాదు! కాదు: కాదు!" గొంతు చించుకుని అరిచింది.

మరుక్షణం తలుపు గడియవేసిన శబ్దం వినబడింది.

ఆమె పంతం అతనికి మరింత యిష్టం. చిన్న పిల్లలు అనుకరిస్తే గొంతువేగం హెచ్చించే ఆడుకోయిలలా అనిపించి నవ్వుకుంటూ వీధివైపుకు వచ్చాడు శివా.

"శివా ఎక్కడకు వెళ్ళావు" అప్పుడే లోపలికి వస్తున్న శివాను పలకరించాడు సూర్యం.

మవ్వు లేకుండా నేనెక్కడికి వెడతాను సూర్యం. నిన్న లేపకమెండ్ కని వెళ్ళి పీధుల్లో నిలబడ్డా. ఈ రోజు ఎంత పొగమంచు పడుతోందో.

అబద్ధమాడాననే భయం శివా అంతరాత్మలో కదలాడింది.

సూర్యానికి ఏ మాత్రం అనుమానం రాలేదు. పచ్చ కామెర్ల వాడికి లోకం పచ్చగా కనబడువచ్చు. కాని మంచి వానికి మాత్రం లోకం మంచిగానే కనబడుతుంది.

పెట్టె సర్దుకుంటున్న శివాను బెంగగా చూశాడు సూర్యం. "ఇంకో నాల్గు రోజులుండకూడదా శివా!"

"సూర్యం! ఎన్నాళ్ళు వున్నా నీలాంటి వారికి అలాగే అనిపిస్తుంది. నీ మంచితనం అలాంటిది" ఇద్దరి కళ్ళల్లో నీటిపొర కదిలింది.

"మళ్ళీ ఎప్పుడు వస్తావు!".

"మీ పరీక్షలు నా పరీక్షలు పూర్తి అయ్యాక"

అంతలో సూర్యం తల్లి అక్కడకు వచ్చింది. ఈసారి మీ అమ్మగార్ని తీసుకు రా! వారిని చూసి చాలా రోజులయింది.

ఆవిడ మాటలకు అలాగేనండి అన్నాడు.

అంతలో జగన్నాధం గారు వచ్చి "ఏమయ్యా! అప్పుడే ప్రయాణమే. నాలుగు రోజులుండి వెళ్ళు"

"కాలేజీ కదండీ! అయినా మా నాన్నగారు ఎలావున్నారో! వుత్తరం రాలేదు". అన్నాడు ఆందోళనగా శివకుమార్

"మీ నాన్నగారికేం, బాగానే వుంటారు? ఇంక కాలేజీ అంటావా? ఎప్పుడూ వుండేదేగా! ఇదిగో ఈ సారి వచ్చినప్పుడు మీ నాన్నగారిని అమ్మగారిని కూడా తీసుకుని రావాలి తెలిసిందా!"

ఆ దంపతుల ఆప్యాయతకు శివా కరిగి పోయాడు.

"ఈ రోజుల్లో యింత మంచివారు వుంటారా!" అనుకున్నాడు మనస్సులో.

"అలాగే తీసుకువస్తానండి. ఇంక వెళతానండి అంటూ పెట్టె చేతపట్టుకున్నాడు.

"మీ అమ్మగారిని అడిగానని చెప్పుబాబు" అంది ఆవిడ.

"అలాగేనండి"

జగన్నాధంగారు బలవంతంగా అరటి పండ్లగెల, దోర్లో పెట్టు అరటికాయలు బుట్టలో సర్ది యిచ్చారు.

సూర్యంతో పాటు రిక్షా ఎక్కిన శివా చూపులు అటు ఇటు వెతికాయి. శాంకరి మాత్రం కనబడలేదు.

రిక్షా కదిలింది.

"జాగ్రత్త బాబూ" అన్నారు జగన్నాధంగారు.

వీధి అరుగుమీద నిలబడివున్న శాంకరి తండ్రిని చూసి "నమస్కారమండీ" అన్నాడు శివకుమార్. "మంచిది నాయనా" అన్నాడాయన. రిక్షా వేగంగా ముందుకు కదిలింది.

# 12

శివకుమార్ ఇల్లు చేరగానే ఎదురు వచ్చిన రాజేశ్వరమ్మగారు, కొడుకుని కౌగిలించుకుని వెక్కి-వెక్కి ఏడ్చింది.

"ఏం జరిగిందమ్మా!" కంగారూగా తల్లిని అడిగాడు శివకుమార్.

"మీ నాన్న గారికి మొన్న చాలా జబ్బు చేసింది. మైల్డు హార్ట్ ఎటాక్ అన్నారు డాక్టర్లు. నీ కోసం టెలిగ్రాం ఇప్పించాను."

కారే కన్నీళ్ళు కొంగుతో తుడుచుకుంటూనే వుంది.

ఆవిడను చూసేటప్పటికి శివకుమార్‌కి దుఃఖం పొంగివచ్చింది. ఎదురుగా తండ్రి మంచం మీద చలనం లేకుండా పడుకుని వున్నాడు.

శివా ఒక్క అంగలో ఆయన మంచం సమీపించాడు. డాక్టర్ దగ్గర పని చేస్తున్న ఒక నర్సు పక్కనే కుర్చీలో కూర్చుని వుంది.

తండ్రి పరిస్థితంతా ఆమె నడిగి తెలుసుకుంటున్నాడు శివా.

"ఏం భయం లేదమ్మా! నువ్వు ధైర్యంగా వుండాలి. నాలుగు రోజుల్లో నాన్నగారు మామూలు స్థితికి వచ్చేస్తారు. నువ్వు కంగారు పడకమ్మా!"

అప్పుడు చూసాడు పరిశీలనగా తల్లిని. పది లంఖణాలు చేసినట్లు కనిపించిందావిడ.

"నువ్వు ఎలా వున్నావో తెలుసామ్మా! నువ్వు మంచాన పడితే నన్ను, నాన్నగార్ని చూసే దెవరమ్మా."

"నాకేం భయం లేదురా! ఆయన ఎట్లా వుంటారోననే నాకు భయంరా!" ఆవిడ గొంతుక జీరబోయింది.

"నువ్వు ధైర్యంగా వుండమ్మా! నాన్నగారికి ఏ భయం లేదు" అన్నాడు ఓదార్పుగా.

"కాఫీ తాగుదువుగాని బాబు" ఆవిడ మాట మార్చి వంట యింటివైపు నడిచింది.

తిరిగి తల్లి కాఫీ కప్పుతో వచ్చింది. కొడుకు పక్కన మరో కుర్చీలో కూర్చుంది.

"అసలేం జరిగిందమ్మా!"

"నువ్వెళ్ళిన తర్వాత మరింత నీరసపడ్డారు. ఆ రోజు కోర్టు కెళ్ళడానికి తయారయ్యారు. బూట్లు వేసుకుంటున్న మనిషి కుర్చీలో వెనక్కి వాలిపోయారు. వళ్ళంతా చెమటలు. గుమస్తా రామనాధం వెళ్ళి మన డాక్టరు గారిని తీసుకువచ్చాడు. ఆయన ఆక్సిజన్ అది ఇక్కడకే తెప్పించారు. ఏం ప్రమాదం లేదని పూర్తి విశ్రాంతిలో వుండాలని చెప్పారు." ఆవిడకు దుఃఖం పొంగి వచ్చింది.

"సమాయనికి నువ్వు లేవురా. దిక్కులేని వాళ్ళలా అయిపోయామనుకో. మామయ్యకు కూడా టెలిగ్రాం ఇప్పించాను" వెక్కి వెక్కి ఏడ్చింది.

"ఇంకెందుకమ్మా? భయం ఇంక ఏడవకు." అన్నాడు.

"ఎందుకండి అలా ఏడుస్తున్నారు. ప్రమాద పరిస్థితి ఏం లేదండి" అంది చూస్తున్న నర్సు.

"రాత్రి అవసరమొస్తుందని నర్సు ఇక్కడే వుంటోంది. నిన్నటి వరకు రామనాథం కూడా ఇక్కడే వున్నారు. పొద్దుటే కాస్త సులువుగా వుందని యింటికి వెళ్ళాడు.

"ఈ రోజుల్లో నాలుగు రోజులైనా టెలిగ్రాములు అందకపోవడం ఆశ్చర్యంగావుంది. సరేలే నువ్వే వచ్చావుగా" అంది తల్లి.

కాఫీ తాగడం పూర్తిచేసి కప్పు పక్కనే పెట్టాడు. అంతలో డాక్టర్ చైతన్య వచ్చి నారాయణరావుగారిని పరిశీలించి చూసి ఆ మందులే వాడమని మరో ఇంజక్షన్ ఇచ్చారు.

"ప్రస్తుతం భయం లేదండి. కాని మళ్ళీ రాకుండా చూచుకోవాలి. కొన్నాళ్ళు రెస్టు చాలా అవసరమండి" ఆదుర్దాగా చూస్తున్న శివాతో చెప్పాడు డాక్టరు.

నర్సు కూడా డాక్టర్ వెంట కదిలి వెళ్ళింది.

డాక్టరు వచ్చి వెళ్ళిన తరువాత తల్లీకొడుకులకు కాస్త ధైర్యం వచ్చింది.

అంతలో నారాయణరావుగారు కళ్ళు విప్పి చూసారు. శివ కుమార్ తండ్రికి దగ్గరగా వెళ్ళి నిలబడ్డాడు. కొడుకును గుర్తుపట్టినట్లుగా ఆయన కళ్ళలో నీటిపొర కదిలింది.

"అబ్బాయి వచ్చాడు హాయిగా పడుకోండి" ఆవిడ మాటలు విన బడినట్లుగా ఆయన తిరిగి కళ్ళు మూసుకున్నాడు.

"శివా! నువ్వు స్నానం చేసి రారా! నేను ఇక్కడే చూస్తుంటాను" ఆయనకు కప్పిన దుప్పటి సరిచేస్తూ చెప్పిందావిడ. శివకుమార్ స్నానాలగదికి వెళ్ళాడు.

షవర్ తిప్పి స్నానం ప్రారంభించాడు. ఎందుకో అనుకోకుండా గోదావరి స్నానం గుర్తుకు వచ్చింది. తన వడిలో శాంకరి తాను పెదాలు అందుకున్న శాంకరి! అతని వళ్ళు జలదరించింది. వేడినీళ్ళ స్నానం

చేస్తున్నా ఒళ్ళంతా చలికాయలు. స్నానం చేస్తూనే వున్నాడు. గత అనుభవంలో పులకరిస్తున్నాడు.

తల్లి తలుపు కొడుతుంటే అతనికి వినబడడమే లేదు.

"బాబూ తలుపు తియ్యరా!" ఆసారి మరింత గట్టిగా కొట్టింది.

"షవర్ ఆపి." 'ఏమిటమ్మా' అంటూ తలుపు తీశాడు.

"ఏమిట్రా యింతసేపు స్నానం చేస్తున్నావు" ఆశ్చర్యంగా అడిగింది.

"ఏం లేదమ్మా! ఆ పల్లెటూర్లో ఎంతసేపు స్నానం చేసినా ఒళ్ళంతా మట్టే" అన్నాడు నవ్వుతూ.

"సరే కాని గిరిజను తీసుకుని మీ మావయ్యా, అత్తయ్యా వచ్చారురా!" ఆమాట వినగానే అతని ముఖంలో వచ్చిన మార్పు చూడకుండానే ఆవిడ వెనక్కి తిరిగింది.

టవల్ చుట్టుకున్న శివకుమార్ బట్టలు వేసుకోడానికి మేడ మీద తన గదికి వెళ్ళాడు.

జబ్బులో వున్నవారు ఉన్నప్పుడు ఇంట్లో నలుగురు తిరుగుతూ వుంటేనే ధైర్యంగా వుంటుంది. అటువంటి సమయంలో ఒంటరితనం, అర్ధరాత్రి చీకటిలా అనిపిస్తుంది.

రాజేశ్వరమ్మగారికి తమ్ముడు వాళ్ళని చూడగానే మరింత ధైర్యం వచ్చింది. భర్తకు సగం రోగం తగ్గినట్లు అనిపించింది. నారాయణరావుగారు కూడా బావమరిదిని గుర్తు పట్టారు. ఆయన ముఖం కాస్త తేటగా అనిపించింది. ఆయన కళ్ళు కదలాడిన నీటిపొర ఆత్మీయతవల్ల వచ్చిందే. బాధల్లో వున్నవారిని ఎవరు పలకరించినా ఆత్మీయత కన్నీళ్ళ రూపంలో కళ్ళలో కదలాడుతుంది.

మేనల్లుడేడని ఆయన అడగలేకపోయాడు. కిందటిసారి వచ్చినప్పుడు జరిగిన సంగతి ఇంట్లో చెప్పలేదు. ఈసారి శివా సంగతి అడగడానికి నోరురాలేదు.

ఆవేమి తెలియని గిరిజ ఉత్సాహంగానే వుంది.

"అబ్బాయి కనబడలేదు వదినా".

"మేడమీద వున్నాడ"ని గిరిజ తల్లికి సమాధాన మిచ్చింది రాజేశ్వరమ్మ.

మేనత్త ఆమాట చెప్పగానే "బావా" అంటూ మేడమీదికి పరుగెత్తింది గిరిజ.

గిరిజ వస్తున్న అలికిడి వినగానే తలుపు బోల్టు పెట్టుకున్నాడు శివకుమార్.

"బావా! బావా! తలుపులు తియ్యి" టకటక తలుపులు కొట్టింది గిరిజ.

"వస్తున్నా! వస్తున్నా! గిరిజా" అన్నాడు కాని శివకుమార్ వెంటనే తలుపులు తియ్యలేదు.

"ఏం చేస్తున్నావు బావా తలుపులు తియ్యి" మళ్ళీ పిలిచింది గిరిజ. యవ్వనంలో అడుగుపెట్టిన గిరిజ మనసు నిండా సన్నజాజి సౌరభంలా ఆవరించి వున్నాడు శివా. ఆమె తలుపుల నిండా తీయని కోరికలే. చిన్నతనం నుంచి చనువుగా తిరిగిన శివకుమార్ చుట్టూ ఆమెలోని తీయని కలలు తిరుగుతున్నాయి. అతని కళ్ళలోని ఆత్మీయత ను అందుకోడానికి ఆమె చూపులు తొందర పడుతున్నాయి. అతన్ని ఆ క్షణంలో చూడాలని ఆమె కోరిక. ఆ దృష్టిలో లేని శివకుమార్‌కు తొందరలేదు.

"తలుపు తియ్యి బావా!" ఈసారి దబాదబా కొట్టింది తలుపు మీద. శివకుమార్‌కు తలుపు తియ్యక తప్పలేదు.

గిరిజ సంతోషంతో ఉక్కిరి బిక్కిరి అయింది.

"బావా" అన్న ఆమె అతన్ని చూస్తు అలాగే ఆగిపోయింది. అప్పుడే స్నానం చేసి వేసుకున్న దుస్తులతో కొత్తగా కపబడ్డాడు ఆమె కంటికి. స్నానం చేసి తల పూర్తిగా ఆరకుండా దువ్వుకున్న అతని కురులు వింతగా మెరుస్తున్నాయ. అప్పుడె రాసుకున్న పౌడరు వాసనతో ఘుమ ఘుమ లాడుతున్నాడు.

"బావా! బావా!" అంటూ మునుపటిలా చనువుగా అతనికి సమీపించలేక పోయింది. సిగ్గుచేత కాదు.

అతనిలోని చిలిపితనం మటుమాయమవ్వడమే దానికి కారణం.

బావలోని మార్పు ఆమె గ్రహించలేకపోయింది.

"ఏం గిరిజా! ఎప్పుడొచ్చారు?" ఆ మాటలు పొడిగా వినపడ్డాయి.

గిరిజ వుత్సాహంమీద నీళ్ళు జల్లినట్లయింది. ఆమె తలవంచుకుని వెనక్కి తిరిగింది. మునపటిలా అతను బతిమాలుతాడని ఆమె ఆశ.

అవన్నీ ఆమెపట్ల మరిచిపోయిన శివకుమార్ ఆమెను దాటుకుంటూ కిందికి వచ్చేసాడు. ఉబికి వచ్చే కన్నీళ్ళను పమిట కొంగుతో తుడుచుకుంటూ మెల్లగా మెట్లు దిగింది గిరిజ.

"ఏం మావయ్యా ఎప్పుడొచ్చారు"?

"ఏం అత్తా ఎప్పుడొచ్చారు?"

"ఇప్పుడే శివా" అల్లుడి అందాన్ని చూసుకుని మురిసిపోయింది ఆవిడ.

మేనమామ పక్కనే కూర్చుని కాసేపు అతనితో, మేనత్తతో మాట్లాడాడు. అంత సేపు గిరిజ ఎటో చూస్తు దూరంగా కూర్చుంది. శివకుమార్‌తో మాట్లాడుతున్న అత్త కూతురు సంగతి పట్టించుకోలేదు. చలపతి మాత్రం కూతుర్ని చూసి శివాతో గొడవ పడి వుంటుందని వూహించుకున్నాడు.

టైం చూసుకున్న శివకుమార్ తండ్రి దగ్గరకు వెళ్ళి మందులు వేసీ తిరిగి దుప్పటి సరిచేసాడు. కొడుకుని సంతృప్తిగా చూసుకున్న నారాయణమూర్తిగారు హాయిగా కళ్ళు మూసుకుని పడుకున్నారు.

"నాన్నగార్ని ఎక్కువ పలకరించకండమ్మా! కొంచెం పనుంది అలా బయటకు వెళ్ళి వస్తానమ్మా"

సరే కాని భోజనానికి ఆలస్యం చెయ్యకు బాబూ"

"సరేనమ్మా!" అతను తలుపులు తెరచుకుని బయటకు వెళ్ళాడు. తర్వాత మోటారు సైకిలు స్టార్టు చేసిన శబ్దమయింది.

అప్పుడు చూసింది ఆ తల్లి. కూతురు మొహం వాడి పోయి వుండడం. అప్పుడు ఆలోచించింది శివకుమార్‌లోని మార్పును, ఎంతో సరదాగా గిరిజతో మాట్లాడే శివకుమార్ ఒక్కసారిగా అంత ముభావంగా ఎందుకు మారాడో ఎవరికి అంతు పట్టలేదు. ఎవరూ పైకి ఏమీ అనలేదు.

సాయంకాలం తిరిగి వచ్చాడు శివకుమార్. రాగానే తండ్రిని చూసి తర్వాత నవ్వుతూ అందరిని విష్ చేసి మేడ మీదకు వెళ్ళిపోయాడు.

అతని పలకరింపులో ఏదో ఆత్మీయత కనబడింది గిరిజకు. కొత్త ఆశలు అల్లుకున్నాయి ఆమె మనస్సులో. ఏదైనా అతనితో మాట్లాడి ఏదో ఒకటి తేల్చుకోవాలనుకుంది. అతని వెనకే మేడ మెట్లు ఎక్కింది.

"లోపలికి రా గిరిజా!"

గుమ్మం దగ్గరే ఆగిపోయిన గిరిజను పిలిచాడు శివకుమార్. ఆ పలకరింపుకే కరిగి పోయిన గిరిజకు కోపం తగ్గిపోయింది. "ఏం బావా నాతో మాట్లాడడం లేదు". అంది గారాలు పోతూ, "మాట్లాడక పోవడం ఏమిటి గిరిజా! ఇప్పుడేగా నిన్ను పలకరించి పైకి వచ్చాను". డ్రాయరు మీద పుస్తకాలు సర్దుకుంటూ సమాధాన మిచ్చాడు.

"అది కాదు బావా! నువ్వు చాలా మారిపోయావు"

"అలాగా అయితే నువ్వు కూడా మారిపో! సరిపోతుంది" చేసే పని ఆపకుండానే సమాధానమిచ్చాడు.

ఆ సమాధానం విని ఆశ్చర్య పోయింది గిరిజ. ఒక్కసారి ఆమె మనస్సులో అతనిపై అనుమానాలు చోటు చేసుకున్నాయి. ఎవరో అతని దృష్టిలో పడివుంటారు. బహుశా క్లాసుమేటు కావచ్చు. లేకపోతే వూరు వెళ్ళినప్పుడు. అక్కడ ఎవరైన అమ్మాయి కలిసి వుండవచ్చు. ఏ స్నేహితుని చెల్లెలో కావచ్చు.

ఇంక అతనితో మాట్లాడకూడదనుకుంది. ఆమెలోని అభిమానం

కాసేపట్లో కళ్ళలో కన్నీళ్లై కారింది. ఇక అక్కడ అతనికి ఎదురుగా నిలబడి మాట్లాడలేక మెట్లుదిగి కిందికి వచ్చేసింది.

ఎవరూ చూడకుండా గిరిజ బాతురూములోకి వెళ్ళి వెక్కి వెక్కి ఏడ్చింది.

చిన్నతనం నుంచి శివకుమార్ని ప్రేమించటం నేర్చుకుంది. అతన్నే ఆరాధించింది. అతను కూడా ఆమెతో చనువుగా వుండేవాడు. అతనిలోని ఆ చనువే ఆమెలో ఆశలు పెంచుకోడానికి కారణమయింది. ఆ పెంచుకున్న ప్రేమలతను వేళ్ళతో ఎవరో పెళ్ళగించినట్లయింది. ఆమె మానసికంగా వాడిపోయింది.

రాత్రి తల్లి పక్కలో పడుకొని కరువుతీరా ఏడ్చింది. ఆడ బిడ్డను నిలదీసి అడగాలనుకుంది ఆ తల్లి. కాని నారాయణమూర్తిగారు జబ్బుచేసి మంచం మీద వున్నప్పుడు అల్లరి చెయ్యటం బాగుండదని వూరుకుంది. కూతుర్ని ఓదార్చింది,

గిరిజ మరునాడే వెళ్ళిపోదామని పేచీ పెట్టింది.

"రెండు రోజులు ఓర్పు పట్టమ్మా! తర్వాత అలాగే వెళ్ళిపోదాం" తల్లిదండ్రులిద్దరూ బతిమాలాడు.

"అయితే మీరుండండి. నేను వెళ్ళిపోతాను". గిరిజ పేచీ పెట్టింది. "రెండురోజులుంటే మామయ్యగారికి కాస్త తగ్గుతుంది. అప్పుడు శివానే అడుగుదాం.

"కంగారుపడకమ్మా!" అంది ఆ తల్లి. చలపతి నోటమాట రాలేదు. ఎప్పుడో అటువంటి పరిస్థితి ఎదుర్కోవలసి వస్తుందని అతనికి తెలుసు. గిరిజ సమాధానం చెప్పకుండా కళ్ళు మూసుకుని పడుకుంది. ఇంక తల్లి తండ్రులు ఆ విషయం ప్రస్తావించలేదు. రాజేశ్వరమ్మగారికి ఆ మాటలు వినపడుతూనే వున్నాయి. శివాకు అన్నం వడ్డించిన రాజేశ్వరమ్మ.

"నువ్వు ముభావంగా వున్నావని బాధపడుతోందిరా గిరిజ" కొడుక్కి చెప్పింది.

"నేను మామూలుగానే వున్నాను! కాని నాన్నగారు ఎలా వున్నారో వాళ్ళకి తెలుసు కదమ్మా! గిరిజ నాన్నగార్ని చూడ్డానికి వచ్చిందా? లేక నాతో సరదాగా వాగడానికి వచ్చిందా" ఎదురు ప్రశ్నలు వేసాడు తల్లిని.

కొడుకు చెప్పిందాంట్లో నిజముంది. అందుకే అతనికి సమాధానం చెప్పలేకపోయింది. కాని అతని మనస్సు మాత్రం అర్థం కాలేదు.

"నువ్వు చెప్పింది నిజమేరా!" అంది. ఇంకేమి అనలేక తల్లి వైపు ఆప్యాయంగా చూసాడు శివా.

"అమ్మా! నువ్వు భోంచేసావా?"

"తిన్నారా"!

శివా భోజనం చేసి తండ్రి దగ్గరకు వచ్చాడు. బెడ్‌లైట్ కాంతితో తండ్రి ముఖం మరింత పేలవంగా కనబడింది.

"ఎప్పటికి కోలుకుంటారో" అనుకున్నాడు మనస్సులో. తల్లికూడా పని ముగించుకుని వచ్చింది.

అనేక విషయాలు ఇద్దరూ చర్చించుకున్నారు. ఆయన మంచానికి దగ్గరగా ఇద్దరు మంచాలు వేసుకుని పడుకున్నారు. రెండు రోజుల నుంచి నిద్రలేని రాజేశ్వరమ్మగారు ఆ రాత్రి గాఢంగా నిద్రపోయింది.

శివకుమార్ మాత్రం మగత నిద్రపోయాడు. తండ్రిని జాగ్రత్తగా చూస్తునే వున్నాడు. మందులు వేస్తూనే వున్నాడు.

మరునాడు ముభావంగా వున్న గిరిజను చూస్తే ఆవిడకు జాలేసింది. అటు కొడుకు మనస్సు కష్టపెట్టే పనిచెయ్యలేను. ఇటు మేనకోడలు మనస్సు కష్ట పెట్టలేదు. ఏదైన ఆవిడకు కొడుకు తర్వాతే కోడలు. ఆమెకు కాస్త నచ్చచెప్పి మనసులోని బాధనుకాస్త తగ్గించాలనుకుంది. అయినా పెద్దల తప్పు కూడా వుందని ఆమెకు తెలుసు. "చిన్నతనం నుంచి వాళ్ళు కలిసి మెలిసి తిరగడానికి తామే కారకులు. గిరిజ పుట్టింది మొదలు శివా భార్యని చెప్పింది తామే. ఈ నాడు వారిద్దరి ప్రవర్తనలో మార్పు వచ్చింది. ఆ మార్పును తాము సరిదిద్దలేరు.

పెద్దలు చేసిన పనికి గిరిజ ఈనాడు విలవిల్లాడిపోతోంది అను కుంది రాజేశ్వరమ్మ. "వాడి మనస్సు బాగుండలేదమ్మా! తండ్రిని చూడగానే బెంబేలు పడిపోయాడు. వాడికి వెనకాముందు ఎవరూ లేరు కదమ్మా! వాడికి వాడే తోడు. తండ్రి అంటే వాడికి ప్రాణం. ఆయన కోలుకుంటే వాడి మనస్సు కాస్త కుదుట పడుతుంది. వాడే మామూలు మనిషి అవుతాడు. నువ్వు అనవసరంగా బాధపడకు" గిరిజ భుజంమీద చెయ్యివేసి నచ్చచెప్పింది.

మేనత్త మాటలు ఆమె మనస్సుకు హత్తుకున్నాయి. తానే అస త్యంగా ప్రవర్తించానేమోనని బాధపడింది గిరిజ. "మేనత్త మాటలకు తల తిప్పింది". ఆవిడకు కొత్త వూపిరి అందింది.

రెండురోజు లయ్యేటప్పటికి నారాయణరావుగారు కాస్త కోలు కున్నారు.

ఆ రెండు రోజులు కూడా శివకుమార్ తప్పించుకునే తిరిగాడు- గిరిజ కూడా అతన్ని పట్టించుకోనట్టే మసలుతోంది.

మూడోరోజు కాలేజీకి వెళ్ళివచ్చాడు శివకుమార్.

ఆ సాయంకాలం కారుతీసుకుని బయలుదేరుతున్న శివాని చూడ గానే గిరిజ మనసు రెపరెప లాడింది.

"బావా! సినిమాకి వెడదామా!" అంది పంతం మరిచిపోయి చనువుగా.

"ఓ! దానికేం తప్పకుండా! నేను కూడా సినిమా చూసి చాలా రోజులయింది. ఇప్పుడే వస్తాను రెడీగా వుండు" కారు వేగంగా పోర్టుకో లోంచి రోడ్డు మీదికి వెళ్ళిపోయింది.

గిరిజ ముఖం ఆనందంతో వెలిగింది. ఆ మాట విన్న అందరు సంతోషించారు. డ్రస్సింగ్ టేబులు ముందు కూర్చున్న గిరిజ అరగంట వరకు ముస్తాబు చేసుకుంటూనే ఉంది. అరగంట తరువాత తుది మెరు గులు దిద్దుకుని వచ్చి డ్రాయింగ్ రూములో సోఫాలో కూర్చుని శివా రాక కోసం ఎదురు చూస్తోంది.

గిరిజ మరీ పొడవరి కాదు, పొట్టి కాదు. దానికి తగిన లావు. పచ్చటి రంగు, తీర్చిదిద్దిన ముక్కు, ఆమె పలువరస అందంగా వుంటుంది. కళ్ళు చిన్నవియైనా నవ్వుతూంటే ఆకర్షణీయంగా వుంటాయి. దానికి తగినట్లుగా అతి మోడరన్‌గా ముస్తాబు చేసుకుంటుంది. ఎత్తు చెప్పులు, చేతికి వాచి, కొత్తరకం చీరలు, హేర్ స్టైలు ఆమెను మరింత ఫేషన్‌గా చూపిస్తాయి.

అలా ముస్తాబు చేసుకుని కూర్చున్న గిరిజ ఆ తల్లి తండ్రుల కంటికి అప్సరసలా కనబడింది.

"అబ్బాయి యేమని వంక పెడుతాడులే. పిల్ల అందానికి లోపం లేదు. దీపంలా వుంది" అనుకుంది రాజేశ్వరమ్మ.

రాత్రి 9 గంటలు అయినా శివకుమార్ జాడలేదు. గిరిజ అవమానంతో కుంగి పోయింది. రాత్రి భోజనం చెయ్యకుండానే వెళ్ళి పడుకుంది. తల్లి తండ్రులు, మేనత్త ఎంత బతిమాలినా ఆమె వినలేదు. కొడుకు అంత అబద్ద మెందుకు చెప్పాడో తెలియక రాజేశ్వరమ్మగారు కూడా తికమక పడింది.

రాత్రి పదకొండు గంటలకు ఇల్లు చేరుకున్నాడు శివా. అలిసి పోయి వచ్చిన కొడుకుని చూసి ఆ తల్లి భయపడింది.

"ఏం బాబు! అలా వున్నావు" ఆదుర్దా పట్టలేక అడిగింది.

"ఏం లేదమ్మా! నా స్నేహితుడు రాజేష్‌కి యాక్సిడెంటు అయింది" అన్నాడు బాధగా.

"అయ్యో! అదేమిట్రా! అలా ఎలా జరిగింది" ఆమె గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

"స్కూటర్ మీద వెడుతుంటే వెనకనుంచి మిన్నిబస్సు వచ్చి కొట్టింది. అక్కడ ఎవరో చూసి హాస్పటల్లో చేర్పించారు".

"ఇప్పుడెలా వుందిరా"

"ప్రమాద పరిస్థితిలోనే వున్నాడు".

"ఆ తల్లితండ్రులు ఎంత బాధపడుతున్నారో పాపం"

"అతనికి చిన్నప్పుడే తండ్రి పోయాడు. తల్లి ఎక్కడో పల్లెలో దూరంగా వుంది. ఆవిడ కోసం మరో ఫ్రెండుని పంపించాం" ఇంక చెప్పలేనట్లు.

అతడు నీరసంగా కుర్చీలో వెనక్కి వాలి కళ్ళు మూసుకున్నాడు.

"కాస్త ఎంగిలి పడరా!"

"నాకు తినాలని లేదమ్మా!"

ఆవిడ వేడిపాలు పట్టుకొచ్చి యిచ్చింది. ఆ పాలు త్రాగాక అతని మనస్సు కాస్త కుదుట పడినట్లయింది. బట్టలు మార్చుకుని వచ్చి తండ్రి దగ్గరకు వెళ్ళాడు.

మెలకువ వచ్చిన గిరిజ శివకుమార్ మాటలు వింటూనే వుంది. అతనిని అనవసరంగా అపార్థం చేసుకున్నందుకు బాధపడింది. సినిమాకి ఈ వేళ కాకపోతే మరోరోజు వెళ్ళవచ్చనుకుని తిరిగి మంచం చేరి నిద్రపోయింది.

ఒక పక్క స్నేహితుని జ్ఞాపకాలతో మరోపక్క శాంకరి తలపులతో ఆ రాత్రి శివకుమార్‌కు నిద్రపట్టలేదు. అప్పటికే అర్ధరాత్రి అయింది. అంతలో కాలింగ్‌బెల్ మోగింది. ఉలిక్కిపడి లేచాడు శివకుమార్.

"గోపీ! ఏమయిందిరా!" తలుపు తీసిన శివ ఆదుర్దాగా అడిగాడు.

"అంతా అయిపోయింది. నువ్వు రావాలిరా" అతని కంఠం బాధతో పూడుకుపోయింది.

"ఏమయిందిరా శివా!" కారు తాళాలు తీస్తున్న కొడుకుని అడిగింది రాజేశ్వరమ్మ.

"అంతా జరిగిపోయిందమ్మా!"

తండ్రి మంచం దగ్గరకు వెళ్ళి దుప్పటి సరిచేశాడు.

"అమ్మా! నాన్నగారిని జాగ్రత్తగా చూడు. నేనెప్పుడొస్తానో తెలీదు, జాగ్రత్త"

బట్టలు మార్చుకోకుండానే కారు స్టార్టు చేసాడు. గోపీ వెళ్ళి అతని పక్కనే కూర్చున్నాడు. గోపీక్లాసుమేటు కాకపోయినా చిన్నప్పటి నుంచి కలిసి మెలిసి పెరిగారు. బంధువుల కంటే ఎక్కువ. తెలియని వాళ్ళంతా ఇద్దరూ అన్నదమ్ములనుకుంటారు.

"తలుపులేసుకో అమ్మా"

కారు ముందుకు వెళ్ళింది. రాజేశ్వరమ్మగారికి కన్నీళ్ళు ఆగలేదు. వీధి తలుపు గడియపెట్టింది.

ఆ హడావిడికి ఇంట్లో అందరూ లేచారు. రాజేశ్వరమ్మగారు జరిగిన సంగతి చెప్పింది. చలపతి, భార్య ఆ సంగతి విని చాలా బాధ పడ్డారు. గిరిజ మరింత బాధ పడింది.

తెల్లవారినా శివా యింటికి రాలేదు. ఉదయం 10 గంటలు అయ్యాక "నాన్నగారు ఎలా వున్నారమ్మా! నువ్వు కంగారు పడకు. మామయ్యా వాళ్ళను నేను వచ్చేవరకు వెళ్ళనివ్వకు. వీలు చూసుకుని వస్తాను." అంటు ఫోను చేశాడు. మధ్యాహ్నం దాటింది. అయినా శివా యింటికి రాలేదు.

"రేపు డ్యూటిలో జాయినవ్వాలి. నేను వెడతానక్కా" ప్రయాణానికి సిద్ధమయ్యాడు చలపతి. శివా వచ్చాక అతనితో మరోసారి మాట్లాడాలని అతని వుద్దేశం. కాని అతడు కనపడే దారిలేదు. రాజేశ్వరమ్మగారు ఎంత బలవంత పెట్టినా వుండకుండా చలపతి వెంటే భార్యా, కూతురు గిరిజా బయలుదేరారు. పెళ్ళి విషయం ప్రస్తావించకుండానే వెళ్ళిపోయారు. వారివుద్దేశం రాజేశ్వరమ్మకు తెలియలేదు. ఆయనకు బాగా తగ్గిన తరువాత వచ్చి కూతురి పెళ్ళి సంగతి అడుగుతారనుకుంది.

# 13

ఆరోజే ఇంటర్ రెండవ సంవత్సరం పరీక్షలు పూర్తయ్యాయి.

అందరి కంటే శాంకరి పరీక్షలు బాగా రాసింది. ఆమెకు కాలేజీ ఫస్టు రావచ్చని అందరూ అనుకున్నారు. కనకం వాళ్ళు కూడా బాగానే రాసారు. వాళ్ళంతా సెకండు క్లాసులో పాసవుతామనుకున్నారు. ఆ రోజంతా శాంకరి వాళ్ళు హాయిగా తిరిగారు. చీకటి పడుతుండగా యింటికి చేరుకున్నారంతా.

శాంకరి ఇంట్లో అడుగుపెట్టేటప్పటికి నాయనమ్మా, మేనత్తా యింట్లో వున్నారు.

"నానమ్మా! అంటూ ఆవిడను కౌగిలించుకుంది శాంకరి.

"పరీక్షలు బాగా రాసావా" మనవరాల్ని ఒళ్ళో కూర్చోపెట్టుకుని అడిగింది దుర్గమ్మ.

"చాలా బాగా రాసా! నాకే కాలేజి ఫస్టు అంటున్నారంతా" మేనత్త వైపు చూసింది శాంకరి.

"నా తల్లే! తర్వాత ఏం చదువుతావే శాంకరీ"

"డాక్టరు చదివి మీ అందరికి వైద్యం చేస్తా నాయనమ్మా!"

"అబ్బో! అంత చదువుకుంటే యీ గడుగ్గాయిని నా కొడుక్కి చేసుకోను తెలిసిందా!"

"అయ్యో! పాపం ఆ మొద్దవతారాన్ని చేసుకోడానికి యిక్కడెవ్వడు సిద్ధంగా లేరు తెలిసిందా!" మేనత్తకు సమాధాన మిచ్చింది శాంకరి.

ఆ మాటలు విన్న మేనత్త తెల్లబోయింది. మేనత్త కొడుక్కి చదువు లేదు పెద్ద ఆస్తీ లేదు. ఉన్న భూమినే వ్యవసాయం చేస్తున్నాడు. అందమూ లేదు. మనిషి చాలా మోటుగా వుంటాడు. అందుకే ఇంట్లో ఎవరికి ఆ సంబంధం యిష్టం లేదు చదువుకున్నవాడికీ, కాస్త వెనక ముందు ఉన్నవాడికీ, ముఖ్యంగా కాస్త రూపురేఖలు ఉన్నవాడికీ శాంకరిని యిచ్చి పెళ్ళి చేయాలని దుర్గమ్మగారి తాపత్రయం. అందుకే మనవరాలి మాటలకు పకపకా నవ్వింది.

"చూసావా అమ్మా! ఎలా అంటోందో! రెండు మొట్టికాయలు పెట్టవేమే? నీ మనవరాలికి కాస్త భయం చెప్పు" రుసరుసా చూసింది మేనకోడలి వైపు.

రామనాథంగారూ, అన్నపూర్ణమ్మగారు ఆ మాటలు వింటూనే వున్నా వారేమి కలగజేసుకోలేదు.

"అనడాని కేముందీ! పిల్ల ఫస్టుగా చదువుతోంది. నీ కొడుకు పదో తరగతే తప్పాడు కదే! పైగా నీ కొడుకు మోటుగా తుమ్మ మొద్దులా వుంటాడు. నా మనవరాలు ఎలా చేసుకుంటుందే? ఆదేదో పెద్ద చదువు చదువుతానంటోంది.

"ఇంతకీ పిల్లనివ్వమంటారు. అంతేనా?" తల్లిని నిలదీసి అడిగింది. "నాకేం తెలుసే నన్నడగుతావు? నీ అన్నగారి యిష్టం. మీ వదిన యిష్టం. ఆ పైన శాంకరి యిష్టం." దుర్గమ్మ కూతురికి తేల్చిచెప్పేసింది.

"అయితే ఒక్క క్షణం ఇక్కడ వుండను. నే వెళ్ళిపోతా" నంటూ లేచింది. "ఇప్పుడేగా వస్తివి! అప్పుడే వెళ్ళడం యేమిటి? పెళ్ళి సంబంధమే తప్ప పాత సంబంధాలు లేనట్టేనా? కాళ్ళు కడుక్కో కాఫీ, టిఫెన్ తీసుకుందువు గాని" అన్నపూర్ణమ్మ వచ్చి ఆడబిడ్డను సముదాయించింది. ఆ పూటకు ఎలాగో అలాగా ముళ్ళ మీదున్నట్టు వుండి తర్వాత ప్రయాణం కట్టింది ఆవిడ.

వెడుకున్న కూతుర్ని బలవంతం చేయలేదు దుర్గమ్మ. ఆమె స్వభావం తెలుసుకున్న రామనాథం, అన్నపూర్ణమ్మ కూడా ఎక్కువ బలవంతం చెయ్యలేదు.

శాంకరి మాత్రం "హమ్మయ్య" అనుకుంది.

"ఒరే అబ్బాయీ? దీని చదువు సంగతి యేం చేస్తావురా" దుర్గమ్మ రామనాథాన్ని అడిగింది.

"దాన్ని చదివించడమే మంచిదనిపిస్తోందమ్మా! అందరూ ఆ మాట అంటున్నారు. డాక్టరు చదివిస్తే మంచిది. అందులో సీటురావాలిడే

"విశాఖపట్నంలో వుంది కదరా! మరి ఎక్కడ వుంటుందితా ఆడపిల్ల"

"హాస్టల్లో వుంటుందమ్మా! ఈ రోజుల్లో ఆడపిల్లలు చదువుకో డానికి కావలసినన్ని సదుపాయాలు"

"సరే మరి అదే పద్ధతి మంచిదేమో?" ఆ మాటలు విన్న శాంకరి ఎగిరి గంతేసింది. ఆ సంతోషాన్ని అందరికి పంచాలని కనకం యింటి వైపు వెళ్ళింది. అప్పుడే ఆ వార్త అందరికీ అందించింది. కనకం, కాసులు, సుబ్బులు శాంకరి చుట్టూ చేరారు.

అటుగా వచ్చిన సూర్యం "కంగ్రాట్యులేషన్స్" అన్నాడు.

"థ్యాంక్యూ! డాక్టరయినంత ఠీవిగా చెప్పింది శాంకరి.

అతని మనస్సులో కాస్త బాధగా వుంది. శాంకరి పొరుగూరు వెళ్ళి చదువుకోవడం అతనికి యిష్టం లేదు.

శాంకరి మునపటంత చనువుగా అతనితో వుండలేకపోతోంది. మునపటంత సరదాగా మాట్లాడడంలేదు. శాంకరిలో వయసుతో పాటు పెరుగుతున్న మార్పును సూర్యం గ్రహించలేదు.

అయినా ఒకే కాలేజీ మూలంగా అందరూ కలుసుకోడం, మాట్లా డుకోడం మాత్రం మానలేదు.

"శివా వుత్తరం రాసాడు శాంకరి"

శాంకరి ముఖం చిట్లించి సూర్యం వైపు చూసింది. కాని ఏమి మాట్లాడ లేదు.

"ఏం రాసాట్ట" కనకం అడిగింది.

"వాళ్ళ నాన్నగారికి జబ్బు చేసిందిట"

"అలాగా ఇప్పుడెలా వున్నారట" కాసులు అడిగింది.

"బాగానే వున్నారుట" సూర్యం సమాధానమిచ్చాడు.

"అమ్మ అన్నానికి రమ్మంటోంది" తమ్ముడు రవి వచ్చి చెప్ప గానే అతని వెంట యింటికి బయలుదేరింది శాంకరి.

"డాక్టరుగారు టా! టా!" అన్నారు కాసులు, కనకం.

"డాక్టరు గారికి యింక తీరుబడి యెక్కడ? వెరీ బిజీ" అంది సుజ్ఞులు.

"టా! టా!" నవ్వుతూ వెనుతిరిగింది శాంకరి. ఆ నవ్వుకు జారిన ముత్యాలు ఏరుకోవాలనుకున్నాడు సూర్యం.

# 14

కాసులు అసలు పేరు మహాలక్ష్మి. అందరికికాసులంటేనే తెలుసు. మహాలక్ష్మికి పెళ్ళి ప్రయత్నాలు ప్రారంభించారు వాళ్ళ నాన్నగారు. పైవూరు పంపి ఆడపిల్లలను చదివించే శక్తికాని, అభిరుచిగాని ఆయనకు లేదు. ఆయన ఆ వూళ్ళో మిడిల్ స్కూల్లో టీచరుగా పనిచేస్తున్నారు. జీతంతో పాటు ప్రయివేట్లు చెప్పడంవల్ల యిబ్బంది లేకుండా సంసారం సాగుతోంది.

కాసులుకంటే పెద్ద పిల్లాడు కాకినాడలో బి.ఎ. చదువుతున్నాడు. అతనికి ప్రతీనెల డబ్బు పంపడమే కష్టంగా ఉంది. కాసులు తర్వాత ఆడపిల్ల కూడా పెద్దమనిషయి యింట్లో వుంది. రిటైరు కాకుండా కాసులు పెళ్ళి చెయ్యాలని ఆయన తాపత్రయం.

"పిల్ల పెళ్ళెప్పుడయ్యా" కనబడిన ప్రతివారు ఆయన్ని అడుగుతూనే వున్నారు.

"పప్పూ, అన్నం ఎప్పుడు పెడతావే" అంటూ కాసుల్ని ఆడవాళ్ళు అడుగుతూనే వున్నారు.

"ఆ!ఆ! పెడతా! కంగారు పడకండి" అంటూ కాసులు నవ్వుతూ సమాధానం చెబుతూనే వుంటుంది.

అప్పటికే కట్నాలు పెరిగిపోయాయి. ఆడపిల్లల పెళ్ళి చెయ్యడమంటే మామూలు విషయం కాదు. వెనక ఆస్తులున్నవారు అమ్ముకుంటూ పోతున్నారు. అది లేనివారు ఆడపిల్ల పెళ్ళి చెయ్యాలంటే భయపడుతున్నారు.

కాసులు తండ్రి విశ్వేశ్వరరావుగారు సంబంధాలు చూడడం మొదలుపెట్టాడు. ముందు కట్నం సంగతి చెబితేనే పిల్లను చూడడానికి వస్తామని చెబుతున్నారు. ఆయన యిస్తామన్న కట్నం నచ్చి కాసుల్ని చూడడానికి వచ్చిన సంబంధాలు చాలా తక్కువ. అలా వచ్చే పెళ్ళికొడుక్కి చదువు తక్కువ, సరియైన వుద్యోగమూ ఉండడం లేదు. తాడు, బొంగరం లేని వాడికి పిల్లనిచ్చి పెళ్ళి చెయ్యడానికి ఆయనకు మనసొప్పడం లేదు.

అదంతా చూస్తూనే వుంది కాసులు. వయసొచ్చిన ఆమెకు అన్ని విషయాలు అర్థం చేసుకునే శక్తి నిధానంగా ఆలోచించే శక్తి వచ్చాయి.

"కట్నం పుచ్చుకునేవాణ్ణి పెళ్ళి చేసుకోను నాన్నా" అని ఒక రోజు తండ్రితో చెప్పేసింది కాసులు.

తండ్రి అది విని చాలా బాధపడ్డాడు. చదువుకున్న ఆడపిల్లకి అన్ని విషయాలు అర్థమవుతున్నాయి. కానీ కట్నం లేకుండ పిల్లను పెళ్ళి చేసుకునే మగపిల్లాడు లేడు. కూతురికి ఎలా నచ్చచెప్పాలో ఆయనకు అర్థం కాలేదు. ఆయనకు రాయప్రోలువారి "స్నేహలత" గుర్తొచ్చింది. అప్పటికీ ఇప్పటికీ కాలం ఒక్కలాగే వుందనుకున్నారు.

"అమ్మా! కాసులూ! నీ ఆశయం మంచిదేకాని నీ కోరిక నెరవేరే సమయం ఇంకా ఆసన్నం కాలేదు. పైగా మన సంసారం అస్తమించే సూర్యునిలా వుందమ్మా! చదువుకున్న దానివి జాగ్రత్తగా ఆలోచించమ్మా?"

"ఎందుకలా అనుకోవాలి నాన్నా! నేను చదువుకుని వుద్యోగం చేస్తాను నాకాళ్ళ మీద నేను నిలబడతాను." తండ్రికి ధీమగా సమాధానమిచ్చింది కాసులు.

"నీకు తెలీదమ్మా? పెద్ద పెద్ద చదువులు చదువుకున్న వాళ్ళకే వుద్యోగాలు లేవు. పైగా రికమండేషన్‌లేంచే అసలు వుద్యోగాలే దొరకడం లేదు. ప్రస్తుతం ఎంత మంది నిరుద్యోగులున్నారో నీకు తెలుసుకదమ్మా!"

"అందరికీ ఉద్యోగం దొరకదని ఎందుకనుకోవాలి నాన్నా! పోనీ ప్రైవేటుగా బి.ఎ.చదువుకుంటాను నాన్నా"

"పెళ్ళయినా చదువుకోవచ్చు కదమ్మా. నేను రిటైరవకుండా నీ పెళ్ళి చెయ్యాలమ్మా! నీ చెల్లెలికి చదువు మీద శ్రద్ధ లేదు. దాని పెళ్ళికి నీ పెళ్ళి అడ్డు కాకూడదు. దాని సంగతి కూడా కాస్త ఆలోచించమ్మా:"

"పోని దాని పెళ్ళి చేసెయ్యి నాన్నా!" కాసులు మాటలకి ఆయన ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు. వెంటనే తిరగి సర్దుకున్నాడు.

"అలా చెయ్యొచ్చు. కాని అది సరియైన పద్ధతి కాదు. దానివల్ల నీకు లాభం కంటే నష్టమే వస్తుంది. ఎన్నో అవమానాలు నీతో పాటు నీ తండ్రి కూడా పడాలి. గుట్టుగా సాగే సంసారానికి చెడ్డ పేరు వస్తుంది. ఈ దీనుడైన తండ్రి కడుపున పుట్టినందుకు క్షమించు తల్లీ!" ఆయన కళ్ళల్లో నీటి పొర కదిలింది.

తండ్రి మాటలకి కాసులు మనస్సు బాధతో మెలికలు తిరిగింది. ఆమె కళ్ళలో నీళ్ళు నిండాయి. ఇన్నాళ్ళూ యింటి సంగతి పట్టించుకోకుండా హాయిగా తిరిగింది. సంసారంలో అన్ని గొడవలు, బాధ్యతలు వుంటాయని కూడా ఆమెకు తెలియదు. ఏదైనా తాను తల్లిదండ్రులకు భారం కాకూడదు. చెల్లెలి పెళ్ళికి తాను అడ్డురాకూడదు. వాళ్ళ సుఖం తరువాతే తన ఆశయాలు. అంత చిన్న పిల్ల, పెద్ద ఆరిందలా ఆలోచించింది. బుద్ధిమంతురాలైన మనిషికి బాధ్యత పెద్దరికాన్ని తెచ్చిపెడుతుంది.

కూతురు సమాధానం కోసం ఎదురు చూస్తున్నాడు ఆ తండ్రి "మీ యిష్టం వచ్చినట్టు చెయ్యండి నాన్నా!" అన్న కాసులు సమాధానం విన్న తండ్రి మనస్సు ఒక్కసారి సంతోషంతో నిండింది.

"నన్నర్థం చేసుకున్నావు తల్లీ. మేము పెళ్ళి ప్రయత్నాలు చేస్తున్నా నువ్వు బి.ఎ. ప్రైవేటుగా చదువుదుగాని" అంటూ ఆయన సంతోషంగా అక్కడనుంచి కదిలారు.

ఈ సంభాషణంతా వింటున్న కాసులు తల్లి ఏమీ మాట్లాడలేదు. "పెళ్ళయితే ఏం చదువుతుంది. ఏమిటో? ఉద్యోగాలూ, చదువులూ

ఆడపిల్లలకి యేం సాగుతాయి. ఆ పిల్ల అలా దెబ్బలాడుతూ వుంటుంది.. చిన్నతనం" అనుకుంది ఆ తల్లి మనస్సులో.

"చూసావా! నా కూతురు నామాట కాదనదే. దానికి వివేకం ఎక్కువే" అన్నారాయన భార్యతో.

"అలాగా" ఆవిడ నవ్వుకుంది.

ఆరోజు నుంచి విశ్వేశ్వర రావుగారు కాసులు పెళ్ళి ప్రయత్నాలు ముమ్మరంగా ప్రారంభించారు.

ఆ సంవత్సరం కాసులు పెళ్ళి చేస్తే కొడుక్కి ఉద్యోగం రాగానే కొడుకు పెళ్ళి, చిన్న కూతురు పెళ్ళి చెయ్యాలని ఆయన తాపత్రయం. ఉద్యోగంలో ఉండగా శుభకార్యాలు చేస్తే గ్రామవాసులు సహకరిస్తారు. కూరలు, పాలు, పెరుగు మొదలైనవే కాకుండా పెళ్ళి పందిరికి తాటాకుల దగ్గరనుంచి సర్దుబాటు చేస్తారు. రిటైరై యింట్లో వుంటే ఎవరూ మొహం చూడరని ఆయన భయం. పిల్లలు ఆలస్యంగా పుట్టడం వల్ల రిటైరయ్యే వయస్సు వచ్చేవరకు ఆ ఇంట్లో యే శుభకార్యం జరగలేదు. అందుకే ఆ భార్యాభర్తలు అంత తొందర పడుతున్నారు. ఒక పక్క పిల్ల పెళ్ళి చేస్తే తమ బాధ్యత తీరుతుందనే దృష్టి ప్రతి తల్లిదండ్రులకు ఉంటుంది. ఆ పిల్ల హాయిగా భర్తతో కాపురం చేస్తుంటే చూసి ఆనందించాలని ఆ శుభకార్యం జరిపించడానికి తొందర పడుతూ ఉంటారు. చేతిలో పెళ్ళికి సరిపడే ధనం లేకపోయినా పెళ్ళి ప్రయత్నాలు ప్రారంభించారు విశ్వేశ్వరరావుగారు. అందరితో పాటు వారు ఒకరు.

నెల తిరక్కుండానే సంబంధం ఒకటి చూశారు విశ్వేశ్వరరావుగారు. పిల్లవాడు బి.ఎ.పాసై కాకినాడలో సర్వే ఆఫీసులో పని చేస్తున్నాడు చూడ్డానికి బాగానే వున్నాడు. మంచి రోజు చూసి పిల్లలను చూడ్డానికి వచ్చారు పెళ్ళివారు.

కాసుల్ని ముస్తాబు చేసి కూర్చోపెట్టారు. పెళ్ళికొడుక్కి కాసులు నచ్చిందన్నాడు. వాళ్ళ వాళ్ళు కూడా ఎక్కువ ప్రశ్నలు వెయ్యలేదు.

కట్నకానుకలు కూడా ఎక్కువ అడగలేదు. పైగా "చదువుకోవాలని వుందా" అంటూ అడిగాడు పెళ్ళికొడుకు.

"అమ్మాయికి చాలా సరదా?" అన్నాడు విశ్వేశ్వరరావు.

"చదువంటే ప్రాణమండీ" తల్లి చెప్పింది.

"ఆమెను చెప్పనీయండి" అన్నాడు పెళ్ళికొడుకు సుబ్బారావు. అతని మాటలకు అక్కడి వారంద ఆశ్చర్యపోయారు. పెళ్ళికొడుకుతో వచ్చిన అక్కగారు, బావగారు నవ్వుకున్నారు. చిన్నతం నుంచి సుబ్బారావుకు కొన్ని ఆదర్శాలున్నాయి.

పెళ్ళికూతురు చదువుకోవాలని, అవసరమైతే ఉద్యోగం కూడా చెయ్యాలని తల్లితో ముందే చెప్పాడు. చిన్నతనంలోనే అతనికి తండ్రి పోయాడు. మద్రాసులో తెలుసున్న వాళ్ళింట్లో వుండి సుబ్బారావు చదువుకున్నాడు. కాకినాడలో ఉద్యోగం వచ్చి సొంత యింట్లో వుంటు న్నాడు. ఎన్ని సంబంధాలు చూసిన ఏ ఆడపిల్లకి సరియైన చదువు లేదు. పైగా 'చదువుకుంటుందా' అని అడిగితే చాలామంది తల్లితండ్రులు పిల్లనే యివ్వమన్నారు. ఇప్పుడు కాసులు ఇంటర్ చదువుకోడమే కాకుండా పై చదువు చదవడానికి యిష్టపడింది. పిల్లకూడా అందంగానే వుంది.

సుబ్బారావుకి కాసులు అన్ని విధాల నచ్చింది. 'ఇష్టముంటే వుద్యోగం కూడా చెయ్యవచ్చండీ' అన్నాడు సుబ్బారావు.

మహా సంబరపడి పోయింది కాసులు. ఉన్నవారంతా 'ఎంత మంచివాడో. ఆ పిల్ల సరదాకి తగ్గట్టే దొరికాడు. ఈడుజోడు బాగుంది." అన్నారు.

'అమ్మాయి అదృష్టవంతురాలు' అనుకున్నారు తల్లితండ్రులు. సుబ్బారావు మోహమాట పడకుండా 'పిల్ల నచ్చిందని వెంటనే తెలియ జేయ్యడమే కాకుండా అమ్మాయికి నచ్చానో లేదో అడగండి' అన్నాడు.

పెళ్ళికి ముహూర్తం కూడా పెట్టించి పెళ్ళివారు వెళ్ళిపోయారు. అంత తేలిగ్గా కాసులు పెళ్ళి కుదురుతుందని ఎవరు అనుకోలేదు. పైగా

కట్నం విషయంలో ఇచ్చింది పుచ్చుకుంటామన్నారు. 'ఈ రోజుల్లో ఇలా అనే పెళ్ళివారే లేరు' అనుకున్నారంతా.

అంతవరకు వెనుకనుండి పొంచి పొంచి చూస్తున్న శాంకరి, కనకం. సుబ్బులు పెళ్ళివారు వెళ్ళడం చూసి కాసుల్ని చుట్టుముట్టారు. ముగ్గురు కలిసి సుబ్బారావును ఒక ఆట పట్టిద్దామనే అనుకున్నారు. కాని యెక్కడ కాసులు పెళ్ళి చెడిపోతుందోనని భయపడ్డారు.

వాళ్ళు సంతోషంతో కాసుల్ని ఎత్తుకుని గిరగిరా తిప్పారు. ముద్దులు పెట్టుకున్నారు. తర్వాత మొట్టికాయలు కూడా మొట్టారు. అంతలోనే పెళ్ళిపోతుందని జ్ఞాపకంవచ్చివారికి దుఃఖం పొంగివచ్చింది. నలుగురూ వెక్కి వెక్కి యేడ్చారు. వారిని ఆ సమయంలో ఓదార్చేవారే లేకపోయారు. వారిని చూసిన వారందరికి దుఃఖం పొంగివచ్చింది.

"స్వచ్ఛమైన స్నేహం కన్నవారికంటె మిన్న" అనిపించుకుంది.

కాసులుతో కూడా రాజమండ్రి వెళ్ళి పెళ్ళి పట్టుచీరలు కొన్నారు శాంకరి వాళ్ళు. ఆమెకు పెట్టే నగలు కూడా దగ్గరుండి చేయించారు. పెళ్ళికి కావలసిన అన్ని వస్తువుల్లోను వారి హస్తముంది. పెళ్ళి పనులన్నింటిలోను వారి చేయూత ఉంది.

పెళ్ళి ముహూర్తం రోజు రానే వచ్చింది. శాంకరి వాళ్ళ సంతోషానికి హద్దులేదు. ఒక పక్క మంగళవాయిద్యాల సందడి, మరోపక్క శాంకరి వాళ్ళ సందడి. పెళ్ళికూతుర్ని దగ్గరుండి ముస్తాబు చేసారు. కాసులు పెళ్ళికూతురిగా మరింత అందంగా కనబడింది. ముహూర్తం ఆసన్నమయింది.

సుబ్బారావు కాసుల్ని సంతృప్తిగా చూసుకున్నాడు. తాళి కట్టేటప్పుడు తలంబ్రాలు పోసేటప్పుడు శాంకరి వాళ్ళు సుబ్బారావును ఏదో ఒకటి అంటూనే వున్నారు. కాసులు వారితో కలిసి పకపకా నవ్వుతూనే వుంది. స్వచ్ఛంగా నవ్వే ఆ నవ్వు చూసి సుబ్బారావు ముగ్ధుడవుతూనే ఉన్నాడు. పెళ్ళితంతులు పూర్తి అయ్యాయి. భోజనాల దగ్గర కూడా శాంకరి వాళ్ళు కొన్ని కొంటె పనులు చేసారు. కారం ఎక్కువగా కలిపి

కూరలు వడ్డించారు. కొంటె కుర్రాళ్ళకు, మంచినీళ్ళలో ఉప్పు కలిపి పోసారు. భోజనాలు చేసే ఆ అబ్బాయిలు శాంకరి వాళ్ళను ఏమీ అనలేక పోయారు. భోజనాలు పూర్తి అయిన తరువాత వాళ్ళకంట పడలేదు శాంకరి వాళ్ళు.

అప్పగింతల వేళ తల్లితండ్రులు వెక్కి వెక్కి ఏడ్చారు. ఆ దృశ్యం చూడలేక శాంకరి వాళ్ళు దూరంగా నిలబడ్డారు. కాని తీరా బండి ఎక్కే వేళ దుఃఖం ఆపుకోలేక పోయాడు. కాసులు శాంకరి వాళ్ళను కౌగిలించుకుని చిన్నపిల్లలా ఏడ్చింది. ఆమెను పట్టుకుని శాంకరి వాళ్ళు భోరున ఏడ్చారు. వారిని చూసిన వారందరికీ కళ్ళు చెమర్చాయి.

కాసులు తండ్రి విశ్వేశ్వరరావుగారు 'తొందరపడి పిల్లకు పెళ్ళి చేసాను. పిల్ల బెంగపెట్టు కుంటుందేమో' నని బాధ పడ్డారు. తల్లి దుఃఖానికి అంతేలేదు. పెళ్ళికొడుకు సుబ్బారావు కూడా బేజారై పోయాడు. 'ఈ పిల్ల కాపురానికి వస్తుందా' అని భయపడ్డాడు.

ప్రయాణ సమయం రానే వచ్చింది. బలవంతంగా కాసుల్ని వాళ్ళనుండి విడిపించి బండి ఎక్కించారు. వాళ్ళు కన్నీళ్ళు తుడుచుకుంటూనే వున్నారు.

వారంరోజుల వరకు శాంకరి వాళ్ళు మామూలు స్థితికి రాలేక పోయారు. వారు విడి పోవలసి వస్తుందని ఆ కన్యలు ఊహించుకోలేక పోయారు. ఆ బాధను చవిచూసిన వారికి స్నేహం కూడా శాశ్వతమైనది కాదేమో అనిపించింది. అసలు ప్రపంచంలో యేది శాశ్వతమో వారికి తెలియలేదు. ఏదైన తాముకూడా ఎక్కువ కాలం కలిసి వుండలేమేమో నన్న భయం ఆవరించింది. తాముకూడా విడిపోవలసి వస్తుందని మాత్రం తెలుసుకున్నారు.

# 15

నారాయణ రావుగారికి రెండవ సారి హార్టు ఎటాక్ వచ్చింది. డాక్టరు చెప్పినా వినకుండా ఆయన కేసులు వాదిస్తూనే వున్నారు. నాలుగు

రోజులనుండి కాస్త అలసటగా వుంటున్నా ఆయన లెక్కచేయలేదు. ఎవరు ఎంత చెప్పినా వినలేదు. ఆ రోజు కేసులో ఆయన తీవ్రంగా వాదించారు. ఇంటికి వచ్చేటప్పటికీ ఆయన చాలా అలసిపోయివున్నారు. నల్లకోటు విప్పుతుండగానే బాధతో మెలికలు తిరిగి కుప్పలా కూలి పోయారు. శివా ఫోను చెయ్యగానే అంబులెన్సు వచ్చి యింటి ముందు ఆగింది. నారాయణ రావుగారిని మెల్లిగా అందులో పడుకోపెట్టి పెద్ద హాస్పటల్ కి తీసుకు వెళ్ళారు.

ఎందరో డాక్టర్లు ఆ ప్రసిద్ధ లాయరు దగ్గరుండి వైద్యం చేసారు. ఎంత ప్రయత్నం చేసినా ఆయన ప్రాణం ఆపలేకపోయారు. ఆయన ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసి పోయాయి.

శివకుమార్ వెక్కి వెక్కి యేడ్చాడు. రాజేశ్వరమ్మగారిని ఎవరూ ఓదార్చలేక పోయరు. ఒక్కరోజు కూడా ఆయన భార్యను వదలి వుండేవారు కాదు. అన్నింటికి ఆ భార్య దగ్గరుండవలసిందే. అంతగా అభిమానించే ఆ భర్త ఒక్క మాటకూడా చెప్పకుండా వెళ్ళి పోయి నందుకు ఆమె బాధతో మెలికలు తిరిగింది. భర్త లేకుండా తాను బతకలేననుకుంది. భర్తతో పాటు తన ప్రాణం పోనందుకు మరింత ఏడ్చింది. ఎడ్చినా, మొత్తుకున్నా పోయిన ప్రాణం తిరిగిరాదు. కదిలేకాలం ఆగదు.

వార్త తెలియగానే బంధువులంతా వచ్చారు. తమ్ముడు చలపతి రావు. భార్య లలితా, కూతురు గిరిజ వెంట పెట్టుకుని వచ్చారు.

శివా తండ్రి శవం కాలుతుంటే ఆ దుఃఖాన్ని భరించలేక పోయాడు. చితి కాలుతుంటే నిల్చోలేక పోయాడు. మరణమంటె అంత భయంకరమైనదని స్నేహితుడు చనిపోయిన్నాడు తెలుసు కున్నాడు. ఈనాడు. ఆత్మీయుల చావు మరెంత బాధాకరమైనదో తెలుసుకున్నాడు. అతనికి వంటిమీద తెలివి లేదనిపించింది. కొండంత బాధను కుప్పెడంత గుండెలో దాచుకుని కర్మకాండ చేస్తూనే వున్నాడు.

ఆ వార్త తెలియగానే సూర్యాన్ని తీసుకుని జగన్నాథంగారు మద్రాసు చేరుకున్నారు. సూర్యాన్ని చూడగానే శివా దుఃఖం గోదావరి వరదలా పొంగి వచ్చింది. సూర్యం అతన్ని తన గుండెలో దాచుకుని పెద్దవాడిలా వోదార్చాడు. జగన్నాథంగారు మాటల్లోని ఆప్యాయత, ఆయన వోదార్పుమాటలు నిజంగా ఆ తల్లీ కొడుకులకు ఓదార్పు కలిగించాయి,

ఆ సాయంకాలం డాబామీద స్నేహితులిద్దరూ కూర్చున్నారు. శివా యెన్నో విషయాలు సూర్యాన్ని అడగాలనుకున్నారు. కాని అడగడానికి సూర్యం ఏమనుకుంటాడోనని వూరుకున్నారు.

"శివా! కాసులు పెళ్ళి శుభలేఖ నీకు అందలేదా?"

"లేదు? నాకా శుభలేఖ రాలేదు. ఇంతకీ పెళ్ళెప్పుడయింది?"

"పరీక్షలవగానే జరిగింది. అబ్బాయి పేరు సుబ్బారావు. కాకినాడలో ఉద్యోగం చేస్తున్నాడు". తర్వాత పెళ్ళి వివరాలన్ని చెప్పాడు. శాంకరి సంగతి చెప్పలేదు. శివాకు ఆమె సంగతి వినాలని ఉంది. అతని మనసులోని భావం సూర్యం అర్థం చేసుకోలేక పోయినా ఆ విషయమే చెప్పాడు సూర్యం.

శాంకరి వైజాగ్‌లో మెడిసిన్ చేస్తుందిట."

"మెడిసినా!" ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు శివా. అది నిజమా? కలా? అనుకున్నాడు.

"అవును!" సూర్యం తాపీగా సమాధానమిచ్చాడు.

"వాళ్ళ నాన్నగారు ఒప్పుకున్నారా?"

"ఎందుకు వద్దంటారు?"

"ఎక్కడుండి చదువుకుంటుంది?" ఆదుర్దా దాచుకోవాలనుకున్నా అతని మాటల్లో ఆ విషయం బయట పడుతూనే ఉంది.

"హాస్టల్లో ఉండి చదువుకుంటుందని వాళ్ళ నాన్నగారే చెప్పారు?"

"వెరీగుడ్. అయినా శాంకరి అక్కడ ఎవర్నీ కొట్టకుండా ఉండాలికదా".

"అబ్బే శాంకరి అట్లాంటిది కాదు శివా! చాలా మంచిది."

శివా మనస్సులో శాంకరి రూపం కదులుతోంది. అతని కళ్ళ ముందు శాంకరి నిలిచివుంది.

శివా వెంటనే వెళ్ళి శాంకరిని చూడాలను కున్నాడు. కాని యిప్పట్లో అది సాధ్యపడే పని కాదు. స్థిమిత పడి వైజాగ్, వెళ్ళి శాంకరిని చూడాలనుకున్నాడు.

"ఏమిటి శివా? అంతగా ఆలోచిస్తున్నావు" కళ్ళు మూసుకుని కూర్చున్న శివాని అడిగాడు.

"నాన్నగారు లేకుండా ముందు నేను అమ్మా! ఎలా బతికాలో ఏమో"

సూర్యం మాటలకు సమాధానమిచ్చాడు. శివా! అతని మనస్సు లోని మాట సూర్యానికి చెప్పడానికి మనసొప్పలేదు. శాంకరిని పెళ్ళి చేసుకుంటానని అతను చెప్పింది మొదలు అతని దగ్గర శాంకరి ప్రస్తా వన తీసుకు రాకూడదను కున్నాడు శివా. అందుకే మాట మార్చాడు. అతని మనస్సు తండ్రివైపు మళ్ళింది. అతని కళ్ళు నీటితో నిండాయి.

"బాధపడకు శివా! నువ్విలా బాధపడితే మీ అమ్మగారిని ఎవ్వరు చూస్తారు. ఆవిడను నువ్వే వోదార్చాలి."

అంతలో ఎవరో అక్కడికి రావడంతో మాట మార్చి యిద్దరు కిందికి దిగి వచ్చారు.

మరునాడు జగన్నాధంగారు, సూర్యం తిరుగు ప్రయాణ మయ్యారు.

"అమ్మా! మావూరు పుట్టింటి లాంటిది. ఒక్కసారి అక్కడకు వచ్చి నాలుగు రోజులుండి వెళ్ళండమ్మా" అన్నారు జగన్నాధంగారు రాజేశ్వరమ్మతో.

"జీవితంలో అన్నీ పోగొట్టుకున్నదాన్ని ఏ మొహం పెట్టుకుని మీవూరు రానండి". అంటూ ఏడ్చింది ఆవిడ.

"అలా అనకమ్మా!" పోగొట్టుకోడానికి యేముందని. భార్యా భర్త లిద్దరు కలిసి పుట్టరు. కలిసివెళ్ళరు. ముందు వెనుకలు తప్పవు. ఇద్దరు కలిసి జీవించే కాలం సుఖమయమే. కాని జీవితానికి అవస్థలు తప్పవు. అందులో యిదొకటి? ఇదిలోక సహజం. మీరలా బాధ పడుతుంటే మీ అబ్బాయిని ఎవరు చూస్తారు. ఇక మీ అబ్బాయికి మీరు సాయం. మీకు అబ్బాయి సాయం. ఒకరిని ఒకరు ఓదార్చుకోవాలి తప్పదు. అబ్బాయి-శివా! అమ్మగారిని వీలు చూసుకుని మావూరు తీసుకురా!"

"తప్పకుండానండి". అన్నాడు శివకుమార్.

"అమ్మగారిని జాగ్రత్తగా చూడు బాబు!" శివకుమారుకు మరో సారిచెప్పి బయలు దేరారు జగన్నాధం గారు కొడుకు సూర్యంతో. ఆ తండ్రి కొడుకుల ఆప్యాయతకు ఆశ్చర్యపోయింది ఆవిడ. అందుకే శివా అక్కడ భూములు అమ్మకుండా వుంచాడు. మంచిపని చేసాడు" మనసులోనె కొడుకును అభినందించింది.

"శివా! అంత మంచివాళ్ళతో స్నేహం లభించిందిరా మనకు" అంది రాజేశ్వరమ్మ.

"అమ్మా! వాళ్ళని ఒక్కసారి చూస్తేనే నీకు అలా అనిపించింది. కదమ్మా! వాళ్ళతో కలిసి మెలిసి తిరిగె నాకు ఎలా అనిపిస్తుందో నువ్వు వూహించుకోగలవమ్మా! అందుకే నాకు వాళ్ళు అందరికంటె దగ్గర బంధువుల్లా కనబడుతున్నారమ్మా! వాళ్ళే మనకు అసలు ఆత్మీయులని పిస్తోంది".

"అది నిజం శివా!"

ఆరాత్రి వారిని గురించిన ఆలోచనలతోనె ఆ తల్లి కొడుకులు నిద్ర పోయారు.

వచ్చిన చుట్టాలంతా ఒక్కొక్కరే వెళ్ళిపోయారు. ఇంట్లో చలపతి లలిత, గిరిజ మిగిలారు. ఆవిడను ఎన్నోవిధాల కనిపెట్టి చూస్తున్నారు.

శివా ముభావంగా మసలడం చూసిన గిరిజ అతనికి దూరంగా వుండాలని ప్రయత్నించింది. అతన్ని పలకరించడానికి ఆమెకు అహం అడ్డువచ్చింది. అందుకే ఆరోజు బంధువులతో పాటు ఆమె కూడా వెళ్ళి పోయింది.

సగం భారం తగ్గిందనుకున్నాడు శివకుమార్ మేనమామ మా భార్యా ఎప్పుడు వెళ్ళిపోతారాని ఎదురుచూస్తున్నాడు.

డబ్బు, ఆస్తి వ్యవహారాలు ఎన్నో వున్నాయి. తండ్రి పోయిన బెంగతో అవి మరింత భారంగా కనిపించాయి శివకుమార్‌కు.

చలపతి, భార్య లలిత కూతురు పెళ్ళి సంగతి రాజేశ్వరమ్మ గారితో మాట్లాడి వెళ్ళాలనుకున్నారు. ఆమె గదిలో వంటరిగా వుండడం చూసి ఆమె దగ్గరకు వెళ్ళి కూర్చున్నారు.

"అక్కా! మేంవచ్చి చాలరోజులయింది. ఇంక మేం వెళ్ళాలను కుంటున్నాము" అన్నాడు చలపతి.

"అప్పుడే వెడతానంటారేమిటి? నాకు మాత్రం ఎవరున్నారు?"

"పిల్లలంతా యింటి దగ్గరున్నారు. పైగా గిరిజ కూడా వెళ్ళి పోయింది? అందరూ ఎలా వున్నారో ఏమో?"

"పోనీ లలితను వుంచరా?" లలిత సంగతి కేమి గాని నువ్వు మాతో రావాలి? ఉన్న వాణ్ణి నేనొక్కడినే కదక్కా? కొన్నాళ్ళు నువ్వు శివకుమార్ మా దగ్గరుండి వద్దురుగాని. "ఇప్పుడు కాదు తమ్ముడు. ఇక్కడ కొన్ని విషయాలు చూసుకొన్నాక వస్తాములే! వాడా చిన్న వాడు. ఎక్కడ ఏమున్నాయో కూడా తెలియదు." "దానికెంత? పోనీ నీకు వీలున్నప్పుడేరా? అయినా గిరిజ శివకుమారుల పెళ్ళి సంగతి ఆలోచిస్తే మంచిదక్కా? ఇంత కష్టంలో వున్నారు. అయినా ఏదీ తప్పదు కదా! ఏది ఎలా జరగాలో అలా జరగాలి కదా!"

"నిజమే తమ్ముడూ! ఏదీ తప్పదు. అయినా పెళ్ళి సంగతి శివానే అడగడంమంచిదిరా."

"నీ అభిప్రాయం చెప్పు? నీ మాట వాడు కాదనడు కదా!"
"నాకు మొదటి నుంచి చేసుకోవాలని వుంది? వాడి అభిప్రాయం అడగాలి కదా!

ఇంతలో అటు వస్తున్న శివకుమార్‌ని చూసాడు చలపతి. అవకాశం జారవిడుచు కోకూడదనుకున్నాడు.

"శివా! అమ్మ పిలుస్తోందిరా" చలపతి పిలుపు విన్నాడు శివా.

"అమ్మా! పిలిచావా?" తల్లి పక్కకు వెళ్ళి కూర్చున్నాడు శివా.

"శివా మామయ్య మీ పెళ్ళి సంగతి అడుగుతున్నాడురా" అంది రాజేశ్వరమ్మ కొడుకుని చూసి.

"మీ పెళ్ళి సంగతి అడగడానికేముంది శివా! నీ చదువా పూర్తయింది. పైగా చిన్నతనం నుంచి గిరిజకు, నీకు పెళ్ళి చెయ్యాలని అనుకున్నాం కదా! మీ నాన్న బతికుండగా ఆ మూడుముళ్ళు పడితే బాగుండేదిరా".

"ఇప్పట్లో నాకు పెళ్ళి చేసుకోవాలని లేదు మామయ్యా!"

"చలపతీ! సంవత్సరం వరకు ఏటిసూతకం అంటారు. ఆయన సంవత్సరీకాలు వెళ్ళే వరకు పెళ్ళి చెయ్యకూడదురా శివాకి" అటు వచ్చిన ఒక ముసలావిడ తెలియజెప్పింది.

"పోనీ! వచ్చే యేడు చేసుకోమను పిన్ని! గిరిజను కూడా పిలిపిస్తాను. అన్ని విషయాలు ఇప్పుడే మాట్లాడుకుంటే బాగుంటుంది. పెళ్ళి తరువాత ఏర్పాటు చేయవచ్చు".

అవును రాజేశ్వరమ్మా! అలా చేసుకుంటే బాగుంటుందిరా ఒరే! శివా! చలపతి మామయ్య మాట వింటె బాగుంటుందిరా! ఆ ముసలి పిన్ని మాటలకి రాజేశ్వరమ్మ సమాధానం చెప్పలేదు. కొడుకు వైపు చూసింది అతన్ని సమాధానం చెప్పమన్నట్టుగా.

"నన్ను క్షమించు మామయ్యా! మీ గిరిజకు ఇంకో సంబంధం చూసి పెళ్ళి చేస్తే బాగుంటుంది. నాకు ఉద్యోగం అవి దొరికేటప్పటికి

సంవత్సరాలే పట్టచ్చు. అయినా నేను అప్పుడే పెళ్ళి చేసుకోవాలను కోవడం లేదు. పై చదువు చదవాలనుకుంటున్నాను" చెప్పవలసింది పూర్తి అయినట్టుగా అక్కడి నుంచి లేచి తన గదివైపు నడిచాడు శివ. కుమార్. అలా చెప్పినందుకు తల్లి బాధ పడుతుందని అతనికి తెలుసు. మామయ్య గుమ్మం తొక్కడని అతనికి తెలుసు. అయినా తాను త్యాగం చెయ్యలేననుకున్నాడు శివకుమార్. శాంకరి రూపంతో, వ్యక్తిత్వంతో పోల్చుకుంటె ఏ మాత్రం సరితూగదు గిరిజ. అతని హృదయంలో శాంకరి రూపం నిండి ఉంది. అందుకే నిర్మొహమాటంగా చెప్పవల సింది చెప్పేసాడు. పైగా ఇన్నాళ్ళు ఆమెతో చనువుగా వుండి పొర పాటు పని చేసాననుకున్నాడు శివా. పైగా ఆ చనువు కూడా చిన్న తనం నుంచి ఉన్న పరిచయం వల్లనేనని సమర్థించుకున్నాడు మనస్సును. గిరిజను ఒక ప్రియురాలిగా, భార్యాగా ఎన్నడూ అనుకో లేదు. పైగా తన భార్యగా గిరిజకు స్థానం లేదనుకున్నాడు. "ఈ మాట ముందే చెప్పవలసింది ఇన్నాళ్ళు ఎందుకు చెప్పలేదు. మా పిల్ల జీవితం కావాలనే నాశనం చేసారు." అంటూ భార్యభర్తలిద్దరూ తల్లికొడుకుల్ని నానామాటలు అన్నారు.

రాజేశ్వరమ్మగారు నిందుకుండ, దేనికీ సమాధానం ఇవ్వ లేదావిడ. దానితో ఆ భార్యాభర్తలిద్దరు మరీ రెచ్చిపోయారు. వెంటనే సామాను సర్దుకుని ఇద్దరూ వెళ్ళిపోయారు.

# 16

రాజేశ్వరమ్మగారు దుఃఖం అపుకోలేక వెక్కివెక్కి యేడ్చింది. ఇటు కొడుకును బలవంతం చెయ్యలేదు. అటు తమ్ముడికి నచ్చచెప్ప లేదు. తన అశక్తికి తానే బాధపడింది.

"అమ్మా! నువ్వలా బాధపడితే ఎలాగమ్మా! ఎవరు లేకపోయినా నీకు నేనున్నానమ్మా! మనం హైదరాబాదు వెళ్ళిపోదామమ్మా!" తల్లిని ఓదార్చడానికి ప్రయత్నం చేసాడు శివా.

నారాయణమూర్తిగారి తండ్రి మద్రాసులో ఒక యిల్లు కొన్నాడు. ప్రస్తుతం ఉన్న యిల్లుఅదే. హైదరాబాదులో నారాయణమూర్తిగారు యిల్లు కట్టారు. ఆ యింటిని అద్దెకిచ్చారు. ఆ యింట్లో ఉండాలని హైదరాబాదు వెళ్ళాలని అతని ఆలోచన.

"దానికేం అలాగే వెడదాంరా! ఇంతకి గిరిజను ఎందుకు వద్దన్నావురా!" కొడుకు మనసులోని విషయం తెలుసుకోవాలని అడిగింది ఆతల్లి.

"ఆమె పద్ధతులు - మాట తీరు, వేషధారణ నాకు నచ్చవు. ఎబ్బెట్టుగా అనిపిస్తాయి. పైగా ఆమె అభిప్రాయాలు, నా అభిప్రాయాలు కలవవమ్మా! అందుకే ఆ నిర్ణయానికి వచ్చానమ్మా!"

"పోనీ నీ దృష్టిలో ఎవరైనా అమ్మాయి ఉంటే చెప్పరాదురా!"

"ఇంకా ఎవ్వరూ లేరమ్మా! ఉంటే వెంటనే నీకే చెప్తా!"

"అన్నట్టు అమ్మా! నాన్నగారికి చాలామంది డబ్బు యివ్వాలని గుమాస్తా గారంటున్నారు. నీకేమైన తెలుసమ్మా!"

నాకు పూర్తిగా తెలీదుగాని వారు డైరీలో అన్నీ రాసేవారు. వారి డైరీలు తీసి చూడు బాబూ. అన్ని విషయాలు నీకే తెలుస్తాయి.

"అలాగే నమ్మా! ఇప్పుడే నాన్నగారి అలమారులోని డైరీలన్నీ తీసి చూస్తాను. ఎక్కడైనా దొరికితే సరే! లేకపోతే నష్టమొచ్చినా వదిలేద్దాం" శివా అన్నీ అలమారులు తీసి కనబడిన డైరీని తెరిచి చదివాడు. అందులో ఒక డైరీలో ఆయన జీవిత చరిత్రలోని ముఖ్యమైన సంఘటనలు రాసి ఉన్నాయి. వాటి చివర ఆయన ఎవరెవరికి ఎంతెంత డబ్బు ఇచ్చింది ఉంది. పైగా వద్దంటున్నా స్నేహితులు ఇచ్చిన ప్రామిసరీ నోట్లు వున్న ఫైలు నెంబరు కూడా దొరికింది. కాని వారందరిని పిలిపించి డబ్బు అడగడానికి ఆ తల్లీ కొడుకులిద్దరికీ కూడా మొహమాట మనిపించింది. అడగకుండా ఇచ్చిన వారి దగ్గర నుంచే ధనం తీసుకోవాలనుకున్నారు. ఇవ్వనివారు బహుశా కష్టాల్లో ఉంటారని నిర్ణయించుకున్నారు.

నారాయణరావుగారు చనిపోయినారని తెలిసిన స్నేహితులు ఆయన కియ్యవలసిన మొత్తాన్ని కొందరు అడగకుండానే ఇచ్చేసారు. మరికొందరు గుమాస్తా కబురు పెట్టగానే యిచ్చేశారు. కాని మరి కొందరు ఇవ్వలేకనేమొ వచ్చి సానుభూతి వాక్యాలు చెప్పారు, కాని డబ్బును మాత్రం తీర్చలేదు. వారి స్థితిగతులు తెలిసి ఆ సంగతే మరిచారు వాళ్ళు.

'అమ్మా! మనం హైదరాబాదు వెళ్ళిపోదామా?' తిరిగి ఒకనాడు అడిగాడు శివా. కొడుకు అడిగిన ప్రశ్నకు ఆశ్చర్యపోయిన రాజేశ్వరమ్మగారు 'ఎందుకు బాబూ! మళ్ళీ అడుగుతున్నావు'.

'ఏం లేదమ్మా! మన తెలుగు వాళ్ళంతా అక్కడే ఉన్నారు కదమ్మా!'

కాపురానికి వచ్చింది మొదలు రాజేశ్వరమ్మగారు మద్రాసులో ఆ యింట్లోనే ఉన్నారు. ఆ యిల్లు మామగారు కొన్న యిల్లు. ఆ వూరు వాకిలి వదలి వెళ్ళడానికి మనసు బాధపడినా ఆమె పైకి అనలేదు. కొడుకు మనసును కాదనే శక్తి ఆమెకు లేదు. పైగా అతను ఏ పని చేసినా ఆలోచించే చేస్తాడనే నమ్మకముంది. అందుకే

"అలాగే బాబు నీ యిష్టమొచ్చినట్లు చెయ్యి నీకేది బాగుందంటే నాకు అదేరా! నీ సంతోషమే నా సంతోషంరా: నీకంటె యీ లోకంలో నాకెవ్వరున్నారురా" అంది రాజేశ్వరమ్మ.

"నా స్నేహితునికి ఉత్తరం రాస్తాను ఇల్లు కాళీ చేయించమని అతను ఉత్తరం రాయగానే బయలుదేరుదాం" అన్నాడు.

'అలాగే బాబు' ఇద్దరి మనస్సులు తేలికయ్యాయి.

# 17

ఇంటర్ రిజల్ట్సు వచ్చాయి. పేపరు పట్టుకుని పరుగెత్తుకొచ్చాడు

సూర్యం. శాంకరి ఫస్టుక్లాసులో పాసయింది. సూర్యం, కనకం, కాసులు, సుబ్బులు సెకెండు క్లాసులో పాసయ్యారు.

అన్నపూర్ణమ్మ, రామనాథంగారు కూతురు ఫస్టుక్లాసు తెచ్చుకున్నందుకు చాలా సంతోషించారు.

"రామనాథం! అమ్మాయి పెళ్ళి చెయ్యడం మంచిదిరా! ఇంకా పెద్ద చదువులు చదివించడం కష్టంరా!" మనవరాలు పెళ్ళి చెయ్యమని సలహా యిచ్చింది దుర్గమ్మ.

"శాంకరి చదువుకుంటా నంటోందమ్మా! చదివించడమే మంచిదనుకుంటున్నాను. అయినా పెళ్ళి చెయ్యడం మామూలు విషయం కాదమ్మా! అడిగిన కట్నమిచ్చి పెళ్ళి కుదర్చడం కంటె చదివించడమే మంచిది."

"అది సరే రామనాథం ఏ వయసులో జరగవలిసిన ముచ్చట ఆ వయస్సులో జరగాలి కదరా!"

కాని శాంకరికి డాక్టరు చదవాలని వుందమ్మా! మనవాళ్ళల్లో యింతవరకు ఆడపిల్ల లెవరూ డాక్టరు చదవలేదమ్మా!

సీటు వస్తే చదివించాలనుకుంటున్నాను.

"సీటు వస్తే చదివించరా! కాని పెళ్ళి చెయ్యడం ధర్మంరా! పిల్లని మరోసారి అడిగిచూడరా!"

"అలాగేనమ్మా! శాంకరిని పెళ్ళి విషయం నువ్వే అడుగమ్మా! "అలాగే చేద్దాంరా" ఆవిడ అక్కడ నుంచి లేచి లోపలికి వెళ్ళింది.

రామనాథంగారు సమయం చూచికుని విశాఖపట్నం బయలుదేరి వెళ్ళారు. శాంకరిని మెడిసిన్‌లో సీటు కోసం అప్లికేషన్ పెట్టారు. ఆ సమయంలో తన కూతురికి నిజంగానే మెడిసిన్ సీటు వచ్చినంత సంబరపడ్డారు. శాంకరికి మంచి మార్కులు రావడంవల్ల తప్పకుండా సీటు వస్తుందనే నమ్మకం ఆయనకుంది. అందుకే ఆయనకంత సంతోషం.

తిరిగి వచ్చిన రామనాథంగారిని అందరు శాంకరి సీటు సంగతే అడిగారు. ఆయన అడిగిన వారందరికి సంతోషంతో "ఎలా విశాఖ పట్టణం వెళ్ళింది? ఏలా సీటుకి అప్లికేషన్ పెట్టింది" వివరంగా చెప్పు కొచ్చారు. ఇంట్లో వాళ్ళతో పదేపదే చెప్పారు. దుర్గమ్మగారు మనవ రాలికి సీటు వచ్చినట్లే హడావిడి చేసింది. అన్నపూర్ణమ్మగారు సంతో షాన్ని మనసులోనే దాచుకొంది. శాంకరి ముఖం కొత్త కాంతితో కల కలాడింది.

జగన్నాథంగారు సూర్యాన్ని చదువు మాన్పించి వ్యవసాయం చెయ్యమన్నారు. సూర్యానికి కూడా అంతాగా చదవాలని లేదు. అందుకే మరీ మంచిదనుకున్నాడు. శ్రద్ధగా పొలం వెళ్ళడం, అక్కడ పనులు చూడడం ప్రారంభించాడు.

# 18

ఒకరోజు దుర్గమ్మగారికి విపరీతంగా జ్వరం వచ్చింది. ఆ వచ్చిన జ్వరం నాలుగు రోజుల వరకు ఒక్క డిగ్రీ కూడా తగ్గలేదు. ఆ నాలుగు రోజులు వంటి మీద తెలివే లేదు. ఐదవరోజు పక్షవాతం వచ్చి కాలుచెయ్యి పడిపోయాయి. ఆవిడ బతుకుతుందని ఎవరూ అనుకోలేదు. 8వ రోజు కాస్త తెలివి వచ్చింది.

"బాబూ! రామనాథం. నేను బతుకుతాననే ఆశ లేదురా! శాంకరి పెళ్ళి చూడాలని ఉందిరా" ముద్దముద్ద మాటలతో కొడుకుని పిలిచి చెప్పింది.

"అదేమిటమ్మా! డాక్టరు చదివిద్దామనుకున్నాము కదా! ఇప్పుడు మళ్ళీ పెళ్ళంటున్నావేమిటి? అయినా ఇంత తొందరగా పెళ్ళికొడుకు ఎక్కడ దొరుకుతాడమ్మా!"

"అలా అనకురా! పెళ్ళయితే మాత్రం చదువుకోకూడదని వుందా? చక్కగా మన సూర్యానికిచ్చి పెళ్ళి చేస్తే ఏంత బాగుం టుందిరా!"

"సూర్యానికా! అదేమిటమ్మా సూర్యం చదువు మానేసి వ్యవసాయం చేస్తున్నాడు. మనపిల్ల డాక్టరు చదవాలనుకుంటోంది. అతన్ని చేసుకోవడానికి ఒప్పుకుంటుందా అమ్మా?"

"అది ఒప్పుకోడానికేముందిరా? పెళ్ళయినా కూడా విశాఖ పట్టణంలో డాక్టరే చదువుకుంటుంది. తర్వాత ఎలాగూ ఇక్కడే కదరా వైద్యం చేసేది" అప్పటికే ఆవిడ ఆయాసంతో ఉక్కిరి బిక్కిరవుతోంది.

"తల్లి మాటలు విన్న రామనాథం ఆశ్చర్యపోయాడు" తనకి తల్లి కొత్త విషయాలు నేర్పుతోందనుకున్నాడు. ఇంకేమి అనలేక "నీ యిష్టమమ్మా" అన్నాడాయన. ఒక పక్క చావుబతుకుల్లో ఉన్న తల్లి. మరో పక్క ఉదయిస్తున్న సూర్యునిలా ఉన్న కూతురు. ఏదైనా తల్లి మనస్సుకు తృప్తి నివ్వాలనుకున్నాడు.

వెంటనే దుర్గమ్మగారు జగన్నాథంగారిని, సూర్యాన్ని రమ్మని కబురు పెట్టింది. తండ్రీ కొడుకులిద్దరూ వెంటనే బయలుదేరి వచ్చారు.

"ఒరే సూర్యం! శాంకరిని పెళ్ళి చేసుకుంటావురా" తన మంచం మీద కూర్చోపుని మరీ అడిగింది దుర్గమ్మ.

ఆ మాటలు విన్న శాంకరి కోపంతో లోపలికి వెళ్ళి పోవడం ఎవరూ గమనించలేదు.

"నాకు చాలా యిష్టం" అని అనలేక 'నీ యిష్టం అమ్మమ్మ' సమాధానమిచ్చాడు సూర్యం.

"నువ్వేమంటావు జగన్నాథం?"

"ఆమేదో పెద్ద చదువులు చదువుతానంటోంది. మరి శాంకరిని అడగటం మంచిది" జగన్నాథంగారు తేల్చి చెప్పారు.

"దాని దేముంది చిన్నపిల్ల. మీకు అంగీకారమయినట్టేగా! రేపు మంచిరోజు పురోహితునికి కబురుచేయండి. తాంబూలాలు పుచ్చుకొని ముహూర్తాలు పెట్టండి" దుర్గమ్మ ఆయాసంతో యింక చెప్పలేక పోయింది.

సూర్యం ఆనందం పట్టలేక యింటికి పరుగెత్తాడు. అవీ యివీ మాట్లాడిన జగన్నాథంగారు కుర్చీలోంచి లేచారు. "ఎందుకైనా మంచిది. పిల్లనోసారి అడగండి" అంటూనే ఆయన మెట్లు దిగారు.

సూర్యం, గ్రామ దేవతలైన మాలక్షమ్మ, మల్లమ్మలకు మొక్కుకున్నాడు. వాడపల్లి వెంకన్నకు భోగం చేయిస్తానన్నాడు. ఆసంతోషం పట్టలేక శివకుమారుకు ఆరోజే ఉత్తరం రాసి పోస్టుడబ్బాలో పడేసాడు.

# 19

రాత్రి అందరూ పడుకున్నారు. ఇల్లు నిశ్శబ్దంగా ఉంది. శాంకరి మెల్లిగా లేచి తల్లి పక్కలో చేరింది. "రేపు పెందరాళే లేచి తలంటు కోవాలమ్మా" "నేనేమి చెయ్యదలచుకోలేదు. ఈ పెళ్ళి నాకు ఇష్టం లేదు."

"ఇందాకే చెప్పకపోయావే? అన్నీ మాట్లాడుకుని, ముహూర్తాల వరకు వచ్చాక వాళ్ళేమనుకుంటారే? మన పరువు మర్యాదలు నిలబడతాయా" "అమ్మా! మన పరువు మర్యాదల కేం లోటులేదు. ఇందాకే చెప్పడానికి మీరసలు నన్నడిగారా! పైగా జగన్నాథం మామయ్య నన్నడగమని చెబితే వినిపించుకున్నారా! నాకీపెళ్ళి ఏ మాత్రం ఇష్టం లేదు. నేను బతికి ఉండటం ఇష్టంలేకపోతే ముహూర్తాలు పెట్టించండి."

కోపం దాచుకోలేని శాంకరి లేచి తిరిగి తన పక్కమీదికి వెళ్ళిపోయింది.

అన్నపూర్ణమ్మగారికి మతిపోయినట్లయింది, వెంటనే రామనాథంగారి మంచం దగ్గరకు పరుగెత్తింది.

"విన్నారా! శాంకరి ఈ పెళ్ళి చేసుకోనని మొండికేసింది." ఆయన ఆ మాట విని వెంట లేచి మంచం మీద కూర్చుండిపోయారు.

"అత్తగారికి తెలిస్తే ఈ అర్ధరాత్రి నానా అల్లరి చేస్తారండీ!"

"తెల్లవారనీ చూద్దాం! ఇప్పుడేం కంగారు పడకు?"

"కంగారు కాకపోతే ఏమిటి చెప్పండి? తెల్లవారి వాళ్ళ ముఖాలు ఎలాగండి చూడ్డం?"

"దానికేంగాని? పిల్లని అడగకుండా పెళ్ళి కుదర్చడం మనదే తప్పు. అక్కడికీ జగన్నాథం పిల్లభిప్రాయం తెలుసుకోమని అంటూనే వున్నాడు. మనమే పట్టించుకోలేదు"

"ఇప్పుడెలాగండి మరి? దీన్ని మరెవరు చేసుకుంటారు?"

"ఇప్పుడు మించిపోయిందేమిలేదు. అసలు ఇప్పట్లో పెళ్ళి చేసుకోకూడదనే కదా దాని అభిప్రాయం. మనం చేసిన తప్పు మనమే సరిదిద్దుకోవాలి?"

"అదెలాగండి?"

"ఇదిగో... ఆ సూర్యం అసలు మన పిల్లకి తగిన వాడేకాదు. ఆ మద్రాసు శివకుమారే మన అమ్మాయికి అన్ని విధాల తగిన వాడు. ఇది తప్పిపోవడమే మనకు మంచిది.

"వాళ్ళు ఎక్కువ కట్నం అడుగుతారేమోనండి"

"అంతవున్నవాళ్ళు కట్నం అడక్కపోవచ్చు. పైగా మన అమ్మాయి. డాక్టర్ చదువుతోందంటే ఎంతోమంది ముందుకు వస్తారు. చూస్తూవుండు." భర్త మాటలమీద ఆమెకు నమ్మకం కుదిరింది. ఈ పెళ్ళి అవడంకంటే శివకుమార్‌తో నిశ్చయమవ్వడం మంచిది. అను కున్న ఆవిడ మనస్సు తేలికయింది. తిరిగి వచ్చి తన మంచం మీద నడుం వాల్చింది. శాంకరి నెమ్మదిగా వచ్చి తిరిగి తల్లి పక్కచేరింది. తల్లి చెప్పిన మాటలు విన్న శాంకరి సంతోషానికి అవధుల్లేవు. "మా అమ్మ! మంచిది" అంటూ తల్లిని కౌగిలించుకుని నుదుటి మీద ముద్దు పెట్టుకుంది.

తెల్లవారింది మొదలు రామనాథంగారు తల్లి దుర్గమ్మతో ఆ విషయం ఎలా చెప్పాలో తెలీక తికమకపడ్డారు. అన్నపూర్ణమ్మ వంట చేస్తూ మధ్య మధ్యలో ఇవతలకు వచ్చి రామనాథంగారు ఏం చేస్తు న్నారో చూసి వెడుతోంది. దుర్గమ్మ, మంచితనానికి మంచిదే, శాస్త్ర

తేడావస్తే యేవిధంగా అల్లరి చేస్తుందో ఆ యింట్లో అందరికీ బాగా తెలుసు. పైగా ఇప్పుడు జబ్బుతో మంచం మీద ఉంది. అందుకే మరింత భయంగా ఉంది అన్నపూర్ణకు. శాంకరి మాత్రం మామూలు గానే తిరుగుతోంది.

అలా అనుకుంటుండగానె మధ్యాహ్నం భోజనాలుకూడా అయి పోయాయి.

శాంకరికి తలంటడంగాని, ఇల్లు కడిగి ముగ్గులు పెట్టడంకాని, గుమ్మాలకు తోరణాలు కట్టడంకాని కనపడని, దుర్గమ్మకు అనుమానం బయలుదేరింది.

"ఒరే! రామనాథం! పురోహితుడికి కబురు చేసి మాట్లాడావురా! ఎప్పుడు మంచిదన్నాడురా!" ఉండబట్టలేక అడిగింది దుర్గమ్మ.

"ఆ పురోహితుడికి కబురు చేసాను. ఊళ్ళో లేట్ట. ఈ పూట వస్తాడట. రాగానే ఇక్కడికి రమ్మని చెప్పాను. ఆవిడకు అనుమానం రాకుండా సర్దిచెప్పాడు రామనాథం.

"అలాగా! అయినా పంచాంగం చూసి నేనే చెప్పగలనురా!"

"నీకెందుకమ్మా అంత శ్రమ! పురోహితుడు వస్తాడుగా!"

"పోస్టు! పోస్టు!" రెండు గంటలకు వచ్చే పోస్టుమ్యాన్ కేక వినపడింది. ఉత్తరాలు అందుకోడానికి లేచాడు రామనాథం.

"అప్పుడే పోస్టు వచ్చిందా!" లోపలనుంచి వచ్చి వీధి గుమ్మం దగ్గర నిలబడింది అన్నపూర్ణమ్మ.

అ పల్లెల్లో పోస్టుమాన్ అందరికీ ఆత్మీయుడు. పోస్టు వారికి ఆత్మబంధువు. పోస్టుమాన్ వచ్చి గుమ్మం ముందు పిలిచాడంటే వారి సందడి చూడవలసిందే.

"ఇదేదో విశాఖపట్నం నుంచి వచ్చినట్టుందమ్మా" ఉత్తరం అందుకున్న ఆయన తెరిచి చూసాడు. "శాంకారీ! నీకు సీటు వచ్చిం దమ్మా! ఇదిగో మరోసారి చదువు" కూతురికి ఇచ్చాడు కవరు. ఆయన ఎక్కువగా చదువుకోలేదు. ఇంగ్లీషు చదువుకోక పోయినా అనుభవం

నేర్చిన పాఠంతో కాస్త ఇంగ్లీష్ చదివి అర్థం చేసుకుంటాడు. మరొకరు చదివి చెబితే తప్ప ఆయన ఆ విషయం నిర్ధారణ చేసుకోడు.

"నాకు మెడిసిన్‌లో సీటు వచ్చింది నాన్నా! 15వ తేదీలోపుగా వచ్చి ఫీజు కట్టాలట" తన ఇంటర్ పరిజ్ఞానంతో అర్థం చేసుకుని చెప్పింది శాంకరి. ఆ మాటలు చెబుతూ సంతోషంతో గంతులు వేసింది.

"అలాగే! శాంకారీ! నీ కోరిక నెరవేరిందే తల్లీ!" కూతుర్ని దగ్గరకు తీసుకుని కౌగిలించుకుంది అన్నపూర్ణమ్మ.

రామనాథంగారు అందరికంటే మరింత సంతోషపడ్డారు.

వెంటనే తల్లి గది చేరుకున్నారు. "అమ్మా మన శాంకరికి డాక్టర్ సీటు వచ్చిందమ్మా! మనవూళ్ళో మొదటి డాక్టరు ఇదేనమ్మా."

"అలాగా! ఎంత సంతోషంరా! అయినా శాంకరంటే మామూలు కాదురా! ఎంతైనా అది నా మనవరాలు. వెంటనే పెళ్ళి ముహూర్తాలు పెట్టించెయ్యరా అబ్బాయీ!"

"ఇప్పుడు పెళ్ళిచెయ్యడం అంతమంచిది కాదేమోనమ్మా! అక్కడ కాపురం పెట్టడానికి లేదే. పైగా అయిదేళ్ళు చదువు. పోనీ సీటు వదులుకుందామంటే శాంకరి ఊరుకోదు కదా!"

ఆ మాటలు విన్న దుర్గమ్మ మాట్లాడలేదు. గుమ్మవార గా నిల బడ్డ అన్నపూర్ణమ్మ గుండెలు చేతపట్టి నుంచుని చూస్తోంది. అప్పుడే శాంకరి ఆవార్త చెప్పడానికి సుబ్బులింటికి పరుగెత్తింది.

"ఒరే అబ్బాయీ! అది చదువు ఎందుకు మానుకుంటుందిరా! ప్రస్తుతం పెళ్ళిచేస్తే ఆ పిల్ల చదువు సాగడం కష్టమే. ఎవరికీ రాని సీటు దానికి వచ్చింది. దానిని చదివించడమే మంచిదనిపిస్తోంది."

తల్లి అంత తేలిగ్గా మనసు మార్చుకుంటుందనుకోలేదు.

ఆయనకు కొండంత భారం దిగిపోయినట్లయింది.

తలుపు చాటున నిలబడ్డ అన్నపూర్ణమ్మ గట్టిగా వూపిరి పీల్చు కుంది.

"అమ్మా! జగన్నాథం ఏమనుకుంటాడో?"

"రామనాథం జగన్నాథం! అనుకోకుండానికేముందిరా? అమ్మా యిని మరోసారి అతగమని చెప్పింది అతనేకదా! అమ్మాయికి సీటు వచ్చింది. అప్పుడు పెళ్ళి ముహూర్తం పెడతామని అనుకోరురా! అయినా జగన్నాథాన్ని పిలిచి నేను మాట్లాడుతాధా? నువ్వు కంగారు పడకు"

దుర్గమ్మ మాటలకి రామనాథం మనస్సు కుదుటపడింది. ఆరోజు దుర్గమ్మ కాస్త తేలిగ్గా కనబడుతోంది. ఆయాసం కూడా కొంచెం తగ్గింది. కాలు చెయ్యి కదలకపోయినా మనిషి ప్రశాంతంగా ఉంది. పైగా మాటకూడ కాస్త స్పష్టంగా ఉంది.

తల్లికి యేభయం లేదనుకున్నాడు రామనాథం. మనిషి కోలు కుంటున్నట్లే కాస్త కాలు చెయ్యి కూడా కదిలితే బాగుండుననుకుంది, అన్నపూర్ణమ్మ. ఎంతైన మంచం పట్టి వారికి చాకిరీ చేసి మెప్పించడం చాలా కష్టమని ఆ యిల్లాలి భయం.

అంతలో శాంకరి యింటికి తిరిగి వచ్చింది. అన్నపూర్ణమ్మ జరిగిన సంగతి శాంకరికి చెప్పింది.

"నాయనమ్మా! నువ్వు చాలా మంచిదానివే" నాయనమ్మ పక్కకు చేరింది శాంకరి.

మనవరాలు పక్కలో కూర్చునేటప్పటికి ఆవిడ మనస్సు కరిగి పోయింది. మనవరాలిపై ప్రేమ పొంగి వచ్చింది. ఆవిడ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. చక్రాల్లాంటి కళ్ళు తిప్పుతూ విశాలమైన పొలంలో, పచ్చని రంగులో మిలమిలలాడే మనవరాలి ముఖాన్ని చూస్తూ వుండిపోయింది ఆవిడ.

"ఏంటి నాయనమ్మా! అలా చూస్తున్నావు?"

"ఏంలేదు శాంకరీ! నీ ముఖంలో విద్యాకళ పుట్టి పడుతోంది. నువ్వు డాక్టరు కావాలని నీ నుదుటన రాసి వుందమ్మా! అదే చూస్తున్నానే శాంకరీ!"

నాయనమ్మ వేపు ఆశ్చర్యంగా చూసింది శాంకరి. మనవరాలిని ఒంటి చేత్తోనె దగ్గరకు తీసుకుంది. దుర్గమ్మ ఒడిలో గువ్వలా ముడుచుకుంది శాంకరి.

"శాంకరీ! నా బట్టల పెట్టి యిలా పట్టుకురా!" దుర్గమ్మ మాటలు పూర్తి కాకుండానే శాంకరి పరుగెత్తింది.

ఆవిడలా పెట్టె పట్టుకురమ్మనడం శాంకరికి అలవాటే. పెట్టి తెరచి ఆవిడ ఏదో కానుక మనవరాలికి యివ్వడం ఆవిడకు అలవాటు. కాలికి వెండి పట్టీలు, బంగారు జడకుచ్చులు, నాగరం అలాటి వస్తువులన్నీ నాయనమ్మ అప్పుడప్పుడు యిచ్చినవే.

ఆవిడ పెట్టె పట్టుకొచ్చి మంచం మీద పెట్టి శాంకరి నాయనమ్మ ఏమి చేస్తుందోనని ఎదురు చూసింది. పెట్టె తెరవమని దుర్గమ్మ తాళాలు అందించింది.

"ఎందుకు నాయనమ్మా!" అంటూనే పెట్టె తెరిచింది శాంకరి.

"అదిగో ఆ పక్కగా వున్న మూట పైకి తీయమ్మా!"

శాంకరి బరువుగా ఉన్న మూట తీసి ఆవిడ పక్కన పెట్టింది.

"ఇందులో మూడువేలున్నాయి. ఇది నీ చదువుకోసం శాంకరి!" ఒక చేత్తోనే మూట తీసి శాంకరి చేతిలో పెట్టింది.

మూట అందుకున్న శాంకరి నాయనమ్మ పాదాలకు నమస్కరించింది. "శాంకరీ! డాక్టరు చదివి నువ్వు ఇక్కడే ప్రాక్టీసు పెట్టాలి! నువ్వు గొప్ప డాక్టరవ్వాలి!"

ఆవిడ దీవనకు అందరూ ఆశ్చర్యపోయారు. కొడుకు, కోడలి వైపు గర్వంగా చూసింది దుర్గమ్మ.

"ఫీజు కట్టడానికి ఎక్కడ అప్పు చెయ్యాలా" అని ఆలోచిస్తున్న రామనాథం మనస్సు కుదుట పడింది.

శాంకరి అదృష్టానికి అందరు మురిసిపోయారు. ఆ వార్త అప్పుడే వూరంతా పాకిపోయింది. కనకం, సుబ్బులు పరుగెత్తుకొచ్చారు. సంతోషం పట్టలేక శాంకరిని కౌగిలించుకున్నారు.

"అన్నపూర్ణా! వీళ్ళకి మిఠాయిచేసి పెట్టవే" అజ్ఞాపించింది దుర్గమ్మ.

"ఇదిగో యిప్పుడే తయారు చేస్తాను." ఆవిడ వంటింటి వైపు నడిచింది.

"ఇప్పుడేం చేస్తావు? దుకాణం నుంచి తెప్పిస్తాలే."రామనాధంగారు రవిని దుకాణానికి పంపించారు. పెరటి వసారాలో చాప వేసుకుని కూర్చున్నారు ముగ్గురు. పెరట్లోవున్న కొబ్బరి చెట్ల నుంచి చల్లని గాలి వీస్తోంది. అంతలో అన్నపూర్ణమ్మ మిఠాయి వుండలు, పకోడిలు ముగ్గురికి ప్లేట్లో పెట్టి అందించింది.

అప్పటికే చీకటి పడి చంద్రోదయమయింది. కొబ్బరి చెట్లు సందుల్లోంచి వెన్నెల కిరణాలు వచ్చి వారి మీద పడుతూ కొబ్బరి మట్టలతోపాటు నాట్యాలు చేస్తున్నాయి. ఇళ్ళలోని కష్టాలు కన్నీళ్ళు వారికి తెలియవు. వారి ఆనందమే ఆ యిళ్ళకు పచ్చతోరణాలు.

"శాంకరీ! శంకూ! అసలు సంగతి చెప్పవేమే?" సుబ్బులు ఉండబట్టలేక అడిగింది.

"ఏం సంగతే" తెలీనట్లు అడిగింది శాంకరి.

"నాటకాలే? నీకేం తెలీదు చిట్టిపాపాయివి కదూ! కనకం చెప్పింది.

"అబ్బా! ఏమిటో చెప్పండే చంపక" శాంకరి విసుక్కుంది.

"చిట్టి తల్లీ! నీ పెళ్ళి సంగతి!" సుబ్బులు సాగతీసింది.

"ఓ! అదా! ఇంకెక్కడి పెళ్ళే! గోయిందా! గోయిందా!" పకపకా నవ్వింది శాంకరి.

"అదేమిటే" కనకం ఆశ్చర్యంగా అడిగింది.

"అవునే! నేను సూర్యాన్ని చేసుకోనని మా అమ్మతో చెప్పాను. ఇంతలో సీటు వచ్చిందని ఉత్తరం అందింది. మా నాయనమ్మ మనస్సు మార్చుకుంది. అంతేసంగతి."

"సూర్యంతో నీ పెళ్ళి తప్పిపోయిందా!" సంతోషం పట్టలేక పకపకా నవ్వింది కనకం.

"దాని పెళ్ళి తప్పిపోతే నీకెందుకే అంత సంబరం." సుబ్బులు నిలదీసి అడిగింది.

''ఆ! ఏంలేదు. మన శంకూ! డాక్టరమ్మ అవుతుందని'' కనకం పకపకా నవ్వింది మనసులోని భావం బయట పడకుండా.

అలా నవ్వుకుంటున్న ముగ్గురిని చూసిన అన్నపూర్ణమ్మ హృదయం సంతోషంతో నిండి పోయింది.

''అలా సంతోషంతో తిరుగుతూ చదువుకునే ఆ ఆడపిల్లల నోర్లు మూయించి పెళ్ళిళ్ళు చేసి అత్తింటికి బందీలను చేస్తున్నామనే తలంపు ఆమెలో కలిగింది.

అంతలో రైతు భార్య రాములమ్మ నలుగురు పిల్లల్ని వెంటపెట్టుకుని వచ్చింది.

''శాంకరమ్మ తల్లి! నువ్వు డాటరమ్మ వైనావంట కదా! నాకు, నా బిడ్డలకి నీవే మందులీయాలమ్మా! నీ కాడ వడుంటా'' రాములమ్మ మాటలకి స్నేహితురాళ్ళు ముగ్గురు పకపకా నవ్వారు.

''అదేంటి అమ్మాయిగారూ! మందులీయమంటే నవ్వుతారేంటి?''

''ఇంకా శాంకరమ్మ! డాక్టరు కాలేదు. డాక్టరు చదువుకోడానికి వెడుతోంది. చదువు పూర్తయ్యాక నీకు, నీ పిల్లలకి మందులిస్తుందిలే''

''అయితే కనకమ్మా! ఎన్నిదినాలవుతాదేమిటి?''

''అయిదేళ్ళు పడుతుంది".

''పోనీతే సుబ్బులమ్మా! అంతేగా! అంతవరకు నాతిప్పలు నేను పడుతుంటాతే''

''అవును రాములమ్మా! నీ మొగుడు నిన్ను కొట్టడం మానేసాడా లేదా?'' శాంకరి అడిగింది.

''మీకు తెలీంది ఏముందమ్మా! తాగొచ్చి మీకాడే కొట్టినాడు కదమ్మా! మీరు అడ్డుపడ్డారు కాని లేకుంటే మరిన్ని దెబ్బలు పడే వమ్మా! పైగా అడి సంపాదనంతా ఒక్క పైసా ఇంటికివ్వడమ్మా! అడికి కూడా నేనే పెట్టాలి''.

''మరి వాడిని వెళ్ళగొట్టక మయావా?''

''అలా అంటావేటి శంకరమ్మా ఆడు ఎక్కడికి పోతాడమ్మా! పిల్లలకి తండ్రిమీద పేనముంటుది కదమ్మా! ఎప్పటికైనా ఆడు మారచ్చుకమ్మా!'' ఆ మాటలకి శాంకరి గుండె కలుక్కుమంది. తప్ప కుండా అలాంటి వాళ్ళకి వైద్యం చెయ్యాలనుకుంది మనస్సులో.

''అలాంటి వాళ్ళని చక్కదిద్దాలి కనుకం! అప్పుడు కాని దేశం బాగుపడదు శాంకరి ఆవేశంగా అంది.''

''ఏం చక్కదిద్దడమో? అసలు వీళ్ళ తాగుడు మానిపించాలి శాంకరీ! రాములమ్మని కొడుతుంటే మనం ఊరుకోకూడదు'' కనకం కోపంగా అంది.

"అలాగే చూద్దాం" సుబ్బులు సమాధానమిచ్చింది.

"రాములమ్మ" పెద్ద పిల్లకి చదువులేదు. కాని చిన్నవాళ్ళ నైన స్కూలికి పంపించు. నేను డాక్టర్నయ్యాక నువ్వు నాదగ్గరే వుండి పోదువుగాని.

"శంకరమ్మా! నువ్వు సానా మంచిదానివి. ఆ దేవుడు నిన్ను సల్లగా సూడాలి. వెడతానమ్మా,

''రాములమ్మా అన్నముంది పట్టుకెళ్ళు'' అన్నపూర్ణమ్మ పిలుపు విని రాములమ్మ పిల్లతో కూడా వెళ్ళింది.

అంతలో రామనాథంగారు అటు వచ్చారు. సుబ్బులు, కనకం, కాసులు ఇళ్ళకు వెళ్ళారు.

"శాంకరీ! రేపొద్దుట షాపు నుంచి బట్టలొస్తాయి. నీకేమి కావాలో తీసుకో!"

"అలాగే" జవాబిచ్చింది శాంకరి.

"అమ్మా! అన్నీ చీరలే కొనుక్కుంటాను. అక్కడ లంగాలు ఓణీలు వేసుకోరమ్మా" వంటింటి వెళ్ళగానే తల్లితో చెప్పింది శాంకరి.

"నీకేమి కావాలో అవే కొనుక్కో"

"అలాగే అమ్మా"

ఆ రాత్రి శాంకరి మనస్సు పరిపరి విధాల పోయింది. శివకుమార్ రూపం లీలగా కనిపించింది. కాని అతని చొరవ ఆమెకు నచ్చదు. మనస్సు కాస్త చికాకు పడింది. సూర్యం గుర్తుకు రాగానే జాలేసి నవ్వుకుంది. కిటికీలోంచి వెన్నెల వచ్చి మంచమంతా పరచుకుంది. చల్లని గాలి గదంతా పరచుకుంది. ఆలోచనలతో అలసిన ఆ కన్య నిద్రలోకి జారుకుంది.

## 20

శాంకరి విశాఖపట్టణంలో డాక్టరు కోర్సు చదవడానికి సీటు వచ్చిందనే వార్తతో పాటు సూర్యంతో పెళ్ళికి యిష్టపడలేదనే విషయం కూడా వూరంతా తెలిసింది.

ఆ వార్త సూర్యం గుండెకి తుపాకి గుండులా తగిలింది, పైగా శాంకరి అభిప్రాయం తెలుసుకోకుండా తాను పెళ్ళికి సిద్ధపడినందుకు మరింత సిగ్గుపడ్డాడు. ఇల్లు వదలి వీధుల్లోకి రాలేకపోయాడు. తన గుండెలో భద్రంగా దాచుకున్న శాంకరి రూపాన్ని మరుగు పరచడానికి ఎంతో ప్రయత్నం చేసాడు. కాని చిన్నతనం నుంచి పెంచుకున్న ఆ ప్రేమను కాదనుకోలేక పోయాడు. అతని గుండె బాధతో మెలికలు

తిరిగింది. కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి. పగలూ, రాత్రీ తెలియకుండా తన గదిలో మంచం మీద వుండిపోయాడు. అతన్ని చూసిన తల్లి మనస్సు విలవిల్లాడింది. తండ్రి జగన్నాథంగారు కొడుకును ఓదార్చ లేకపోయాడు. కోపమూ చెయ్యలేక పోయాడు. మనస్సు బాధపడుతున్నా పైకి మాత్రం ఏమీ జరగనట్లుగానే తిరుగుతున్నారు.

కాలం మనసు గాయాన్ని మాన్పుతుందంటారు. అది సూర్యం పట్ల నిజమయింది. ఆ రోజు సూర్యం పొలానికి బయలుదేరాడు. మాసిన గడ్డంతో, నలిగిన బట్టలతో వున్న సూర్యాన్ని శాంకరి చూసింది. అతని ఆకారాన్ని చూడగానే ఆమె మనస్సు కలుక్కుమంది. చుట్టుపక్కల ఎవరూ లేకపోవడం చూసి ఆమె సూర్యాన్ని సమీపించింది.

శాంకరిని హఠాత్తుగా చూసిన సూర్యం ఉలిక్కిపడ్డాడు. ఆమెను ఆప్యాయంగా పలకరించలేక పోయాడు. తలవంచుకుని అలాగే నిలబడ్డాడు.

"క్షమించు సూర్యం - నిన్ను అవమానించాలని కాని, నువ్వంటే యిష్టంలేక కాని పెళ్ళి వద్దన లేదు."

''నాదే పొరపాటు శాంకరీ! నీ మనస్సు గ్రహించలేక పోయాను''.

''అలా అనకు సూర్యం. చిన్న తనం నుంచి మనం కలిసి మెలసి తిరుగుతున్నాం. కాని నిన్ను ఆ దృష్టితో నేనెప్పుడూ చూడ లేదు. ఒక అన్నగా నిన్ను భావించాను. పైగా నాకు చదువంటే ప్రాణ మని నీకు తెలుసు. ఎంత కష్టపడి చదివి ఈ సీటు సంపాదించానో నీకు తెలుసు. నువ్వలా వుంటే నేను చూడలేక పోతున్నాను. నువ్వు మామూలుగా వుండకపోతే నామీద ఒట్టే?''

శాంకరి! కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అది చూసిన సూర్యం గుండె కరిగిపోయింది. తన పొరపాటేమిటో అతను తెలుసుకున్నాడు.

''శాంకరి నేను మామూలుగానే వున్నాను. నువ్వు డాక్టరై ఇక్కడే ప్రాక్టీసు పెట్టాలి" లేని నవ్వు తెచ్చుకున్నాడు సూర్యం.

"సాయంకాలం మాయింటికి రావాలి."

"నేనెక్కడికి వెడతా? తప్పకుండా మీ యింటికి వస్తా! కాని ఈ రోజు కాదు." పొలం వైపు నడిచాడు సూర్యం.

అంత మంచి స్నేహితునికి చేతులెత్తి నమస్కరించింది.

శాంకరి తేలికైన మనస్సుతో యింటివైపు కదిలింది.

ఒకరోజు సూర్యం శాంకరి యింటికి బయలుదేరి వెళ్ళాడు. గుమ్మంలోనే శాంకరి ఎదురయింది.

"రా! సూర్యం ఇలా వచ్చి కూర్చో!" కుర్చీ చూపించింది.

విశాఖపట్టణంలో ఎక్కడ ఉండేది వివరంగా అడిగి తెలుసుకున్నాడు సూర్యం. తర్వాత చదువు సంగతి అడిగాడు. అన్నింటికి వివరంగా సమాధానాలు చెప్పింది శాంకరి.

ఇద్దరూ మాట్లాడుతున్నా యిద్దరిలో మాటలు పొడిపొడిగానే ఉన్నాయి. మునుపటి ఆత్మీయత వారిలో లేనేలేదు.

"ఏం సూర్యం బాగున్నావా? ఇటు రావడమే మానేశావు?" అటు వచ్చిన అన్నపూర్ణమ్మ పలకరించింది.

"ఆ బాగున్నానత్తయ్యా! ఏదో పొలాల పని అదీను, ఖాళీయే దొరకడం లేదు". లేని నవ్వు తెచ్చుకొన్నాడు.

"ఎవరిదే ఆ కొత్త గొంతు" కాస్త కోలుకున్న దుర్గమ్మగారు పక్కగదిలోనుంచే అడిగింది.

'సూర్యం నాయనమ్మా!'

"సూర్యమా! చూసి చాలా రోజులైందే శాంకరీ! వాడిని యిలా రమ్మను."

ఆ మాటలు విన్న సూర్యం ఆవిడ గదిలోకి వెళ్ళి ఆవిడ మంచం మీద కూర్చున్నాడు.

"ఏం సూర్యం! బాగున్నావా నాయనా?" సూర్యం భుజం మీద చెయ్యివేసి అడిగింది.

''ఆ బాగున్నా! నీ ఆరోగ్యం ఎలా ఉంది?''

"ఏదో నాయనా? ఇలా బ్రతికి ఉన్నాననుకో? ఇంక పోయేదే కానీ ఆరోగ్యం తిరిగి వచ్చేది కాదు కదా! మంచం పట్టకుండా పోవాలనుకుంటే పోతానా?''

''అప్పుడే ఎక్కడ పోతావు? అయినా పోవాలని ఎందుకనుకుంటావు? కాలు చెయ్యి వస్తే హాయిగా తిరుగుతావు?"

"కాలుచెయ్యి వస్తాయంటావా?'' ఆశగా అడిగింది.

"మహారాజులా వస్తాయి. ఇంక వెడతా" అందరికి చెప్పి బయలు దేరాడు సూర్యం.

# 21

శాంకరి మెడిసిన్ చెయ్యడానికి విశాఖపట్నం వెడుతుందని తెలిసిన కాసులు రెక్కలు కట్టుకు వాలింది. కాసుల సంతోషానికి అంతు లేదు.

బండి దిగిన కాసుల్ని కనకం, సుబ్బులు, శాంకరి చుట్టుముట్టారు.

''శాంకరీ! అనుకున్నది సాధించావే. పరువు నిలబెట్టావే"అంటూ శాంకరిని వాటేసుకుంది కాసులు. ఆనందంతో వారి కళ్ళు చింతగింజలంత నీటిబిందువులతో నిండిపోయాయి.

సాయంకాలం కాగానే నలుగురు గోదావరివైపు బయలుదేరారు. ఇసుకతిప్పలో నడిచి నీటివరకు వచ్చారు. ''అమ్మ దొంగా! నువ్వు మాత్రం నీళ్ళలోకి దిగకే తల్లీ! మళ్ళీ పైకి రావు! దీన్ని పట్టుకోండే'' అంటూ కనకం, శాంకరిని ముందు కెళ్ళకుండా ఆపి మిగిలిన వారిని పిలిచింది.

కాసులు, సుబ్బులు వచ్చి నీళ్ళలో కాలు పెట్టకుండా శాంకరిని పట్టుకున్నారు.

"వదలండే తల్లీ: నీళ్ళలోకి దిగనులెండి'' అంటూనే శాంకరి యిసుక తిప్పలో చతికిల పడింది.

ఆమె చుట్టూ కూర్చున్నారు కాసులు, సుబ్బులు, కనకం.

నలుగురు యిసుక తిప్పలో బొమ్మరిళ్ళు కట్టడం ప్రారంభించారు.

పైన కొంగల గుంపులు 'బేర్, బేర్' మంటూ ఎగురుతూ పోతున్నాయే.

ఎంత హాయిగా ఎగురుతున్నాయే" కనకం వేలెత్తి చూపించింది.

"ఆ! మనలాగే" అంది సుబ్బులు.

"ఇంక మనం అలా తిరగలేమే" నీరసంగా అంది కాసులు.

"అత్తారింటి కెళ్ళి అక్కల్లలైనా కాలేదు. అప్పుడే నీరసపడి పోయావే తల్లీ'' కనకం చెప్పింది.

"చల్లని నీటి కెరటాల మీద దూచ్చుని ఎంత బాగా పూగుతున్నాయో? ఆ నీటి పక్షుల్ని చూడవే?" ఇసుకలో గంతులు వేసింది సుబ్బులు.

కనకం వాటిని పట్టుకోవడానికి నీళ్ళవైపు పరుగెత్తింది.

"కనకం! అటెళ్ళకు. అక్కడ నీళ్ళు చాలా లోతుగా వుంటాయి.

"వెనక్కి వచ్చేసేయి" అంటూనే శాంకరి కట్టే పిచ్చుక గూడు లోంచి కాలు తీసుకుని ముందుకు పరుగెత్తింది. అప్పటికే కనకం నీటి లోకి దిగింది. నీటి పక్షి అందలేదు కాని ఆమె నీటిలో దిగిపోతోంది.

"శాంకరీ! శాంకరీ!" అని భయంకరంగా కేకలు పెడుతోంది కనకం. ఆమె తల, పైకెత్తిన చేతులు మాత్రమే కనబడుతున్నాయి.

'కనకం' అంటూ ఆమె చేతులు అందుకోవడానికి నీళ్ళలోకి దిగింది శాంకరి.

"శాంకరీ! నువ్వు వెళ్ళకే! ఆగు, శాంకరీ!" కాసులు శాంకరిని పట్టుకోడానికి పరుగెత్తి శాంకరి చేయి పట్టుకుని వెనక్కి లాగింది.

"కనకం! చచ్చిపోతోందే! అయ్యో! కనకం!" శాంకరి కాసులు చెయ్యి విదిలించుకుని కనకం చెయ్యి అందుకోపోయింది. కాని ఆమె చెయ్యి అందలేదు. శాంకరి కూడా నీళ్ళలోకి దిగిపోతోంది.

ఆ దృశ్యం చూడలేని సుబ్బులు వెనక్కి పరుగెత్తి గట్టుమీదున్న స్త్రీ జాలర్లను పిలుచుకొచ్చింది.

నీళ్ళ దగ్గర నిలబడ్డ కాసులు ఆర్తనాదాలు చేస్తోంది.

ఆ జాలర్లు గజ ఈతగాళ్ళు. నలుగురు నీళ్ళలోకి దిగి చేతులు మాత్రమే కనబడుతున్న ఆ యిద్దర్ని పట్టుకుని తీసుకువచ్చి యిసుకలో పడుకోపెట్టారు. గట్టుకింద కాపురముంటున్న ఆడవాళ్ళంతా చుట్టు ముట్టారు.

వారు పట్టుకొచ్చిన బట్టలతో తలలు తుడిచారు కాసులూ, సుబ్బులూ.

పొట్టలు నొక్కి నీళ్ళు కక్కించి చలి మంటలు వేసి కాళ్ళూ చేతులూ కాచారు జాలర్లు. వారికి అది పెద్ద ఆశ్చర్యం కాదు. కాని ఈ ఆడ పిల్లల్ని రక్షించడమే వారికి ఆనందాన్ని కలిగించింది.

"ఎంత పని చేసారమ్మా!" అంటూ వాపోయాడు జాలారి రంగన్న.

"శాంకరీ! ఎంతపని చేసేవే? కనకం ఎంతపని చేసేవే?" అంటూ వారిపక్కన కూర్చొని గుండెలు బాదుకొని కాసులు, సుబ్బులు ఏడవడం మొదలు పెట్టారు.

"అయ్యో! బతికి బయట పడినాక అలా ఏడుస్తుంటావేటమ్మా" అంటూ వారిని ఓదార్చారు అక్కడి ఆడవారు.

నీళ్ళు పైకి రాగానే ఉబ్బిన వారి పొట్టలు లోపలకు దిగాయి. శవాకారాలు పోయి తిరిగి మనిషి రూపాలు వచ్చాయి. కాస్త కాళ్ళూ. చేతులూ వేడి ఎక్కగానే మెల్లిగా వారిలో చలనం వచ్చింది "శాంకరీ- కనకం కదులుతున్నారే ఇంక బతికినట్టేనే" అంటూ కన్నీళ్ళు తుడుచుకుంది కాసులు. సుబ్బులు వారినే తదేకంగా చూస్తూ కారే కన్నీళ్ళు రెండుచేతులతోనూ తుడుచుకుంది.

అంతలో ఆ వార్త ఊరంతా పాక్కింది. మంచైనా చెడైనా దానితో పాటు వార్తలు కూడా వ్యాపిస్తూ ఉంటాయి. సూర్యం, రాజు, రవి గోదావరివైపు పరుగు పెట్టారు. వారి వెనక మిగిలిన వారంతా పరుగు పెట్టారు.

రామనాథంగారు, విశ్వనాథంగారు యింట్లో లేరు.

"నాతల్లో! ఎంత పని చేసావే? వద్దంటే విన్నావు కాదే! నాతల్లీ" అంటూ అన్నపూర్ణమ్మగారు శోకాలు ప్రారంభించింది. దుర్గమ్మగారు గుండెలు బాదుకుంటూ ఏడుపు మొదలు పెట్టింది. వాళ్ళు గోదావరి వైపు వెళ్ళలేక పోయారు.

కనకం తల్లి సంగతి చెప్పనే అక్కర లేదు. ఆమె శోకాలు వీధంతా మారుమ్రోగుతున్నాయి. ఆ వీధిలోని ఆడవాళ్ళంతా అక్కడ చేరారు వాళ్ళను ఓదారుస్తూ.

శాంకరి కనకం ఉన్న చోటకు చేరుకున్నారు సూర్యం వాళ్ళు. అలా యిసుకలో పడుకుని వున్న శాంకరిని, కనకాన్ని చూడగానే అతని మనస్సు బాధతో మెలికలు తిరిగింది.

"అక్కా!" అంటూ శాంకరి మీద వాలి వెక్కివెక్కి ఏడ్చాడు రవి.

రాజు వాళ్ళని చూస్తు అలా వుండిపోయాడు.

జాలరి రంగన్న జరిగినదంతా వివరించాడు సూర్యానికి.

"ఇంక పాన భయం లేదు బాబు. డాటరుగారికి చూపించి మందు ఇప్పించండి. బండిమీద తీసుకెళ్ళండి బాబు" అన్నాడు రంగన్న.

వెంటనే సూర్యం తనతో వచ్చినవారిని పంపి రెండెడ్ల బండిని తీసుకురమ్మన్నాడు. మరో రేవునుంచి ఎడ్లబండ్లు ఇసుక తిప్పలు దాటుతాయి. ఆ రేవులో గట్టు వాటంగా లేదు. అప్పటికీ సూర్యాస్తమయం దాటి చంద్రోదయమయింది. వెండి వెన్నెలలో ఇసుక తిన్నెలు మిల మిల మెరుస్తున్నాయి. ఆ యిసుకలో నిర్జీవంగా పడుకుని వున్న ఆ కన్యలు గంధర్వ కన్యల్లా మెరుస్తున్నారు.

అంతమంది చుట్టూవున్నా నక్క అరుపులకు, తీతువు పిట్ట కూతలకు పులిక్కిపడుతున్నారు కాసులు, సుబ్బులు. ప్రాణ స్నేహితురాలైన శాంకరి, కనకానికి ప్రాణభయం లేదనగానే వారి ముఖాలు కలువల్లా వికసించాయి. వారి గుండెల్లో గూడు కట్టుకున్న చీకటి తెరలు తొలగడం మొదలు పెట్టాయి. పాటి రేవు వెంట రెండెడ్ల బండి వచ్చి వారి ముందు నిలబడింది. సూర్యం, రాజు కలిసి కాసులు, సుబ్బులు సహాయంతో వాళ్ళను బండిలో పడుకోపెట్టారు.

గణగణ గంటలు చప్పుడు చేసుకుంటూ బండి కదిలింది. బండి తొట్టెలో అరికేన్ లాంతరు, జాలరి రంగన్న చేతిలో మరో లాంతరు, సూర్యం చేతిలో బ్యాటరీలైటు వారికి తోడుగా ఉన్నాయి. కాసులు, సుబ్బులు, రవి కూడా బండి ఎక్కారు.

పాలేరు వెంకన్న ముందు నడుస్తున్నాడు. అతని వెనక ఎడ్ల బండి. దాని చుట్టూ వచ్చిన జనం నడుస్తున్నారు. అంతలో జర జర పాకుతూ తెల్ల త్రాచు బండి ముందు నుంచి వెడుతోంది. వెంకన్న కర్ర ఎత్తి దెబ్బ వేయబోయాడు.

"వెంకన్నా! దాన్నేమి చేయకు. అది దాని దారిని పోతుంటే నీకెందుకయ్యా!" కోపం చేసాడు సూర్యం. ఎత్తిన కర్ర దించి ముందుకు నడిచాడు వెంకన్న.

గుండెలు చేతపట్టి ముందుకు నడిచారు మిగిలినవారు. దూరంగా మిణుకు మిణుకు మంటూ దీపాల్లా కనబడుతున్నాయి. వీటిని చూసి కొందరు భయపడ్డారు.

"సూర్యం! అవి కొరవి దెయ్యాలు" భయంగా అరిచాడు రవి. కాసులు రవిని ఒళ్ళోకి తీసుకుని గట్టిగా పట్టుకుంది.

"కొరవి దెయ్యాలు లేవు. కొండముచ్చు దెయ్యాలు లేవు. ఎవరో మనలాగె లాంతర్లు పట్టుకుపోతున్నారు" అన్నాడు సూర్యం.

"రాత్రిళ్ళ యిసుక తిప్పల్లో కొరివి దెయ్యాలు తిరుగుతాయి సూర్యం. నీకు తెలియదు"

"చాల్లె సుబ్బులూ! నీకెవరు చెప్పారు ఇవన్నీను. కొరివి దెయ్యా లంటూ ఏవీ లేవు. ఇంతకీ నువ్వెప్పుడైనా చూసావా?"

"లేదు" మొహం ముడిచింది సుబ్బులు.

అంతలో శాంకరి కళ్ళు విప్పి చూసింది.

"ఎలావుంది. శాంకరీ" కాసులు అడిగింది.

"నీరసంగా వుంది" ఆమె మాట నూతిలోంచి వచ్చినట్లు వుంది. కనకానికి బాగా తెలివిరాలేదు. తిరిగి శాంకరి కళ్ళు మూసుకుంది.

బండి శాంకరి యింటి ముందు ఆగింది. అన్నపూర్ణమ్మగారు వాళ్ళు మరో సారి గొల్లు మన్నారు.

మంచాలు వాల్చి పక్కలు వేసింది. సుందరమ్మ "ఏడవకు అన్నపూర్ణమ్మా, ఓదారుస్తున్నారు అక్కడి ఆడవారు.

మెల్లగా యిద్దర్నీ సాయం పట్టి సావిట్లో మంచాల మీద పడుకో పెట్టారు సూర్యం వాళ్ళు.

డాక్టరు వచ్చి యిద్దరికి యింజక్షన్లు చేసి మందులు ఇచ్చాడు. మందులు వేసి వేడి వేడి పాలు తాగించమన్నాడు. వారి వంటి మీదున్న తడి బట్టలు అవే ఆరిపోయాయి. వారి బట్టల నిండా, తల నిండా వంటి నిండా తెల్లటి ఇసుక పట్టుకుని వుంది.

కాసులు వారి తలలు మెల్లగా తుడిచి, ఒళ్ళంతా వున్న యిసుకను తుడిచింది. కాస్త కోలుకున్నాక బట్టలు మారుద్దామనుకున్నారు. అన్నపూర్ణమ్మ వెక్కి వెక్కి ఏడుస్తూనే వుంది.

"బతికి బట్టకట్టారు ఏడుస్తారెందుకండి అలా. ఏడవటం మంచిది కాదు. పిల్లలు భయపడతారు కూడా" పెద్ద ముత్తైదువలు మందలించారు అన్నపూర్ణమ్మను.

కాసులు, సుబ్బులు, సూర్యం రాజు ఆ రాత్రి అక్కడే వుండి పోయారు. "సుబ్బులూ! ఎంత గండం దాటిందే! కనకం చేతులు చాచి రక్షించమంటే, శాంకరి మునిగిపోతూ కాసులూ! రంగన్నను పిలవండి

నేను చచ్చిపోతున్నా" అని అరుస్తున్నప్పుడు మనం ఏం చెయ్యలేక పోయాం కదా! ఇంక నాకళ్ళముందు ఆ దృశ్యమే కనబడుతోందే" కాసులు రెండు చేతులతో ముఖం కప్పుకుని వెక్కి వెక్కి ఏడ్చింది.

"కాసులూ! ఏడవకే మన ముందే అంత ఘోరం జరుగుతుందని కలలో కూడా అనుకోలేదే! ఆ జాలరి రంగన్న, అతని పరివారం అక్కడ లేకపోతే మనం ఏం చెయ్యలేక పోయే వాళ్ళమే? అసలు కనకం, శాంకరీ కూడా మన కంటె బాగా ఈదుతారు? కాని వారు నిలతొక్కుకోలేక పోయారు" సుబ్బులు ఏడుపు ప్రారంభించింది.

"అదేమిటీ? కాసులూ! సుబ్బులూ! అలా ఏడుస్తారెందుకు? ఇప్పుడేం జరగలేదు కదా! పైగా ఆ పక్క పడవల రేవుంది కదా? అక్కడ లోతు ఎక్కువ. అక్కడసుడి గుండాలు వున్నాయి. నిరుడు చంద్రగ్రహణం నాడు స్నానాలకు వచ్చిన కేశవుడు, మాధవుడు అపదులో మునిగి పోవడం మేము చూస్తూనే వున్నాం. కేశవుడు మునుగుతుంటే మాధవుడు పట్టుకోపోయి మునిగి పోయాడు. నేను పరిగెత్తుతుంటే రాజు వాళ్ళు పట్టుకున్నారు. జాలరి రంగన్నా వాళ్ళు కాలప రేవు కెళ్ళారు. వాళ్ళు వచ్చేటప్పటికి అంతా జరిగిపోయింది. ఆ బురదలో కూరుకు పోయిన వారి శవాలు దొరకడమే కష్టమయింది. ఈ రోజు మంచి రోజు అందుకే శాంకరి, కనకం మనకి దక్కారు" సూర్యం మాటలు విన్న కాసులు. సుబ్బులు భయంతో బిగుసుకు పోయారు. అంత అందమైన గోదావరి నదీ, పరిసరాలు వారికి భయంకరంగా కనిపించాయి. సూర్య కాంతిలో బంగారు. తిన్నెర్లా వెన్నెల రాత్రిలో వెండి తల్పాలా మెరసె ఆ యిసుక తిన్నెల్లో భగభగ మండే మృత కళేబరాలు వారి కళ్ళముందు నిలిచాయి. సూర్యానికి అదే విషయం చెప్పారు.

"మంచి చెడు మనిషిలో వున్నట్లుగానే పవిత్రమైన ఆ గోదావరి చుట్టూ వుంటాయి. దాని కోసం గోదావరికి వెళ్ళడం మానం కదా"

ఆరిందాలా మాట్లాడుతున్న సూర్యాన్ని ఆశ్చర్యంగా చూసారు కాసులూ, సుబ్బులూ.

అంతలో రామనాథంగారు యింటికి వచ్చారు. ఆ వార్త విని ఆయన ఆశ్చర్యపోయారు.

"ఎంత పని జరిగింది సూర్యం. నేను పెళ్ళికి మొదటి నుండీ చెబుతూనే వున్నా. అక్కడికి వెళ్ళవద్దన వినిపించుకున్నారు కాదు. ఆ గజ ఈతగాళ్ళు వుండబట్టి బతికారు. అయినా ఆ సుబ్బులు వాళ్ళ పాలిట ప్రాణదేవతమ్మా! ఆపిల్ల చూస్తూకూర్చుంటే ప్రమాదం జరిగిపోయేది. వాళ్ళని పిలుచుకు వచ్చింది. మంచి వివేకవంతురాలు సుబ్బులు" అన్నారు రామనాథంగారు. ఆమె అలా పడుకుని వుంటే ఆ తండ్రి చూడలేక పోయాడు. ఆయన గుండె కరిగిపోయింది. కనకం తండ్రి కూతుర్ని చూసి భోరున ఏడ్చాడు.

"ఏదైన గండం తప్పిందమ్మా" అంటూనే ఆయన కాస్త ఎంగిలి పడి గదిలోకి వెళ్ళిపడుకున్నారు రామనాథంగారు. అన్నపూర్ణమ్మగారు ఎవరు బతిమాలినా ఎంగిలి పడలేదు. ఆవిడ కళ్ళు అలా వర్షిస్తునే వున్నాయి. దుర్గమ్మగారికి కునుకు పట్టింది.

మిగిలిన వారు అలా ఏదో ఒకటి మాట్లాడుతూనే వున్నారు.

అర్ధరాత్రి దాటాక శాంకరి మూలగడం మొదలు పెట్టింది.

"శాంకరి ఎలా వుందే?" కాసులు అడిగింది.

"తల నెప్పిగా వుందే? మంచి నీళ్ళు కావాలి, శాంకరి మాట అందరు ఆసక్తిగా విన్నారు.

అన్నపూర్ణమ్మ పాలు పట్టుకొచ్చి ఇచ్చింది. సుబ్బులూ, కాసులూ కలిసి తాగించి మందులేసారు. అందరిని ఆశ్చర్యంగా చూసిన శాంకరి కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

"భయపడకు శాంకరీ! అదిగో. కనకం కులాసాగానే వుంది." అంది కాసులు

కనకం మంచం వైపు చూసిన శాంకరి ముఖంలో ఆనందం కనబడింది. తిరిగి నిద్రలోకి జారిపోయింది.

కనకానికి తెల్లవార్లు తెలివి రానేలేదు. పడుకున్న మనిషి పడుకున్నట్లుగానే ఉంది. కనకం తల్లి ఆమె పక్కలోనే కూర్చుంది. ఆవిడ కళ్ళు నీళ్ళతో నిండే వున్నాయి.

తెల్లారకట్లకి కనకం కాస్త కళ్ళు తెరచి చూసింది.

"అమ్మా!" ఆ తల్లి కూతురు తల నిమిరింది.

ఏదో అడగాలనుకుంది. కాని మాట రాలేదు కాసులు వెంటనే గ్రహించింది.

"అదిగో శాంకరి" నీ పక్క మంచం మీదేవుంది. కులాసాగానే వుంది. శాంకరి మంచం వైపు చూసి" తలూపింది కనకం.

కనకంచేత మందులు మింగించి గోరువెచ్చని పాలు తాగించింది వాళ్ళమ్మ. తిరిగి కనకం నిద్రలోకి జారుకుంది.

తెల్లావారకుండానె సూర్యం, రాజు నిద్రలేచి శాంకరిని, కనకాన్ని ఒక మాటు చూసి "మళ్ళీ వస్తామని" చెప్పి యింటికి వెళ్ళిపోయారు.

కనకం ప్రొద్దుటికి కాస్త తేరుకుంది. మెల్లిగా ఆమెను యింటికి తీసుకువెళ్ళారు తల్లి తండ్రులు. కాసులు, సుబ్బులు శాంకరి దగ్గరే వుండిపోయారు.

మరునాటికి కాస్త తెరుకున్న శాంకరి మెల్లిగా మంచం మీద లేచి కూర్చుంది.

కాలు కింద పెట్టే ఓపిక ఆమెకు లేదు. "ప్రయాణం రెండు రోజులే వుంది. ఇంకా ఏమీ సర్దుకోలేదే?" శాంకరి బాధ పడింది.

"శాంకరీ! నువ్వు బతికి బయట పడ్డావు అంతే చాలే. సామానుకేముంది మేం సర్దుతాంలే" కాసులు, సుబ్బులు ఆమెకు ధైర్యం చెప్పారు. శాంకరిని, కనకాన్ని చూసి బాధపడిన కాసులు, సుబ్బులు నాలుగు లంఖణాలు చేసినంత నీరసపడ్డారు. ఆ పూట వాళ్ళు యింటికి వెళ్ళి వస్తామని బయలుదేరారు. వారి స్నేహాన్ని చూసిన అన్నపూర్ణమ్మ

కళ్ళు చెమర్చాయి. వారి వల్లె తన కూతురు బతికిందని ఆమె మనస్సులో వారిమీద చెప్పలేని అభిమానం ఏర్పడింది.

మరునాటికి కనకం, శాంకరి మరి కాస్త కోలుకున్నారు. సూర్యం కాసులు, సుబ్బులుతో కలిసి శాంకరిని చూసి వచ్చాడు. తర్వాత రాజుతో కలిసి కనకాన్ని చూడ్డానికి వెళ్ళాడు. వాళ్ళని చూడగానే కనకం వెక్కి వెక్కి ఏడ్చింది.

"ఇప్పుడెందుకు ఏడుస్తున్నావు కనకం? అడిగాడు సూర్యం.

"నా మూలంగానె శాంకరి నీళ్ళలో మునిగిపోయింది."

"మరి నువ్వెవరి మూలంగా మునిగావు?"

"నేనా! ఆ పశువుల మూలంగా".

ఆ మాటకి అందరు పకపకా నవ్వారు. కనకం కూడా నవ్వింది. శాంకరి వెనకాల వుండి అల్లరి చేసేది కనకమే. ఆ కనకంతో యింకా చిలిపితనం పోలేదనుకున్నాడు సూర్యం.

శాంకరి ప్రయాణానికి కావలసిన బట్టలు, వస్తువులు కాసులు, సుబ్బులు అన్ని ఎక్కడ అక్కడ సర్దారు. శాంకరి ముఖం విప్పారింది. ఒక పక్క సర్దుతున్నా శాంకరి దూరం వెళ్ళిపోతోందనే బాధ సుబ్బులు మనస్సులో కలవర పెడుతోంది. కాకినాడలో వుంటున్న కాసుల్ని ఆ విషయం అంత బాధపెట్టలేదు.

## 22

శివకుమార్ దృష్టి అంతా శాంకరి పైనే వుంది. శాంకరిని చూడలనే తలంపు అతన్ని నిలవనియ్యడం లేదు. అతను ఏ పని చేస్తున్నా అతని తలంపు నిండా శాంకరి నిండివుంది.

అంతలో అతనికి సూర్యం రాసిన ఉత్తరం అందింది. ఎంతో సంతోషంతో కవరు తెరిచిన శివకుమార్ నిర్ఘాంత పోయాడు. సూర్యం వివాహం శాంకరితో నిశ్చయమైందన్న వార్త అతను నమ్మలేక

పోయాడు. అతని గుండె పగిలినట్లయింది. కాళ్ళ కింద భూమి కదిలి లోపలికి వెళ్ళినట్లయింది. ఇంక అక్కడ నిలబడలేక గదికి వెళ్ళి మంచం మీద వాలిపోయాడు. గుండెలోని బాధను అదుపు చేయలేని అతని కన్నీళ్ళు సుళ్ళు తిరిగాయి. ఇంక తనకు జీవితమే లేదను కున్నాడు. శాంకరి లేని తాను జీవించినా వ్యర్థమే అనుకున్నాడు. తన భావన తప్పేమోనని మరోసారి వుత్తరం చదివాడు. అందులో వివరా లేమి లేవు. శాంకరితో పెళ్ళి నిశ్చయమైన సంగతి మాత్రమే అందులో రాసాడు. అంత బాధలోను అతనికి శాంకరి వివాహానికి అంగికరించిందో లేదో? అనే అనుమానం వచ్చింది. శాంకరి అంగికరించదనే అతని మనస్సు ఘోషించింది. అతని మనస్సు కాస్త కుదుటపడింది. వెంటనే వెళ్ళి శాంకరిని కలుసుకుని మాట్లాడాలనుకున్నాడు.

"అంతలోనే పెళ్ళి కుదిరిన తరువాత తాను వెళ్ళి మాత్రం ప్రయోజన మేమిటి? తనమీద ఏ మాత్రం మమకారం లేని ఆమె కోసం తాను బాధ పడడం అనవసరమనుకున్నాడు."

అలా అనుకున్నా అతని మనస్సు కుదుట పడలేదు. గాయపడిన అతని హృదయం బాధ పడుతూనే వుంది. అలసిపోయి మంచం మీద అలాగే నిద్రపోయాడు. ఉత్తరం చదువుకున్నది మొదలు కొడుకు మామూలుగా లేడని ఆ తల్లి గ్రహించింది. ఉత్తరంలో బాధ కలిగించే విషయమేదో వున్నదని అనుకుంది. కొడుకుకు బాధ కలిగించిన విషయం ఆవిడకు తెలియకపోయినా ఆతల్లి మనస్సు తల్లడిల్లిపోయింది

మెళకువ వచ్చిన శివకుమార్ మరోసారి వుత్తరం చదువుకు న్నాడు. బాధపడే మనస్సును ఓదార్చుకునే శక్తి అతనికి లేదు. అంత మాత్రం చేత మనసు వెంట పరుగెత్తే స్వభావము అతనికి లేదు. ఉత్త రం మడిచి అలమారులో పడేసాడు. మామూలుగా వుండడానికి ప్రయ త్నం చేస్తూ కిందికి దిగాడు.

"టీ వుందా అమ్మా!"

"ఆ వుంది! ఇప్పుడే తయారుచేసాను. పట్టుకొస్తానుండు"

ఆవిడ టీ పట్టుకొచ్చి కుర్చీలో కూర్చున్న శివకుమార్‌కు అందించింది. మామూలుగా పేపరు చదువుతున్న కొడుకును చూడగానే ఆవిడ మనస్సు కుదుట పడింది.

"శివా! సూర్యం వాళ్ళు కులాసాగా వున్నారా?" అతనికి సంతోషం కలిగించాలని అడిగింది.

"ఆ! కులాసాగానే వున్నారు. సూర్యం పెళ్ళట. ఇందాక వుత్తరం వచ్చింది"

"అలాగా? పిల్ల ఎవరుట?"

"వాళ్ల మామయ్య కూతురే :"

ఆయనెవరు?

"రామనాధంగారని చెప్పాకదమ్మా వాళ్ళమ్మాయి శాంకరీ దేవి!"

"అలాగా! బాగుంది. ఒకేవూరు. ఒకరికొకరు తోడుగావుంటారు. అయినా అందరూ బాగానే వుంటారు! మీ మామయ్య చలపతి చూసావా? వెళ్ళాక వుత్తరం ముక్కైనా లేదు?"

"పోనీలే వాళ్ళ సంగతెందుకమ్మా!"

అంతలో 'శివా' అంటూ లోపలికి వచ్చాడు మధు.

"రా! రా! మధూ"

"కంగ్రాట్యులేషన్స్ శివా! నీకు నాకు ఎం టెక్‌లో సీట్లు వచ్చాయి తెలుసా!"

'హాయ్' ఇద్దరు కరచాలనం చేసుకున్నారు. మధును చూసి. కుర్చీలోంచి లేచి నిలబడిన రాజేశ్వరమ్మ ఇద్దరి వైపు సంతోషంగా చూసింది.

"చూసావా అమ్మా! నాకు ఎం టెక్‌లో సీటు వచ్చిందట? నాకు వస్తుందనుకోలేదమ్మా"

"నేనను కున్నారా! నీకు వస్తుందని! ఏం మధూ బాగున్నావా? ఈ మధ్య ఎక్కడా కనపడ్డం లేదు.

"ఎక్కడాంటీ? కాలేజీ లేకపోతే ఏదో పని! తీరుబడే లేదాంటీ!"

'కూర్చో మధూ!'

ఆవిడ టీ పట్టుకొచ్చి అతనికూడా యిచ్చింది. ఇద్దరు చదువు సంగతే కాసేపు మాట్లాడుకున్నారు. ఇద్దరూ చిన్నతనం నుంచి కలిసి మెలసి చదువుతున్నారు. ఇద్దరు ఒకటే క్లాసు. ఇద్దరికీ ప్రాణ స్నేహం. మధు అంటే రాజేశ్వరమ్మ గారికి కూడా చాలా అభిమానం. మధులాంటి వారితో వుంటే తండ్రిలేని లోటు లేకుండా కొడుకు విద్యాబుద్ధులు నేర్చుకుంటాడని ఆ తల్లి నమ్మకం.

"రేపు కలుసుకుందాం శివా! అంటూ మధు వెళ్లిపోయాడు.

ఈ రోజు నాకు చాలా సంతోషంగా వుంది శివా! మీ నాన్నగారు ఈ వార్త వింటే ఎంత సంతోషించేవారో!

"అవునమ్మా! నేను అదే అనుకుంటున్నాను. ఆయన చాలా సంతోషించే వారు?"

"శివా! నీ చదువు రెండు సంవత్సరాలుంటుందా?"

అవునమ్మా! ఈ రెండు సంవత్సరాలు ఇక్కడే వుందామమ్మా"

"అవును బాబు! నీ చదువు పూర్తయ్యేవరకు ఇక్కడే వుందాం! తర్వాత నీ యిష్టం హైదరాబాద్ వెళ్ళచ్చు"

అవునమ్మా రేపే హైదరాబాద్ ఉత్తరం రాస్తాను. మనం యిప్పట్లో రావడంలేదని"

అంతలో గుమాస్తా రావడంతో ఇద్దరు యింటి విషయాలు డబ్బు విషయాలు, శివా చదువు విషయం అన్నీ మాట్లాడుకున్నారు.

ఆ పూట అతను వారితో పాటే భోజనం చేసి అక్కడే పడుకు నాడు.

ఆ రాత్రి శివాకు నిద్ర రాలేదు. అతని కళ్ళ ముందు శాంకరి నిలబడింది. మనసంతా ఆమె ఆలోచనలతో నిండిపోయింది. ఆమె సూర్యం భార్య కాబోతోంది. ఆమెను గురించి యింక ఆలోచించ కూడదను కున్నాడు. కదలి అంత బాధను కడుపులో దాచుకుని బల వంతంగా కళ్ళు మూసుకున్నాడు.

అతని కళ్ళముందు సూర్యం పెళ్ళి సభలేక కదిలింది. పెళ్ళి పందిరి అందులో సూర్యం కదిలాడు. తన ఊహకు తానే నవ్వుకున్నా తరువాత శివా నిద్రలోకి జారాడు.

# 22

ఆరోజే శాంకరి ప్రయాణం. ఉదయం మొదలు ఇల్లంతా ఒకటే అడావిడిగా వుంది. కాసులు, కనకం, సుబ్బులు శాంకరి వెనకే తిరుగు తున్నారు. తమ స్నేహితురాలు డాక్టరవుతోందన్న సంతోషం వాళ్ళని నిలవనియ్యడం లేదు.

"నువ్వు డాక్టరయితే మాతో మాట్లాడుతావుటే" అంటున్న స్నేహితురాళ్ళకి "ఏమిటా మాటలు? మీరలా అంటే నేను మీతో మాట్లాడ"నంటూ వాళ్ళని బెదిరిస్తోంది. మరోసారి "నోరు మూసు కోండే" పనికిరాని వాగుడు మీరునూ" అంటూ కోపం చేస్తోంది శాంకరి.

"అక్కా! అక్కా! మళ్ళీ ఎప్పుడొస్తావక్కా. నన్నుకూడా తీసు కెళ్ళు అక్కా!" అంటూ పేచీ పెట్టాడు రవి!

"నువ్వు చిన్నపిల్లవాడివి కదా! అమ్మానాన్నల దగ్గరే వుండాలి. నువ్వు పెద్దయ్యాక నిన్నుకూడా తీసుకెడతా"రవికి నచ్చచెప్పింది శాంకరి.

అన్నపూర్ణమ్మగారికి కాళ్ళుచేతులు ఆడ్డం లేదు. కూతురు అక్కడ వంటరిగా వుండి ఎలా చదువుకుంటుందన్నదే ఆవిడ భయం. పైగా ఆవిడకు తెలుసున్నంతలో ఆడపిల్లలెవరు హాస్టల్లో వుండి చదువుకో లేదు. అందుకే ఆవిడకు మరింత భయంగా వుంది.

ఆవకాయ, మాగాయ, నెయ్యి సీసాల్లో సర్ది యిచ్చింది. కంది పొడి వగైరాలు పొట్లాలు కట్టింది.

"ఇవన్నీ ఏమిటమ్మా! అక్కడ హాస్టల్లో అన్నీ వుంటాయి" అంటున్న కూతురు మాటలు వినిపించుకోలేదు ఆవిడ.

"నీకు తెలీదమ్మా! ఆ వంటలు ఏమీ బాగుండవు. ఇవన్నీ పట్టుకెళ్ళు" తల్లిమాట కాదనలేక వేరు బాగ్‌లో పెట్టింది.

కనకం గోంగూర పచ్చడి, చింతకాయ పచ్చడి సీసాల్లో పెట్టి పట్టుకొచ్చింది.

సుబ్బులు జంతికలు, మిఠాయి వుండలు యిచ్చింది. సూర్యం తల్లి పాలకోవా చేసి పంపించింది. అన్నీ మరో బాగ్‌లో సర్దింది కాసులు. శాంకరితోపాటు అందరు రాజమండ్రి వెళ్ళి రైలు ఎక్కించి వద్దామనుకున్నారు. దుర్గమ్మగారు మంచం మీద కూర్చునే కనపడ్డ వారికి ఏదో పురమాయిస్తూనే వుంది. ఆవిడ కొంచెం కోలుకుంది. మాట బాగానే వచ్చింది. ఒక కాలు చెయ్యి మాత్రం కదలడంలేదు. తనంతటతాను మంచం మీద లేచి కూర్చోగలుగుతోంది. అందుకే సంతోషించింది దుర్గమ్మ. దుర్గమ్మగారు కాస్త భారీ మనిషి. ఆవిడను లేవతీసి కూర్చోపెట్టడమంటే మామూలు విషయం కాదు. ఇద్దరు మనుషులుండ వలసిందే. అప్పటికే అన్నపూర్ణమ్మ రోగం వచ్చిందానిలా అయిపోయింది. అత్తగారు కాస్త లేచి కూర్చోవడం వచ్చాక ఆమె ప్రాణం కాస్త కుదుట పడింది.

అంతలో రామనాధంగారు హడావిడిగా లోపలికి వచ్చారు. "ఏమయిందండీ అలా వున్నారేం" అన్నపూర్ణమ్మ కంగారుగా అడిగింది. "అల్లుడుకి హార్టు ఎటాక్ వచ్చిందట మనిషి వచ్చాడు. ఆయన మాట తడబడింది. కన్నీళ్ళు ఆపుకోలేక తువ్వాలతో తుడుచుకున్నాడు.

"అయ్యో! నాతల్లీ! నీకెంత కష్టమొచ్చిందే" అన్నపూర్ణమ్మగారు శోకాలు ప్రారంభించింది.

"శాంకరి చుట్టు చేరారు. కాసులు, సుబ్బులు, కనకం, దుర్గమ్మ గారితో మెల్లిగా రామనాధంగారు ఆ విషయం చెప్పారు.

"నేను బతుకుండగానే నీకెంత కష్టమొచ్చిందే నాతల్లీ" దుర్గమ్మ గారు కూడా శోకాలు ప్రారంభించింది. ఇంకా వచ్చిన మనిషి వీధిలోనే వున్నాడు. శాంకరి అతని దగ్గరకు వెళ్ళి మెల్లగా వివరాలన్నీ అడిగింది

ఈ మధ్య కొద్ది కాలంగా అతను అనారోగ్యంగా వుంటున్నాడని రాత్రి రెండు గంటల వేళ గుండెల్లో నెప్పివస్తే హాస్పటల్లో చేర్పించారని చెప్పాడు.

"డాక్టర్లేమన్నారు?"

"వాళ్ళేమన్నారో నాకుతెలియదమ్మా ప్రసాదబాబుగారు ప్రమాద స్థితిలో వున్నారని, వెంటనే నాన్నగారిని తీసుకురమ్మని ఆయన చిన్నాన్నగారు చెప్పారమ్మా!"

"అలాగా" శాంకరి లోపలికి వచ్చి తల్లిని ఓదార్చింది.

"ఈ రోజుల్లో అందరికీ వస్తూనే వుందమ్మా! భయపడకమ్మా" అంటు ధైర్యం చెప్పింది.

శాంకరి వచ్చిన మనిషికి భోజనం పెట్టింది. మనం వెంటనే బయలుదేరాలి. కాని శాంకరి సంగతితో? విశాఖపట్నం ఎవరు వెడతారు? అమ్మని ఎవరు చూస్తారు?" రామనాధంగారు కంగారుపడ్డారు.

"అదిమీరే ఆలోచించాలి?" అంది అన్నపూర్ణమ్మ. దుర్గమ్మగారిని నేను చూస్తాను. కాసులు, కనకం, శాంకరితో విశాఖపట్నం వెడతారు" పెద్ద అరిందాలా సలహా యిచ్చింది సుబ్బులు.

"అవునండీ. సుబ్బులు చెప్పింది నిజం. మేము ఆమెతో విశాఖ పట్నం వెళ్ళి కాలేజీలో జేర్పించి వస్తాము. సుబ్బులు నాయనమ్మగారిని చూస్తుంది." కాసులు, కనకం ఒకేసారి అన్నారు. వారి ఆప్యాయతకు వారి స్నేహానికి ఆశ్చర్యపోయారు రామనాధంగారు.

"అలాగేనమ్మా!" అన్నారాయన.

అన్నపూర్ణమ్మగారి ఏడుపు విన్న జనమంతా లోపలికి వచ్చారు. వాళ్ళను చూసి ఆవిడ మరింత ఏడ్చింది. అది విని మరింత మంది పోగయ్యారు.

ఆ వార్త విన్న సూర్యం, జగన్నాధంగారు సుందరమ్మగారు కూడా అక్కడకు వచ్చారు'

"పిన్నిని మేం చూస్తాం. సూర్యం శాంకరితో విశాఖపట్టణం వెడతాడు. మీరు వెంటనే బయలు దేరండి" ఆజ్ఞాపించినట్లే చెప్పాడు జగన్నాధంగారు.

"అన్నీ తెలుసున్న నువ్వే అలా అధైర్యపడితే ఏలా? పిల్లలు బెంబేలు పడతారు. లేచి అన్నీ సర్దుకో ఒదినా" సుందరమ్మ ధైర్యం చెప్పింది అన్నపూర్ణమ్మకు.

"కనకం, కాసులు శాంకరితో వెడతామంటున్నారు." నసిగింది అన్నపూర్ణమ్మ.

"చిన్న పిల్లలు వాళ్ళు వెళ్ళడం మంచిది కాదు. పైగా కొత్త ఊరు. సూర్యం వెళ్ళడమే మంచిది" జగన్నాధంగారు మళ్ళీ స్పష్టం చేసారు.

రెండు బట్టలు. సంచీలో సర్దుకొని రామనాధంగారు అన్నపూర్ణమ్మ, రవిని తీసుకుని బయలుదేరారు. అన్నపూర్ణమ్మగారి కళ్ళు అలా వర్షిస్తూనే వున్నాయి.

పెళ్ళై కాపురం చేసుకుంటున్న కూతురు కాపురం తారుమారవుతోందని భయపడ్డారు రామనాధంగారు. ఈ మధ్యనే కంపెనీలో మంచి ఉద్యోగం వచ్చి స్థిరపడ్డాడు అల్లుడు. మాటి మాటికి సుశీలను ఏధో ఒకటి పట్టుకురమ్మని పుట్టింటికి పంపించడం మానేసాడు. ఇంతలో ఈ ప్రమాదం వచ్చిపడింది. ఆ పిల్ల గతి ఏమౌతుందోనని తనలో తానే బాధపడ్డాడాయన.

ఊళ్ళో వాళ్ళంతా ధైర్యం చెప్పి పంపించారు ఆ దంపతుల్ని.

శాంకరి ప్రయాణానికి సిద్ధమయింది. సూర్యం యింటికి వెళ్ళి చేతి సంచీతో వచ్చాడు.

రాజమండ్రి వరకు వచ్చి దిగబెడతామని కాసులు, కనకం, సుబ్బులు బయలు దేరారు.

దుర్గమ్మగారు శాంకరిని కౌగిలించుకుని ఓ కంటితో కన్నీరు, ఓ కంటితో ఆనంద బాష్పాలు కార్చింది. "బాగా చదువుకుని పైకి రావాలి తల్లీ! పట్నంలో జాగ్రత్తా!" పదే పదే చెప్పింది మనవరాలికి.

ఆ పరిసరాలు వదలి వెళ్ళాలంటే శాంకరికి చెప్పలేని బెంగ బయలుదేరింది. సన్నగా కాళ్ళు వణకడం ప్రారంభించాయి. అంతవరకు శరీరంలోవున్న బలం తగ్గి నిస్సత్తువ ఆవరించింది. వీధుల్లోకి జట్కా బండి వచ్చి ఆగింది. నాలుగు రోజుల క్రితమే ఆ వూళ్ళోకి జట్కా బండి కొత్తగా వచ్చింది.

సుబ్బులు, కనకం, కాసులు శాంకరి సామానులన్నీ తెక్క పెట్టి బండిలో పెట్టారు. అయితే తామూ వాళ్ళు బయలుదేరడం వల్ల వాళ్ళకి ఆమె వెళ్ళిపోతుందన్న బాధ అంతగా అనిపించలేదు.

అందరు బండి ఎక్కారు. ముందు కూర్చున్నాడు సూర్యం. "చీకటి పడకుండా తిరిగి వచ్చేయండమ్మా" కనకం, కాసుల్ని, సుబ్బుల్ని వాళ్ళ వాళ్ళు హెచ్చరించారు.

"అలాగే! కంగారుపడకండి" తిరిగి సమాధానమిచ్చారు వాళ్ళు.

"సూర్యం జాగ్రత్తగా తీసుకెళ్ళు. శాంకరి జాగ్రత్త" అన్నాడు జగన్నాథంగారు.

బండి కదిలింది. ఒక పక్క శాంకరి డాక్టరు చదవడానికి వెళుతోంది. మరో పక్క అందరు కలిసి ప్రయాణం చేస్తున్నారు.

సంతోషం పట్టలేని కనకం ఈల వేసింది, అత్తవారింట్లో కాపురం చేస్తున్న కాసులు మరింత చిన్నపిల్లై మరో ఈల వేసింది. సుబ్బులు చప్పట్లు కొట్టింది. శాంకరి పకపకా నవ్వింది. బండి చుట్టూ

ఉన్న చిన్నపిల్లలు సమాధానంగా చప్పట్లు కొట్టారు. సూర్యం మాత్రం వాళ్ళను చూస్తూ నవ్వుకున్నాడు. బండి ముందుకు కదిలింది.

కాలవ రేవులో బస్సు ఎక్కి రావులపాలెం వెళ్ళారు. అక్కడ మరో బస్సులో ఎక్కి రాజమండ్రి సెంట్రల్ స్టేషన్‌కి చేరుకున్నారు. సూర్యం పెళ్ళి రెండు టిక్కెట్లు పట్టుకొచ్చాడు. రైలుకి ఇంకా అరగంట టైముంది. శాంకరి వాళ్ళు ప్లాట్‌ఫారం మీద కూర్చున్నారు. ఏదో ఒకటి నలుగురు మాట్లాడుకుంటూనే వున్నారు.

అంతలో గంట మోగింది. పొగలు కక్కుకుంటూ దూరం నుంచి రైలు వస్తోంది.

కనకం వాళ్ళ గుండెల్లో రైళ్ళు పరుగెత్తాయి. శాంకరి విడిపోతుందనే భయం వారిని విలవిల్లాడించింది.

"శాంకరీ! నువ్వు లేకుండా నేనా వూళ్ళో ఎలా వుండనే" వెక్కి వెక్కి ఏడ్చింది కనకం.

"మళ్ళీ ఎప్పుడు వస్తావే శాంకరీ?" సుబ్బులు ఏడ్చింది.

"అంత దూరం వెళ్ళి వంటరిగా ఎలా ఉంటావే?" కాసులు ఏడ్చింది. అందరు శాంకరిని పట్టుకున్నారు.

"రైలు వచ్చేస్తోంది. మీరలా శాంకరిని కంగారు పెడితే ఎలా? ఆమె చదువుకోటం మీ కిష్టం లేదా? కాసులు అత్తారింటికెడితే మళ్ళీ రావటం లేదా? చిన్న పిల్లల్లా అలా గొడవ చేస్తే ఎలా?" సూర్యం కోపం చేసాడు.

అందరు ఏడుపులు ఆపి సూర్యం వేపు చూసారు. అంతలో రైలు వచ్చి వాళ్ళ ముందే ఆగింది. ఖాళీగా ఉన్న కంపార్టుమెంటు చూసి శాంకరి ఎక్కింది. కాసులు వాళ్ళు సామానులు లోపల పెట్టారు. సామానులు లెక్కపెట్టి చెప్పింది కనకం.

"తరచు ఉత్తరాలు రాయి"

"ఆరోగ్యం జాగ్రత".

ఏదో ఒకటి అలా చెబుతూనే వున్నారు. "రైలు కదిలే వేళవు తోంది. కిందకు దిగి నుంచోండి" హెచ్చరించాడు సూర్యం. ముసలి కళ్ళు నీళ్ళతో నిండాయి.

"శాంకరీ వస్త్రామె జాగ్రత్త" కళ్ళొత్తుకుంటూ కిందికి దిగారు. ఆ సమయంలో ప్రపంచమే శూన్యంగా అనిపించింది.

"శాంకరి చదువు మానేసి అక్కడే వుంటే ఎంత బావుండునో అనుకున్నారు."

కారే కన్నీళ్ళతోనే రైలు కదులుతుంటే చేతులు వూపారు. శాంకరి కన్నీళ్ళు అవుతుంటూ తిరిగి చెయ్యి వూపింది. ఒక పక్క ఆమెకు చాలా సంతోషంగా ఉంది.

కాసులు, కనకం, సుబ్బులు వాడిన ముఖాలతో రెంసు బస్సులు ఎక్కి దిగి తమ వూరు చేరుకున్నారు.

# 23

శాంకరి, సూర్యం రైల్లో పక్క పక్కనే కూర్చున్నారు. అంత వరకు ఇద్దరు ఎక్కువగా మాట్లాడుకోలేదు.

"సూర్యం! ఇంకా నామీద కోపం పోలేదా?"

"కోపం దేనికీ?"

"నువ్వు మామూలుగా మాట్లాడటం లేదు?"

"ఇంత కంటే ఎక్కువ ఏం మాట్లాడను? నువ్వేచెప్పు" లేని నవ్వు తెచ్చుకున్నాడు సూర్యం.

అతను మాట్లాడే ధోరణికి శాంకరి ఆశ్చర్యపోయింది.

"ఎక్కడికి వెడుతున్నారు?" పక్కన కూర్చున్నావిడ అడిగింది

"విశాఖపట్టణం" శాంకరి సమాధానమిచ్చింది.

"అతనెవ్వరు? మీ అన్నగారా?"

సమాధానం కూడా ఆవిడ ప్రశ్నలోనే ఉండడంవల్ల శాంకరి తలూపింది.

సూర్యం తల తిప్పి శాంకరి వైపు చూసాడు. శాంకరి కూడా చటుక్కున అతని వైపు చూసింది.

“చిన్నతనం నుంచి కంటికి రెప్పలా చూస్తున్నాడు. తనకేది కావాలో అతనికి తెలుసు. నిజంగా సూర్యం అన్నగారే?” ఆమె మనస్సు పలికింది.

“శాంకరికి తనంటే ఎంతో అభిమానం. ఆప్యాయంగా పలకరిస్తుంది. ఎప్పుడూ తప్పు పట్టలేదు. కలిసి చదువుకున్నాం. కలిసి మెలిసి తిరిగాం. శాంకరి నిజంగా తనకు చెల్లెలే?” అతని హృదయం పదే పదే చెప్పింది.

ఇద్దరి గుండెల్లోని భారం దిగిపోయింది. భారంగా ఉన్న ఆ హృదయాల్లో ఆత్మీయత పల్లవించింది.

”అనయ్యా” మనసులోనే అనుకుంది.

“చెల్లెమ్మా” అతని మనసు పలికింది.

తుని స్టేషన్ రాగానే కిందికి దిగాడు సూర్యం. వడ ప్లేటు అందించాడు శాంకరికి. తాను కింద నుంచునే తిన్నాడు. తాను టీ తాగి ఆమెకు కూల్ డ్రింక్ అందించాడు. ఆమె టీ తాగదని సూర్యానికి బాగా తెలుసు.

ఎందుకంటూనే శాంకరి కూల్ డ్రింక్ తాగి కాలీసీసా సూర్యానికి అందించింది.

ఆమె పర్సు తీసి పైసలు అందించబోయింది.

“నే యిచ్చేసా” సూర్యం లోపలికి వచ్చేసాడు.

## 24

బండి విశాఖపట్టణంలో దిగేటప్పటికి సాయంకాలమయింది.

సూర్యం పినతల్లి ఆ ఊళ్ళో వుంటుంది. శాంకరి వాళ్ళు కూడా వాళ్ళకి బాగా తెలుసు. దూరపు బంధుత్వం కూడా వుంది. అందుకే శాంకరికి వాళ్ళింటికే తీసుకు బయలుదేరాడు. సూర్యం ఇది వరలో రెండుసార్లు వాళ్ళింటికి పనిమీద వెళ్ళాడు. అందుకే వెతుక్కోకుండా యిల్లు గుర్తు పట్టాడు.

ఇద్దరిని చూసి వాళ్ళు కూడా సంతోషించారు. ఆ రాత్రి కొత్త ప్రదేశమయినా సూర్యం హాయిగా నిద్రపోయాడు. అతని మనస్సును కలవరపరిచే విషయాలేమి అతనికి లేవు. శాంకరికి ఆ రాత్రి నిద్ర పట్ట లేదు.

పరాయి వాళ్ళింట్లో నిద్రపోవటం ఆమెకు అలవాటు లేదు. పైగా కొత్త వూరు. అక్కడ నాన ఎలా వున్నాడోనని ఆమె మనస్సు కలవర పడింది. అక్క పరిస్థితి ఏమవుతుందోనని బాధ పడింది.

మరో పక్క కొత్త కాలేజి. ఎలా వుంటుందో ఏమో? కలత నిద్రలోనే తెల్లవారింది.

మరునాడు పొద్దుటే మెడికల్ కాలేజికి బయలుదేరారు. సూర్యం వెంట వాళ్ళ పిన్నికొడుకు కూడా వచ్చాడు. కాలేజీ ముందు పెద్ద గందర గోళమవుతోంది.

సూర్యం! ఏమిటిదంతా?" శాంకరి ఆశ్చర్యంగా అడిగింది.

"అదా రాగింగ్" సమాధానమిచ్చాడు కూడా వచ్చినవాళ్ళాయి.

శాంకరికి ముందుకు వెళ్ళే ధైర్యం చాలలేదు. వెనక్కి అడుగులు వేసింది.

"ఇంత అసహ్యంగా ఇదేం రాగింగ్"

"నీకు తెలీదు సూర్యం. మీరు పేపర్లలో చదివే వుంటారు. మేము ప్రత్యక్షంగా చూస్తున్నాము. రాగింగ్ చెయ్యకూడదని అది నేరమని అందరికి తెలుసు. అయినా కొత్త విద్యార్థుల పాలిట బ్రహ్మ రాక్షసిలా అది సాగుతూనే వుంది. కళాశాలల్లో యూనివర్సిటీలలో, మెడికల్ కాలేజీలలో, ఇంజనీరింగ్ కాలేజీల్లో దారుణంగా వుంది?"

"చూస్తూ ఎలా వూరుకుంటున్నారండీ!" శాంకరి అడిగింది.

"ఎవరు ఏమి అంటున్నా వాళ్ళు విచ్చలవిడిగా రాగింగ్ చేస్తూనే వున్నారు. మొన్నొకమ్మాయి ఆ బాధ పడలేక ఆత్మహత్య చేసుకుంది. అంతెందుకు మొన్న ఇంటర్ చదివే అబ్బాయి, బి. ఎ. చదివే మరో అబ్బాయి ఆత్మహత్యలు చేసుకున్నారు. కొందరు చదువులు మానేసి పారిపోతున్నారు.

"ఇప్పుడు శాంకరి సంగతేమిటి?" భయంగా అడిగాడు సూర్యం.

"శాంకరికి ఏం భయంలేదు కాని మనం మరో గంట పోయాక వచ్చి ఫీజు కట్టేద్దాం. తర్వాత హాస్టల్లో రూం చూసుకుందాం. రెండు రోజులు పోయాక కాలేజీకి వస్తుంది."

అతని సలహా సూర్యం, శాంకరి విన్నారు. ముగ్గురు కలసి ఇంటికి వెళ్ళిపోయారు.

"బుద్ధిగా చదువుకోవలసిన విద్యార్థులలో ఆ రాక్షసత్వమేమిటో శాంకరికి అంతు పట్టలేదు. ఏదైనా అధికారులతో కలసి ఆ భయంకర. విన్యాసం పోగొట్టాలనుకుంది.

మరునాడు శాంకరి యింట్లోనే వుండిపోయింది. సూర్యం, అతను కలసి కాలేజీకి వెళ్ళారు. అప్పటికి కాస్త ప్రశాంతంగా వుంది అక్కడి వాతావరణం. లోపలికి వెళ్ళి ఫీజులు కట్టి హాస్టల్ రూము కూడా ఎలాటు చేయించుకున్నారు.

"కొన్నాళ్ళ వరకు క్లాసులు కావు అప్పుడే శాంకరిని ఎందుకు తీసుకువచ్చావు?"

అతని మాటలకు సూర్యం ఆశ్చర్యపోయి, "మాకు తెలియదు కదా" అన్నాడు.

"పోనీలే అంతవరకు మా యింట్లో వుంటుంది." అన్నాడు రాజేష్.

"ఇద్దరు వెంటనే యింటికి వెళ్ళారు. విషయం విన్న శాంకరి అనవసరంగా వచ్చాను కదా!" అనుకుంది మనస్సులో ఏదైనా తాను ఆ యింట్లో అనవసరంగా వుండకూడదని నిశ్చయించుకుంది."

"హాస్టల్లో చేరిపోతాను సూర్యం" అంది.

ఎవరు చెప్పినా వినలేదు.

"మీకు తెలియదు శాంకరీ!, మగ పిల్లలే కాదు. ఆడపిల్లలు కూడా రాగింగ్ చెయ్యడంలో ఫస్టు తెలిసిందా, హాస్టల్లో కూడా మిమ్మల్ని వదలరు" అన్నాడు రాజేష్.

"ఫరవాలేదు ఎప్పుడైన తప్పదుకదండీ, ఈ రోజే వెడతానండీ!"

శాంకరి పట్టుదలకు ఏవరు ఏమి చెప్పలేకపోయారు. ముగ్గురూ హాస్టల్‌కి బయలుదేరారు.

ఆ గదిలో మరో అమ్మాయి వుంది. ఆ అమ్మాయి కూడా కొత్తగా జేరిన అమ్మాయియే. శాంకరి తోడు వచ్చినందుకు ఆమె చాలా సంతోషించింది. ఎవరు వచ్చి తలుపు కొట్టినా పొద్దుట నుంచీ తలుపు తియ్యలేదుట.

శాంకరి ఆమె సంగతి వినగానే కాస్త ధైర్యమొచ్చింది. గదిలో సామాను పెట్టించాడు, ఎన్నో జాగ్రత్తలు చెప్పాడు సూర్యం.

ఒక పక్క పట్నం కొత్త, పరిసరాలు కొత్త, మరో పక్క మనుషులు కొత్త, చివరకు జీవన విధానమే కొత్త, అన్ని సౌకర్యాలు వున్నా వంటరిగా బాధపడింది.

ఆమె కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరిగాయి. సూర్యం మనస్సు నీరయిపోయింది. శాంకరిని ఆ స్థితిలో అతనెప్పుడూ చూడలేదు.

"ఎవరో ఒకరు వస్తూనే వుంటాము. కలవలివ్వగానే వచ్చెయ్యి" రాజేష్ మధ్య మధ్యలో వచ్చి చూసి వెడతూంటాడు. సూర్యం మాటలకు తలూపింది శాంకరి.

"ఏ అవసరమొచ్చినా మొహమాటపడకు. ఉత్తరం రాయి. రెక్కలు కట్టుకువచ్చి వాల్తాం"

అందుక్కూడా తలూపిన శాంకరి వచ్చే కన్నీళ్ళు ఆపుకుంటూ "అందరిని అడిగానని చెప్పు" అంది.

సూర్యం కంటికి చిన్న పిల్లలా అనిపించింది శాంకరి. దగ్గరకు తీసుకుని ఓదార్చాలన్న ఆలోచనను బలవంతంగా ఆపుకున్నాడు.

"ఇంక వెళ్ళనా" "టా! టా!" సూర్యం వెనక్కి చూస్తూనే గేటు వరకు వచ్చాడు. అతని వెనకే రాజేష్ నడిచాడు. వారిద్దరి ఆత్మీయత ను ఆశ్చర్యంగా చూసాడు రాజేష్. అంత అందమైన, తెలివైన అమ్మాయితో సూర్యానికి అంత చనువుండటం అతని అదృష్టమే అనుకున్నాడు.

# 25

"త్వరగా లోపలకి రండు" రూములో వున్న అమ్మాయి శాంకరిని తొందర పెట్టింది. శాంకరి చెయ్యి పట్టుకుని లోపలికి లాగి తలుపులు మూసింది ఆ అమ్మాయి. "నా పేరు అపర్ణ మీ పేరు" అడిగింది ఆ అమ్మాయి.

"శాంకరి! మీరు ఎందుకు అంత కంగారు పడుతున్నారు?"

"ఏం లేదండీ! రాత్రి భోజనాల దగ్గర మన పనిపడతారు. వాళ్ళు ఇప్పుడు మిమ్మల్ని చూసారనుకోండి ఇప్పుడే వచ్చి అల్లరి చేస్తారు. అందుకే ఈ పూట వారి కంట పడకూడదు. రాత్రి భోజనం ఇక్కడే పెట్టాం" అంది అపర్ణ.

"అపేంతా వింటుంటే శాంకరికి ఒకపక్క భయమనిపించింది మరో పక్క అసహ్యమనిపించింది.

రాత్రి యిద్దరు ఒకరి సంగతులు ఒకరు తెలుసుకున్నారు. ఇద్దరి అభిప్రాయాలు కలిసాయి.

"పొద్దుటనుంచి నాకు చాలా భయమనిపించింది. తలుపులు పెట్టుకునే కూర్చున్నాను. ఇప్పుడు మీరు వచ్చాక కొండంత అండ దొరికినట్లుంది.

"అంతకేమి కాని ధైర్యం చాలా అవసరమనుకోండి. లోకువ కడితే చాలు నెత్తినెక్కుతారండి. మీరు నాకు కూడా కొండంత అండే. ఒకరి సాహాయ్యం ఒకరికి వుండాలి" శాంకరి మాటలు ఆమెకు నచ్చాయి

ఇద్దరు పేటలు రఘుపతిని తెచ్చుకున్న ఫలహారాలు తిని సూర్యం కొనిచ్చిన అరటి పళ్ళు తిన్నారు. లైట్లు ఆర్పి పడుకుందా మనుకుంటుండగా ఎవరో తలుపు తట్టారు.

తలుపు అద్దంలోంచి చూసిన శాంకరి ఎవరో ఆడవారని చెప్పింది మెల్లిగా తియ్యవద్దని ఆజ్ఞాపించింది అపర్ణ. "లైట్లు వెలుగుతోంది. కాని ఎవరూ లేరు. వెళ్ళిపోయారేమో?" వెళ్ళిపోయారు ఆ ఇద్దరమ్మాయిలు. ఆ రాత్రి యిద్దరు పడుకున్నా నిద్రలేదు వారికి. ఎప్పటికో నిద్రలోకి జారుకున్నారు.

నిద్ర సర్వాపణాలకు అతీతమయినది. భయం తెలీదు. సంతోషం తెలీదు. సుఖదుఃఖాలు తెలీవు. నిద్రవల్ల సమస్యలు తీరవు. కాని నిద్ర వాటినన్నిటిని తనకడుపులో దాచుకుని తాను ప్రశాంతంగా పడుకుం టుంది. మెలకువవస్తే కాని మనిషికి ఏదీ తెలీదు. చివరకు బతికున్నదీ లేనిదీ కూడా తెలీదు.

దుఃఖానికి ఆనకట్ట నిద్ర. సంతోషానికి జోలపాట నిద్ర.

# 26

శివకుమార్ శుభలేఖ కోసం ఎదురుచూస్తూనే వున్నాడు. కాని సూర్యం, శాంకరి వివాహ శుభలేఖ మాత్రం అందలేదు. శివా మనస్సు మరింత చికాకుగా తయారయింది. అలా వుండగా ఎం.టెక్‌లో చేరి కాలేజీకి వెళ్ళి వస్తున్నాడు. కాస్త అతని మనస్సు కుదుట పడుతోంది.

కాని శాంకరి జ్ఞాపకం వచ్చినప్పుడల్లా అతని మనస్సు కలుక్కు మంటోంది.

భర్తపోయిన తరువాత రాజేశ్వరమ్మగారిని చలపతి పుట్టింటికి తీసుకెళ్ళలేదు. గిరిజను కోడలిగా చేసుకోరని తెలిసినప్పటి నుంచి ఆ గుమ్మం ఎక్కడమే మానేసాడు.

రాజేశ్వరమ్మగారికి అత్తవారి తరపున మరుదులు, బావగార్లు, ఆడబడుచులు ఎవరూ లేరు. భర్త ఒక్కడే. ఇటు పుట్టింటి తరపున తమ్ముడు చలపతి ఒక్కడే.

ఆ చలపతిని మందలించేవారు ఎవరూ లేరు. ఒక అక్కకాని, ఒక చెల్లెగాని ఉంటె తను వంటరితనంతో బాధపడేది కాదు. తనకి కూడా శివాతో పాటు మరో ఆడపిల్ల వుండే యింట్లో ఎంతో తోడుగా వుండేది. ఆడపిల్ల యింటికి ఎంత అందం. రంగురంగుల బట్టలు కుట్టించేది. రకరకాల నగలు చేయించేది. అమ్మా! అమ్మా! అంటు తన కొంగు పట్టుకు తిరిగేది. తనకు ఒంటరి తనమే వుండేది కాదు" అలా రాజేశ్వరమ్మగారి మనస్సు పరిపరి విధాలపోతోంది. ఏదైనా ఆడపిల్ల లేని లోటు లోటే. మగపిల్లవాడు సంపాదించి తల్లి తండ్రులను పోషిస్తాడు. ఆడపిల్ల మమకారాన్ని, ఆత్మీయతను పంచుతుంది. అందుకే ఆడపిల్ల యింటికి లక్ష్మి అన్నారు. వంటరి తనంతో బాధపడుతున్న రాజేశ్వరమ్మగారి మనస్సు ఆడపిల్లవైపు మళ్ళింది. భర్త వుండగా ఎప్పుడూ ఆవిడ అలా ఆలోచించలేదు. అంతలో ఆమె మనస్సు కొడుకు పెళ్ళివైపు మళ్ళింది. కోడలు వస్తే ఆడపిల్ల లేని లోటు తీరవచ్చునే ఆలోచన వచ్చింది. ఆ ఆలోచన ఆవిడ మనస్సుకు వేసవిలో చలివేంద్రంలా అనిపించింది కొడుకు పెళ్ళి సంగతే ఆవిడ తలచుకుంటోంది. ఆవిడ మనస్సుకు ఊరట కలుగుతోంది.

ఒకనాడు కాలేజీకి వెడుతున్న శివాకు మేనమామ చలపతి కలిసాడు.

ఏం! మామయ్యా! బాగున్నారా!" తప్పించుకు వెళ్ళిపోవాలను కున్న చలపతిని పలకరించాడు శివా.

"ఆ! అంతా బాగున్నాము. అమ్మ ఎలా వుంది. ఇంటికి వచ్చి వెడదామంటే ఏదో అర్జెంటు పని తగులుతోంది. అన్నట్లు గిరిజ పెళ్ళి. నువ్వు అమ్మా తప్పకుండా రావాలి. శుభలేఖలు రాగానే వచ్చియిస్తాలే"

చెప్పడం పూర్తయినట్లు చలపతి ముందుకు వెళ్ళిపోయాడు.

"అమ్మయ్య గొడవ తగ్గింది" అనుకున్నాడు శివకుమార్.

ఇంటికి వచ్చిన తరువాత ఆ విషయం తల్లికి చెప్పాడు.

"పెళ్ళి ఎప్పుడు? అబ్బాయి ఏం చేస్తున్నాడు?" ఆవిడ ఆతురతగా అడిగింది.

"మన గుమ్మం ఎక్కని మామయ్య కూతురు వివరాలన్నీ మన కెందుకమ్మా? అయినా అవన్నీ చెప్పడానికి టైం లేదుట."

మేనకోడలు పెళ్ళి అనగానే ఆవిడ సంతోషంతో పాత గొడవలన్నీ మర్చిపోయింది. కొడుకు సమాధానం విన్నాక ఆవిడ ఆలోచించింది.

"నువ్వన్నది నిజమే శివా! కాని ఎంతైన ఆ పిల్ల మేనకోడలు కదరా! వాళ్ళు దూరమైన పేగులు దూరమవ్వవు కదరా!"

"నిజమేనమ్మా! వాళ్ళు కూడా అలా అనుకోవాలి కదా!"

"చిన్నప్పటినుంచి చలపతి చాలా స్వార్థపరుడురా! వాడు అలా అనుకోడు. మా నాన్నగారు నాకు ఏదైనా కొనిస్తే తనకే కావాలని ఏడ్చేవాడు. అందుకే ఆయన నాకోసం ఏదికొన్నా వాడికి తెలీకుండా యిచ్చేవారు."

అంతలో మధు రావడంతో ఆ సంభాషణ ఆగిపోయింది. రాజేశ్వరమ్మగారు లోపలికి వెళ్ళిపోయింది.

"శివా! ఈవిషయం విన్నావా?"

"ఏ విషయం మధూ!"

"మన క్లాస్‌మేట్ సత్యం సంగతి!"

"కంగారు పడకు! సత్యం ఒకమ్మాయిని ప్రేమించాడు. ఆ పిల్ల పేరు గిరిజ. ఆమె మీ మామయ్య కూతురుట."

"వీళ్ళిద్దరూ ఎలా కలుసుకున్నారురా! ఆశ్చర్యంగా వుందే!"

"ప్రేమంటేనే ఆశ్చర్యం. సత్యం నీకోసం వచ్చినప్పుడు మీ యింట్లోనే గిరిజను చూసాడుట. తరువాత యిద్దరు ప్రేమించుకున్నారు. ఇద్దరు సినిమాలు, షికార్లు ఇద్దరి ప్రేమ పెళ్ళి వరకు వచ్చింది."

"పెళ్ళి ఎప్పుడుట!" శివా ఆదుర్దాగా అడిగాడు.

"అక్కడే వచ్చింది గొడవంతా! సత్యం యింట్లో వాళ్ళు ఎంత చెప్పినా వినడంలేదు. అతని పూర్తి పేరు సత్యనారాయన్. వాళ్ళు తమిళియన్స్. తెలుగు పిల్లను కోడలిగా అంగీకరించడంలేదు."

"ముందెందుకు ఆలోచించలేదు. ఆ సత్యంగాడు. ఆజ్ఞ ఇప్పుడు కావల్సివచ్చిందా!"

అదే సమస్య శివా!తల్లితండ్రులు అడ్డు చెబుతారనే అనుమానము అతనికి రాలేదు.

ఇప్పుడు మంచం నుంచి లేవడంలేదు. మనమే ఏదో చెయ్యాలిరా! "ఏం చెయ్యగలం మధూ!" అలా అనకు శివా! సత్యం యింటికి వెళ్ళి అతని తల్లితండ్రులతో మాట్లాడుదాం! మన ప్రయత్నం మనం చెయ్యాలిగదా! నువ్వు చెబితే వాళ్ళు వినవచ్చు.

మీ నాన్నగారే వాళ్ళకి లాయరు కదా! "సరే అలాగే మాట్లాడుదాం!" మధు వెళ్ళిపోయాడు. రాజేశ్వరమ్మగారు అవన్నీ వింటూనే వుంది. అతను వెళ్ళగానే యివతలకు వచ్చింది. "చూశావా అమ్మా! గిరిజ ఎంత పని చేసిందో!"

"ఆ అన్నీ విన్నా. నిన్నేకాని పెళ్ళిచేసుకోనని నీ వెంటపడిన గిరిజ మరి అతన్ని ఎప్పుడు ప్రేమించిందిరా?" "పైగా అది యీ వూళ్ళో ఎప్పుడు వుంది?"

"నాకూ అదే తెలీడంలేదమ్మా! అంతా విచిత్రంగా వుంది."

అంతలో మధు మళ్ళీ కంగారుగా పరుగెత్తుకొచ్చాడు.

"శివా! కొంప మునుగుతోందిరా!"

'ఏమైంది మధూ'?

"సత్యాన్ని ఏదో వూరు పంపిస్తున్నారట. సత్యం ఒకటే ఏడుస్తున్నాడు. మనం వెంటనే వెళ్ళాలి."

బట్టలు మార్చుకుని మధు వెంట బయలుదేరాడు శివా. వాళ్ళు వెళ్ళేటప్పటికి సత్యం మంచం మీద పడుకుని వున్నాడు.

శివా ఎంత చెప్పినా వాళ్ళ వాళ్ళు వినలేదు. వాళ్ళది చాలా సాంప్రదాయమైన కుటుంబం.

"మా తనువులు యిలా వెళ్ళవలసిందే. ఈ ప్రేమలు పెళ్ళిళ్ళు మాకు తెలియవు. మేము బతికుండగా ఈ పెళ్ళి జరగడానికి వీలు లేదు." వాళ్ళు అలా చెప్పేటప్పటికీ మధు, శివా చేసేది లేక యివతలకు వచ్చి సత్యాన్ని కలుసుకున్నారు. సత్యం మేనమామ వాళ్ళు ఏం మాట్లాడుకుంటారో వినాలని వాళ్ళ పక్కనే నిలబడ్డాడు. అతనికి తెలుగురాదు. అందుకే సత్యానికి అర్థమయ్యేటట్టుగా తెలుగులో ధైర్యం చెప్పారు. పెళ్ళి జరిపించే పూచీ మాదని హామీ ఇచ్చారు. సత్యం ముఖం కాస్త వికసించింది. మధూ, శివా తిరిగి వచ్చేసారు.

శివా యింటికి వచ్చేటప్పటికి చలపతీ, భార్యా, గిరిజా యింట్లో వున్నారు. గిరిజ శోకదేవతలా వుంది.

"బాబూ! శివా నువ్వే నా కూతుర్ని రక్షించాలిరా! చచ్చి నీ కడుపున పుడతారా!"

"చచ్చి నా కడుపున పుట్టనక్కరలేదు. కాని మామయ్యా ఈ పెళ్ళి జరగడం చాలా కష్టం."

"అదేమిటి బాబూ! నువ్వే అలా అంటే ఎలా?" మేనత్త భోరున ఏడ్చింది.

"ఇప్పుడే సత్యం యింటికెళ్ళి వాళ్ళ వాళ్ళతో మాట్లాడాము. వాళ్ళు ఈ పెళ్ళికి ఎంత చెప్పినా అంగీకరించడం లేదు."

"అలా అనకు శివా? నువ్వే ఏదైనా ఉపాయం ఆలోచించాలి" మేనత్త బతిమాలింది."

"ఆలోచిద్దాం" శివా మేడ మీదికి వెళ్ళిపోయాడు. భోజనాలయిన తరువాత అందరు అలసటగా నడుం వాల్చారు.

గిరిజ మెల్లిగా శివా గదిలో అడుగు పెట్టింది.

"ఏం గిరిజా నిలబడ్డావేం కూర్చో!"

శివాని ఎలా పలకరించాలని ఆలోచిస్తున్న గిరిజ ఊపిరి పీల్చుకుంది.

"పడుకున్నావనుకున్నా!"తలఎత్తి మాట్లాడే ధైర్యం లేక తల వాల్చుకుంది, కారే కన్నీళ్ళు పమిట కొంగుతో తుడుచుకుంటున్న గిరిజను చూసేటప్పటికి శివా మనస్సు బాధపడింది. ఎప్పుడూ నవ్వుతూ హడావిడి చేసే గిరిజ మట్టిబొమ్మలా జీవం లేనట్టు కనబడింది.

"పడుకున్నా కాని నిద్ర పోలేదు?"

"బావా! నువ్వు సత్యాన్ని కలిశావా?"

"అవును కలిసాను. అతను కూడా నీలాగే వున్నాడు. కాని అతని తల్లిదండ్రులు మాత్రం అతని మాట వినేటట్టు లేరు. అసలు సత్యంతో నీకెలా పరిచయమయింది గిరిజా?" అవన్నీ యిప్పుడెందుకు కానీ! అసలు అడుగుతున్నా! నీకు బాధ కలిగిస్తే చెప్పకు?"

"బాధ కలిగించడానికేముంది. మొదటిసారి సత్యాన్ని మీ యింట్లోనే చూసాను. అతను నీకోసం వచ్చాడు. నేను తలుపుతీసాను. నువ్వు స్నానం చేస్తున్నావు. అతను సోఫాలో కూర్చున్నాడు. అతన్ని చూడగానే నా మనస్సు ఎందుకో తడబడింది. నీపైవున్న కోపంతో అతనితో చనువు పెంచుకున్నాను. అతనికి కూడా నేనంటే విపరీతమైన అభిమానం మొదటి చూపులోనే ఏర్పడింది. మా అమ్మా, నాన్నా

కంటే ముందు బయలుదేరిన నేను మా వూరు వెళ్ళలేదు. నాక్లాస్‌మేట్ రూములో ఉండిపోయాను. రోజూ సత్యం నా దగ్గరకు వచ్చేవాడు. ఇద్దరం కలిసి బీచ్ రోడ్లన్ని తిరిగే వాళ్ళం. సినిమాలకు, హొటళ్ళకు వెళ్ళే వాళ్ళం. మా ప్రేమ క్రమంగా పెళ్ళి వరకు వచ్చింది. కాని ఇప్పుడిది జరుగుతుందనుకోవడం లేదు. నువ్వేమమ్మల్ని కలపాలి శివా!" గిరిజ దుఃఖం ఆపుకోలేక విలవిల్లాడింది.

"గిరిజా! అనవసరంగా భయపడుతున్నావు. నేనిప్పుడే వెళ్ళి సత్యంతో మాట్లాడి వస్తాః"

అంతలో మధూ "శివా! శివా!" అంటూ కంగారుగా వచ్చాడు.

"ఏం జరిగింది మధూ"

ఇంకేం జరగాలి! సత్యాన్ని రైల్వే స్టేషన్‌కి తీసుకెడుతున్నారు మనం అదే రైల్లో టిక్కట్టు కొనుక్కుని ఎక్కాలి. "ఆతర్వాత సంగతి చెబుతాను. ముందు బయలుదేరు."

"గిరిజా! భయపడకు. ఎటువంటి అవాంతరం తలపెట్టకు జాగ్రత్త. నేనొచ్చేవరకు అమ్మని, నాన్నని జాగ్రత్తగా చూడు."

శివా! మధు వెంట బయలు దేరాడు.

వారిద్దరి వైపు వింతగా చూసింది గిరిజ.

"ఎక్కడికిరా" అంటున్న రాజేశ్వరమ్మగారికి "గిరిజ చెబుతుందమ్మా" శివా మాటలు పూర్తికాలేదు. అప్పుడే గుమ్మం దిగి వెళ్ళి పోయారు.

గిరిజ వారికి మధు చెప్పిన విషయాలు చెప్పింది. వారి మనసులు కాస్త కుదుట పడ్డాయి.

# 26

రామనాథంగారు సుశీల అత్తవారింటికి వెళ్ళేటప్పటికే జరగ

కూడనిది జరిగిపోయింది. అల్లుడు చనిపోయాడు. శవాన్ని ఆస్పత్రి తీసుకు రావడం కూడా అయింది. బంధువుల ఏడ్పులతో గందర గోళంగా ఉంది.

నా తల్లో! ఎంత పని జరిదిందే! అంటూ దూరంనుంచే శోకాలు ప్రారంభించింది అన్నపూర్ణమ్మ.

రామనాథంగారు ఎంతఆపుకుందామని ప్రయత్నించినా దుఃఖం ఆగడం లేదు.

తల్లి ఏడుపుకు భయపడిన రవి తండ్రిని పట్టుకున్నాడు. ఏడ్చి ఏడ్చి అలసిపోయిన సుశీల నిర్జీవంగా తల్లి ఒడిలో వాలిపోయింది.

ఒక పక్క శవ దహనానికి సంబంధించిన ఏర్పాట్లన్నీ జరుగు తున్నాయి. ఆ మంత్రాలు మరింత దుఃఖాన్ని కలిగిస్తున్నాయి. ఆ గందరగోళంలో తల్లి తప్ప సుశీల సంగతి గమనించేవారే లేరు. ముగ్గురు పిల్లలు తల్లి మీద పడి బోరు మంటు ఏడుస్తున్నారు. ఆ పిల్లలు ఆకలికే ఏడుస్తున్నారో భయపడే ఏడుస్తున్నారో ఎవరూ వాళ్ళని వోదార్చే వారేలేరు. తన కూతురు ఏమవుతుందోనన్న భయంతో కొట్టు మిట్టాడుతున్న అన్నపూర్ణమ్మకు మనవల ఏడుపే వినపడటం లేదు.

రామానాథంగారు బార్య ఒడిలో పడున్న కూతుర్ని చూసారు. ఆయన గుండె ఒక్కసారి ఆగినట్లయింది. నీళ్ళు తెచ్చి ఆమె ముఖం మీద చిలకరించాడు.

సుశీల మెల్లిగా కళ్ళు తెరిచింది. నీరసంతో ఆ చూపు నిలబడడం లేదు. నోరెండిపోతోంది. శవాన్ని కదిలిస్తే తప్ప కాఫీ కాని మంచి నీళ్ళు కాని యివ్వకూడదన్నారు కొందరు. అంతలో ఒక ముసలి ముత్తైదువ ఎవరు చూడకుండా గ్లూకోస్ కలిపిన నీళ్ళు పట్టుకొచ్చి సుశీల చేత తాగించింది. ఆమె కాస్త కుదుటపడి ప్రస్తుతంలోకి వచ్చి కళ్ళ ముందు జరుగుతున్న దారుణం చూడలేక తిరిగి శోకాలు ప్రారంభించింది. కానీ ఓపిక లేని ఆ కంఠం కూలబడి పోయింది కాని పైకి రానేలేదు.

కూతుర్ని చూసి గుడ్డిలో మెల్లలా కాస్త కుదుట పడిన రామ నాథంగారు చంటి పిల్లను ఎత్తుకుని మిగిలిన యిద్దరిని పక్కకు తీసు కెళ్ళాడు. తాత చేరదియ్యగానే వాళ్ళ ఏడపులు తగ్గాయి.

భయమే తప్ప అక్కడ జరిగి ఘోరం తెలియని రవి ముగ్గురు పిల్లలతో ఆడుకోవటం మొదలు పెట్టాడు. పెద్దల దృష్టిలో ఆ పిల్లలు అభం శుభం తెలియానివారు. వాళ్ళ ప్రపంచంలో వాళ్ళు మహాజ్ఞానులు.

జీవంలేని ప్రసాదు శరీరాన్ని యింట్లోంచి కదల్చడానికి అందరూ తొందరపడుతూనే వున్నారు. కన్నవారు కట్టుకున్న భార్య మాత్రం ఆ దృశ్యం చూడలేక తల్లడిల్లి పోతున్నారు. ఆ సమయం రానే వచ్చింది. జీవం వున్నా శవంలా వున్న తల్లిని, భార్యను లేపి చేయవలసిన పనులు చేయించారు. ఒళ్ళు తెలియని స్థితిలో సుశీల ఆఖరు సారిగా ప్రదక్షిణాలు చేసింది. ఇంక ఆ శరీరం కూడా కనపడదు. అనుకునేటప్పటికి తల్లి చేతుల్లోంచి నేల మీద కుప్పలా కూలిపోయింది. అయినా కాలం ఆగ లేదు. జరగవలసింది ఆగకుండా జరుగుతూనేవుంది.

కళ్ళ ముందే కొడుకు శరీరాన్ని తీసుకువెడుతుంటే ఆ తల్లి దుఃఖాన్ని ఎవరూ పంచుకోలేరు. పదివయస్సు రాకుండానే కొడుకు కూలి పోయిన సంసారంలో తానూ కూలిపోయి ఏడ్చింది. సుశీల వరదలో కొట్టుకుపోతున్న భవనంలా కనబడింది కన్న తల్లిదండ్రులకు.

ప్రసాదు శరీరం యింట్లోంచి కదలగానే పొంగే వరద ఎండి నట్లయింది. ఏడుపులు తగ్గి నిర్జీవ ప్రశాంతత ఏర్పడింది.

స్నానాలు చేసాక, అందరూ కాఫీలు తాగి కాస్త కుదుటపడ్డారు. ఎవరో ఒకరు కొత్తవాళ్ళు వచ్చి పలకరిస్తూనే వున్నారు. సుశీల కంఠం పడిపోయింది. పడుకునే శోకాలు తీస్తోంది. కాని ఆమె అత్తగారి ఏడుపే మారిపోయింది. ఆమె ఏడుపులో స్వార్థం చేరి చీలికలయింది. కోడలు జాతకం, పిల్లల జాతకం సరిలేకనే కొడుకు చనిపోయాడని ఏడ్చింది. కొడుకు చేసిన అప్పులు, చితికిపోయిన ఆస్తివి ఏకరువు పెట్టింది.

కొడుకు అలా పాడవడానికి కారణం కూడా కోడలేనని ఆవిడ మొర పెడుతోంది. ఆవిడ శోకాలు వినడమే కష్టమయింది. అన్నపూర్ణమ్మగారికి, రామనాథం గారికి ముళ్ళ మీద వున్నట్లు అనిపించింది.

రామనాథంగారు ప్రసాదు ఆఫీసుకు వెళ్ళి అతని స్నేహితుల ద్వారా అన్ని విషయాలు తెలుసుకున్నారు.

కొంతకాలం అతనికి ఉద్యోగమే లేదు. తర్వాత ఒక కంపెనీలో మంచి ఉద్యోగమే వచ్చింది. కానీ జీతం పెరిగిన కొలది అతనికి దురలవాట్లు చోటు చేసుకున్నాయి.

క్రమంగా అతని జీవితం పతనమవడం ప్రారంభించింది. ఆ దురలవాట్ల వలననే ఉద్యోగం నుంచి తీసివేసారు. ఆవార్త తట్టుకోలేక అతనికి హార్టు ఎటాక్ వచ్చింది. ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోయాయి.

దానికి తగ్గట్లు సుశీల కూడా అంత తెలివైనది కాదు. భర్తను అదుపులో పెట్టుకునే శక్తి తెలివి ఆమెకు లేవు. అవి నేర్చుకునే సరికి అంతా అయిపోయింది. అత్తగారు అతి తెలివైందే కాని నోరుఎక్కువ. నిత్యం కోడలిని రాసి రంపాన పెట్టేది. కొడుకు మరణించిన తరువాత ఆమె మీద మరింత పెరిగింది. అతనికి వచ్చే డబ్బు ఏదీ లేదు. పైగా అప్పులున్నాయి. కోడలిని, మనవలిని పోషించే శక్తి లేదని అత్తగారు స్పష్టంగా చెప్పేసింది.

అందుకే రామనాథంగారు ఆ పన్నెండు రోజులు ముళ్ళ మీద వున్నట్లే కాలక్షేపం చేసి సుశీలను తీసుకుని ఆయన ఇంటికి తిరిగి వచ్చేసారు.

## 27

గోదావరి వరదలా ఊరంతా ముంచెత్తింది రాగింగ్ అల్లరి. ఒక కాలేజీ విద్యార్థి మరో కాలేజీ విద్యార్థితో పోటీ పెట్టుకుని కొత్తగా కాలేజీలో అడుగు పెడుతున్న అమ్మాయిని ఆమాంతం ముద్దు పెట్టుకున్నాట్ట.

ఆ వార్త విన్న శాంకరి నమ్మలేక పోయింది.

"ఆ అబ్బాయిని కాలేజీ నుంచి డిస్మిస్ చేయాలని ఆడపిల్లలు అల్లరి చేసారు."

అంత మంది విద్యార్థుల్లో ఆ అబ్బాయి ఎవరో ఆ పిల్లనే గుర్తు పట్టమన్నారు. ముందుకు వచ్చి చెప్పడానికి ఆ పిల్లచాలా భయపడింది.

"అయిన అల్లరి చాలు. ఇంటి పరువు ప్రతిష్ఠలు గంగపాలు చేసావు. చదువు మానేసి యింట్లోకూర్చోమన్నారు" ఆమె తల్లిదండ్రులు.

కాని తోటి విద్యార్థినులు సాక్ష్యం మేం చెబుతాం. భయపడకని ఆ పిల్లను ఓదార్చారు. విద్యార్థినులంతా వెళ్ళి ప్రిన్సిపాల్ గారితో జరిగినదంతా వివరంగా చెప్పారు. వారి మాటలు ఆయన నమ్మారు.

"ఇది ఒక కాలేజీ, ఒక యూనివర్సిటీ సమస్య కాదు. అన్ని కాలేజీలకు సంబంధించినది. అందరం కలిసి ఆలోచించి ఒక నిర్ణయాని కొస్తాం" ఆ ప్రిన్సిపాల్ గారి మాటలకు సంతోషంతో విద్యార్థినులు పెద్ద ఊరేగింపు జరిపారు. విద్యార్థులు పశ్చాత్తాపపడ్డారు.

అపర్ణ ఆ విషయం చెబుతుంటే శాంకరి చాలా సంతోషించింది. తను అందులో పాల్గొంటే ఎంత బాగుండునో అనుకుంది. మరునాడు పేపర్లో మొదటి పేజీలో ఆ సంఘటన రాయబడి వుంది. ఆ వార్తతో పాటుగా హైదరాబాదులో ఒక జూనియర్ కళాశాలలో విద్యార్థి మరణం. ఒక స్త్రీల కళాశాలలో విద్యార్థిని ఆత్మహత్య రాయబడ్డాయి.

శాంకరి కంగారుగా చదివింది. జూనియర్ కాలేజీలో ఆ విద్యార్థినిని దిస్సమొలతో సీనా బ్రాందీ తాగమని సీనియర్స్ వేధించి నందుకు రూములో వురి పెట్టుకున్నట్లు వుంది.

స్త్రీల కళాశాలలో విద్యార్థినులే ఏడిపించడం వల్ల అవమానం భరించలేని ఆ పిల్ల హాస్టల్ రూములో వురి పోసుకుంది.

అమానుషమైన ఆ రాగింగ్ మీద శాంకరికి విపరీతమైన కోపం వచ్చింది. అపర్ణతో ఆలోచించి ప్రిన్సిపాల్ గారి దగ్గరకు వెళ్ళింది.

"ఏమ్మా ఏమిటి ప్రోబ్లం" అన్నారాయన.

"ఏం లేదండీ. మమ్మల్ని సీనియర్స్ ఏడిపిస్తారని భయంగా వుందండీ."

"అలా ఎందుకనుకుంటున్నారు మీరు? చెప్పండి నిర్భయంగా చెప్పండి?"

అయన మాటలు వారికి మరింత ధైర్యాన్ని కలిగించాయి. నిన్న కాలేజీ ముందు జరిగిన సంఘటనలు వివరించారు. తరువాత వారు భయపడి రూములో నుంచి బయటకు రాని సంగతంతా వివరించారు.

ఆయనకు రిపోర్టులు వస్తూనే వున్నాయి కాని అంత వివరంగా చెప్పిన వారులేరు.

వెంటనే ప్రిన్సిపాల్‌గారు "రాగింగ్ చేసిన వారిపై కఠిన చర్యలు తీసుకుంటామని" నోటీసు బోర్డు మీద రాయించారు. పైగా కాలేజీ ఆవరణలో ఏదీ జరగకుండా నిఘా వుంచారు.

శాంకరి, అపర్ణ ఆ రాత్రి హాయిగా పడుకున్నారు. మరునాడు ప్రభుత్వం కూడా రాగింగ్ చేసిన వారిపై కఠిన చర్యలు తీసుకోమని ప్రకటన చేసింది.

వచ్చే సంవత్సరానికైనా ఆ అరాచకం తగ్గుతుందనుకుంది శాంకరి.

"కాలేజీలో క్లాసులు బాగా జరుగుతున్నాయని, తను శ్రద్ధగా చదువుకుంటున్నానని రాయాలనుకున్న వుత్తరం రాయనేలేకపోయింది ఎప్పటికి ఆ అవకాశం వస్తుందోననుకుంది.

రాగింగ్ ఆపడానికి అన్ని కాలేజీల వాళ్ళు ప్రయత్నాలుచేసారు. కొందరు ప్రిన్సిపాల్స్ పోలీసు కాపలాలు కూడా పెట్టారు. కొంత మందిని సస్పెండు కూడా చేసారు. దాంతో విద్యార్థులు కొంచెం భయపడ్డారు. మునపటంత విచ్చలవిడిగా రాగింగ్ చెయ్యలేకపోయారు.

రాగింగ్ పర్వం అనుకున్న దానికంటే ముందుగానే ముగిసింది.

క్లాసులు ప్రారంభమయ్యాయి. భోజనాల దగ్గర క్లాసుల్లోను కూడా కొంత మంది అమ్మాయిలతో పరిచయమైంది శాంకరికి. కొందరు విద్యార్థినులు ఖరీదైన బట్టలతో, ఆధునిక వేషధారణతో వచ్చి మిగిలిన వారిని హేళన చెయ్యడం చూసింది. సాధారణంగా మెడిసిన్ చదివే విద్యార్థినులు మిగతా వారి కంటే చాలా సాధారణ వేషంలో వుంటారు. కాని ఒకరిద్దరు దానికి భిన్నంగా వున్నారు. ఎంత చదువు కుంటున్నా వారి స్వభావాలు మారవనుకుంది శాంకరి. కొంత మంది వివరాలు తెలుసుకుని పల్లెల నుంచి వచ్చిన వారిని పేరుపేరున హేళన చేస్తున్నారు.

"మీదేవూరు పాపా!" అడిగింది ఒకమ్మాయి.

"మీదేవూరు బుచ్చమ్మా" తిరిగి శాంకరి అడిగింది.

ఆ మాటకు ఆ పిల్లకు చాలా కోపం వచ్చింది. కాని శాంకరిని ఏమీ అనలేకపోయింది.

అందరిలోకి అపర్ణ చాలా మంచి స్నేహితురాలనుకుంది శాంకరి. కాని అందరు ఆమె అంత స్వచ్ఛమైన వారు కారు. పల్లెవాసుల పసితనం ఆ పట్టణంలో లేదని మాత్రం వెంటనే గ్రహించింది.

సుబ్బులు, కనకం, కాసులు ఆమె కళ్ళ ముందు మాటి మాటికీ నిలుస్తూనే వున్నారు. అంతటి స్నేహం వారి దగ్గర తప్ప మరెక్కడా దొరకదనుకుంది.

ఇంటి నుంచి వుత్తరం కోసం ఎదురు చూసింది. ప్రసాదు బావ ఎలా వున్నదో ఆమెకు తెలియలేదు, తనే యింటికి వుత్తరం రాయాలనుకుంది అంతలో ఆ రోజే ఆమెకు ఇంటి నుంచి వుత్తరం వచ్చింది. శాంకరి తడబాటులో కవరు చింపి చదివింది. రామనాథంగారు సుశీలకు జరిగిన అన్యాయం గురించి రాయలేకపోయారు. శాంకరి వచ్చినప్పుడే చెప్పాలను కున్నారాయన. అందుకే ప్రసాదు సంగతి అందులో రాయలేదు. పైగా సుశీలా, పిల్లలు కూడా అక్కడే వున్నారని కూడా రాయలేదు. మామూలుగా కులాసాగా వున్నట్లు రాసారు.

"సుబ్బులు అంత ధైర్యం చేస్తుందనుకోలేదే" ఆశ్చర్యంగా చెప్పింది కనకం.

"అవును ఎవరూ అనుకోలేదు శాంకరీ. ఊరిడి మంది ఆశ్చర్య పడ్డారు" అన్నాడు సూర్యం.

"నిజమే! ఆశ్చర్యమే కాని చాలా మంచి నిర్ణయం తీసుకుంది సుబ్బులు, లేకపోతే అసలు ఆ పెళ్ళి జరిగేది కాదు"

"నిజమే శాంకరీ సుబ్బులు పెళ్ళి అయ్యేది కాదు. కాని సుబ్బులు వెళ్ళిపోయాక నాకు ఏం తోచడంలేదే."

నీ బెంగ కేంగాని సుబ్బులు నాన్నగారు మాత్రం చాలా బెంగ పెట్టుకున్నారు. వాళ్ళమ్మగారు కనబడితే ఆవిడ కళ్ళలో నీళ్ళే కనబడుతున్నాయి.

"వాళ్ళింటి కెళ్ళాలే"!

"అలాగే వెడదాం శాంకరీ!" అంది కనకం.

తర్వాత శాంకరి చదువు సంగతీ మాట్లాడుకున్నారు. కనకం చాలా వుత్సాహంగా వుంది. మునపటికంటే చాలా చురుగ్గా వుంది. దానికి కారణం వస్తున్న వయస్సు: మనసులో పొంగివస్తున్న కొత్త భావాలు. చీకటి పడకుండానే ముగ్గురూ లేచారు.

మధ్యలోనే సూర్యం మరో పని మీద వెళ్ళిపోయాడు.

శాంకరి, కనకం ఒకరి చేతులు ఒకరు పట్టుకుని నడుచుకుంటూ వస్తున్నారు.

"ఒసే కనకం! నిజం చెప్పవే" శాంకరి ప్రశ్నకు వులిక్కి పడింది కనకం.

"నే నెప్పుడు అబద్ధం చెప్పానే"

"అందుకే ఇప్పుడు కూడా నిజం చెప్పాలి. నువ్వు పెళ్ళి చేసుకుంటే బాగుంటుందే?"

శాంకరి వైపు బెదురుతూ చూసింది కనకం.

"ఇదిగో మీ సంగతి నాకుతెలిసిపోయిందికాని, కనకం మీరిద్దరూ పెళ్ళి చేసుకుంటే బాగుంటుందే"

"సూర్యం అంగీకరించాలి కదా శాంకరీ" కనకం తడబడుతూ చెప్పింది.

"సూర్యం ఎందుకొప్పుకోడే, సూర్యాన్ని నేనడుగుతా కదా! నీకిష్టమే కదా!"

కనకం చెంపలు కెంపులయ్యాయి. చిరునవ్వుతో ఆమె పెదాలు విచ్చుకున్నాయి.

"ఎంత నంగనాచివే?" కనకం చెవి మెలేసింది శాంకరి. అంతలో ఇల్లు రావడంతో యిద్దరూ ఆగిపోయారు.

వీధి అరుగు మీద కూర్చున్న రామనాథంగారు ఆ యిద్దర్నీ వింతగా చూశారు.

"ఈ పిల్లలు ఈ వీధికే అందం. ఈ పిల్లలు లేందే అసలు నిండుతనమే లేదు" అనుకున్నారు రామనాథం గారు.

మరునాడు సూర్యం శాంకరి యింటికి వచ్చి కూర్చున్నాడు. శాంకరి అదే సమయమనుకుంది. ఎవరి పనులలో వాళ్ళున్నారు. ఇంట్లో ఎవరూ వారి మాటలు పట్టించుకోరు.

"సూర్యం! కనకం అంటే నీకిష్టమే కదా!" సూర్యం ఉలిక్కిపడి "అదేం ప్రశ్న శాంకరీ"అన్నాడు. అతని మాటలు తడబడ్డాయి.

"అది అవసరమైన ప్రశ్న! నిజంగా చెప్పాలి"

"ఎందుకో అడగవచ్చా!" చిరునవ్వుతో సూర్యం ముఖం కళకళలాడింది.

"అవును సూర్యం! మీరిద్దరు పెళ్ళి చేసుకుంటే బాగుంటుంది"

"కనకం అంగీకరించాలి కదా!"

"కనకాన్ని అడిగే చెబుతున్నా"

"నిజమా!" అతని ముఖం ఆడపిల్ల ముఖంలా ఎరుపెక్కింది. సిగ్గుతో తల దించుకున్నాడు.

అంతలో కనకం అక్కడకు వచ్చింది. సూర్యాన్ని చూడగానే కనకం ముఖం సూర్యుని చూసిన పద్మంలా వికసించింది.

"రా! రా! పెళ్ళికూతురా! నీకోసమే చూస్తున్నా" అంది శాంకరి.

కనక మహాలక్ష్మి చనువుగా వచ్చి సూర్యం పక్కన కూర్చోలేక పోయింది.

సూర్యం ఆమెవైపు కొత్తగా చూసాడు. ఎప్పుడూ చూడనట్లు చూసాడు. కనకంలో కొత్త అందాలు కనబడ్డాయి. కనకం నిజంగా కనక మహాలక్ష్మి అనుకున్నాడు.

అతని చూపులు తప్పించుకోడానికి ప్రయత్నించిన కనకం సిగ్గుతో మెలికలు తిరిగింది. ఆమె చూపులు సూర్యం చూపుల్ని తప్పించుకుంటూ నిలబడలేక గిరగిరా తిరిగి నేలను చేరుకున్నాయి. ఆమె తల భారంగా వంగిపోయింది.

"అప్పుడే అంత సిగ్గుపడితే ఎలా? పెళ్ళి చాలా రోజులుంది" శాంకరి వేళాకోళం చేసింది.

తడబాటు దాచుకోలేని సూర్యం యింటికి వెళ్ళిపోయాడు. శాంకరి, కనకం కలిసి సుబ్బులు యింటికి వెళ్ళారు.

గుమ్మంలోనే ఎదురువచ్చిన అనసూయమ్మగారు శాంకరిని కౌగిలించుకుని లోపలికి తీసుకువెళ్ళింది.

రామ్మూర్తిగారు కూడా యింట్లోనే వున్నారు. ఆయన కూడా వచ్చి శాంకరి పక్కనే కూర్చున్నారు. "నిన్ను చూస్తుంటే మా సుబ్బుల్ని చూసినట్లే వుందమ్మా" అంది అనసూయమ్మ. ఆవిడ కనుకొలకుల్లో నీళ్ళు నిలిచాయి.

'సుబ్బులు మళ్ళీ ఉత్తరం రాసిందాండి?" కనకం అడిగింది.

'అవునమ్మా, నిన్ననే వచ్చింది. వెంకట్రావు చాలా మంచి వాడుటమ్మా.

ఎంతో బాగా చూసుకుంటున్నాడుట. గవర్నమెంటు క్వార్టర్స్ యిచ్చారుట. రేపు ఒకటవ తేదికి అక్కడికి వెడతారుట.'

'ఇక పెళ్ళయింది కదండీ, భర్తగారిసంగతేనా, ఉత్తరంలో సంగతేమైనా వుందాండీ?' కనకమే అడిగింది.

"ఆ! మీ సంగతీ వుందమ్మా. మిమ్మల్ని అడిగానని చెప్పమంది మీకు ఉత్తరం రాస్తానని రాసింది. పైగా మిమ్మల్నే అక్కడికి రమ్మన మని రాస్తుందిట. శ్రీశైలం దేవస్థానం చూడొచ్చు. అక్కడ ప్రకృతి దృశ్యాలు చూడొచ్చుట" రామ్మూర్తిగారు నవ్వుతూ చెప్పారు.

కూతురు లేదన్న బాధ ఆ తల్లిదండ్రుల్లో వున్నా, అక్కడ కూతురు సుఖంగా వుందన్న సంతోషం వారిలో కనబడుతోంది. ఏ తల్లిదండ్రులకైనా అదే కదా కావలసింది. అనసూయమ్మగారు యిద్దరికి జంతికలు, కోవాబిళ్ళలు పెట్టింది.

శాంకరి, కనకం తినడం పూర్తిచేశారు. బయట ఆడుకుంటున్న సుబ్బులు తమ్ముడూ, చెల్లి లోపలికి వచ్చి శాంకరిని చుట్టుముట్టారు.

"సుబ్బులక్క ఉత్తరం రాసింది. మమ్మల్ని అక్కడికి రమ్మన మంది ఇవిగో మా అక్క బావ ఫొటోలు" అంటూ గదిలోంచి పట్టుకొచ్చిన ఫొటోలు చూపించారు. అక్కంటే ఎంత ప్రేమో అను కున్న శాంకరి, కనకం ఆసక్తిగా ఫొటోలు చూసారు. ఇద్దరూ పూలదండ లతో నిలబడివున్నారు. వెంకట్రావు ఎడమచేయి సుబ్బులు భుజాలను చుట్టివుంది.

శాంకరి, కనకం నవ్వుకున్నారు.

"పెళ్ళయ్యాక భర్తే సర్వస్వం. మనమెక్కడ గుర్తొస్తామే" అంది కనకం.

"రేపొద్దుట పెళ్ళయ్యాక నువ్వూ అంతే. మేం కనబడితే మీరె వరండీ అంటావు" అనసూయమ్మ వేళాకోళం చేసింది.

"ఈఫొటోలు నిన్ననే పంపించింది సుబ్బులు. మేము మర్చే

పోయాం, పిల్లలకి చూడు ఎంత ఇష్టమో. నిన్నటి నుంచి ఆ ఫొటోలు వదలడం లేదు. రాత్రివేళ కూడా పక్కనే పెట్టుకొని పడుకున్నారు." అంది అనసూయమ్మ.

"అవునమ్మా! వాళ్ళ ఆఫీసు వాళ్ళకి పార్టీ ఇచ్చాడుట అబ్బాయి. అప్పటి ఫొటోలుట." సంబరంగా చెప్పారు రామూర్తిగారు.

"మాకు పంపిస్తుందంటారా సుబ్బులు. పిన్నీ! మాకు పంపించకపోతే యివే పట్టుకుపోతాం" అంది కనకం.

వెంటనే ఆ పిల్లలు "ఇవి మావి. మా అక్క పంపించింది." అంటూ ఫొటోలు తీసుకుని పరుగెత్తారు.

అందరూ నవ్వుకున్నారు.

"వస్తామండీ" అంటూ శాంకరి, కనకం బయలుదేరారు.

శాంకరి ఇంటికెళ్ళకుండా కనకంతోపాటు వాళ్ళింటికి వెళ్ళింది.

కనకం నాన్నగారు వీధి అరుగుమీదే కూర్చున్నారు.

"ఎప్పుడొచ్చావు శాంకరీ" భవానీశంకరంగారు పలకరించారు. చదువు సంగతి కూడా ఆయన వివరంగా అడిగారు.

కనకం తల్లి కామేశ్వరిగారు లోపలికి పిలిచి కూర్చోబెట్టింది శాంకరిని.

సుశీల సంగతి చెప్పి ఆవిడ బాధపడింది. తర్వాత సుబ్బులు చేసిన పని ఆవిడ ఆశ్చర్యంగా చెప్పింది.

"చాలా మంచిపని చేసిందమ్మా! లేకపోతే ఈ పెద్దలు అంగీకరించేవారా? ఆపిల్ల ఎంతో సుఖంగా వుందిట, ఆవిడ కూడా ఆశ్చర్యంగా చెప్పింది.

అంత పల్లెలో కూడా ఎవరూ సుబ్బులూ చేసిన పనిని నిందించ లేదు. అందరూ మంచిపని చేసిందంటున్నారు. శాంకరికి ఆశ్చర్యంగా అనిపించింది. ఏదైనా పల్లెవాసులు కూడా అభ్యుదయాన్నే కోరుకుంటున్నారు. వారంతటవారు యిలాంటి ప్రేమ వివాహాలను ప్రోత్సహించక

పోయినా వాటిని తప్పుగా భావించడంలేదనుకుంది శాంకరి. ఎంతైనా సుబ్బులు చాలా తెలివైన పని చేసింది అనుకుంది మనస్సులో.

"అందరి పెళ్ళిళ్ళు అయిపోతున్నాయి. నీ పెళ్ళి అంటావా? నువ్వు చదువుకుంటున్నావు కదా! ఇప్పట్లో అవసరంలేదు. ఇంక మా కనకానికే ఎక్కడైనా కుదరాలి." అంది కామేశ్వరమ్మ.

"మీ కనకానికి వేరే సంబంధం ఎందుకనీ! హాయిగా సూర్యానికి చ్చేస్తే అయిపోతుంది కదండీ"

"సూర్యానికా!" ఆశ్చర్యంగా అడిగింది ఆవిడ.

"అవునండీ" శాంకరి మరోసారి చెప్పింది.

"ఏమండీ! వింటున్నారా! శాంకరి ఏమంటోందో! సూర్యానికి కనకాన్ని ఇస్తే బాగుంటుందిటండీ!"

భవానీ శంకరం గారికి మనస్సులో వుంది. కాని సూర్యానికి పిల్లనిస్తామంటే వాళ్ళు చేసుకుంటారో లేదోనని ఆయనకు లోపల అనుమానంగా వుంది. జగన్నాధంగారు ఆ వూళ్ళోకల్లా ఆస్తిపరులు. పైగా సూర్యం అందగాడు. కనకం కూడా అందంగానే వుంటుంది. కాని ఆయనతో తులతూగే అంత ఆస్తిలేదు.

"వాళ్ళతో తూగగలమా?" పైకి కూడా అదే మాట అన్నారాయన.

"మీరు అడిగి చూడండి." అంది శాంకరి.

"మన ప్రయత్నం మనం చేద్దాం" అన్నారాయన. కామేశ్వరమ్మగారి మనస్సు కుదుటపడింది.

మరునాడు పొద్దుటే భవానిశంకరంగారు జగన్నాధంగారింటికి బయలుదేరి వెళ్ళారు.

జగన్నాధంగారు ఆయన్ని రోజూ చూస్తున్నా ప్రత్యేకంగా యింటికి వచ్చేటప్పటికి ఏదో విశేషం వుందనుకున్నారు. ఎంతో మర్యాదగా కుర్చీలో కూర్చోపెట్టి కాఫీ తెమ్మని భార్యకు చెప్పారు.

సాధారణంగా ఆ వూళ్ళలో కాఫీలు ఎవరు వచ్చినా యివ్వరు. మర్యాదగా మాట్లాడుకోవడమే అలవాటు. ఆవిడ కాఫీ ఇచ్చి గుమ్మం పక్కనే నిలబడింది.

మీ అంతస్తుకి మేం చాలమనుకోండి. అయినా మా కనకాన్ని సూర్యానికి చేసుకుంటే బాగుంటుందని అడగడానికొచ్చాము" కాఫీ తాగుతూనే భవానీ శంకరంగారు చెప్పవలసింది చెప్పి జగన్నాధంగారి వైపు చూశారు.

"అదా సంగతీ! సంబంధం కలుపుకోడానికి ఆస్తులు అంతస్తులు ఏమిటీ. కనకం మన వూరి పిల్ల మా యింటి కోడలుగా పంపిస్తామంటే మాకింతకంటే ఏం కావాలి. అలాగేకానీ" అన్నారు జగన్నాధంగారు.

జగన్నాధంగారు అంత తేలిగ్గా అంగీకరిస్తారనుకోలే దాయన?

"మా కోడలు బంగారుతల్లి. నిజంగా కనకమహాలక్ష్మే అన్నయ్య గారూ!" అంది సూర్యం తల్లి. చాటున నిలబడి ఆ మాటలు విన్న సూర్యం మనస్సు గాలిలో తేలిపోయింది.

కనకం సూర్యం ఎప్పుడు వంటరిగా కలిసి మాట్లాడుకుందమా అని తొందర పడుతున్నారు.

మరునాడు శాంకరి ప్రయాణం. రామనాధంగారిని రాజమండ్రి వరకు వెళ్ళనీయకుండా ఆమె వెంట కనకం, సూర్యం బయలుదేరారు. కాబోయే ఆ జంటనే ఆసక్తిగా చూస్తున్నారు అంతా.

వదలకుండా తిరుగుతున్న ఆ ఇద్దరినీ చూసి నవ్వుకుంది శాంకరి. "పెళ్ళికి ముందుగా రావాలి సుమా" అంటూ ఎన్నోసార్లు చెప్పారు కనకం, సూర్యం. రైలు కదులుతోంది. శాంకరి సంతృప్తిగా చూసింది వాళ్ళవైపు.

# 33

శివా కాలేజీకి వెళ్ళి వస్తున్నాడు. కాని అతని మనసంతా శాంకరి

మీదే వుంది. సూర్యం పెళ్ళి శాంకరితో జరుగుతుందని తెలిసినా అతని మనస్సులో శాంకరి రూపమే నిలిచివుంది.

అతని తలపులు నిండా శాంకరి మీద వలపులే. మరిచిపోదామని ఎంత ప్రయత్నం చేసినా మరిచిపోలేక పోతున్నాడు. శాంకరిని వెంటనే పెళ్ళి చూడాలని వుంది. కాని సూర్యం రాసిన వుత్తరంలో విషయం జ్ఞప్తికి వచ్చి ఆ పని చెయ్యలేకపోతున్నారు.

రాజేశ్వరమ్మగారు క్రమంగా కోలుకుంటున్నారు. భర్త పోయిన లోటు తీరే బాధ కాకపోయినా కాలంతో పాటు ఆమె కుదుట పడుతోంది.

గిరిజ పెళ్ళి అయిన తరువాత తమ్ముడు చలపతి, మరదలు మామూలుగా వచ్చి పోతున్నారు.

అనుకోకుండా ఒకనాడు కనకం, సూర్యంల పెళ్ళి శుభలేఖ అందింది. శివకుమార్ అది చూసి ఆశ్చర్యపోయాడు. ఎంత ఆలోచించినా అక్కడ జరిగిందేమిటో అతను వూహించుకోలేకపోయాడు. ఏదైనా తన కోరిక ఫలించింది. శాంకరి వివాహం సూర్యంతో జరుగలేదు. శాంకరి తనదే" అతని అంతరాత్మ ఘోషించింది. అతని హృదయం ఆనందంతో గంతులేసింది.

"అమ్మా! సూర్యం పెళ్ళిట!" శుభలేఖ చూపించాడు తల్లికి.

"పెళ్ళికూతురు కనకమహాలక్ష్మి" అని వుందేమిటిరా? నువ్వు శాంకరీదేవి అని చెప్పావు కదా! ఆవిడ జ్ఞాపకం తెచ్చుకుంటూ అడిగింది.

"ఇదివరలో సూర్యం అలాగే రాసాడు. కాని శుభలేఖ వేరుగా వచ్చింది. కనకం కూడా సూర్యానికి దగ్గర బంధువే. శాంకరి మెడిసిన్ చేస్తుందిట. అందుకే పెళ్ళి జరిగుందదమ్మా!" తన వూహ నిజమే అన్నట్లుగా చెప్పాడు.

"అలాగా! శాంకరి మెడిసిన్ చేస్తోందా! బాగుందిరా! అంత

పల్లెలో పుట్టిన పిల్లలకి అంత తెలివి, అంత మంచితనం ఎక్కడ నుంచి వచ్చాయిరా!"

"మొదటి నుంచి ఆ అమ్మాయి స్కూలు ఫస్టమ్మా! ఎంత అల్లరి చేస్తుందో! అంత బాగా చదువుకుంటుందమ్మా! ఏదైన మనం సూర్యం పెళ్ళికి వెళ్ళాలమ్మా!"

"నేను పెళ్ళికి ఎందుకురా! అక్కడందరూ కొత్తవాళ్ళే. మరో సారి నేవస్తాలే. ఇప్పుడు నువ్వెళ్ళిరా! శివా."

"సరే నీ యిష్టమమ్మా."

ఆ రోజు నుంచి శివా పెళ్ళికెళ్ళడానికి రెడీమై కూర్చున్నాడు.

ఇంకా చిన్నతనం పోలేదు. శివా సందడి చూసి అనుకుంది ఆ తల్లి. కొడుకు మనస్సులో ఏముందో మాత్రం ఆ తల్లి పసికట్టలేక పోయింది.

# 34

అంతలో గిరిజా, సత్యం అక్కడికి వచ్చారు. మేనకోడలు వస్తే రాజేశ్వరమ్మగారికి కావలసినంత కాలక్షేపం. సత్యం గిరిజతోపాటు రాజేశ్వరమ్మగారికి దగ్గరగా కూర్చుని కబుర్లు చెబుతాడు. ఆవిడ కష్ట సుఖాలు అడుగుతాడు. ఏవైనా చిన్న పనులు చేసి పెడతాడు. ఆవిడ కూడా పిండివంటలు చేసిపెట్టి వారు ఎక్కువ సేపువుండేటట్టు చూసుకుంటుంది.

ఆ రోజు గిరిజా, సత్యం వుత్సాహంగా లేరు.

"ఏం గిరిజా! అలా వున్నావేం" శివా వెంటనే అడిగాడు.

"ఏం లేదండీ! మా నాన్నగారికి మా సంగతి తెలిసిపోయింది. ఆయన నానా తిట్లు తిట్టి నానా అల్లరి చేస్తున్నారుట. ఆయనకసలే అనారోగ్యం. ఏమైపోతారోనని భయంగా వుంది."

"అంతే కదా! సత్యం. నువ్వేమి భయపడకు. అలా బెదిరించి అల్లరి చేస్తారు కాని వాళ్ళు ఏమీ చెయ్యరు. మీ నాన్నగారికి ఏం భయం లేదు. ఇంతలో ఆయనకు ఎలా తెలిసిందట."

"నేను పారిపోయిన సంగతి స్టేషన్‌లో చూసిన వాళ్ళు చెప్పారుట. కాని ముందు మా నాన్నగారు నమ్మలేదు. ఢిల్లీలో వున్న మా చుట్టాలు నేను అక్కడికి రాలేదని రాసారు. దాంతో మా నాన్నగారు మా మామయ్యను నిజం చెప్పమని బలవంతం చేసారుట. ఆయన జరిగిన సంగతి చెప్పక నేను మధ్యలో తప్పించుకుని పారిపోయానని ఎక్కడున్నానో తెలియదని చెప్పాడుట దాంతో మా నాన్నగారి కోపమంతా నావైపుకు తిరిగింది" సత్యం కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"ఇదిగో సత్యం నువ్వు ధైర్యంగా వుండాలి. కొన్నాళ్ళు పోతే గొడవలు అవే సర్దుకుంటాయి. రాకపోకలు మామూలుగానే వుంటాయి. ఏమీ కంగారు పడకండి" శివా తిరిగి ధైర్యం చెప్పాడు.

"పోనీ! అత్తయ్యా! మేం అక్కడికి వెడితే బాగుంటుందా!"గిరిజ అడిగింది.

"ఆ పని చెయ్యకండి. ఇప్పుడు మీరు వెడితే పుండుమీద కారం జల్లినట్లే అవుతుంది. రోజులు గడుస్తుంటే లోపాలు అవే చల్లారుతాయి. కాస్త ఓర్మి పట్టాలి" రాజేశ్వరమ్మగారు సలహా యిచ్చింది.

"అమ్మ చెప్పింది నిజం: అలాగే చెయ్యండి గిరిజా!" శివా వాళ్ళకి మరోసారి చెప్పి పనిమీద బయటకు వెళ్ళాడు.

గిరిజా సత్యం చాలాసేపు కూర్చున్నారు. అప్పటికే చీకటి పడింది.

"గిరిజా: ఇంటికెళ్ళి వంట ఏం చేసుకుంటావె: ఈ పూట యిక్కడే భోంచేసి యిక్కడే వుండిపొండి" అంది రాజేశ్వరమ్మగారు. గిరిజ ఆప్యాయంగా చూసింది మేనత్తవైపు. అత్తారింటికి వెళ్ళిన కొత్తలో

ఏ ఆడపిల్లైనా పుట్టింటి ఆదరణ కోరుకుంటుంది. తల్లి దూరంగా వున్నా మేనత్తతో తల్లి ఆప్యాయత అందుకుంటోంది గిరిజ. అందుకే ఆవిడ మాట కాదనలేక పోయింది.

"అలాగే అత్తా" అంది.

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ వంట చేసుకున్నారు. శివా వచ్చే వరకు సత్యం భోజనం చెయ్యనన్నాడు.

అంతలో సత్యం మేనమామ వచ్చాడు.

"ఏం మామయ్యా! ఏం జరిగింది". కంగారుగా అడిగాడు సత్యం.

"కంగారు పడకూరా సత్యం. ఏది ఎలా జరగాలో అలా జరుగుతుందిరా! మీ అమ్మ నీకోసం బెంగ పెట్టుకుంది. మీ నాన్న నువ్వు కనబడతే కాలు విరగ్గొడతానంటున్నాడు రా! అయినా మీ అమ్మతో జరిగిన సంగతి చెప్పానురా! మీ నాన్నకి తెలీకుండా నిన్ను, గిరిజని చూడాలని మీ అమ్మ కొట్టుకుపోతోంది. ఎప్పుడో ఒకరోజు మీ అమ్మని తీసుకువస్తారా! అది చెబుదామనే వచ్చాను."

"అలాగా మామయ్యా! అమ్మ చూడ్డానికి వస్తుందా!" సత్యం చిన్న పిల్లాడిలా అడిగాడు. సత్యానికి తల్లి దగ్గర చాలా చనువు. తండ్రికి కాస్త కోపం ఎక్కువ. ఆ లోపం కనపడకుండా ఆవిడ మరింత ఆదరిస్తుంది.

"ఎప్పుడు అమ్మని తీసుకొస్తావు మామయ్యా!" తిరిగి సత్యమే అడిగాడు.

"వీలు చూసుకుని. మీరు జాగ్రత్తగా వుండండి మీరు తొందర పడకండి" ఆయన తిరిగి వెళ్ళిపోయాడు.

అంతలో శివా వచ్చాడు. గిరిజ, సత్యం ఆ రాత్రి అక్కడే పడుకున్నారు. ఆ రాత్రి రాజేశ్వరమ్మగారు హాయిగా నిద్రపోయింది. శాంకరిని తలచుకుంటూ శివా నిద్రపోయాడు.

# 35

శాంకరి మరింత శ్రద్ధగా చదువుతోంది. అన్నింటిలోను అందరి కంటె ఎక్కువ మార్కులు తెచ్చుకుంటోంది. ఎక్కువసేపు పుస్తకాల మధ్యలో వుండటం వల్ల అందరిదృష్టి శాంకరి మీదకి మళ్ళింది.

"శాంకరీ! పుస్తకాలపురుగూ" అంటూ అపర్ణావాళ్ళు గేలిచెయ్యడం మొదలు పెట్టారు.

రాత్రిళ్ళు ఎక్కువసేపు లైటువేసి చదువుకుంటుంటే అపర్ణ విసుక్కునేది. తర్వాత "సారీ శాంకరీ" అనేది.

"లెంపలేసుకో అపర్ణా" శాంకరి మాటలకు నవ్వేసుకుంటు లెంపలేసుకునేది అపర్ణ. అపర్ణకు మొద్దునిద్దర. పరీక్షలన్నా ఆమెకు భయం లేదు. నిద్రపోయిందంటే లేవదు. శాంకరి బలవంతంగా లేపి కూర్చో పెట్టేది.

"శాంకరీ! నా పాలిటి కష్టదేవతా! నన్ను చంపుతున్నావు! ఈ సారి నన్ను వదిలేసెయ్యి" అంటూ బ్రతిమాలేది అపర్ణ.

"అపర్ణా! నా తల్లీ! ఈసారికి లేమ్మా! పరీక్షలయ్యాక నీజోలికి రాను తల్లీ!" నచ్చచెప్పేది శాంకరి.

తప్పదని తెలిసిన అపర్ణ లేచికూర్చుని బలవంతంగా చదివేది.

మొదటి సెమిస్టర్‌లో శాంకరి ఫస్టు వచ్చింది. అపర్ణకు కూడా మంచి మార్కులే వచ్చాయి.

శాంకరీ! నీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేనే. ..నీ మూలంగానే పరీక్ష పాసయ్యాను. నిన్ను విసుక్కున్నందుకు ఏమీ అనుకోకె" అంటూ అపర్ణ శాంకరిని కౌగిలించుకుని ఏడ్చింది.

అపర్ణ తల్లిలేని పిల్ల. అందుకే శాంకరికి అపర్ణంటే చాలా ఇష్టం. అందుకే అంత శ్రద్ధ తీసుకుంది శాంకరి. ఫలితం కలిగింది.

"అపర్ణా! ఈమాత్రం దానికి ఋణాలు, తీర్చుకోడాలు ఏమిటే. నువ్వు పాసయ్యావు. మంచి మార్కులు వచ్చాయి. అదే నాకు కావలసింది."

"శాంకరీ! నువ్వు చాలా మంచిదానివి. నన్ను క్షమించు."

అపర్ణ కళ్ళు తుడిచింది శాంకరి. కనకం, కాసులు, సుబ్బులు గుర్తుకొచ్చారు శాంకరికి.

"అపర్ణా! నువ్వు చేసిన తప్పేమిటి క్షమించడానికి! అలాంటి మాటలు మాట్లాడకు. ఈసారి మాత్రం పెంకితనం చెయ్యక చదువుకోవాలి. అలా ఋణం తీర్చుకో" అంది శాంకరి. "తమరి దయ" అంది బుద్ధిమంతురాలిలా అపర్ణ.

శాంకరి మంచితనం, చదువులో చురుకుదనం అందరికి ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. శాంకరితో మాట్లాడాలని ప్రయత్నం చేస్తున్నారు. ఆమె రూములో వుండాలని కుతూహలపడుతున్నారు. అందుకే లత కూడా వారి రూములో వుండడానికి ప్రయత్నం చేసి వచ్చింది.

అపర్ణకు ఆమె రావడం యిష్టంలేదు. శాంకరికి భయపడి ఏమీ అనలేకపోయింది.

# 36

ఆ రోజు అన్ని కళాశాలల్లోను యూనియన్ ఎలక్షన్స్ ఉదయం ప్రశాంతంగానే జరిగాయి. మధ్యాహ్నం ఒక కాలేజీలో రెండు గ్రూపుల మధ్య ఘర్షణ ప్రారంభమైంది.

ఒకళ్ళనొకళ్ళు కొట్టుకున్నారు. తర్వాత ఇరుపక్షాల వారు కలిసి కాలేజీని ధ్వంసం చేశారు. అద్దాలు పగులగొట్టారు. ఫర్నిచర్ విరగగొట్టారు. వెంటనే మేనేజిమెంటు వారు పోలీసుల్ని పిలిపించారు.

పోలీసులు విద్యార్థులను చెదరగొట్టటానికి లాఠీఛార్జి చేసారు.

టియర్ గాస్ వదిరారు. విద్యార్థులు పోలీసుల మీద రాళ్ళు విసిరారు. పోలీసులు రెచ్చిపోయి విద్యార్థుల వెంటబడ్డారు.

విద్యార్థులు పట్టణం మీద పడ్డారు. సిటీబస్సుల మీద రాళ్ళు కొట్టారు. అద్దాలు పగులకొట్టారు. అదను చూసుకొన్న కొన్ని రౌడీ మూకాలు బయటకు వచ్చాయి. విద్యార్థులో, వాళ్ళో తెలియని పరిస్థితి.

కొన్ని ప్రైవేటు కార్లను, వ్యానులను కూడా పగులకొట్టారు. ఒకవ్యానుకు నిప్పు అంటిచారు, రోడ్డుమీదా పోయే ఆడపిల్లను ఏడిపించటం, అసభ్యంగా ప్రవర్తించడం కూడా జరిగింది. వెంటనే నాలుగు రోజుల కళాశాలలన్నింటిని మూసిలేసారు.

ఆడపిల్లలు బయటకు వెళ్ళడానికే భయపడ్డారు. ఎంతోమందిని కష్టడీలోకి తీసుకున్నారు. అందులో విద్యార్థులు వున్నారు. బయట గుండాస్ కూడా వున్నాడు.

అంత గొడవ జరగడానికి అసలు కారణమేమిటో ఎవరికీతెలియతేదు.

"ఒటింగ్‌లో అన్యాయం జరిగిందని" కొందరన్నారు.

"కౌంటింగ్‌లో అన్యాయం జరిగిందన్నారు" కొందరు.

"కొంతమంది విద్యార్థుల్ని వోటు వెయ్యకుండా ఒక గ్రూప్‌వారు ఆపుచేసారట" అన్నారు కొందరు అలారకరకాలుగా చెప్పుకుంటున్నారు.

అపర్ణకు అలాంటి విషయసేకరణ చెయ్యడం చాలా యిష్టం. మరికొంతమందితో కలిసి గొడవలు జరిగిన ప్రాంతాలకు బయలుదేరి వెళ్ళి తిరిగి వచ్చింది. "శాంకరీ! విన్నావా"? అంటూ అరిచింది.

"ఏమిటి అపర్ణా"

"అసలు సంగతి తెలిసింది. వీళ్ళు చెప్పేని ఏమీ కావు. ఆ కాలేజీలో చదువుతున్న ఆడిపిల్లల్ని మాకు ఓటువేయమంటే మాకు ఓటు వేయమని ఇరువక్షాల వారు పట్టుపట్టారుట. భయపడిన ఆడపిల్లలు ఎవరికి ఓటు వెయ్యాలో తెలియక నిలబడి పోయారుట.

"మీరు ఎవరికి ఓటు వేస్తారో ముందే చెప్పాలి. లేకపోతే మీరు

ఎవ్వరికి ఓటు వేయడానికి వీలులేదు. ఇంటికి వెళ్ళిపొండి" అంటు ఇరు పక్షాల వారు అల్లరి చేసారు.

ఆడపిల్లలంతా ఒక నిర్ణయాని కొచ్చారుట.

"మేము మా యిష్టం వచ్చిన వాళ్ళకి ఓటు వేస్తాం. ఎవరికి వేస్తామో మేంచెప్పం" అన్నారుట అమ్మాయిలంతా.

దాంతో రెచ్చిపోయిన మగపిల్లలు ఓటు వెయ్యబోయిన అమ్మాయి చెయ్యి పట్టుకుని బయటకి లాగారుట. మరో వర్గం వారు ముందుకు వచ్చారుట.

"ఎవడు అడ్డం వస్తాడో చూస్తాం" అన్నారుట వారు.

"మేమున్నాం" మరో వర్గం వారు అరిచారుట.

అలతే ఒకరి నొకరు ముందు తిట్టుకున్నారుట, బెదిరించుకున్నారట. తరువాత కొట్టుకున్నారుట. తర్వాత కాలేజీ అద్దాలు, ఫర్నీచరు తరువాత సంగతి అందరికి తెలుసు" అంటూ ఏ విషయం మర్చిపోకుండా అపర్ణ చెబుతుంటే ఎంతో మంది అమ్మాయిలు ఆమె చుట్టు కూర్చున్నారు. ఆమె చెప్పేది అందరు ఆశ్చర్యంగా విన్నారు.

"ఇది అన్యాయం. ఆడపిల్లలంటే అంత లోకువా? అసలు అమ్మాయిలంటే ఏమనుకుంటున్నారు. మగ పిల్లలు చెప్పినట్లు ఎందుకు వినాలి. అమ్మాయిలకి స్వతంత్ర శక్తి లేదా? శాంకరీ! ఏమంటావు?" కొందరు అమ్మాయిలు పట్టుపట్టారు.

నిజమే! మీరు చెప్పింది అందరు ఆలోచించాలి. ఆడపిల్లలంటే ఏమనుకుంటున్నారు. మన శక్తి ఏమిటో వాళ్ళకి తెలియాలి" శాంకరి సమాధానం అందరికి సంతృప్తి నిచ్చింది.

అన్ని కాలేజీల విద్యార్థినులు కలుసుకున్నారు. విద్యార్థుల చర్యకు నిరసనగా వూరేగింపు చేసారు. అందరు విద్యార్థినులకు సపోర్టు యిచ్చారు. విద్యార్థుల దౌర్జన్యానికి అందరు నిరసన తెలియజేసారు. పైగా ఆ అమ్మాయి చెయ్యి పట్టుకుని బయటకు లాగిన విద్యార్థిని

శిక్షించాలని విద్యార్థినులంతా పట్టుపట్టారు. క్లాసులకు వెళ్ళకుండా కాలేజీ ముందు కూర్చున్నారు.

ఆ కాలేజీ ప్రిన్సిపాల్ చేసేది లేక విచారణ జరిపించారు. తప్పు చేసిన విద్యార్థి నాయకుల్ని పిలిపించారు. ఆ అమ్మాయిని చెయ్యి పట్టుకు లాగిన అబ్బాయిని కాలేజీ నుంచి డిబారు చెయ్యడానికి నిశ్చయించారు. అది మొదటి తప్పని మరెప్పుడు అటువంటి పని జరగకుండా చూస్తా మని విద్యార్థి నాయకులు ప్రిన్సిపాల్‌ని బతిమాలుకున్నారు. విద్యార్థికి శిక్ష పడకుండా తప్పించారు విద్యార్థి నాయకులు.

విద్యార్థినులందరిని సంఘటిత పరచిన శాంకరిని అందరు మెచ్చుకున్నారు. ఆమె ఉత్సాహం, ఆమె తీసుకునే నిర్ణయం, పట్టుదల గాంభీర్యమైన ఆమె మాట అందరిని ఆకర్షించింది. మెడికల్ కాలేజీ లోనే కాదు అన్ని కాలేజీల్లోను శాంకరి పేరు మారు మ్రోగింది.

"శాంకరీ! నువ్వు నిజంగా ఆదిశక్తివే" అన్నారు అపర్ణా లతలు.

"ఊరుకోండి. నాదేముంది మీరంతా సహకరించారు కదా! ఆడ పిల్లల్లో పట్టుదల రావాలి. ఐక్యత పెరగాలి. అది లేందే ఏదీ సాధించ లేం" శాంకరి సమాధాన మిచ్చింది.

"శాంకరి నీకు శుభలేఖ" పక్కరూము అమ్మాయి శుభలేఖ చేతులో పెట్టి వెళ్ళిపోయింది.

కనకం, సూర్యంల పెళ్ళి శుభలేఖ చదువుకుంది శాంకరి.

"ఎవరిది పెళ్ళి శుభలేఖ" అని అడిగిన అపర్ణ లతకు వారి సంగతి చెప్పింది.

"అయితే పెళ్ళి ప్రయాణమా" అపర్ణ అడిగింది.

అయితే బట్టలు సర్దుకో శాంకరీ! అయినా మేం కూడా నీతో పెళ్ళికి వస్తాం శాంకరీ" లత అడిగింది.

'దానికేం అలాగే రండి"

"ఇప్పుడిలా అంటున్నావు కాని నిజంగా మేం వచ్చామనుకో నువ్వు నీ ఫ్రెండ్స్‌తో కలిసిపోతావు కాని మా సంగతే గుర్తుంచుకోవు. అందుకే నీతో రాలేం" అపర్ణ బుంగ మూతి పెట్టింది.

"నిజంగా రండే! అపర్ణా" శాంకరి బతిమాలింది.

"మాకు కుదరదు శాంకరి సరదాకన్నాం. నువ్వు బట్టలు సర్దుకుని వుంచుకో" లత నవ్వుతూ చెప్పింది.

ఆ రాత్రి శాంకరి కంటికి నిద్ర రాలేదు. "కాసులు, సుబ్బులు పెళ్ళికి తప్పకుండా వస్తారు. వాళ్ళెలా వున్నారో ఏమో? అందరినీ కలుసుకోవచ్చు. ఇంటి దగ్గర సుశీలక్క ఎలా వుందో, నాయనమ్మ ఎలా వుందో రవి శ్రద్ధగా చదువుతున్నాడో లేదో! వాడి చదువు సంగతి జాగ్రత్తగా చూడాలి. అమ్మా నాన్న ఎలా వున్నారో" అలా ఆలోచిస్తున్న ఆమె ఆలోచనలు శివా దగ్గరకు వచ్చి ఆగిపోయాయి.

ఆమెకు తెలియకుండానే శరీరంలో వెచ్చని ఆవిర్లు వచ్చాయి. మనసు మధురానుభూతితో తడిసి పోయింది. గోదావరి సంఘటన గుర్తుకు వచ్చి ఆమె శరీరం సన్నగా వణికింది.

శివా పెళ్ళికి తప్పకుండా వస్తాడు. ఏదో కొంటె పని చేస్తాడు. ఈసారి జాగ్రత్తగా వుండాలి. అతని మాయలో పడకూడదు. మనసుకు సర్ది చెప్పింది శాంకరి. చుట్టుముట్టుతున్న తీయని కలలను బలవంతంగా దూరానికి నెడుతూ నిద్రలోకి జారింది.

# 37

శాంకరి పెళ్ళికి బయలుదేరింది. కనకం, సూర్యంల పెళ్ళి యింకా అప్పటికి రెండు రోజులుంది. సింహాద్రి ఎక్స్‌ప్రెస్ వేగంగా పరుగెడుతున్నా అసలు కదులుతున్నట్లే అనిపించలేదు శాంకరికి. కాసేపు చేతిలో వున్న పత్రిక తిరగేసింది. మరి కాసేపు బండితో పరుగెడుతున్నట్లు వున్న చెట్లను, కొండలను, ఇళ్ళను చూసింది. మరి కాసేపు ఆకాశం వైపు చూసింది. ఏ స్టేషన్ తరువాత రాజమండ్రి స్టేషనుందో

ఆమెకు తెలుసు. కాని స్టేషన్ రాగానే వులిక్కిపడి చూస్తోంది. పక్కన ఎవరు కూర్చున్నారో, ఆమె గమనించలేదు. అసలు ఎవరు ఎక్కుతున్నారో, ఎవరు దిగుతున్నారో కూడా ఆమె గమనించడంలేదు.

"కొంచెం మీ చేతిలో పత్రిక యిస్తారా"

శాంకరి తల తిప్పి పక్కకు చూసింది. ఒక యువకుడు తన చేతిలోని పత్రికను యివ్వమని మళ్ళీ అడిగాడు పత్రిక అందించింది.

అతి చనువుగా ఆమెకు మరింత దగ్గరగా జరిగాడు ఆ వ్యక్తి శాంకరికి చికాకువచ్చింది. అయినా వూరుకుంది.

"పత్రిక తిరగేస్తూ మాటి మాటికి శాంకరి వైపు చూసి వెకిలి నవ్వు నవ్వుతున్నాడు. శాంకరి వంటికి కారం పూసుకున్నట్లయింది. అయినా తమాయించుకుంది. "ఆమె ఓర్పును మరోలా అర్థం చేసుకున్న ఆ వ్యక్తి ఆమెకు మరింత దగ్గరగా జరిగాడు. ఆమె పాదాల్ని తాకుతూ తన పాదం పెట్టాడు.

"మిస్టర్! కళ్ళు కనపడ్డంలేదా! కాలు తియ్యి" శాంకరి గర్జించింది. ఆమె కంఠధ్వని ఆ కంపార్టుమెంటులో ప్రతిధ్వనించింది. ఎదురుగా కూర్చున్న వాళ్ళు, పక్కనున్న వాళ్ళు అందరూ ఆశ్చర్యంగాచూసారు.

"ఏం చేసానని అరుస్తున్నావు!" అతను కాలు తీసుకుని మరింత గట్టిగా అరిచాడు. "ముందు పక్కకి జరిగి మరీ మాట్లాడు" శాంకరి మరింత గట్టిగా అంది.

"ఇందాకటి నుంచి చూస్తున్నా! వంటరిగా ఆడపిల్ల కనబడితే చాలు. ముందు పక్కకు జరిగి మరీ మాట్లాడు" ఎదురు సీట్లో కూర్చున్న ఒక ముసలాయన లేచి వచ్చాడు. ఆయన పక్కతను కూడా లేచాడు.

"ఇంక దబాయించలేని అతను పాను నములుకుంటు లేచి మరో చోట కూర్చోడానికి సీటు వెతుకుతున్నాడు.

అంతలో టికెట్ కలెక్టరు ఎదురు వచ్చాడు.

"ఏయ్! టిక్కెట్ ఏది?"

ఆ మాట విని వినపించుకోనట్టు పారిపోబోయాడు. వెంటనే అతనిని పారిపోకుండా అతను పట్టుకున్నాడు.

ఇందాకటి ముసలాయన జరిగినదంతా అతనితో చెప్పాడు.

"అవునండీ! ఇలాటి వాళ్ళు ఎంతో మంది టికెట్ లేకుండా మంది టికెట్ లేకుండా ప్రయాణించడమే కాదు. ఆడవాళ్ళపై అత్యాచారాలు కూడా చేస్తున్నారు. నిన్నొక కంపార్టుమెంట్‌లో ఒకామె, ఒక చిన్న మూట పక్కన పెట్టుకుని కూర్చుంది. ఆమె పక్కన చేరి ఆమెను సతాయించడం మొదలు పెట్టాడు. కంపార్టుమెంటులో వాళ్ళు అందరు కలుగజేసుకుని తిడితే ఆమె నా భార్య పొమ్మన్నాడు.

"ఆమె నా భర్త కాదంటున్నా, నా భార్యని అల్లరి చేసాడు. ఏదో స్టేషన్‌లో బండి ఆగితే పోలీసుని తీసుకు వచ్చారు వాళ్ళు. అప్పుడు వాడి బండారం బయటపడింది.

"వీడు కూడా అటువంటి వాడేనండీ. పోలీసులకు పట్టించాలి" అంటూ కంపార్టుమెంటులో వాళ్ళు అరిచారు. స్టేషన్ రాగానే అతన్ని పోలీసులకు అప్పచెప్పారు.

"ఈ రోజుల్లో ఆడపిల్లలు నీలా ధైర్యవంతులు కావాలమ్మా! లేకపోతే యిలాటి రౌడీలు మరింత విజృంభిస్తారామ్మా" స్టేషన్ రాగానే "జాగ్రత్త తల్లీ" అంటు అతను దిగాడు.

అది రాజమండ్రి స్టేషన్, ఆ సందడిలో శాంకరి స్టేషన్ రావడం గమనించలేదు తర్వాత చూసుకుంది. పెట్టిచేతపట్టి గబగబకిందకిదిగింది.

శాంకారి కోసం సూర్యం, కనకం వెతుకుతున్నారు.

శాంకరిని చూడగానే వారి ముఖాలు చేటలంత అయ్యాయి.

"శాంకరీ" అంటు కౌగిలించుకుంది కనకం.

"హలో శాంకరి" సూర్యం పలకరించాడు.

"పెళ్ళికూతురు; పెళ్ళి కొడుకు యింట్లో వుండక వూళ్ళు తిరుగుతున్నారేమిటి"?

"బట్టలు కొనుక్కోడానికి వచ్చాం. నువ్వు ఈ రోజు వస్తావని తెలుసుకదా! అందుకే హొటల్లో ఫోం చేసి మాట్నీచూసి నిన్ను తీసుకు వెడదామని వచ్చాం!" అంది కనకం సిగ్గుపడుతూ.

ఆమె మాటలు విన్న శాంకరి ఆశ్చర్యపోయింది. సూర్యం వైపు చూసింది. అతను కూడా తల దించుకున్నాడు.

"అవును కనకం వూరంతా తిరగడానికి సిగ్గులేదు కాని నాదగ్గర సిగ్గెందుకే" శాంకరి నిలదీసి అడిగింది.

"ఏం లేదు కాని" ఇంక బయలుదేరు తల్లీ అంటు శాంకరి చేయి పట్టుకుంది కనకం.

ఇంతకీ మీ బట్టలేవే'' శాంకరి అడిగింది.

షాపులోనే వుంచాం. మనం ఇటునుంచే వెళ్ళాలి. వెళ్ళేటప్పుడు బట్టలు తీసుకొని వెళ్ళచ్చు" అన్నాడు సూర్యం. ముగ్గురు బయలు దేరారు.

ఆ రోజే కాసులు, సుబ్బులు వచ్చి వున్నారు. శాంకరికి ఎదురు వెళ్ళి తీసుకొచ్చారు. ఇంక వాళ్ళ కబుర్లకి అంతేలేదు.

"శాంకరీ! చిక్కిపోయావే? హాస్టలు తిండా" కాసులు అడిగింది.

"ఎంత నాజుగ్గా అయిపోయావే. ఈ చీర కట్టడమేమిటే."

"ఆ తల దువ్వుకోడమేమిటే! ఆ! ఆ! ఏం షోకు నేర్చుకున్నావే" సాగదీసింది సుబ్బులు.

"నా సంగతికేమి గాని మీ ఆయన ఏమంటున్నాడే కనకం'' శాంకరి అడిగింది.

"ఏమంటాడు. పెళ్ళాం కొంగు పట్టుకుని తిరుగుతున్నాట్ట" కాసులు సమాధానం చెప్పింది.

"పాపం సుబ్బారావు ఏం చేస్తున్నాట్ట. పెళ్ళాం జడ పట్టుకుని తిరుగుతున్నాడా!'' సుబ్బులు కోపంగా అడింగింది.

"ఇంక మీ భర్తల సంగతేనా? మీ సంగతేమైనా వుందా!" అప్పుడే అక్కడకు వచ్చిన కనకం అడిగింది.

సుశీల వాళ్ళ కబుర్లను ఆశ్చర్యంగా వింటోంది. పెళ్ళికాని పిల్లల్లాగే సరదాగా మాట్లాడుతున్న కాసుల్ని, సుబ్బుల్ని వింతగా చూసింది. వాళ్ళలో అంత వుత్సాహం ఎక్కడిదో. కావాలని పెళ్ళి చేసుకున్న భర్తలు భార్యల్ని ప్రేమగా చూస్తారేమో అనుకున్న సుశీలకు తన గతం గుర్తుకు వచ్చి కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

"ఇంక మా సంగతికేమి కాని నువ్వు పెళ్ళికాకుండానే మీ ఆయన్ని కొంగున ముడేసుకుని తిరుగుతున్నావు. నువ్వు మాకేం చెబుతావే సీరంగ నీతులు'' కాసులుమాటలు విన్నకనకం.

"ఏం నీతులు లేవుగాని భోజనాలకు రండి'' అంటు పిలిచింది. అంతకు మునుపే పెళ్ళి పిలుపులు అయిపోయాయి. ఆ రెండు రోజు లందరు పెళ్ళి వారింట్లోనే భోజనాలు.

శాంకరి స్నానం చేసి బట్టలు మార్చుకుంది. అక్క పిల్లల్ని వెంట పెట్టుకుని రాత్రి భోజనానికి బయలుదేరి వెళ్ళింది.

"స్వయంగా పెళ్ళికూతురే పిలిచింది. వెళ్ళక తప్పుతుందా'' శాంకరి వెనకే కాసులు, సుబ్బులు బయలుదేరారు.

# 38

పెళ్ళి పందిరి కలకల లాడుతోంది. విశాలమైన వీధి అంతా తుడిచి పేడనీళ్ళ జల్లి అలికి ముగ్గులు పెట్టారు. జంబుఖానాలు, తుంగ చాపలు పరిచారు. తాటాకుల పందిరికి పచ్చని మామిడి తోరణాలు రంగురంగుల కాగితాలు కట్టారు. మధ్యలో పెండ్లి మండపం పచ్చని చేమంతులతో ఎర్రని కనకాంబరాలతో ఇంద్రధనస్సులా వెలుగుతోంది.

అంతలో మంగళవాయిద్యాలు మార్మ్రోగాయి. అగరుధూమాల వాసనలు, పన్నీరు, సెంటు వాసనలు ఘుమఘుమలాడాయి. పందిరి నిండా చేరిన జనం కబుర్లు వింతగా వినబడుతున్నాయి.

అందరిలో శాంకరి పంచవన్నెల రామచిలుకలా వుంది. చిలకాకు పచ్చ పట్టుచీర కట్టింది. దాని ఎర్రని జారీఅంచు మిలమిల మెరుస్తోంది.

అదే రంగు జాకెట్టు, మెడలో వంటిపేట గొలుసు, పొడవైన వాలుజడ నగంలోనే కట్టింది. తలనిండా కనకాంబరాలు తురిమింది. వెన్నుల జుమకాలు ఆమెతో పాటు కదులుతున్నాయి.

ఆమెతో పాటె కాసులు, సుబ్బులు వున్నారు. చేతికి అందిన పని చేస్తూనే వున్నారు.

"శివా దిగాడే" కాసులు శాంకరి చెవిలో చెప్పింది.

"ఇదే చూస్తున్నాడే" సుబ్బులు మరింత మెల్లిగా చెప్పింది.

శాంకరి వులిక్కిపడింది. నిబ్బరంగా వుండడానికి ప్రయత్నం చేసింది. బ్లూసూటులో హుందాగా నిలబడి వున్నాడు శివా.

అనుకోకుండా అటు చూసింది. శివా వాడిచూపులు చురుక్కుమన్నాయి. శాంకరి తల తిప్పి మరో పక్క చూసింది.

కాసులు కుంకుమ, పసుపు అందరికీ అందిస్తోంది. సుబ్బులు అందరికి తాంబూలాల పాకెట్లు అందిస్తోంది. శాంకరి పన్నీరుబుడ్డి, సెంటుసీసా అందుకుంది. ఆడవాళ్ళందరికి పన్నీరు జల్లి సెంటు రాస్తోంది. ఆమె కదిలితే పన్నీరు వాసన గుప్పుమంటోంది.

"మనక్కూడా పన్నీరు జల్లితే ఎంత బాగుండునురా! కృష్ణశాస్త్రి గారు ఆడవాళ్ళే పూలుకోయాలి, మాలలు కట్టాలి అన్నారు. కాని అసలు స్త్రీలే పన్నీరు జల్లాలి. సెంటు పూయాలి" అన్నాడు శివా కొంటెగా.

ఆ మాటలు తనను వుద్దేసించే అన్నట్లు అర్థం చేసుకుంది శాంకరి. తల తిప్పి కోపంగా అతని వైపు చూసింది. పక్కనే కూర్చున్న శివా శాంకరి వైపు కొంటెగా చూసాడు. శాంకరి కోపం తారాస్థాయికి చేరింది. ఆడవాళ్ళ కోపం పెదవి మీదె అనట్లుగా కింద పెదవి పళ్ళతో నొక్కిపట్టింది. చేతిలో వున్న పన్నీరు బుడ్డితో ఆపకుండా అతని మీద జల్లింది.

శివకుమార్ రెండు చేతులు అడ్డుపెట్టుకుని "శాంకరీ! ఆపు! ఆపు!" అంటు మెల్లిగా అరిచాడు.

శాంకరి వినిపించుకోలేదు. అందులో పన్నీరు అయిపోయిందని తెలియగానే పంతం తగ్గి లోపలికి పరుగెత్తింది. శివకుమార్ మనస్సు గాలిలో గంతులేసింది. అది చూసిన కాసులు, కనకం మాత్రం ముసి ముసి నవ్వులు నవ్వుకున్నారు.

మంగళవాయిద్యాల మధ్యలో సూర్యం, కనకమహాలక్ష్మి మెడలో మంగళసూత్రాలు కట్టాడు. అందరు అక్షంతలు వేసారు. శాంకరి మీద అక్షంతలు పడ్డాయి. తల తిప్పి చూసింది. వెనకగా శివకుమార్. కోపంతో శాంకరి కళ్ళు ఎర్రగా మెరిసాయి. నూతన వధూవరుల చేత తలంబ్రాలు పోయిస్తున్నాడు పురోహితుడు.

శాంకరి, కాసులు, సుబ్బులు కనకం పక్క చేరారు. అది చూసి శివా, రాజు సూర్యం పక్కకు చేరారు.

ఒకపక్క వాళ్ళు కనకానికి హెచ్చరికలు చేస్తుంటే మరో పక్క వాళ్ళు సూర్యాన్ని హెచ్చరిక చేస్తున్నారు. కనకం, సూర్యం మరింత పోటాపోటీగా తలంబ్రాలు పోసుకుంటున్నారు.

శివకుమార్ నిజంగా తాను శాంకరి మీద తలంబ్రాలు పోస్తున్న భ్రాంతిలో పడ్డాడు. శాంకరినే చూస్తూ అలా వుండిపోయాడు. అతని చూపుల్ని తట్టుకోలేని శాంకరి కళ్ళు వాల్చుకుంది.

శాంకరి మారిపోయిందనుకున్నాడు శివకుమార్. "ఇంక శాంకరి తనదే" తీయని వూహలలో తేలిపోయాడు శివకుమార్. ఆ యిద్దరినీ గమనిస్తున్నారు కాసులు, సుబ్బులు. త్వరలోనే వాళ్ళిద్దరి పెళ్ళి జరిపించాలని నిశ్చయించుకున్నారు.

వధూవరులు తలంబ్రాలు పోసుకోడం పూర్తి అయింది. పెళ్ళిలో ముఖ్యమైన సందడి అదే. పైగా వయసులో వున్న యువతీ యువకుల దృష్టి ఆ తంతు మీదే. ఇక వయసు మళ్ళిన వారి సంగతి, వయసు వచ్చిన వారి సంగతి చెప్పనే అక్కరలేదు.

పిల్లల సందడి మరీను. తర్వాత అందరు అక్కడి నుంచి లేచారు. భోజనాల ఏర్పాట్లు ప్రారంభించారు. శాంకరి మంచినీళ్ళ

గ్లాసులు సర్దుతోంది. అది చూసిన శివకుమార్ అక్కడకు చేరు కున్నాడు.

"శాంకరీ! మంచినీళ్ళు యిస్తారా!" అడిగాడు చనువుగా! అతని చనువుకి శాంకరికి కోపం వచ్చింది. అయినా మంచినీళ్ళ గ్లాసు అందిం చింది. ఆమె వేళ్ళు తగిలేటట్లు గ్లాసు అందుకున్నాడు. శాంకరి పళ్ళు నూరుకుంది.

శివకుమార్ గ్లాసులో నీళ్ళు కొంచెం చేతిలో పోసుకుని ఆమె ముఖంమీద జల్లాడు. ఆ సమయంలో ఆమె ముఖాన్ని చూడాలని వున్నా ఎవరో వస్తున్న అలికిడయితే అక్కడ నుంచి తప్పుకున్నాడు. ఇందాక పన్నీరు జల్లిన సంగతి గుర్తుకొచ్చింది శాంకరికి. శివాని ఏమీ చెయ్యలేక పమిటకొంగుతో ముఖం తుడుచుకుంది.

పెళ్ళిసందడి పూర్తయ్యేటప్పటికి రాత్రి రెండుగంటలయింది. పెళ్ళి జనమంతా ఎక్కడ ఖాళీ దొరికితే అక్కడ పక్కలేసి పడుకుం టున్నారు. మగపెళ్ళివారు యింటికి వెళ్ళిపోయేరు. కాసులు, సుబ్బులు ఆ రాత్రి అక్కడే పడుకున్నారు. శాంకరి మాత్రం యింటికి బయలు దేరి వచ్చింది.

# 38

పెళ్ళి రెండురోజులు సరదాగా గడిచిపోయింది. చుట్టాలంతా చాలా భాగం వెళ్ళిపోయారు. వియ్యాలవారిద్దరూ ఒకే వూరు అవడంవల్ల ప్రయాణాల సందడిలేదు. ఆ సాయంకాలం శాంకరి, కాసులు, సుబ్బులు గోదావరి నదివైపు నడిచి వెళ్ళారు.

నీరెండ వచ్చి యిసుకతిన్నెల మీద పడుతోంది. బంగారు వన్నెలతో యిసుకతిన్నె మిలమిలా మెరుస్తోంది. చల్లని గాలి విపరీ తంగా వీస్తుంటే పమిటకొంగులు కప్పుకున్నారు. గాలికి ఎగురుతున్న ముంగురులను చేత్తో అదుముకుంటూ కూర్చున్నారు.

సుబ్బులు చిన్నపిల్లలా పిచ్చికగూళ్ళు కడుతోంది.

"శాంకరి ఒక్కమాట అడుగుతాను చెబుతావా?" అంది కాసులు.

"అడగవే"

"నీకోసం తపించే ఆ రాజకుమారుణ్ణి ఎందుకు చిన్నచూపు చూస్తావే" అంది శాంకరి

"ఎవ్వరికీ తెలీదనుకుంటోంది శాంకరి. కాసులు అలా అడిగే టప్పటికి ఉలిక్కిపడింది శాంకరి.

"రాజకుమారుడెవడే"

"ఎవరా? తెలీనట్లు నటించకు శాంకరీ! శివా వచ్చేది నీకోసం. అతను గిరిజను తిరస్కరించింది నీకోసం. నీకోసం పరితపిస్తున్నాడు. అంత మొండితనం పనికిరాదు శాంకరీ!"

"అంత అమాయకురాలిలా వుండే కాసులు ఇంత ఆరిందలా ఎప్పుడయిందా?" అనుకుంది శాంకరి.

ఎవ్వరికీ తలవంచని శాంకరి ఇప్పుడు కాసులుకి సముజాయిషీ యిచ్చుకోవలసి వచ్చింది.

"నన్నడిగే నన్ను ప్రేమించాడా?" మొండిగా అడిగింది శాంకరి.

"నువ్వు ప్రేమించమంటే ప్రేమించేదీ, నువ్వు మానమంటే మానేది ప్రేమకాదు శాంకరీ. ఎవరిని చూస్తే ఎవరి హృదయం వుప్పొంగి వురకలు వేస్తుందో ఎవరూ చెప్పలేరు అదే ప్రేమ. ఒకరిని చూస్తే ఒకరికి చెప్పలేని ప్రేమ. మరొకరికి చెప్పలేని ద్వేషం. నువ్వు లేందే అతని జీవితానికి వెలుగు లేదు. అతను లేనిదే నీ జీవితానికి సార్థకత లేదు. చంద్రుడు లేనిదే వెండి వెలుగులు లేవు. వెండి వెలుగులు లేనిదే చంద్రుడు లేడు.

గుక్క తిప్పుకోకుండా మాట్లాడే కాసుల్ని ఆశ్చర్యంగాచూసింది శాంకరి.

"కాసులూ! నాసంగతి తెలిసే యింత వుపన్యాసం ఇస్తున్నావా? మెడిసిన్ మొదటి సంవత్సరంలో వున్నా! నా చదువు పూర్తి అవ్వాలి. మాయింటి పరిస్థితి కూడా నీకు తెలుసు. నేను చదువుకి ప్రాణమిస్తానని

తెలుసు నీకు. ప్రేమకి కాదే! నా సంగతి తెలిసే ఇలా అంటున్నావంటే నాకు ఆశ్చర్యంగా వుంది కాసులు. 'అయినా నా కాళ్ళమీద నేను నిల బడాలే" "ఆ తెలిసే మాట్లాడుతున్నా శాంకరీ! నువ్వు చదువు మాన మని ప్రేమలో పడమని ఎవరూ అనరే! కాని భార్యాభర్తలు ఒకరి మీద ఒకరు ఆధారపడి జీవిస్తారు. అందులో హెచ్చు తగ్గులు లేవు. ఒకరి కొకరు బానిసలుకారు. మనలో పెరుగుతున్న ప్రేమ మరొకరికి పంచితే కాని జీవితానికి సార్థకత లేదే? అలాగే మనకోసం మరొకరిలో పెరుగు తున్న ప్రేమ మనం అందుకుంటేగాని జీవితమేలేదు."

"కాసులూ! నీకు ప్రస్తుతం ప్రేమ తప్ప మరేమీ కనబడ్డం లేదు. నా పరిస్థితి అర్థం చేసుకుని మాట్లాడవే? నాకా ప్రేమ సంగతి తెలీదు. నా చదువు సంగతి చెప్పవే?"

"శాంకరీ! అలా అనకే. నీ చదువు సంగతి అందరికీ తెలుసు. ఎవరు చదువు మానమని అనడం లేదు? శివా ప్రేమ సంగతి ఆలో చించవే? అసలు ఈ ప్రేమ ఎన్నో రకాలే. తల్లీకూతుళ్ళ మధ్య, అన్నా చెల్లెళ్ళ మధ్య, తండ్రీ పిల్లల మధ్య, గురువు శిష్యుల మధ్య, స్నేహి తుల మధ్య, ప్రేయసీ ప్రియుల మధ్య, భార్యాభర్తల మధ్య రకరకా లుగా వుంటుంది. వ్యవస్థను బట్టి అభిమానం, అనురాగం, స్నేహం, ప్రేమ, వాత్సల్యం, భక్తి అని రకరకాలుగా పిలుస్తాం తెలిసిందా! నీకు చదువు అంటే ప్రాణం. మా స్నేహం వదిలావా? నీ చదువు సాగడం లేదా?"

కాసులుకి సమాధానం చెప్పడానికి ఆలోచించింది శాంకరి. "కాసులు తనకంటే ఎంతో ఎదిగిపోయింది. లోకాన్ని ఎంతో అర్థం చేసుకుంది. జీవితానుభవమే పాఠాలు నేర్పుతుంది." అనుకుంటి మన స్సులో "కాసులూ! నువ్వు చెప్పింది నిజమే కాదనను. కానీ ప్రస్తుతం నేను ప్రేమించలేను. పెళ్ళి చేసుకోలేను. స్నేహం వేరు, ప్రేమ వేరని నేననుకుంటున్నాను. స్నేహం పాఠాలు నేర్పుతుంది. ప్రేమ పరవళ్ళు తొక్కిస్తుంది."

"శాంకరీ! నువ్వన్నది నిజమే? కాని నే చెప్పింది విను. ప్రస్తుతం పెళ్ళి చేసుకోమని ఎవరూ చెప్పరు. కాని అతన్ని కాదనకు. శివకుమార్ లాంటి వ్యక్తి నిన్ను ప్రేమించడం నీ అదృష్టంగా భావించు, అతనికి చదువుంది, అందముంది, ఆరోగ్యముంది, ధనముంది, అన్నిటికంటే ప్రధానమైనది మంచిగుణముంది. అన్నిటి కంటే మించి నిన్ను ప్రేమించే లక్షణముంది. పెద్దలంటే గౌరవముంది. తల్లి అంటే అభిమానముంది. ప్రేయసి అంటే ప్రేమ వుంది. లోకమంటే గౌరవముంది. అంతకంటే ఏంకావాలే శాంకరీ!"

"కాసులు! ఎంత సేపు శివకుమార్ సంగతే చెబుతావు. కానీ నా సంగతి చెప్పవేమే. అతని కంటే నాకేమి తక్కువ? చదువుంది, అందముంది, తెలివివుంది." అంది నవ్వుతూ.

"శాంకరీ! నీకులేదని ఎవరు అనడం లేదే? నీకు కూడా అతనితో పాటు అన్ని వున్నాయి. కనుకనే ఈడుజోడు బాగుంది అంటున్నా. ఒకరి కొకరు అన్ని విధాల తగివున్నారు. అందుకేనా ఈ కంఠ శోష."

"నన్ను ఆలోచించుకోనీ కాసులూ. అయినా ప్రస్తుతం నాకు ఈ ప్రేమ కంటే చదువే ముఖ్యం. చదువే నాకు ప్రాణం."

"మక్కె మొదటికి రాకు. శివా సంగతి ఆలోచించు. చదువు మానమనడం లేదు. చదువుతో పాటే ప్రేమ కూడా! నీ చదువు పూర్తి అయ్యేటప్పటికి మీ ప్రేమ ముదిరి పాకాన పడుతుంది. అప్పుడే పెళ్ళి చేసుకోండి" అంతవరకు వారి మాటలు వింటూ కూర్చొంది సుబ్బులు. శాంకరికి చదవంటే ప్రాణమని ఆమెకు తెలుసు. ఈ ప్రేమలో పడితే శాంకరి చదువు ఎక్కడ కుంటు పడుతుందోనని సుబ్బులు భయం. అందుకే ఆ విషయంలో జోక్యం కలగ జేసుకోకుండా దూరంగా కూర్చుంది. శాంకరి సమాధానాలు విని నవ్వుకుంది. ఏదైనా శాంకరి అందరి కంటే చాలా తెలివైంది. ఆమె అభిప్రాయం కాదనకూడదని ఆమె అభిప్రాయం.

"ఇంక చీకటి పడుతోంది. కాసులూ నీ ఉపన్యాసం పూర్తయిందా? ఇంటికి వెడదాం" అంది సుబ్బులు.

"నా మాటలు నీకు ఉపన్యాసంలా వుందా! సాతల్లే? ఇంకలే యింటికి పోదాం" కాసులు లేచింది.

ముగ్గురు యింటి వైపు బయలు దేరారు.

"అమ్మా! డాటరమ్మా! బాగున్నావా?" దారిలో కాలరి రంగన్న కనబడి అడిగాడు.

"ఆ బాగున్నా రంగన్నా నువ్వెలా వున్నావూ?"

"నాకేం అమ్మా! బాగానే వున్నా! ఎప్పుడు చదువు పూర్తవుతోందమ్మా! ఇక్కడే మందులివ్వాలమ్మా"

"ఇంకా అయిదేళ్ళు చదువాలి. మందులిక్కడే యిస్తుందిలే." సుబ్బులు సమాధానం చెప్పింది.

"మంచిదమ్మా!" రంగన్న ముందుకు నడిచాడు.

ఆ రాత్రి శాంకరి కంటికి నిద్రరాలేదు. ఒక పక్క శివా రూపం కళ్ళ ముందు కదులుతోంది. మరో పక్క కాసులు మాటలు చెవుల్లో హోరుమంటున్నాయి. ఒక పక్క శివా తీసుకునే చనువుకి కోపం మరోపక్క మధురానుభూతులు మనసును గిలిగింతలు పెడుతున్నాయి.

మరునాడు ఉదయం కాసులు, సుబ్బులు అత్తవారిళ్ళకు ప్రయాణమయ్యారు. వెళ్ళేముందు కాసులు శాంకరిని మరోసారి హెచ్చరించి మరీ వెళ్ళింది. శాంకరి నవ్వుకుంది. ఆరోజే శివకుమార్ ప్రయాణం. సూర్యంతో కలిసి శివకుమార్ శాంకరి యింటికి వచ్చాడు. వెంట కనకం కూడా బయలుదేరింది. రామనాథం గారు గుమ్మంలోనే ఎదురయ్యారు. "రండి! రండి!" అంటూ లోపలికి పిలిచారు.

చక్కటి పొడవు, తగిన లావుతో చక్కని రంగుతో వుండాగా కనపడే శివా అంటే ఆయనకు చాలా యిష్టం. మునపటికంటే అతనిలో మరింత అందం వచ్చింది. పెళ్ళిలో అతన్ని చూసింది మొదలు ఆయన

దృష్టి శివా మీదే వుంది. శాంకరి పక్కన శివా ఎంతో బాగుంటాడు అనుకున్నాడాయన.

"నమస్కారమండీ" రెండు చేతులు జోడించి నమస్కరించాడు శివా.

"మీనాన్న గారు పోయారని తెలిసింది బాబూ! వయసు రాకుండానే వెళ్ళిపోయారు."

తండ్రి మాట తల పెట్టేటప్పటికి అతని కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"మీ అమ్మగారు ఎలావున్నారు బాబూ" అన్నపూర్ణమ్మగారు అతిగారు.

"కులాసాగానే వున్నారండీ"

"వస్తామండీ" శివా, ఆ దంపతులకు నమస్కరించాడు.

"మంచిది నాయనా" రాపనాథంగారి మాట పూర్తికాకుండానే శివా, సూర్యం వీధి గుమ్మం దాటాడు.

వీధుల్లో రిక్షా నిలబడివుంది. అతని సామాను అందులోనే వుంది. శివా రిక్షా ఎక్కాడు. ఎంత చెప్పినా వినకుండా సూర్యం సైకిలు మీద బయలు దేరాడు. రిక్షా కదులుతోంది. శివా శాంకరకోసం వెతికాడు. వీధి అరుగు మీద నిలబడి వుంది. శివా ముఖం విప్పారింది. అతని పెదవులపై చిరునవ్వు నిలిచింది. అనుకోకుండా చెయ్యి వూపాడు. అనుకోకుండా చెయ్యి వూపింది శాంకరి. అతని హృదయం ఆనందంతో రెపరెప లాడింది. రిక్షా ముందుకు కదిలింది.

# 39

హఠాత్తుగా దుర్గమ్మగారికి తిరిగి జబ్బు చేసింది. ఆ రాత్రి ఆవిడ బ్రతుకు తుందనుకోలేదు. డాక్టరు వచ్చి చూసి తెల్లవారితే తప్ప చెప్ప లేమన్నాడు. ఇంజక్షన్ చేసి మందులు రాసిచ్చి వెళ్ళాడు.

ఎవరు యిచ్చినా ఆవిడ మందులు మింగలేదు. శాంకరి బ్రతిమాలితేనే వేసుకుంది.

రామనాథంగారు వెంటనే తమ్ముడికి కబురు చేశాడు.

దుర్గమ్మ గారికి బ్రతకనని తెలిసిపోయింది. ఆవిడకు చావంటే భయం లేదు. అంత రోగంలోను ఆవిడ "రామ,రామ" అంటూనే వుంది.

"పడుకో నాయనమ్మా!" అని శాంకరి పదేపదే చెప్పింది. "ఇంక ఒక్కసారే ఏకంగా పడుకుంటానమ్మా" అంటూ ఆవిడ సమాధాన మిచ్చింది.

ఆ రాత్రి తల్లితండ్రులతో పాటు శాంకరి కూడా నాయనమ్మ దగ్గరే కూర్చుంది.

తెల్లవారకట్ల అన్నపూర్ణమ్మగారిని, రామనాథంగారిని దగ్గరకు పిలిచింది దుర్గమ్మ.

"అదుగో గంధర్వులు వీణలు మీటుతూ నన్ను పిలుస్తున్నారు. అదిగో పూలరథం వస్తోంది. నే వెళ్ళిపోవాలి" అంటూ చెప్పింది.

ఆవిడ తెలివితో చెబుతుందో లేక పలవరిస్తోందో వారికి ముందు అర్థం కాలేదు.

"రామనాథం ఏకాదశి ఘడియలు ఎప్పుడొస్తాయి" ఆవిడ తెలివి లోనే మాట్లాడుతోందను కున్నారు అందరు.

రామనాథంగారు పంచాంగం పట్టుకొచ్చి చూసారు.

"ఉదయం వస్తుందమ్మా! అయినా ఎందుకడుగుతున్నావు" ఆయన బాధగా అడిగాడు.

"ఏం లేదురా! నన్ను కింద పడుకో పెట్టండిరా" అంది.

"అదేమిటమ్మా! అలా అంటున్నావు."

"నీకు తెలీదురా! చాపమీద పడుకోపెట్టండిరా" అంది. దొడ్డి వరండాలో చాప పరిచారు. దాని మీద దుప్పటి పరుస్తుంటే ఆవిడ వద్దని చెప్పింది.

అందరు కలిసి సాయం పట్టి చాపమీద పడుకో పెట్టారు. అప్పటికి ఇరుగుపొరుగు లంతా వచ్చి చేరారు. రెండవ కొడుకు కూతురు బండి దిగారు.

అప్పటికే ఏకాదశి ఘడియలు వచ్చాయి. దుర్గమ్మగారికి ఎగ పూపిరే కాని దిగపూపిరి లేదు. చిన్నకొడుకు, కూతురు తల్లిమీద పడి ఏడ్చారు. అన్నగారు కింద పడుకోపెట్టాలని మంచం కోసం కక్కుర్తి పడ్డాడని అన్నారు.

అంత అయాసంలోను దుర్గమ్మగారు తానే పడుకోపెట్టమన్నానని చెప్పింది. పెద్దన్నగారు చాలా మంచివాడని తనను బాగా చూసుకున్నాడని చెప్పింది. తర్వాత మాట్లాడ్డానికి ఆవిడకు మాట రాలేదు.

ఆవిడ చేతినున్న వుంగరం, మెడలో నున్న మంచి పొగడాల మాల తీసి శాంకరికి యిచ్చింది.

మేనత్తకిమ్మని చెప్పింది శాంకరి.

ఎవరికి యివ్వకు నువ్వే వేసుకోమని చెప్పింది దుర్గమ్మ, తర్వాత తులసి తీర్థం పొయ్యమంది. తులసి తీర్థం పెద్దగిన్నెడు తాగింది. మిగిలినవి మింగుడు పడక నోటినుండి కారి పోయాయి. ఆవిడ కళ్ళు తేలవేసింది. ఆవిడ ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయాయి. ఎందరి ప్రాణుల జీవనవాయువులు అందులో కలిసినా ఆ అనంత వాయువు బరువు ఎక్కదు. అన్నిటిని తన గర్భంలో కలుపుకుని అతి తేలికగా వయనిస్తూనే వుంటుంది.

ఎవరి దుఃఖం వారిది. ఆవిడ సంతానం, వారి సంతానం, ఆవిడ చుట్టూ చేరి ఏడ్చారు. ఆవిడకు వారి ఏడుపులతో పనేలేదు. అసలు ఆ జీవికి ఆ శరీరంతో పనేలేదు. ఆ జీవి ఎక్కడకు వెళ్ళిపోయిందో ఎవరికీ తెలియదు.

రామనాథంగారి చేతిలో పైసాలేదు. ఎవరినో అడిగి అప్పుపట్టుకొచ్చి దహన సంస్కారాలు పూర్తిచేసి యింటికి వచ్చారు.

ఆ సాయంకాలమె చెల్లెలు, తమ్ముని భార్య. దుర్గమ్మగారి సొమ్ము కాజేసారని రామనాథం గారిని, అన్నపూర్ణమ్మగారిని నిందించారు.

"అదేమిటే! అలా అంటారు. దుర్గమ్మక్కా దగ్గర ఏముందనే? పైగా సంవత్సరం నుంచి ఆవిడ మంచం మీద వుంటే మీరు వచ్చి తొంగిచూడలేదు. ఆవిడ ఖర్చులకు పైసా యివ్వలేదు. అంతా రామనాధమే పెట్టుకున్నాడు కదే! పైగా ఆవిడ మందులకు, మాకులకు ఎంతైందో తెలుసా? అన్నపూర్ణ చాకిరీ చెయ్యలేక సగమయింది. ఒక్క కూతురివికదా! ఏనాడైనా తల్లికి చాకిరీ చేసావే! ఇప్పుడిలా అనడానికి మీకు నోరెలా వచ్చిందే" రామనాధంగారి పినతల్లి దులిపేసింది. ఆవిడ పక్కవూళ్ళోనే వుంటుంది. అందుకే అన్ని విషయాలు చెప్పింది. ఆవిడకు సమాధానం యివ్వలేని వాళ్ళు మెల్లిగా అక్కడ నుంచి జారుకున్నారు.

రావలసిన చుట్టాలంతా వచ్చారు. తమ్ముడు భార్యా, చెల్లెలు వచ్చివారందరితో రామనాధంగారు డబ్బు, బంగారం కాజేసాడని చెబుతూనే వున్నారు. నమ్మినవాళ్ళు "అయ్యో! అలాగా! పైకి ఎంత మంచి వాళ్ళే! యింత పని చేసారా" అంటూ ముక్కు మీద వేలేసుకున్నారు.

"నమ్మని వాళ్ళు అదేమిటమ్మా! దుర్గమ్మగారికి బంగారం ఎక్కడిది? డబ్బెక్కడిది? పాపం రామనాధమే చూసాడు" అన్నారు. మనకెందుకు అనుకున్న వాళ్ళు "అలాగా! మాకేమీ తెలీదమ్మా" అంటు తప్పించుకు తిరిగారు. పన్నెండు రోజులు ముళ్ళమీదే వున్నట్టు వున్నారు. తర్వాత రామనాధంగారితో కొట్లాడి. తమ్ముడు భార్యా పిల్లలతో వెళ్ళిపోయాడు. చెల్లెలు శాపనార్ధాలు పెట్టి వెళ్ళిపోయింది.

మొత్తం ఖర్చంతా రామనాధం గారి నెత్తినే పడింది. తమ్ముడేమైనా సహాయం చేస్తాడనుకున్నాడు ఆయన సహాయం పోగా అపనిందలు వేసి వెళ్ళిపోయాడు. డబ్బులేక అందరి దగ్గర అప్పులు చేసి ఏదో విధంగా డబ్బు సర్దుబాటు చేసుకున్నాడు. తర్వాతైనా అప్పుతీర్చాలి. లేకపోతే వడ్డీలు కట్టాలి. వెంటనే ఒక అరెకరం భూమి బేరం పెట్టారాయన.

అది తెలిసిన జగన్నాధంగారు చాలా బాధపడ్డారు. "ఒరే సూర్యం! ఇంకా అమ్ముకుంటే ఏం పెట్టుకు ఈ రామనాధం తింటా

మరా: అదేమిటో వెళ్ళి కనుక్కు రారా:" జగన్నాథంగారు కొడుకుని పంపారు. సూర్యం రామనాథంగారిని ఆ విషయం అడిగాడు.

"నిజమే సూర్యం! అరెకరం బేరం పెట్టాను. ఇప్పుడు చేసిన అప్పు తీర్చాలి. పైగా రేపు శాంకరిని కాలేజీకి పంపాలి. మళ్ళీ అప్పు చెయ్యడం కష్టం అందుకే బేరం పెట్టాను." రామనాథం గారు సమాధానం చెప్పారు.

"అలాగా మామయ్యా! మొత్తం ఎంత డబ్బు అవుతుంది."

"మొత్తం పదివేలుండాలి సూర్యం"

"అలాగా! నాన్నగారితో చెప్పి వస్తా: భూమి అమ్మకు. నాన్నగారే అడిగి రమ్మన్నారు" సూర్యం తిరిగి వెళ్ళిపోయాడు. సూర్యం తండ్రితో వివరంగా చెప్పాడు.

"అయితే పదివేలు ఆయనకు ఇచ్చిరా! డబ్బున్నప్పుడు సర్దుబాటు చెయ్యమను." జగన్నాథంగారు పదివేలు యిచ్చి కొడుకును పంపించారు.

రామనాథంగారు ఆ డబ్బు తీసుకోడానికి సిగ్గుపడ్డారు. అయినా తప్పలేదు. డబ్బు తీసుకున్నారు. భూమి కాగితాలు అతని చేతిలో పెట్టబోయాడు. కాని సూర్యం అందుకోలేదు.

"వస్తాను మామయ్య"! అంటూ వెళ్ళిపోయాడు

రామానాథంగారు ఆ తండ్రికొడుకుల మంచితనాన్ని భరించలేకపోయారు. ఆయన కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అందతా చూస్తున్న అన్నపూర్ణమ్మగారు ఆశ్చర్యపోయింది. తోడికోడలు, ఆడబడుచు నానా మాటలు అన్నా ఆవిడ పల్లెత్తుమాట అనలేదు. తనని కాదన్నట్లే మసులుకుంది. సుశీల, శాంకరి వాళ్ళకు సమాధానం యివ్వబోతే వాళ్ళని మందలించింది. తన ఓర్పే తనకురక్షని ఆవిడ నమ్మకం.

దుర్గమ్మగారు పోయిన తరువాత యిల్లంతా బోసి పోయినట్లయింది. రామనాథంగారికి తోచడం లేదు. అన్నపూర్ణమ్మకు చేతిలో పనే

తేనట్లుంది. సుశీల పిల్లలు మాత్రం మరింత అల్లరి చేస్తున్నారు. వారి అల్లరి భరించడమే కష్టంగా వుంది వారికి.

శాంకరి వాళ్ళను కోపం చేసేది. సుశీలకు భయం చెప్పటం చేతకాదు. అందుకు అక్కను కూడా కోపం చేసేది శంకరి. పై యిద్దరి పిల్లల్ని ఎలిమెంటరీ స్కూల్లో జాయిన్ చేసింది శాంకరి. రోజూ సాయంకాలం వాళ్ళకి చదువు చెబుతానంది కనకం. మూడో పిల్లకి ఇంకా స్కూలుకు వెళ్ళే వయస్సు రాలేదు. కనకం చేతిలో బెత్తంచూసి పిల్లలు కాస్త భయపడుతున్నారు. కాస్త చెప్పింది రాయడం, చదవడం ప్రారంభించారు. కనకం వారిని లొంగతీయగలదనే ధైర్యం శాంకరికి కలిగింది.

కనకం, సూర్యం ఎంతో అన్యోన్యంగా వుంటున్నారు. కనకం లేందే సూర్యానికి నిత్య జీవితమే లేదు. 'కనక' మనే పేరు అతని నాలుక మీద నానుతునే వుంటోంది.

జగన్నాధంగారు, భార్య కూడా కోడలిని చూసుకుని మురిసి పోతున్నారు. వంటింటి పనుల్లో, ఇంటి పనుల్లో కనకం అత్తగారికి తోడుగా వుంటోంది. ఇంటి పద్దులు రాయడం, కూలీల డబ్బు లెక్క కట్టడం కనకానికే అప్పజెప్పారు మామగారు.

"మాయింటి మహాలక్ష్మి" అంటూ పొంగిపోతున్నారు.

అ జంటను చూస్తే శాంకరికి కూడా చాలా సంతోషమనిపించింది. కనకం తల్లితండ్రులు కూడా "తమ పిల్ల అదృష్టవంతురాలని" మురిసి పోతున్నారు. పైగా కళ్ళముందే వుంది పిల్ల. రెండిళ్ళవతలే పుట్టిల్లు వున్నా కనకానికి ఒక్కరోజు అక్కడకు వెళ్ళివుండడానికి తీరుబడేలేదు.

డబ్బు సర్దుబాటు కాగానే శాంకరి వైజాగ్‌కు ప్రయాణమయింది. ఈ మాట రామనాధంగారే స్వయంగా వచ్చి దిగబెట్టి వస్తామన్నారు. శాంకరి ఒప్పుకోలేదు.

"అనవసరంగా రానుపోను చార్జీలకు డబ్బు ఖర్చవుతుంది. పైగా బోల్డంత శ్రమ. మీరు రాకండి" అంటూ తండ్రిని వారించింది శాంకరి.

శాంకరికి తోడుగా కనకం, సూర్యం రాజమండ్రి వరకు బయలుదేరారు. రాజమండ్రిలో కావల్సిన వస్తువులు కొనుక్కొని సినిమా చూసి రావచ్చని వారి వుద్దేశం. అది తెలిసి శాంకరి నవ్వుకుంది.

జగన్నాథంగారు, భార్యాకూడా కొడుకు, కోడలు చిలకాగోరింకల్లా తిరుగుతుంటే చూడాలని సరదా పడుతున్నారు. అన్నీ కలిసి వస్తున్నాయి.

హోటల్లో అందరికీ యిమ్మని అరటిపండ్లగెల రైల్లో పెట్టించాడు సూర్యం.

శాంకరి వద్దంటున్నా వినలేదు.

రైలు కదిలే వరకు కనకం గలగల కబుర్లు చెబుతూనే వుంది. విశాపట్టణం రమ్మని యిద్దరిని ఆహ్వానించింది శాంకరి. తప్పకుండా వస్తామన్నారు ఆ దంపతులు.

తీరా రైలు కదులుతుంటే కనకం వెక్కి వెక్కి ఏడ్చింది. శాంకరి కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

"చిన్న పిల్లలా ఏడిస్తే ఎలా" సూర్యం మందలించాడు.

రైలు కదిలి వేగం అందుకుంది. శాంకరి చెయ్యి వూపింది.

ఆమెతో పాటు సూర్యం కూడా చెయ్యి వూపాడు. రైలు వేగంగా ముందుకు వెళ్ళింది. ఏడుస్తున్న కనకం కళ్ళు తుడిచి నడిపించుకుంటూ వెళ్ళాడు సూర్యం.

## 40

కాలేజీలో శాంకరి అంటే అందరికి ప్రత్యేకమైన అభిమానం ఏర్పడింది. అందులో జయరాంకి మరింత యిష్టం కలిగింది. ఆ యిష్టం ఎటువంటిదో ఎవరికీ తెలియదు. అతను కూడా బాగా చదివే వాళ్ళలో ఒకడు, వైద్యశాస్త్రానికి సంబంధించిన ఎన్నో విషయాలు జయరాం శాంకరితో చర్చించేవాడు. శాంకరి కూడా ఎంతో విపులంగా చర్చించి చెప్పేది. దాని మూలంగా శాంకరి అంటే అతనికి మరింత అభిమానం ఏర్పడింది.

ఒక రోజు క్లాసు అయిపోగానే శాంకరి హాస్టల్ వైపు వెడుతోంది. ఆమెను చూసిన జయరాం ఆమెకు ఎదురువెళ్ళి "హలో! శాంకరీ!" అన్నాడు.

"హలో రాం"

"ఒక్కరే వెడుతున్నారు."

"మీరు తోడు వస్తారని" కొంటెగా అంది శాంకరి.

"దానికేం! అలాగే వస్తా" ఆమెతో పాటు నడవడం మొదలు పెట్టాడు.

"ఏదో సరదాకఅన్నా! మీకు పనుందేమో వెళ్ళిరండి"

"మీతో రావడం కంటే నాకు ముఖ్యమైన పని ఏముంటుంది" ఆమె వక్కనే నడవడం మొదలు పెట్టాడు.

"ఈ మగవాళ్ళు అందరూ ఇంతే. తమ ధోరణే తమది. తమ యిష్టమే తెలుసు వారికి. ఎదుటివారి యిష్టాయిష్టాలతో పనేలేదు. పైగా బలవంతంగా తమవైపు లాక్కుంటారు" శాంకరి కళ్ళముందు శివా నిలిచాడు.

"చంద్రునివలె ప్రసన్నమైన మీ ముఖమండలం మధ్య మధ్యలో మేఘాచ్ఛాదితమైనట్లు కనబడుతోంది" అన్నాడు కవిత్వ ధోరణిలో.

"ఎవరే దృష్టితో చూస్తే వారికలా కనబడుతుంది నా ముఖం" అంది శాంకరి పళ్ళు నూరుకుంటూ.

"అయితే నా దృష్టికి పరీక్ష అన్నమాట"

"అన్నమాట కాదు వున్నమాటే" ఆమె మాటలు అర్థం చేసుకో లేక తికమక పడ్డాడు రాం.

"కాసేపు గార్డెన్‌లో కూర్చుందాం రండీ" రాం ప్రతిమాలాడు.

"కాస్త చనువిస్తే చాలు. ఈరోజు గార్డెన్ అంటారు. రేపు సినిమా అంటారు. ఈ మగవాళ్ళు అందరూ ఇంతే! మాయల పకీరులు. వీళ్ళ ఆటలు నా దగ్గర సాగవు." శాంకరి గొణుక్కుంది.

"ఏమిటి నన్ను తిట్టుకుంటున్నారా! హాస్టల్ వరకు వస్తాలెండి" అతని మాటలకి శాంకరికి మరింత చికాకు వచ్చింది.

"నేనేం చంటి పాపాయిని కాదు! చెయ్యి పట్టుకొని దిగబెట్టటానికి నేను వెళ్ళగలను."

"చిన్న పిల్లలయితే భయమెందుకండీ! వయస్సులో వున్నారు కదా! అందుకే 'తోడు' అవసరమండి" అన్నాడు. తోడు అన్న మాట నొక్కి పలుకుతూ.

"నాకు తోడులు చాలా వున్నాయండి. ఇవిగో కాళ్ళు, చేతులు, చెవులు, కళ్ళు. ఈ తోడులు చాలండి నాకు. మీరేమి భయపడకండి. నాకేంభయం లేదు." శాంకరి వడివడిగా ముందుకు అడుగులు వేసింది.

ఇంతలో లత ఎదురై యిద్దరిని పలకరించింది.

లత వారిద్దరి మధ్యన నడవడం ప్రారంభించింది. శాంకరి ముఖం కోపంగా వుందని గ్రహించింది లత. కారణం ఆమెకు అర్థం కాలేదు.

"ఈ మహానుభావుడు వదిలేటట్టులేడు" విసుక్కుంది శాంకరి.

"మీరు శలవులకి వెడుతున్నారా!" లతను అడిగాడు రాం.

"ఇక్కడ వుండి ఏం చెయ్యాలి? శలవుల్లో మా బావ ఫారిన్నుంచి వస్తున్నాడు" సంతోషంగా చెప్పింది లత.

"అలాగా! నాక్కూడా మరదలు వుంటే ఎంత బాగుండును." అన్నాడు రాం శాంకరి వైపు తిరిగి. శాంకరి మాట్లాడలేదు.

"దానికేం లోటు. ఎక్కడ చూసినా ఆడపిల్లలే. ఒక మరదల్ని సంపాదించండి" లత సమాధానమిచ్చింది.

"మన కిష్టమైన వారు అంగీకరించాలి కదండీ"

"మీకు నచ్చితే చాలదండీ! ఆమె దృష్టిలో మీరు పడాలి కదా!" శాంకరి సూటిగా సమాధానమిచ్చింది.

"అది నిజం శాంకరీ" అంది లత.

ఆ మాటలు విని జయరాం కాస్త కంగారు పడ్డాడు.

"అది నిజమేనండీ" అన్నాడు లేని నవ్వు తెచ్చుకుని. అతని ముఖం పాలిపోవడం శాంకరి గ్రహించింది.

"శాంకరి సామాన్యురాలు కాదు ఒక పట్టాన ఎవరిని నమ్మదు" అనుకున్నాడు.

అంతలో హాస్టల్ గేటు రానే వచ్చింది.

"ఇంక వెడతానండి"

"టా! టా!" అన్నారు శాంకరి, లత. రాం వెనక్కి తిరిగాడు. శాంకరి, లత రూముకి చేరుకున్నారు.

అప్పటికే అపర్ణ వచ్చి రూములో పడుకునివుంది.

శాంకరి, లత వచ్చి చేతిలో పుస్తకాలు టేబులు మీద పడేసి మంచం మీద నడుములు వాల్చారు.

"శాంకరీ! జయరాం అంటే నీ కెందుకే అంతకోపం. అతనంటే ఎవరనుకుంటున్నావు. అతనికి కావలసినంత డబ్బుంది, అందముంది అందుకే అతనంటే ఆడపిల్లలు పడిచస్తారు" అంది లత.

ఆ మాటలు విన్న అపర్ణ ఠక్కున లేచి కూర్చుంది. అలాంటి కబుర్లంటే అపర్ణకు చాలా యిష్టం.

"పడి చావనీ! మనకెందుకు లతా" శాంకరి సమాధానమిచ్చింది.

"ఎవరబ్బా!" అపర్ణ కుతూహలం దాచుకోలేక అడిగింది.

"ఇంకేవరు మన జయరాం! శాంకరి అభిమాని" లత చెప్పింది.

"నా అభిమాని ఎందుకవుతాడు? అతనెవరో నాకవసరం లేదు. క్లాసుమేటు కనుక చదువు విషయాలు చర్చిస్తాం. మంచి చెడ్డలు అడుగుతాం. అంతేకాని అతని సొంతవిషయాలతో మన కేం పని!"

"శాంకరీ! మన కేంపనీ లేదుకాని ఏదో పొరపాటున అన్నా! ఇంతకీ నా సంగతి అడగవేం శాంకరీ!"

"అందుకా తల్లీ! ఇందాకటినుంచి ఈ పురాణమంతా! సరే అడి గాను చెప్పు" "మా బావ ఇంజనీరు చదివి ఫారిన్ వెళ్ళాడు. ఈ శల వుల్లో వస్తున్నాడని మా అమ్మ రాసింది. మా బావ అంటే నాకు చాలా ఇష్టం."

"నీకు యిష్టం సరే లతా! మరి మీ బావ సంగతో!" "మా బావకు నేనంటే చాలా యిష్టం." "అలాగా! ఆ విషయం మీ బావని ఎప్పుడైనా అడిగావా?"

"లేదు. చిన్నప్పటి నుంచి మా యిద్దరికీ పెళ్ళి చెయ్యాలని అందరు అనుకుంటున్నారు. ఆ విషయం మా బావకి తెలుసు. అందుకే మా బావ నాతో చాలా సరదాగా వుంటాడు." అంది లత మురిసిపోతూ.

"నీపని బాగానే వుంది! ఇంక నీకు చదువెందుకే. చదువు మానేసి పెళ్ళి చేసుకో! హాయిగా కాలేజీలో ఒక సీటు ఖాళీ అవుతుంది. హాస్టల్లో ఒక బెడ్ ఖాళీ అవుతుంది" అంది అపర్ణ.

"నీతో నేనేం చెప్పలేదులే?" అంది కోపంతో లత.

"అపర్ణ చెప్పింది నిజం లతా! మీ బావని పెళ్ళి చేసుకుని ఫారిన్ వెళ్ళిపో! ఇంక నీకు చదువెందుకు?" శాంకరి అపర్ణ మాటలను సమర్థించి చెప్పింది.

"నా పెళ్ళి కేంకాని! నీ సంగతి చెప్పవేం" శాంకరిని బలవంతం చేసింది చెప్పమని.

"ఇంకా చేరి సంవత్సరం కాలేదు. ఇంకా మొదటి సంవత్సరం లోనే వున్నాం. చదువు పూర్తయ్యాక నా పెళ్ళి" అంది శాంకరి.

"అప్పుడు హవుస్ సర్జన్! తర్వాత ఎం. డి. తర్వాత ఉద్యోగం సంపాదన" ఇంక పెళ్ళెప్పుడే? జుట్టు పండిపోతుంది. ముసలితనం వచ్చేస్తుంది. అప్పుడింక పెళ్ళెందుకు?"

అపర్ణ ముసలిదానిలా యాక్షన్ చేసి చూపించింది. శాంకరి, లతలు పక పకా నవ్వారు.

అంతలో భోజనాలవేళయింది. బట్టలు మార్చుకుని ముగ్గురు డైనింగ్ హాలు వైపు నడిచారు.

# 41

శివకుమార్‌కి శాంకరి తనదే అన్న నమ్మకం ఏర్పడింది. కొండంత వుత్సాహంతో యింటికి చేరుకున్నాడు. "పెళ్ళి బాగా జరిగిందిరా!" రాజేశ్వరమ్మగారు కొడుకు ఉత్సాహం చూసి అడిగింది.

"చాలా బాగా జరిగిందమ్మా! అక్కడందరు నిన్ను అడిగారు. నువ్వు కూడా వస్తే చాలా బాగుండేదమ్మా!"

"పోనీలే ఈసారి వెడదాం! సూర్యం పెళ్ళి శాంకరితో ఎందుకు కాలేదురా!" ఆవిడ జ్ఞాపకం పెట్టుకుని అడిగింది.

"సూర్యం పెళ్ళి శాంకరితో ఎలా అవుతుందమ్మా! శాంకరి చాలా తెలివైంది. పైగా మెడిసిన్ చేస్తోంది. బాగా అందమైంది కూడా! ఆమె సూర్యాన్ని చేసుకోనందటమ్మా!"

"అలాగా" ఆశ్చర్యంగా అడిగింది.

"శివాకు ఆ పిల్లే తగిన పిల్ల, అయినా శివా మనస్సులో ఒక వేళ శాంకరి వుందేమో? అందుకే గిరిజను కాదన్నాడా" ఆమె ఆలోచనలు పరి పరి విధాల పోయాయి.

"అవునమ్మా! ఆ పిల్లను చేసుకునే వాడెవడో చాలా అదృష్ట వంతుడు!"

"నువ్వు మెచ్చుకున్నావంటే నిజంగా ఆ పిల్లను చూడవలసిందేరా"

"దానికేం అలాగే వెళ్ళి చూడమ్మా!"

"ఉత్తినే వెళ్ళి చూడ్డానిక్కాదురా! ఈ యింటి కోడలిగా చూసి రావాలని"

"ఓ అదా! శాంకరి ఇంకా మెడిసిన్ మొదటి సంవత్సరం చేస్తోందమ్మా! ఆమె అప్పుడే పెళ్ళి చేసుకోదమ్మా! కోడల్ని తర్వాత వెతుక్కుందు గానిలే"

"నేను వెతికేదేమిట్రా! నువ్వే కోడల్ని వెతికి తీసుకొద్దువుగాని" కొడుకు మనస్సులో శాంకరి వుందనే నమ్మకం ఆవిడకు ఏర్పడింది.

శివకుమార్ నవ్వుకుంటూ అక్కడ నుంచి వెళ్ళి పోయాడు. ఆ రాత్రి శివకుమార్ కంటికి నిద్రరాలేదు. చాలాసేపు శాంకరిని గురించే ఆలోచించాడు. "శాంకరికి ఉత్తరం రాస్తే ఎలావుంటుంది" అన్న ఆలోచన అతనికి వచ్చింది. వెంటనే లేచి కూర్చున్నాడు. శాంకరికి వుత్తరం రాయడం మొదలు పెట్టాడు. ఎంతసేపు ఆలోచించినా ఏం రాయాలో తోచలేదు. ఏం రాస్తే బాగుంటుందో తెలియలేదు. తర్వాత ఆమెకు ఏం రాస్తే కోపమొస్తుందోనని భయపడ్డాడు. ఏదైన వుత్తరం రాసి చూద్దామనుకున్నాడు.

ఆలోచించి ఆలోచించి "డియర్ శాంకరీ!" అంటూ సంబోధన చేశాడు. మృదు మధురమైన పదాలతో కవిత్వ ధోరణిలో రాద్దామనుకున్నాడు. మళ్ళీ ఆమె ఉత్తరం చదవకుండానే చింపి అవతల పడేస్తుందేమోనన్న అనుమానం వచ్చింది. మొదటి ఉత్తరం సింపుల్‌గా రాయడమే మంచిదనుకున్నాడు. "శ్రద్ధగా చదువుతున్నావనుకుంటా మొదటి సంవత్సరం పరీక్ష లెప్పుడు? శలవులు ఎప్పుడిస్తారు? వీలున్నప్పుడు వైజాగ్ వస్తాను. మా అమ్మగారు నిన్ను చూడాలని కలవరిస్తున్నారు. వీలుంటే సమాధానం రాయి. అడ్రస్ రాస్తున్నాను."

ఇట్లు
శివకుమార్.

ఉత్తరం రాయడం పూర్తిచేసి తలకింద పెట్టుకున్నాడు. తర్వాత హాయిగా నిద్రపోయాడు. మరునాడు పొద్దుటే ఉత్తరం పోస్టు చేసి వచ్చాడు.

ఉత్తరం చదివి శాంకరి సమాధానమిస్తుందా?" ఉత్తరం పోస్టు చేసాక ఎందుకో అతనికి కాస్త కంగారుగా అనిపించింది.

"అనవసరంగా ఉత్తరం రాశానేమో? వెళ్ళి చూసి రావచ్చు కదా" అనుకున్నాడు, అంతలోనే అతనికి కోపంతో వున్న శాంకరి రూపం కళ్ళముందు నిలచింది. నవ్వుకున్నాడు శివా.

అంతలో గిరిజ, సత్యం వచ్చారు. ఇద్దరిని సంతోషంగా ఆహ్వానించింది రాజేశ్వరమ్మ.

"ఏరా! సత్యం! ఎలావుంది కొత్త కాపురం" శివా పలకరించాడు.

"కొత్త కాపురానికేంకాని మళ్ళీ పాత కాపురమే అయింది" అన్నాడు సత్యం.

శివాకు ఆ మాటలు అర్థం కాలేదు.

"అర్థమయ్యేటట్టు చెప్పండి" అంది గిరిజ.

"శివా అర్థం కాలేదా" మానాన్నగారు మమ్మల్ని అక్కడికే వచ్చెయ్యమని కబురుచేసారు. మేము అద్దెయిల్లు అలాగే వుంచాము కాని ఇప్పుడు మా నాన్నగారితోనె వుంటున్నాం. అదే పాతకాపురం" సత్యం నవ్వాడు.

"అలాగా!" రాజేశ్వరమ్మగారు, శివా ఒకేసారి అన్నారు.

"అపును మా నాన్నగారు చాలా జబ్బుపడ్డారు. మా అమ్మ, మామయ్యా కూడా చాలా నచ్చచెప్పారు మా నాన్నగారు ఏమనుకున్నారో ఏమో మమ్మల్ని కబురు చేసారు. వెంటనే మేం వెళ్ళాం. అక్కడే వుండిపొమ్మని పట్టుపట్టారు. ఇంక అన్నింటికి కోడలు గిరిజనే పిలుస్తున్నారు. గిరిజ కూడా మావాళ్ళతో కలిసి పోయింది." సంతోషంగా చెప్పాడు సత్యం.

"ఆశ్చర్యంగావుంది సత్యం. మీ నాన్నగారు నిన్ను యింట్లోకి రానిస్తారనుకోలేదు. నువ్వు తెగించి పెళ్ళి చేసుకోపోతే యీపాటికి నీకు మరో పెళ్ళయ్యేది?" శివా వేళాకోళం చేసాడు. సత్యం, గిరిజ ముసి ముసినవ్వులు నవ్వుకున్నారు.

గిరిజ కాపురం స్థిరపడినందుకు రాజేశ్వరమ్మగారి మనస్సు కుదుట పడింది.

"అనురాగాలు, ఆత్మీయతలు మధ్య కోపతాపాలేమిటో? మళ్ళీ ఆ కలయికలేమిటి?" శివాకు అంతా చిత్రంగా అనిపించింది. "మీ నాన్న గారికెలా వుంది సత్యం" అడిగాడు శివా.

"ఆయనకేం! హాయిగా వున్నాడు. ఏ రోగం లేదన్నాడు డాక్టరు." అందరు పక పక నవ్వారు సత్యం మాటలకి.

# 42

"శాంకరీ! శాంకరీ! నీకు లెటర్! లవ్ లెటర్" అంటూ లెటర్ చేతిలో పెట్టింది అపర్ణ.

"లెటర్ వస్తే అది లవ్ లెటరేనా? ఎవరైనా వింటే నవ్వుతారు" కోపం చేసింది శాంకరి.

"అయితే ఎవరురాశారో చెప్పు?" నిలదీసింది అపర్ణ.

"లెటర్ చదవందే ఎలాచెప్పను?"

"అయితే త్వరగా చెప్పు" అపర్ణ తొందర చేసింది.

"సుబ్బులు రాసింది. ఆవిడ గారికి మూడోనెలట".

"అయ్యో! శాంకరీ! ఇదా విషయం. నీరసపడి పోయాశే!"

అపర్ణ నీరసంగా మంచం మీద వాలిపోయింది.

"నా ఫ్రెండుకి మూడో నెలయితే నీకు వేవిళ్ళెందుకు అపర్ణా?"

"అదికాదు శాంకరీ! ఏ గంధర్వకుమారుడో నీకు లెటర్ రాసి వుంటాడేమో? ఆ లవ్ అంతా విందామనుకున్నానే? అందుకే వుత్సాహ మంతాపోయిందే?"

"అలాగా అమ్మా! ఆ లవ్ లెటర్ నాకెందుకట? పోనీ నీకే ఎవరైనా రాస్తే సరిపోతుంది కదా! హాయిగా ఎంజాయ్ చేసేదానివి?"

"అది కాదు శాంకరీ! నాకెవరు రాస్తారే లవ్ లెటర్? నన్ను చూస్తేనే అబ్బాయిలు ఆమడ దూరం పారిపోతారే?" నీరసంగా అంది అపర్ణ.

"అంతలో లత వచ్చింది."

"ఏమిటి సంగతి అపర్ణా"

"ఏముంది మన శాంకరికి లెటర్ వచ్చింది. ఏ లవ్ లెటరో వచ్చిందనుకుంటే సుబ్బులుగారికి. వేవిళ్ళట అదే లెటర్" అంది చేతులు మూతి తిప్పుతూ.

"అదా సంగతి! నువ్వేం నీరసపడకుగాని మరో లెటర్ శాంకరీ"

"ఇదిచూడు శాంకరీ! లెటర్ యిస్తే ఏమిస్తావు?"

"నేనేమి యివ్వను? అసలా లెటరే నాకు రాలేదు."

"అయ్యో అలాగా అమ్మా! ఇదిగో లెటర్ ఫ్రం మద్రాస్" అంది లత.

"మద్రాసా" ఒక్కసారి మంచంమీద లేచి కూర్చుంది శాంకరి. ఆమె గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

"మద్రాసులో ఎవరున్నారో ఎప్పుడూ చెప్పలేదే శాంకరీ!"

"చెప్పడానికేముంది? అక్కడ మా మేనత్త వుందిలే"

"మేనత్తా! అయితే మేనత్త కొడుకు కూడా ఉండాలి కదా! అమ్మదొంగా! ఇన్నాళ్ళు మాతో చెప్పకుండా దాచావా? లత అల్లరి ప్రారంభించింది. "ఇదిగో లతా! మా మేనత్తకు కొడుకులెవరు లేరు గాని లెటర్ యివ్వవే?"

"అక్కర లేదన్నావుగా! నీకెందు కింక లెటర్" "అయితే ఉంచుకో" శాంకరి మంచం మీద వాలింది. "అయితే నువ్వే చదువుకో? కాని రెండు ముక్కలు మాత్రం మా చెవిని పడెయ్యి" అపర్ణ ఉత్సాహంగా అంది.

"లెటర్ అందుకుంటుంటే శాంకరి చేతులు సన్నగా వణికాయి. లెటర్ చింపుతుంటే చేతులు తడబడ్డాయి. కంగారుగా ఉత్తరం చది

ఏంది. ఆమె శరీరంలోని గగుర్పాటును కనపడనీయకుండా దాచుకుంది.

"లెటర్ ఎవరు రాశారే శాంకరీ! చెప్పవేం" అపర్ణ తొందర చేసింది.

"ఏముంది చెప్పడానికి. మా మేనత్త పెద్దావిడయిందిలే. ఒకసారి వాళ్ళ వూరు రమ్మంది" కల్పించి చెప్పిన శాంకరి నీరసం నటించింది.

"అయ్యో! అలాగా! ఇంతకీ ఆవిడ కొడుకు సంగతేమిటి?" లత అడిగింది.

"కొడుకు ముసలాడు. ఎప్పుడో పెళ్ళయింది. ఇద్దరు సంతానం"

"ఇదా సంగతి!! ముసలి బావనా! ఎంత ఛాన్సు పోయిందే నీకు. అయితే జయరామే గతన్నమాట" అపర్ణ చప్పట్లు కొట్టింది.

"ఏమిటే వూరుకుంటుంటే రెచ్చిపోతున్నారు. ఆ జయరాంతో చెప్పి నీ పెళ్ళి చేయిస్తా అపర్ణా"

"ఆపని చేసి పుణ్యం కట్టుకో. చచ్చి నీకు సైతస్కోప్‌గా పుడతా" అపర్ణ రెండు చేతులు జోడించింది.

శాంకరి, లతా పకపకా నవ్వారు. తర్వాత ముగ్గురు టీ తాగడానికి బయలు దేరారు.

టీ తాగడం పూర్తి చేసి శాంకరి అందరికంటె ముందు రూంకు వచ్చేసింది. పరుపు కింద దాచిన లెటర్ పెట్టెతీసి అడుగున పెట్టి తిరిగి పెట్టెకి తాళం వేసింది. సుబ్బులు రాసిన ఉత్తరం మాత్రం టేబులు మీదే వుంచింది. ఎంత మరిచిపోదామనాకున్నా శివా లెటర్ గుర్తుకు వస్తోంది. "వైజాగ్ వస్తాను" అన్న మాట కాస్త ఆందోళన కలిగించింది. "ఎప్పుడొస్తాడో, ఏమల్లరి చేస్తాడో" శాంకరి భయపడింది. తర్వాత ఆ సంగతి మర్చిపోవడానికి పుస్తకాలు ముందేసుకుని కూర్చుంది.

అంతలో గలగలమంటు అపర్ణ,లత రూముకి వచ్చారు. "శాంకరీ తల్లీ! పుస్తకాల పురుగువే నువ్వు. ఏం చదువు? ఏం చదువు? ఓ సినీమా లేదు, ఓ షికారు లేదు, ఓ బీచి లేదు, ఓ హొటలు లేదు. ఎంతసేపు పుస్తకాలేనా? కాస్త మా సంగతి ఏదైనా ఆలోచిస్తావా?"

"ఆలోచిస్తా! ఆలోచిస్తా! రేపాదివారం మనం బీచ్ కెడతాం! అంత వరకు కూర్చుని చదువుకోవాలి, లేకపోతే మన ప్రయాణం కాన్సిల్!"

"ప్రయాణం మాత్రం కాన్సిల్ చెయ్యకు తల్లి! కూర్చుని చదువుకుంటాం! లతా! పుస్తకం తియ్యమ్మా!"

శాంకరి పుస్తకం ముఖానికి అడ్డుపెట్టుకునే వాళ్ళని గమనిస్తుంది. అపర్ణ నీరసంగా మంచం మీద వాలి పుస్తకం తీసింది. లత పుస్తం తీసి కుర్చీలో కూర్చుంది. ఇద్దరు పళ్ళుకొరుక్కోవడం చూసింది శాంకరి.

"అమ్మాయిలూ! పళ్ళుకొరుక్కోవడం మానేసి పుస్తకాలు తెరవండి?" శాంకరి ఆజ్ఞాపించింది.

"అమ్మ దొంగా! అయితే నువ్వు చదువుకోడం లేదన్నమాట! మమ్మల్నే చూస్తున్నావన్నమాట! మేం కూడా నీ తిక్క కుదురుస్తాం. ఆ జయరాంని నీవెంట పడమని చెబుతా. అప్పుడు అమ్మాయిగారు ప్రేమలో పడతారు. చదువు గోవిందా! మా చదువు గోవిందా!" చప్పట్లు కొట్టింది అపర్ణ.

"నిజంగా చెప్పు! నీకు చదువుకోవాలని లేకపోతే మీ వాళ్ళకి వుత్తరం రాస్తా! చదువు మాన్పించి పెళ్ళిచెయ్యమని"

"అంత పని చెయ్యకే అమ్మా! ఈ చదువు కోసం ఏం కండిషన్స్ పెడుతున్నావే తల్లీ! నీతో వేగలేక పోతున్నాం. చదువుకోలేక చస్తామా! లతా పుస్తకం తీస్తావా?"

"తియ్యడమేమిటి? చదువుతున్నా కూడా!"

"అయితే తప్పదంటావా లతా? ఈ చదువంటే నాకు. ఏడుపొస్తోందే" అపర్ణ కళ్ళలో నిజంగానే నీళ్ళు తిరిగాయి.

శాంకరి, లత చూసి చూడనట్టే వూరుకున్నారు. అపర్ణ చేసేది లేక చదవడం మొదలు పెట్టింది. రాత్రి అయ్యేవరకు ముగ్గురు చదువుకుంటూనే వున్నారు. అపర్ణా, లత మాట్లాడుకోవాలనివున్నా శాంకరికి భయపడి ఆ పని చెయ్యలేక పోయారు.

ఆ రాత్రి భోజనాలయ్యాక అపర్ణ, లత పుస్తకాలను ముట్టుకోలేదు. అలసటగా నిద్రపోయారు.

"సాయంకాలం చదివినందుకు కాబోలు అంత అలసటగా నిద్రపోతున్నారు" శాంకరి నవ్వుకుంది. ఆమె మాత్రం నిద్ర వచ్చేవరకూ చదువుకుంటూనే వుంది.

నిద్ర వస్తోందనుకున్న శాంకరి పుస్తకం మూసి లైటుతీసి బెడ్ లైటు వేసింది. మంచంమీద నడుంవాల్చగానే తిరిగి ఆమెకు శివా రాసిన లెటరే గుర్తుకు వచ్చింది. ఆమె మనసు ఆలోచించిన కొద్దీ పరి పరి విధాల పోయింది.

"నేను వుత్తరం రాయమనలేదు కదా! ఎందుకు రాసినట్లు? నేను మాత్రం సమాధానం రాయను. రాయలేకపోతే వైజాగ్ వస్తాడేమో? వస్తేరాని సమాధానం రాయకూడదు. రాస్తే నేను ఓడిపోయినట్లే" చివరకు శాంకరికి శివా మీద కోపం వచ్చింది. మళ్ళీ అంతలోనే ఏదో అంతు తెలియని మధుర స్మృతులు హృదయ వీణలు మీటాయి. లెటర్ మరోసారి చదువుకోవాలనుకుంది. కాని పెట్టెలో వుండిపోయింది. వైజాగ్ వస్తేరాని, కాని సమాధానం మాత్రం రాయకూడదు అనుకుంది తర్వాత మెల్లగా నిద్రలోకి జారిపోయింది.

## 43

ఆరోజు ఆదివారం. తెల్లవారింది మొదలు లేచి ప్రయాణం సంగతే అడుగుతున్నారు అపర్ణ,లతా. శాంకరి కూడా వైజాగ్ వచ్చింది మొదలు బీచి చూడలేదు. లోపల చూడాలనే వుంది. పైకి మాత్రంబెట్టు చేసింది.

"మీరెళ్ళండే! నేను చదువుకోవాలి" అంది శాంకరి.

"మేం అలా ఒప్పుకోం. నువ్వూ రావలసిందే" వాళ్ళు పట్టు పట్టారు. మిగిలిన రూముల వాళ్ళు కూడా ప్రయాణానికై సిద్ధంగా కూర్చున్నారు.

"ఇదేమిటి అందరూ బయలుదేరుతున్నారు. హాస్టల్ వాళ్ళం కాకుండా ఇంకా బయటవాళ్ళు ఎవరైనా వస్తున్నారా కొంపతీసి" అడిగింది శాంకరి.

"ఎవ్వరూ రావటం లేదు శాంకరీ! ఇంక బయలుదేరు" అపర్ణ విసుక్కుంది.

"దాని మాటలు నమ్మకు శాంకరీ! దాన్నోకంట కనిపెట్టాలి" అంది శాంకరి చెవిలో లత.

"ఏం లతా! ఏం సంగతి? నామీద ఏం చెబుతున్నావు? నీసంగతి చెబుతా చూడు?"

"ఆ ఏం చెబుతావో చెప్పు?"

"ఇదిగో శాంకరీ! లతను నమ్మకు సుమా!" అంది అపర్ణ.

"ఎవరి మాటలు నమ్మను కాని ముందుబయలుదేరండి" అందరు బీచ్‌కి బయలుదేరారు. మొత్తం 15 మంది ఉన్నారు. అందరు ఒక వ్యాను మాట్లాడుకొని అందులో బయలుదేరారు.

వెనకాల ఒక డజను మోటారు సైకిళ్ళు, ఒక అలహాసితర్, ఒక ఫియట్ వస్తున్నాయి.

"అదేమిటి మన వ్యాన్ వెంబడే వస్తున్నారు? వాళ్ళెవరో"

"ఎవరో ఏమిటి శాంకరి? అడుగో జయరాం" అంది అపర్ణ.

"మనం వెడుతున్నట్లు వీళ్ళకెలా తెలిసింది. వానర సైన్యంలా బయలుదేరి వస్తున్నారు" శాంకరి కాస్త కోపంగా అంది.

"ఎవరో వస్తుంటారు. వెడుతూంటారు. బీచి మనసోంతమా!" అడిగింది అపర్ణ.

"అపర్ణ మీదే అనుమాన మొచ్చింది శాంకరికి. చెప్పలేని కోపం వచ్చింది. అపర్ణకు సమాధానం ఇవ్వకుండా వూరుకుంది. శాంకరికి కోపం వచ్చిందని తెలుసుకున్న అపర్ణ ఏం మాట్లాడలేదు.

ఆడ పిల్లలంతా బిల బిల మంటూ వ్యాన్‌దిగి పరుగులు పెట్టారు దారిలో కనపడ్డ తినే వస్తువులన్ని కొనుక్కోవడం తినడం మొదలు పెట్టారు. బెలూన్స్ వాడిని ఆపి కొని ఎగురవేస్తూ పరుగులు పెట్టారు. వాళ్ళని ఆ సమయంలో చూసిన వాళ్ళెవరు వాళ్ళు మెడిసిన్ చదివే స్టూడెంట్సని అనుకోరు. హైస్కూలు విద్యార్థినుల్లా అల్లరి చేసారు.

సముద్రానికి కాస్త దూరంలో దుప్పటి పరిచారు. టేపురికార్డరు ఆన్ చేశారు. పట్టుకొచ్చిన తినుబండాలరాన్ని వాటిమీద పరిచారు. శాంకరి వెళ్ళి దుప్పటి మీద కూర్చుంది. ఆమెతోపాటు మరికొందరు కూడా కూర్చున్నారు. మిగిలిన వాళ్ళు ఫ్లాస్కులోని కాఫీ కప్పుల్లోకి తీసుకుని తాగారు. తర్వాత మ్యూజిక్‌కు అనుగుణంగా డాన్సులు ప్రారంభించారు. అందులో అపర్ణా, లత కూడా ఉన్నారు.

వారికి కాస్తా దూరంలో స్టూడెంట్సు మకాం పెట్టారు. వాళ్ళు కూడా టేపురికార్డర్ మరింత వాయిస్ పెంచి పెట్టారు. కొందరు ఆ వాయిస్‌తో పాటు పాడుతున్నారు. కొందరు స్టెప్సు వేస్తున్నారు. మరి కొందరు అపర్ణావాళ్ళ వైపు వచ్చారు.

"హల్లో! శాంకరి" అన్నాడు జయరాం.

"హల్లో జయరాం" కూర్చునే అంది శాంకరి. ఆమె నలుగురి మధ్యలో కూర్చుని వుంది. లేచి వస్తే ఆమెతో మాట్లాడాలని అతని వుద్దేశం. కాని ఆమె ఆ పని చెయ్యలేదు.

"ఇలా దయచేసారేం జయరాం" శాంకరి అడిగింది.

"తమలాంటి దేవకాంతలు వార్త పంపితే రాకుండా ఎలా వుంటాం! రెక్కలు కట్టుకు వాలాం"

జయరాం మాటలు విన్న శాంకరికి అసలు విషయం అర్థ

మయింది. అపర్ణ చేసిన పనికి విపరీతమైన కోపం వచ్చింది. జయరాం ఎదురుగా అపర్ణను ఏమీ చెయ్యలేక వూరుకుంది.

"చాలా సంతోషం జయరాంగారు. రమ్మంటే వచ్చారుగా! ఇంక వెళ్ళమంటున్నాం వెళ్ళి మీ పని చూసుకోండి" అంది శాంకరి కోపం దాచుకుంటూ.

శాంకరి మొహం చూసిన అపర్ణ డాన్సు ఆపు చేసి జయరాంకేసి చూసింది. 'అపర్ణా! శాంకరీ దేవిగారు మూడ్సులో లేరు. నీతో స్టెప్సు వేస్తా' జయరాం నవ్వుతూ అన్నాడు.

అపర్ణా, లత, వింధ్య మొదలైన ఆడపిల్లలుగల మొగ పిల్లలు కలిసి కాసేపు డాన్సులు చేసారు. తర్వాత తెచ్చుకున్న పూరీలు, వడలు స్వీట్సు ఆడ మగ భేదాలు లేకుండా అందరూ కలసి తిన్నారు.

శాంకరి, మరో యిద్దరు అమ్మాయిలు మాత్రం కూర్చున్నచోటే తిన్నారు. కాని మిగిలిన వారితో కలవలేదు. 'శాంకరికి కాస్త అహం ఎక్కువనుకుంటా' తిలక్ అన్నాడు.

"ఆవిడ జోలెందుకుగాని మన సంగతి చూడరా" అన్నాడు జయరాం. శాంకరిని ఎలాగైన మెప్పించాలని ఆమెతో స్నేహం చెయ్యాలని జయరాం కోరిక. అందుకే ఎవరిని శాంకరి మాట తలపెట్టనియ్యడు.

"ఏం చేస్తుందిట మొహం మీదే అంటా" తిలక్ కాస్త గట్టిగానే అన్నాడు.

"తిలక్! శాంకరి జోలెందుకు? విసుక్కుంది అపర్ణ. తర్వాత తినడం పూర్తయింది. శాంకరి సంగతి మర్చిపోయి కాసేపు పేకాడు కున్నారు కాసేపు పాటలుపాడారు.

అందులో కొందరు మెడికల్ స్టూడెంట్స్ కాని వారు కూడా వున్నారు. వారిలో కాస్త మోటుతనం ఎక్కువగా వుంది. అపర్ణ స్నేహితురాలు వందనాని కాస్త దూరంగా తీసుకువెళ్ళి ఆమెను దగ్గరకు తీసుకుని ముద్దు పెట్టుకోపోయాడు. ఆమె భయంతో అరిచింది. టేపు రికార్డర్స్ సౌండులో వాళ్ళకి ఆమె అరుపులు వినపడలేదు. శాంకరి వాళ్ళకి వినపడింది. వెంటనే శాంకరి వాళ్ళు అటు పరుగెత్తారు.

వందన అతని చేతుల్లో పెనుగులాడుతోంది. ఆ దృశ్యం చూసే టప్పటికి శాంకరికి విపరీతమైన కోపం వచ్చింది. "వందనా" అంటు గట్టిగా పిలిచింది శాంకరీ. "శాంకరీ" అంటూ అరిచింది వందన.

అతను వందనను వదలి పారిపోబోయాడు. శాంకరి వెళ్ళి అతని కాలర్ పట్టుకుని ఆపింది. ఈడ్చుకుంటు వచ్చి అందరి ముందు నిల బెట్టింది. ఆడపిల్లలు బలవంతం చేస్తే తప్పించుకోలేక లొంగిపోతారనే నమ్మకం అతనికుంది. అందుకే వందనను దూరంగా తీసుకెళ్ళాడు. కాని ఆమె అరుపులు ప్రమాదాన్ని తెచ్చిపెట్టాయి. తన ప్లాను తప్పి నందుకు మరింత కోపం వచ్చింది అతనికి.

''ఆమె నన్ను రమ్మని పిలిచింది వచ్చాను. ఆమె నాతో ఎన్ని సార్లు సినిమాకు వచ్చింది. హోటళ్ళకు వచ్చింది. మీరందరు వున్నారని నకరాలు చేస్తోంది?" అన్నాడు ఆ వ్యక్తి.

ఆ మాటలు విన్నవాళ్ళంతా ఆశ్చర్యపోయారు.

"అతన్ని నేనెప్పుడు చూడలేదు, ఇప్పుడే చూస్తున్నా! అతనితో నేనెప్పుడు సినిమాకు వెళ్ళలేదు. అంతా అబద్దం" వెక్కి వెక్కి ఏడ్చింది వందన.

"వందనా నువ్వెందుకు ఏడుస్తావు. తప్పుపని చేసినందుకు అతను ఏడవాలి. వందన నీకెలా తెలుసో చెప్పు. శాంకరి గద్దించింది. అతను సమాధానం చెప్పలేక తికమక పడ్డాడు.

"ఇతన్ని ఎవరు తీసుకొచ్చారు?" శాంకరి గట్టిగా అడిగింది.

మాకు తెలీదంటే మాకు తెలీదన్నారు. తీసుకొచ్చిన వాళ్ళు చెప్పడానికి భయపడ్డారు.

శాంకరికి విపరీతమైన కోపం వచ్చింది.

"ఆడపిల్లలంటే నీ చేతిలోని కీలు బొమ్మలుకాదు. జాగ్రత్త మరెప్పుడు ఆడపిల్లల జోలికి వెళ్ళకు" శాంకరి గట్టిగా చెప్పింది. మిగిలిన వాళ్ళెవరు మాట్లాడలేదు.

"సమయం వచ్చినప్పుడు నీపని చెబుతానుండు" అంటూ అతను కోపంగా వెళ్ళిపోయాడు.

మిగిలిన వాళ్ళంతా కూడా సామానులు సర్దుకున్నారు. వెళ్ళినప్పటి వుత్సాహం లేదు కొందరికి. ఆ సంఘటన కూడా కొంతమందిని కుంగదీసింది. కాని అపర్ణా లత వాళ్ళు మాత్రం చాలా వుత్సాహంగా వున్నారు. మళ్ళీ ఎప్పుడు వస్తుందా అటువంటి అవకాశమని ఎదురు చూస్తున్నారు.

శాంకరి తిడుతుందోనని ఆ మాట పైకి అనలేదు. శాంకరి రూంకు వెళ్ళాక అపర్ణని, లతని గుంజీలు తీయమంది. జయరాంతో తనను గురించి తప్పుగా చెప్పవద్దని చెప్పింది. ఎప్పుడూ అలా చెప్పమని లెంప లేసుకున్నారు అపర్ణావాళ్ళు.

"పరీక్షలు దగ్గర కొస్తున్నాయి. శ్రద్ధగా చదువుకోవాలి" శాంకరి మాటలకు వాళ్ళు తలలూపారు.

ఆ రోజు మొదలు అపర్ణ దృష్టి జయరాం మీదే వుంది. ఆ విషయం తెలియని జయరాం దృష్టి మాత్రం శాంకరి మీదే వుంది.

# 44

శివా, శాంకరి సమాధానం కోసం ఎదురు చూసాడు. ఏన్నాళ్ళు చూసినా సమాధానం మాత్రం రాలేదు. శాంకరికి కోపం వచ్చివుంటుంది అనుకున్నాడు. అందుకే మరో ప్రయత్నం చెయ్యాలనుకున్నాడు. ఈసారి మరికాస్త అందంగా ప్రేమలేఖ రాసాడు.

'మైడియర్ శాంకరీ'

నా ప్రియాతి ప్రియమైన శంకూ! నీ స్నేహితురాళ్ళ పకపకల మధ్యలో కలహంసలా నడకలే నా హృదయంలో పదనిసలై మ్రోగుతున్నాయి. కోపంలో నువ్వు వేగంగా నడిస్తే ప్రణయకోపంలో సత్యభామలా కనుపించావు. చిరునవ్వుతో చంద్రబింబంలా, అలుకతో ఎర్ర

కలువలా వికసించిన నీ వదనమండలమే నా కంటికి వెలుగుగా, నా ప్రేమకు దీపంలా నిలిచిపోతుంది. చంద్రునివెంట వెన్నెలలా, మేఘం వెంట మెరుపులా నీవెంట నా హృదయం పరుగులు పెడుతుంది. నీవు లేనిదే నేను లేను. నీ ప్రేమలో కరిగిపోవాలని, నీ హృదయంలో శాశ్వతంగా నిలిచిపోవాలని ఎదురుచూసే నీ శివా. సమాధానం రాయక పోయినా నీ చేతిలో రుమాలులా, నీ కళ్ళలో చూపులా, నీ హృదయంలో చిరుప్రేమలా నిలిచిపోవాలని కోరుకునే లేఖమాత్రమే ఇది. ప్రతి అక్షరంలో పన్నీరు నింపి పంపిస్తున్నా నీ శరీరంలో అణువణువు పన్నీరు చిలికే ప్రేమలేఖ ఇది. నీ గుండెలో భద్రంగా దాచుకో.

నీ ప్రియమైన శివా.

పదిసార్లు చదువుకున్నాడు శివా. అతని శరీరం గగుర్పొడిచింది. గుండెల్లో ఏదో తెలియని సంతృప్తి. ఆమె తప్పకుండా చదువుతుందనే ధైర్యం. వెళ్ళి పోస్టులో వేసి వచ్చాడు లెటర్. ఈసారి సమాధానం కోసం ఎదురుచూడలేదు శివా. ఆమె సమాధానం రాయదని అతనికి తెలుసు. తన ప్రేమను కాదనే ధైర్యం ఆమెకు లేదని అతనికి తెలుసు. అందుకే అతనికి కంత చొరవ.

ఆ మధ్యాహ్నం పోస్టులో సూర్యం దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. వేసవి శెలవలివ్వగానే రాజేశ్వరమ్మగారిని తీసుకుని ఆ ఊరు రమ్మని రాసాడు సూర్యం. శివా పొలాలు కూడా అతనే చేస్తున్నాడు. ఆ సంవత్సరం అధిక వర్షాలు లేవు. గొదావరి వరదలు లేవు. అందుకే పంటలన్నీ బాగున్నాయి. వ్యవసాయంలో సూర్యం చేయి బాగుందన్నారు అందరూ. పైగా కనకం వచ్చినవేళ బాగుందన్నారు. సూర్యానికి, తల్లిదండ్రులకు అటువంటి నమ్మకాలు చాలా తక్కువ. అయినా ఎదుటివారిని ఎదురించి వారి మనస్సును కష్టపెట్టే మనస్తత్వం కూడా వారికి లేదు అందుకే అందరూ అలా అంటున్నా వారేమి పట్టించు కోలేదు. సూర్యానికి తను కష్టపడి పండించిన పంటను చూసి అందరు మెచ్చుకోవాలని అని కోరిక. అందుకే శివాను కూడా రమ్మని రాసాడు.

పైగా వేసవిశెలవుల్లో శాంకరి కూడా వస్తుంది. కనకం ద్వారా శివా అభిప్రాయం విన్న సూర్యం కూడా వారిద్దరినీ కలపాలనే అనుకుంటు న్నాడు. శివా తల్లి రాజేశ్వరమ్మగారు శాంకరిని చూడాలని సూర్యం, కనకంల తలంపు.

లెటర్ చదువుకున్న శివా మనస్సు అటే తిరిగింది. వేసవిలో తల్లిని తీసుకుని అక్కడకు వెళ్ళాలనే అనుకున్నాడు. తల్లికి సూర్యం లెటర్ చదివి వినిపించాడు. రాజేశ్వరమ్మగారికి కూడా అక్కడకు వెళ్ళాలనే వుంది.

"అవును శివా! ఈ వేసవిలో తప్పకుండా అక్కడికి వెళదాం" అంది రాజేశ్వరమ్మ.

శివాకు సూర్యం మనస్సు అర్థం కాకపోయినా ఏదో తృప్తి అనిపించింది.

అంతలో పరీక్షలు దగ్గరపడంవల్ల అన్నీ మరచి చదువులో నిమగ్నమయ్యాడు శివా.

## 45

శాంకరి లెటర్స్ విషయంలో కొంచెం జాగ్రత్తగానే వుంది. లెటర్ బాక్స్‌లో తన లెటర్స్ వుంటాయేమోనని వెతుకుతోంది. ఏ శివా యైనా మళ్ళీ లేటర్ రాస్తే లత, అపర్ణల కళ్ళు కప్పడం చాలా కష్టం.

ఆ రోజు రెండు లెటర్స్ వున్నాయి ఆ బాక్స్‌లో. ఎడ్రస్ చూస్తే శివా లెటర్ని, తండ్రి రాసిన లెటర్ని గుర్తుపట్టేసింది. ఎవరూ చూడ లేదనుకున్న తరువాత శివా లెటర్ పుస్తకం మధ్యలో పెట్టి తండ్రి రాసిన లెటర్ అందరు చూసేటట్టు పట్టుకుని రూముకి వచ్చింది.

అపర్ణ లత గదిలోనే వున్నారు. శాంకరి చేతిలో లెటర్ చూడ గానే "మళ్ళీ మీ మేనత్త రాసిందా వుత్తరం" అంటు అడిగారు.

"మా మేనత్తకు ఏం పని లేదా నాకు ఉత్తరం రాయడం తప్ప. ఇది మా నాన్నగారు రాసారు" అంది గర్వంగా.

"అయితే చిట్టితల్లీ! పొట్టితల్లీ నువ్వే చదువుకో" అంటూ ఇద్దరూ మరోవక్కకు తిరిగి పడుకున్నారు.

శాంకరి తండ్రి రాసిన లెటర్ విప్పి చదివింది. ఈ సంవత్సరం పంటలు బాగా పండాయని ఖర్చులకు ఇబ్బంది లేదని రాసారు. అక్క పిల్లలుమరీ అల్లరి చేస్తున్నారని కాస్త కనకాని కే భయపడుతున్నారని, పరీక్షలు ఎప్పుడో రాయమని పరీక్షలుకాగానే బయలుదేరిరమ్మని రాసారు.

పైగా అన్నపూర్ణమ్మగారు వెయ్యికళ్ళతో ఎదురుచూస్తోందని రాసారు. ఆ మాటలు చదుతుంటే శాంకరి గుండె కదిలింది. కళ్ళల్లో నీళ్ళు జలజల రాలాయి. కన్నీళ్ళు తుడుచుకుని మరోసారి చదువుకుని టేబులుమీద పెట్టింది ఉత్తరం.

"శాంకరమ్మా! లెటర్ చదవడం పూర్తయిందా?" అపర్ణ అడిగింది. "ఆహా పూర్తయింది. నే లెటర్ చదువుతుంటే నీకేమిటే బాధ" శాంకరి కాస్త కోపంగా అడిగింది.

"నాకేం బాధ లేదు కాని ఎప్పుడూ నీకు అలాంటి వుత్తరాలే వస్తాయేమి? మంచి ఘాటైన ప్రేమలేఖ రావచ్చు కాదా: అందుకని."

"పాపం! అపర్ణా! నీకే ఆ ప్రేమలేఖ రావచ్చుగా" శాంకరి తిరిగి అడిగింది.

"అయ్యో! నాకు అంత అదృష్టంకూడానా?" అంది నవ్వుతూ అపర్ణ. ఆ మాటకు శాంకరి, లత కూడా నవ్వారు.

"అబ్బా! తల నొప్పిగా వుందే! టీ తాగి వద్దామే" లత మంచం మీదనుంచి లేచింది. ఆమె వెనక శాంకరి, అపర్ణ నడిచారు.

టీ తాగి కాస్త అటు ఇటు తిరిగారు ముగ్గురు. పక్క రూము వాళ్ళు కూడా కలిసారు. పరీక్షలు దగ్గరకు రావడం వల్ల ఎవరి నోట మ్మాట విన్నా ఆ సంగతే వస్తోంది. అపర్ణ, లతా మాత్రం ఆ సంగతి ఎత్తడం లేదు.

"ఈ మొద్దుల్ని ఎలా రూములో పెట్టుకున్నావు శాంకరీ" పక్క రూములోఉన్న పద్మ అడిగింది.

"మొద్దుల్నే వుద్ధరిద్దామని" శాంకరి సమాధానం విని అందరు నవ్వుకున్నారు.

అందరు ఎవరి రూములకు వాళ్ళు బయలుదేరారు. అపర్ణా లతా మాత్రం కాస్త అటు ఇటు తిరిగి వస్తామన్నారు.

శాంకరి దృష్టి అంతా శివా లెటర్ మీదే వుంది. అదే సమయమనుకుని తలుపు గడియపెట్టి పుస్తకంలో దాచిన లెటర్ తీసింది. ఆ శైలికి, ఆ ధోరణికి ఆశ్చర్యపోయింది శాంకరి. ఆమె గుండె వేగంగా కొట్టుకుంది. ఆమె పెదవులు అదిరాయి. వణుకుతున్న చేతుల మధ్యలో లెటర్ రెప రెపలాడింది. మరోసారి చదవాలనివున్నా వాళ్ళు వస్తారని భయంతో లెటర్ పెట్టి అడుగున ముందు లెటర్ పక్కనపెట్టి తిరిగి తాళం వేసింది. తలుపుగడియతీసి దగ్గరగావుంచింది. ఏదో అలసటగా అనిపించింది. కూర్చోలేక మంచం మీద నడుం వాల్చింది.

అంతలో తలుపులు తోసుకుంటూ ఆడావిడిగా లోపలికి వచ్చారు అపర్ణా, లతా.

"శాంకరీ! లే! లే! మజా! మజా" అంటూ అరిచారు ఇద్దరూ.

"ఏమయిందో చెప్పకుండా ఆ అల్లరేమిటి?"

"మాది అల్లరా! శాంకరీ! లవ్ లెటర్" అంటు చేతిలో లెటర్ చూపించారు.

"ఎవరికీ?" విసుగ్గా అడిగింది శాంకరి.

"ఇంకెవరికి? నీకే" అంది అపర్ణ.

"నాకా? ఎవరు రాసారు?"

"ఇంకెవరు? జయరాం" అంది లత.

"జయరామా!" లేచి కూర్చుంది శాంకరి.

"నిజమా?" ఆమెకు నమ్మకం కలుగలేదు.

"అవును. ఇదిగో లెటర్" లెటర్ చూపించింది లత.

"నాకెంచుకు? మీరే చదవండి" శాంకరి తిరిగి మంచం మీద వాలింది.

"ఆ నీలెటర్ చదివితే మాకు పాపం వస్తుంది" అంది లత.

"పాపం లేదు" "శాపం లేదు" చదవండి శాంకరి ఆజ్ఞాపించింది.

ఆ లెటర్ చదువుతుంటే అందరికి ఆశ్చర్యమేసింది. శాంకరికి కోపం కూడా వచ్చింది.

''తన ప్రేమను స్వీకరించకపోతే ఆత్మహత్య చేసుకుంటానని రాసాడు జయరాం''

"శాంకరీ! నువ్వు అతన్ని ప్రేమించక తప్పదే. లేక పోతే నీకు హత్యా దోషం చుట్టుకుంటుదే?"

"చుట్టుకోని ఏం భయం లేదు?"

"అయితే అతనికి సమాధానం రాద్దామా? వద్దా" అపర్ణ అడిగింది,

"ఎందుకు రాయాలి? ఏం రాయద్దు. తెలినట్లే వుందాం" శాంకరి సమాధానమిచ్చింది.

"అది పద్ధతి కాదు శాంకరి. మనం సమాధానం రాయలేదనుకో జయరాం మళ్ళీ ఇంకో లెటర్ రాస్తాడు. అందుకే సమాధానం రాయడమే మంచిది" సలహా ఇచ్చింది లత.

"అయితే ఆ సమాధానం మీరే రాయండి. నేను రాయను. నాకే సంబంధం లేదు"

''అయితే శాంకరి సమాధానం నేనే రాస్తాను." అపర్ణా పెన్నూ, కాగితం సిద్ధం చేసింది.

"ఏమని సమాధాన మిస్తావు?" లత అడిగింది.

"ఏముంది? శాంకరికి నువ్వంటే చాలా కోపం. మరెప్పుడు ఇటువంటి పని చెయ్యకు. ఈసారికి వదిలేస్తున్నాము. మరోసారి లెటర్ అందితే ప్రిన్సిపాల్ గారి ముందు పెడతాము." ఇట్లు నీ శ్రేయోభిలాషి.

"వెంటనే రాసేయి. మేటర్ బాగుంది. పోస్టులో వెద్దామా? చేతికి యిద్దామా?" లత అడిగింది.

"పోస్టల్ ఖర్చు ఎందుకు? చేతికే యిచ్చి వస్తా. నాకేం భయం లేదు" అపర్ణ లెటర్ పూర్తి చేసింది.

"రేపు క్లాసులోంచి బయటకు రాగానే ఇస్తా" అపర్ణ మాటలకి శాంకరి తలూపింది.

మరునాడు క్లాసులు పూర్తికాగానే శాంకరి, లత, అపర్ణ హాస్టల్ వైపు వెడుతున్నారు. క్లాసులో ముగ్గురు మామూలుగానే వున్నారు. జయరాంకి చాలా ధైర్యం వచ్చింది. తప్పకుండా శాంకరి తన ప్రేమను అంగీకరించి వుంటుందనుకున్నాడు.

"అపర్ణగారూ" అంటూ పిలిచాడు జయరాం.

ఆ సమయం కోసం ఎదురు చూస్తున్న అపర్ణ అగింది.

"లెటర్ చేతిలో పెట్టిరా" అంది లత.

జయరాం వడి వడిగా నడిచి ఆమెను కలుసుకున్నాడు.

"ఏమిటి జయరాంగారు అలా వున్నారు"

"ఏమీ లేదు శాంకరి నాగురించి ఏమైనా అందా!"

"ఏం అనలేదు? అన్నట్లు మరిచిపోయా! మీకు లెటర్" అంటు బాగ్‌లోంచి తీసి చేతిలో పెట్టింది.

జయరాం ముఖం కళ కళలాడింది. కళ్ళు మిలమిల మెరిసాయి. కంగారుగా లెటర్ విప్పి చదివాడు. అతని ముఖం వాడిపోవడం గ్రహించింది అపర్ణ.

"జయరాంగారు ఆ శాంకరి జోలి మీకెందుకండి. ఆమె దగ్గరుండి ఈ లెటర్ రాయించింది. పాపం మీకు నిరాశే కలగచ్చు. కాని ఏం చెయ్యగలను చెప్పండి" సానుభూతి తెలియజేసింది అపర్ణ.

ఆమె మాటలు మండుటెండలో నీటి జల్లులా అనిపించాయి జయరాంకి.

వెళ్ళబోయిన అపర్ణను "కాసేపు ఆగండి" అన్నాడు.

"మీ మనస్సుకు బాధ కలిగినట్లుంది. కొన్ని మర్చిపోవాలి తప్ప దండి" అతని వైపు జాలిగా చూసింది అపర్ణ.

కాసేపు మాట్లాడి అపర్ణ వెళ్ళిపోయింది.

ఆమెను చూడగానే లత "ఏం జరిగింది? అతనికి బుద్ధివచ్చిందా?" అని అడిగింది.

బాగానే వచ్చినట్టుంది?" అంటు జరిగిన సంగతి వివరించింది. శాంకరి, లత నవ్వుకున్నారు.

"ఇంక ఈ గొడవ చాలించి పుస్తకాలు తియ్యండి" శాంకరి కోపం తెచ్చుకుంది.

ఆరోజు మొదలు జయరాం, అపర్ణ కనపడినప్పుడల్లా మాట్లాడు కుంటున్నారు. అపర్ణ ఎన్నో విషయాలు జయరాంకు చెబుతోంది. క్రమంగా ఆమె మాటలు జయరాంని ఆకర్షించాయి.

శాంకరి వారిద్దరిని కనిపెట్టి చూస్తూనే వుంది. కాని ఏమీ అడగ లేదు.

పరీక్షలు దగ్గరకు రావడంతో అందరు పుస్తకాలు చేత పట్టి కూర్చుంటున్నారు. అపర్ణ, లత కబుర్లు ప్రారంభించినప్పుడల్లా శాంకరి కోపం చేస్తూనే వుంది.

# 46

శివా మీద తలపులు కలవరపెడుతూనే వున్నాయి. బలవంతంగా వాటిని మనసులోనె అణిచిపెట్టి చదువుకుంటోంది శాంకరి. అనుకున్నట్లుగా పరీక్షలు పూర్తి అయ్యాయి. అన్ని పరీక్షలు బాగా రాసింది, ఆరోజే బయలుదేరి వాల్తేరు వెళ్ళిపోయింది.

"నీ కోసం రాజమండ్రి రావాలనుకుంటున్నాం. చెప్పాపెట్టకుండా వచ్చేశావేం" గుమ్మంలోనే ఎదురు వచ్చిన కనకం అడిగింది.

"ఉత్తరం రాసే టైం ఎక్కువుంది. పరీక్షలు పూర్తి అయ్యాయి వచ్చేసాను అంతే. ఇంతకీ నువ్వెలా వున్నావు?"

"నాకేం బాగానే వున్నా" అంది కనకం.

"అక్కడే నిలబడి మాట్లాడుతున్నారేం? లోపలికి రండమ్మా!" అన్నపూర్ణమ్మ పిలిచింది.

తల్లి మాటలకు నవ్వుకున్న శాంకరి, కనకంతో లోపలికి వచ్చింది. శాంకరి చేతిలోని పెట్టె అందుకుని రవి గదిలో పెట్టి వచ్చాడు.

"స్నానం చేసి భోజనం చెయ్యి. నేను మళ్ళీ వస్తా" కనకం వెళ్ళి పోయింది.

"ఏం అమ్మా! పరీక్షలు పూర్తి అయ్యాయా! ఎలా రాసావు?" భోజనం చేస్తున్న కూతుర్ని పలకరించాడు రామనాథంగారు.

"బాగా రాసాను. అన్నింటిలోను నాకే ఫస్టు రావచ్చు అంటు న్నారు అంతా" అంది శాంకరి.

శాంకరి మాటలకు ఆయన మనస్సు ఆనందంతో నిండిపోయింది. తండ్రితో మాట్లాడుతున్నంత సేపు అక్క పిల్లలు ముగ్గురు అల్లరి చేస్తూనే వున్నారు.

"ఈ వయసులో నాన్న వీళ్ళతో ఎలా వేగుతున్నారో" అనుకుని బాధపడింది శాంకరి.

"అక్కా! అక్కా! వీళ్ళు అల్లరి చేస్తున్నారని స్కూలుకి రావద్దన్నారట టీచరు" అక్క పిల్లలవైపు చూపించాడు రవి.

"వాళ్ళ సంగతి నేచూస్తా! నువ్వెళ్ళి చదువుకోరా!"

రవి వెళ్ళి పుస్తకం చేతపట్టి కూర్చున్నాడు. శాంకరి భోజనం పూర్తి చేసింది. అక్క పిల్లల్ని ఎంత కోపం చేసినా వాళ్ళు అల్లరి మానలేదు. "వీళ్ళని నువ్వు కూడా కాస్త కోపం చెయ్యాలక్కా"

"నీమాటే వినడం లేదు శాంకరీ! ఇంక నామాటేం వింటారు? నువ్వే వాళ్ళని భయపెట్టాలి శాంకరి! ఈ మధ్య ఆ కనకం మాటకూడా వీళ్ళు వినడం లేదు" అంది సుశీల.

శాంకరి వెళ్ళి బెత్తం చేత్తో తీసుకుంది. అది చూసిన పెద్ద పిల్లలిద్దరు బుద్ధిగా పుస్తకాలు ముందేసుకుని కూర్చున్నారు. చిన్నవాళ్ళు తల్లి దగ్గరకు పరుగెత్తారు.

"నువ్వుండగా వీళ్ళను ఒక దారికి తీసుకురావలమ్మా" అన్నాడు రామనాథంగారు.

శాంకరి చాలా సేపు వాళ్ళ సంగతే ఆలోచించింది. ఆ మధ్యాహ్నం శాంకరి, కనకంతో కలిసి స్కూలు వైపు బయలుదేరింది.

శాంకరీ వాళ్ళు చదువుకునే రోజుల్లో ఆడపిల్లలకి వేరుగా, మగపిల్లలకి వేరుగా స్కూలు వుండేది. ఇప్పుడు ఆడ, మగ పిల్లలందరికీ కలిపి ఒకటే స్కూలు. అందులో ఇద్దరే టీచర్లు. అందులో ఒకాయన వూళ్ళోలేడు. ఒకాయనే వున్నాడు.

వీళ్ళు వెళ్ళేటప్పటికి పిల్లలంతా బయట కూర్చుని అల్లరి చేస్తున్నారు. స్కూల్లో టీచరు లేడు. మధ్యాహ్నం బెల్లు టైం అయిపోయింది. 2 గం. బెల్లుకావాలి. అప్పటికే గం. 2. 30 అయింది.

శాంకరి అదంతా చూసింది. వెళ్ళి బెల్లు కొట్టింది. పిల్లలంతా బిలబిల మంటూ క్లాసులకు వచ్చి కూర్చున్నారు.

ఆ టీచరు యిల్లు స్కూలుకు వెనక భాగంలోనే వుంది. ఆయనకు ఆ బెల్లు వినపడింది. జరిగిందేమిటో తెలియక ఆయన పరుగెత్తుకుంటూ వచ్చాడు.

పిల్లలంతా క్లాసుల్లో వున్నారు. ఎదురుగా శాంకరి, కనకం వున్నారు.

"మీరా అమ్మా!"

"నమస్కారం మేష్టారు"

"నమస్కారం ఇలా వచ్చారేమిటమ్మా!"

"ఏం లేదండీ! మా అక్క పిల్లల్ని స్కూలుకి తీసుకువచ్చాము. ఇంటి దగ్గర చదువుకోడం లేదండీ!"

"అమ్మో వాళ్ళు పిల్లలు కాదమ్మా! పిడుగులు! ఏం అల్లరి నేర్చుకు వచ్చారమ్మా! తాచెడ్డకోతి వనమెల్లా చెరిచిందన్నట్లు వీళ్ళకే నేర్పుతున్నారమ్మా!"

"మీరు భయపెట్టాలండీ"

"ఏం భయం పెట్టమన్నావమ్మా! ఇన్ని క్లాసులకి ఒక్కణ్ణే. మరొకాయన వూరుకి పోయికూర్చున్నాడు. నన్ను ఏ క్లాసుకి వెళ్ళమన్నావు? ఏ పిల్లల్ని భయపెట్టమన్నావు. పది రోజులున్నాయి పరీక్షలు. పోర్షన్స్ కాలేదు."

ఆయన స్థితికి శాంకరికి, కనకానికి జాలేసింది. "ఓ పని చేద్దాం మేస్టారూ!" మేం వచ్చి క్లాసు తీసుకుని కొన్ని పాఠాలు చెబుతాం! వాటిల్లోనె పరీక్షలు పెట్టండి. పరీక్షల్లో కూడా సహాయం చేస్తాం" పిల్లలు ఒకటేగోల చేస్తున్నారు. వారి గోలపడలేని ఆయన "అలాగెనమ్మా?" అన్నాడు.

"ఇప్పుడే ప్రారంభిస్తాం మేస్టారు."

ఇద్దరు చేరో బెత్తం చేతపట్టి చెరో క్లాసుకి వెళ్ళారు. 4,5 తరగతులు మేస్టారు కలిపి చూస్కోపెట్టారు. మిగిలిన క్లాసులు రెండుగా చేసారు శాంకరి, కనకం. ఎన్నాళ్ళనుంచో పాఠాలు లేని పిల్లలకి ఎంతో సరదా అనిపించింది. వాళ్ళు చెప్పింది తిరిగి చెప్పారు. రాయమన్నది తిరిగి రాసారు.

పాఠాలు చెప్పడం శాంకరికి, కనకానికి కూడా చాలా సరదా అనిపించింది.

మరునాడు కాసులు, సుబ్బులు వూరినుంచి వచ్చారు. శాంకరి వస్తుందని తెలిసే వాళ్ళు కూడా వచ్చారు. శాంకరి చెప్పినట్లుగా వాళ్ళు కూడా స్కూలుకి వెళ్ళి పాఠాలు చెప్పడం ప్రారంభించారు. అంతక్రితం స్కూలుకిరాని పిల్లలు కూడా శ్రద్ధగా వెళ్ళి చదువుకుంటున్నారు.

ఊరిడి మంది శాంకరి వాళ్ళని అభినందించారు.

"మీరిలాగే పాఠాలు చెప్పండమ్మా! ఊరంతా బాగు పడుతుంది" అన్నారు సుశీల పిల్లలు కూడా కాస్త దారిలో పడ్డారు.

శాంకరి వాళ్ళకి మరింత వుత్సాహం వచ్చింది. పరీక్షలు కూడా పూర్తి చేసారు. ఆ సాయంకాలం శాంకరి వాళ్ళు కలిసి తోటవైపు బయలుదేరారు. వాళ్ళకి స్కూలు పెట్టాలని ఆలోచన వచ్చింది. కనకానికి చేతినిండా పని వస్తుంది. అప్పుడే అక్కడకు వచ్చిన సూర్యానికి చాలా సంతోషమనిపించింది.

వెంటనే స్కూలు పెట్టడానికి ప్రయత్నాలు ప్రారంభించాడు సూర్యం.

# 47

ఆరోజు శాంకరి దొడ్లో కాళ్ళు కడుక్కుంటోంది. సుశీల వంటరిగా కూర్చుని ఏడవడం చూసింది. ఆమె మనస్సు కలుక్కుమంది.

"పిల్లలు స్కూలికి వెడితే అక్కకు కాలక్షేపమే లేదు. అలాంటి వాళ్ళు ఆ వూళ్ళో ఎంతో మంది వున్నారు. వాళ్ళ కోసం ఏమైన చెయ్యాలి" మిగిలిన వారికి ఆ విషయం చెప్పింది.

"అందరు ఆ విషయం మీద చాలాసేపు చర్చించారు.

"కుట్టుమిషన్ నేర్పిస్తే బాగుంటుంది" శాంకరి సలహా వాళ్ళకి నచ్చింది.

"కొత్తగా వచ్చిన పోలీసు ఇన్‌స్పెక్టర్ గారింట్లో కుట్టుమిషన్ వుంది. ఆవిడ మిషన్ బాగా కుడతారు. అవిడను అడుగుదాం" అంది కనకం.

"మరి ఎవరు నేర్పుతారు?" సూర్యం అడిగాడు.

"మన మంత్రసాని చెల్లెలికి మిషన్ కుట్టడం బాగా వచ్చు. రాజమండ్రిలో ట్రయినింగ్ అయింది కూడా. ఆమె నేర్పవచ్చు అడుగుదాం" అంది తిరిగి కనకం.

"మరి ఆమెకు జీతం" కాసులు సందేహం వెలిబుచ్చింది.

"జీతానికేముంది? అందరి దగ్గర వసూలు చేసి యిద్దాం" అంది కనకం.

"జీతం సంగతి మీకెందుకు? జీతం నేనేర్పాటు చేయిస్తా" అన్నాడు సూర్యం.

అందరి సందేహాలు తీరాయి. అందరికీ చెప్పలేని ఉత్సాహం వచ్చింది. ఆ రాత్రి శాంకరి ఆ విషయం తల్లితో చెప్పింది.

"ఇదేం పనే శాంకరీ! అక్కడకు వెళ్ళి ఎవరు నేర్చుకుంటారే" అంది అన్నపూర్ణమ్మ.

"ఎవరు నేర్చుకోడం ఏమిటి? నువ్వు నేర్చుకోవాలి? అక్క నేర్చుకోవాలి" శాంకరి పట్టుదలగా అంది.

"అన్నీ! నీకిలాటి ఆలోచనలేనే"

"అలా అనకమ్మా! కాలం మారుతోంది. కాలంతో పాటు మనం మారాలి. అవకాశం వున్నప్పుడు ఇలాంటివి నేర్చుకోవడం తప్పేమిటమ్మా" ఆలోచించిన అన్నపూర్ణమ్మ గారికి శాంకరి మాటలు నిజమే అనిపించాయి.

"అలాగే చూద్దాం" అంది ఆవిడ సుశీలకు మాత్రం ఆ వార్త చాలా సంతోషాన్ని కలిగించింది. ఎప్పుడు ప్రారంభిస్తారే.

"రేపేనక్కా" అక్క వుత్సాహం కనిపెట్టి సమాధాన మిచ్చింది శాంకరి.

మరునాడు నలుగురు కలిసి ఇన్‌స్పెక్టర్ గారింటికి బయలు దేరి వెళ్ళారు. సరోజనిగారు వాళ్ళందరిని సాదరంగా ఆహ్వానించింది. పరిచయమున్నట్లుగానే అందరినీ పలకరించింది. వచ్చిన సంగతి చెప్పింది శాంకరి.

"అలాగా అమ్మా! దానికేం తప్పకుండా మా మిషనిస్తాను. అంతే కాదు ఆ మిషను కుట్టుకూడా నేనే నేర్పుతాను. అందరిని మాయింటికి రమ్మనమనండి"

"మీకు భారమేమోనని"

"భారానికేముందమ్మా! చేతిలో వున్న విద్యేకదా! దీని కోసం తబ్బు ఖర్చు లేదు కదా!'' అందావిడ నవ్వుతూ. అందరికి టీ, బిస్కట్లు ఇచ్చింది.

మొహమాటపడుతూ తీసుకున్నారు నలుగురు. వాళ్ళుండగానే ఆవిడ జవానుచేత గదిలో వున్న మిషన్ తెప్పించి హాల్లో వేయించింది. హాలంతా శుభ్రం చేయించి జంబుఖానాలు పరిచింది.

"ఈరోజు మధ్యాహ్నం ప్రారంభిద్దామా?" అంది శాంకరి.

"శుభస్య శీఘ్రం అన్నారు. వెంటనే ప్రారంభిద్దాం" అందావిడ.

"అలాగేనండి! మీ మేలు ఈ జన్మలో మర్చిపోలేమండీ" అంది శాంకరి.

"దానికేమిటమ్మా! నువ్వు అలా అనకూడదు. మా మిషన్ మొన్ననే కొన్నాను. నాకు పనే లేదు. అనవసరంగా తుప్పట్టి పోతుందని భయపడ్డాను. కుట్టడం నేను మర్చిపోతాననుకున్నాను. మీ మూలంగానే నా మిషనుకు, నా విద్యకు సార్ధకత వస్తుంది" అందావిడావుత్సాహంతో.

"మీరు అలా అనకండి. మీ మూలంగా మా వూరు బాగుపడుతుంది కదండీ" అంది కనకం.

తర్వాత ఆవిడ దగ్గర శలవుతీసుకుని ఇంటికి బయలు దేరారు ముగ్గురూ. దారిలో కనపడ్డ ఆడ వాళ్ళకి చెప్పారు. ఇంటింటికి వెళ్ళి అందరిని రమ్మని చెప్పి వచ్చారు.

"అలాగే వస్తాం! మంచి పని చేస్తున్నారమ్మా" అంటూ అందరూ మెచ్చుకున్నారు.

శాంకరి వాళ్ళ ఉత్సాహానికి అంతే లేదు.

సూర్యం కూడా ఆ ఆడవాళ్ళకు మధ్యలో ఒకడిగా మసలుకుంటున్నాడు. తీరా వేళయ్యేటప్పటికి ఒక్కళ్ళు ముందుకు రాలేదు.

శాంకరి వాళ్ళు చాలా నిరుత్సాహపడ్డారు. వాళ్ళకి ఏం చెయ్యాలానికి తోచలేదు.

"అక్కా! అక్కా! నువ్వైనా రావే! నీ కోసమే అసలు ఈ ఏర్పాటు చేశామే." సుశీలను బతిమాలింది శాంకరి.

"వెళ్ళవే సుశీలా" అన్నపూర్ణమ్మ కూడా చెప్పింది.

సుశీల వెక్కి వెక్కి ఏడ్వు ప్రారంభించింది.

"అక్కా నువ్వు ఏడిస్తే నా మీద ఒట్టే!" అంది శాంకరి. సుశీల కారే కన్నీళ్ళు తుడుచుకుంది.

అంతలో సూర్యం తల్లి, కనకం తల్లి "మేము వస్తామంటు" ముందుకొచ్చారు.

సూర్యం రిక్షాలకు కబురు చేసాడు. రెండు రిక్షాలు వచ్చి గుమ్మం ముందు ఆగాయి. రిక్షాలను చూడగానే పిల్లలకు, పెద్దలకు కూడా వుత్సాహం ముంచుకొచ్చింది. రానన్న వారంతా ముస్తాబులై వచ్చారు. రిక్షాలు అలా తిరుగుతూనే వున్నాయి. వచ్చిన వారందరిని చేరవేస్తూనే వున్నాయి. మొత్తం మీద సరోజిని గారి హాలంతా ఆడ వాళ్ళతో నిండిపోయింది.

పేరంటానికి, గుళ్ళో భజనలకు, దేవుని పూజలకు మాత్రమే వెళ్ళడం అలవాటున్న వారికి ఆ రోజు కొత్తగా అనిపించింది. ఎలక్షన్సులో ఓటు వేయడానికి బయలు దేరినట్లు బిలబిల మంటూ వెళ్ళి కూర్చున్నారు. రిక్షాలకు డబ్బు ఖర్చు అయినా ఫలితం దక్కిందనుకున్న సూర్యం పైసలు యిచ్చి రిక్షాలను పంపించాడు.

శాంకరినే అందరు ముందు మిషన్ తొక్కనున్నారు. రిబ్బన్ను కటింగ్ లాంటివి లేక పోయినా ముందు మిషన్ మీద కూర్చుని కాళ్ళతో తొక్కింది శాంకరి. కనకం వాళ్ళను చూసి మిగిలిన వాళ్ళంతా చప్పట్లు కొట్టారు.

సరోజిని గారు నెమ్మదస్తురాలే కాదు, పనిలో నేర్పరి తనం గలది కూడా.

కొందరికి మిషన్ తొక్కడం నేర్పింది. కొందరికి కటింగులు నేర్పింది ఆ రోజు.

మరునాడు మరి కొంతమంది వచ్చారు. అన్నపూర్ణమ్మగారి లాటి వాళ్ళు కూడా కటింగులు నేర్చుకోడం ప్రారంభించారు. వయసులో వున్నవాళ్ళకి మరింత వుత్సాహంగా వుంది. ఇంట్లో పనులు గబగబ తెముల్చుకుని అందరు సరోజిని గారింటికి పరుగెత్తుతున్నారు.

సూర్యం ప్రభుత్వం వారికి రాసి రెండు మిషన్లు తెప్పించాడు. ఊరిడిమంది అదే సందడిలో వున్నారు. అసలు వాళ్ళ వూరే మారి పోయింది. తామే మారిపోతున్నామా అనుకున్నారు.

శాంకరి వాళ్ళను అభినందించారు. కాని వూళ్ళో వున్న టైలర్లు మాత్రం దుమ్మెత్తి పోసారు. వాళ్ళను చిన్నపిల్లల గౌనులు, పెద్దల జాకెట్లు, లంగాలు, చొక్కా-బటన్సు, తలగడ గలేబులు, లోపలి లంగాలు మొదలైనవి నేర్చుకోడం మొదలెట్టారు. మంత్రసాని చెల్లెలు కూడా మిషను కుట్టు నేర్పడానికి ముందుకు వచ్చింది. తలా ఐదు రూపాయలు వసూలు చేసి ఆమెకిస్తామన్నారు. మధ్యలో పూర్తిగా నేర్చు కోకుండా కొంతమంది మానివేసినా మిగిలిన వాళ్ళు మాత్రం శ్రద్ధగా నేర్చుకుంటున్నారు.

ఆడవాళ్ళకి గ్రంథ పఠనం కూడా అవసరమనుకున్నారు వాళ్ళు. దాని గురించి కూడా వారు ఒక నిర్ణయానికి వచ్చారు. జూనియర్ కాలేజిలో మంచి లైబ్రరి వుంది. కాని ఆడ వాళ్ళు అక్కడకు వెళ్ళి చదువుకోవడం అక్కడి నుంచి పుస్తకాలు తెచ్చుకోవడం అలవాటు లేదు. అందుకే ఆడవాళ్ళకు ప్రత్యేకంగా ఒక చిన్న లైబ్రేరీ ప్రారంభించాలనుకున్నారు సూర్యం వాళ్ళ వీధి గది లైబ్రేరీకి కేటాయించారు. కొందరు పెద్దల దగ్గర డబ్బు వసూలు చేసారు. మరికొందరి దగ్గర గ్రంథాలే కాదు, చందాలుకూడా తీసుకున్నారు. రామాయణం, భారతం మొదలైనగొప్పగ్రంథాలు మొదలుకొని నేటి నవలలు,సాహితీ గ్రంథాలు

సంపాదించడానికి కృషి ప్రారంభించారు. నేటి వార, మాస పత్రికలు, నవలలు, కథా సంపుటిలు, సాహితీ వ్యాసాలు, కవితలు కొనడానికి ధనం కేటాయించారు

కాస్త చదవడం, రాయడం నేర్చిన ఆడవాళ్ళంతా అక్కడకు వెళ్ళి పుస్తకాలు, పత్రికలు చదవడం మొదలు పెట్టారు. చదువురాని జనం అక్షరాలు నేర్చుకోవడం చురుగ్గా ప్రారంభించారు.ఆడవాళ్ళందరిని రోడ్డు కీడుస్తున్నారని కొందరు జనం నిందిస్తున్నా శాంకరి వాళ్ళు తమ పని మాత్రం మానలేదు.

ఎప్పుడైతే ఆ రెండు విజయవంతమయ్యాయో సూర్యం వుత్సాహానికి అంతులేదు.

ఒక స్కూలు కూడా వాళ్ళే ప్రారంభిస్తే బాగుంటుందనే ఆలోచన వచ్చింది శాంకరికి.

ఆ మాట మిగిలిన వారితో చెప్పింది. సూర్యం, కనకం ఆ పని చేస్తేబాగుంటుందని సలహా యిచ్చారు కాసులు, సుబ్బులు.

"మనం ఈ వూళ్ళో ఉండలేం కదే! వాళ్ళే ఆ బాధ్యత తీసుకుంటే మంచిది" అన్నది కాసులు. సూర్యానికి, కనకానికి కూడా ఆ పనిచేస్తే పిల్లలు బాగు పడతారు. తమకు చేతిలో పని వుంటుందనుకున్నారు. జగన్నాధంగారు, రామనాథంగారు కూడా ఆ పని మంచిదన్నారు. మరునాడు సూర్యం వాళ్ళు స్కూలు ఎక్కడ ప్రారంభించాలో నిర్ణయించుకున్నారు. పరిమిషన్ పెట్టాడు. శాంకరి కలవులు పూర్తి కాకుండానే స్కూలు ప్రారంభోత్సవం చేయాలనుకున్నారు. అంతలో సుబ్బారావు కాసుల్ని తీసుకెళ్ళడానికి వచ్చాడు. వెంకట్రావు రాకుండా వెంటనే సుబ్బుల్ని రమ్మని టెలిగ్రాం ఇచ్చారు.

కాసులు, సుబ్బులు ఒక కంట ఏడుస్తూ, మరో కంట నవ్వుతూ బయలు దేరారు. కాకినాడ రమ్మని కాసులు, శ్రీశైలం రమ్మని సుబ్బులు, సూర్యాన్ని కనకాన్ని, శాంకరిని బలవంతం చేసారు. వీలు చూసుకుని వస్తామన్నారు వాళ్ళు. అప్పటికి సుబ్బులికి ఐదవ మాసం వచ్చింది. ఆ హడావిడిలో సుబ్బులు ఎవరేం చెప్పినా వినిపించుకోలేదు...

"నెల తప్పిన దానివి? అలా తిరుగుతావేమిటమ్మా!" అని తల్లి ఎంత చెప్పినా వినిపించుకోలేదు సుబ్బులు. గాజులు పెట్టించి, పువ్వులు ముడిపించి పంపిస్తామన్నారు సుబ్బులు తల్లితండ్రులు.

అవన్నీ ఇప్పుడెక్కడండీ! శ్రీశైలం వచ్చి ఆ వేడుకలన్నీ చేయండి అన్నాడు వెంకట్రావు.

ఇంక ఏమి అనలేక పూరుకున్నారు తల్లిదండ్రులు. వెంకట్రావు భార్యను తీసుకుని, వెళ్ళిపోయాడు. సుబ్బారావు వెంట కానులు బయలు దేరి వెళ్ళింది.

కాలేజీలు తెరిచారు. శలవులు పూర్తి అయ్యాయి. శాంకరి వైజాగ్ ప్రయాణమయింది. అంతవరకు సంతోషంగానే వున్నా, తీరా శాంకరి వెళ్ళే సమయానికి అందరి ముఖాలు వాడిపోయాయి. శాంకరి మాత్రం చాలా వుత్సాహంగా వుంది. అప్పటికే సూర్యం స్కూలు పెట్టడానికి అన్ని ఏర్పాట్లు చేశాడు. ఊరు చివరఖాళీవున్న స్థలంలో రెండు పాకలు వేయించాడు. "గురు కులం పాఠశాలగా మార్చాడు. ప్రారంభోత్సవం కూడా చేయించాడు. కాని పిల్లలు మాత్రం ఎవరు రాలేదు. "వర్షం వస్తే తడిసి పోతాయి, గాలివాన వస్తే ఎగిరిపోతాయి. పాకల్లో పాఠాలేమి చెబుతారయ్యా!" చూసిన పెద్దలంతా అదేమాట అన్నారు.

"పాఠాలు ముఖ్యమా! పాకలు ముఖ్యమా?" అన్న సూర్యంమాట ఎవరూ వినలేదు.

సూర్యం, శాంకరి వాళ్ళు మళ్ళీ బాగా ఆలోచించారు. ఊరి మధ్యలోఖాళీగావున్న పెద్ద మేడను అద్దెకు తీసుకున్నారు. కాన్వెంటు స్కూలుగా మార్చారు. కుర్చీలు, బెంచీలు తెప్పించారు. ఆ ఆర్భాటం జనానికి నచ్చింది. హాస్టల్ కూడా మూడో అంతస్తులో పెట్టారు.

వూళ్ళో వాళ్ళేకాదు, చుట్టుప్రక్కల వూళ్ళనుంచి కూడా పిల్లల్ని తీసుకొచ్చి చేర్పించారు తల్లిదండ్రులు. ఇంకో ఇద్దరు టీచర్లు కూడా వచ్చారు. అందుకే శాంకరికి చాలా సంతృప్తిగా వుంది. అక్క పిల్లల్ని కూడా అక్కడికే పంపిస్తోంది. సూర్యానికి, కనకానికి ఎన్నో విషయాలు చెప్పి బయలుదేరింది శాంకరి.

# 48

శివా వేసవి శలవుల్లో తల్లిని తీసుకుని సూర్యం వూరు వెళ్ళాలను కున్నాడు. కాని తల్లికి జ్వరం వచ్చి బాగా నీరసపడింది. ఆమెకు విశ్రాంతి అవసరమని డాక్టర్లు చెప్పారు. పైగా అంత దూరం ప్రయాణం చెయ్యడం మంచిది కాదన్నారు. ఆమెను వంటరిగా ఆ పరిస్థితుల్లో వదలి తాను అంత దూరం వెళ్ళడం మంచిది కాదనుకున్నాడు. సూర్యానికి వస్తున్నానని రాసాడు కాని బయలుదేరలేకపోయాడు.

అతని దృష్టి అంతా శాంకరి మీదే వుంది. కాని ఆమెను చూడ్డానికి అవకాశమే దొరకలేదు.

చలపతి, భార్యా వచ్చి రాజేశ్వరమ్మగారి దగ్గర పది రోజులున్నారు. ఆవిడ కాస్త కోలుకుంది. జ్వరం తగ్గినా నీరసం బాగా వుంది. క్రమంగా తగ్గుతుందన్నారు డాక్టర్లు.

చలపతీ, భార్యా కూతుర్ని చూడాలని బయలుదేరి వెళ్ళారు. వియ్యంకుడుగార్ని పలకరిద్దామందే ఆయన వీళ్ళని చూచి గదిలోకి వెళ్ళి తలుపులు పెట్టుకున్నాడు.

గిరిజను కూడా తల్లితండ్రులతో మాట్లాడనీయకుండా చేసాడు. చలపతీ, భార్యా చాలా బాధపడ్డారు. కూతురు చాలా సుఖంగా వుందనుకుంటున్న సమయంలో ఈ గొడవలేమిటో వాళ్ళకి అర్థం కాలేదు.

వీధి గదిలో కుర్చీల్లో కూర్చున్న చలపతి దంపతులకు కనీసం మంచినీళ్ళు కూడా ఎవరూ అందించలేదు.

ఎంత లవ్ మారేజి అయితే మాత్రం ఓ అచ్చటా ముచ్చటా వద్దా! ఆమాత్రం తెలీదుటండీ! ఆడబిడ్డ మొహాన్ని ఒక రవికుల గుడ్డ లేదు?" లోపల నుంచి అత్తగారి సనుగుడు వినబడుతోంది. చలపతీ అతని, భార్యా అసలు సంగతి విని బాధపడ్డారు. "కట్నం కానుకలు కావాలంటే పిల్లనేత వుత్తరం రాయించవచ్చు కదా! ఈ చాటు వ్యవహారాలేమిటీ". ఆలోచించిన కొద్దీ వారికి ఆశ్చర్యమేసింది.

వాళ్ళకి ఏం చెయ్యాలో కాసేపు అర్థం కాలేదు. మొండిగా ప్రవర్తిస్తే పిల్ల కాపురం ఎక్కడ నాశనం అవుతుందోనని భయపడ్డారు. గొడవలు రాకుండా వ్యవహారం పరిష్కరించుకోవాలి అనుకున్నారు. అత్తమామలు వస్తే తల్లితండ్రులు అలా ప్రవర్తిస్తారని అతననుకోలేదు.

గిరిజకు దుఃఖం వస్తున్నా పైకి రానీకుండా బలవంతంగా ఆపు కుంది. తల్లితండ్రులకు అంత అవమానం జరుగుతుందని గిరిజ అను కోలేదు. కనీసం తాగడానికి మంచినీళ్ళు, కప్పు కాఫీ యివ్వనందుకు బాధపడింది. గిరిజ తల్లికి ఏం చెయ్యడానికి తోచలేదు. చలపతి, ఆవిడా చాలాసేపు ఆలోచించారు. వారికి ఒక ఆలోచన వచ్చింది.

"ఏమండీ: మీకేం కావాలో ఒక లిస్టు రాసి పంపిస్తే మేం అన్నీ పంపిస్తాం. మాకూ సరదాలున్నాయి. అందుకే వచ్చాము. గిరిజ తల్లి హాల్లో అడుగుపెట్టి వియ్యపురాలు వినబడేటట్టు అంది".

"గిరిజా! మీ అమ్మగారు ఏమిటో అంటున్నారు. వెళ్ళి మీ అమ్మ గారికి నాన్నగారికి మంచినీళ్ళు, కాస్త కాఫీ యిచ్చిరా అమ్మా!" అంది.

గిరిజ అత్తగారి మాటలకి తెల్లబోయింది. పేదవానికోపం పెద వులకు చేటు అన్నట్టుగా గిరిజ కోపం లోపలే దాచుకుంది వెళ్ళి తల్లి తండ్రులకు రెండు గ్లాసులతో మంచినీళ్ళు యిచ్చింది.

"ఈ మంచినీళ్ళు చాలమ్మా! సేదతీర్చుకోడానికి మేం వెళ్ళివస్తాం. మీ అత్తగారికి చెప్పు, ఏం కావాలో చెప్పమనమ్మా, వాళ్ళకు ఏం కావాలో మాకు తెలీదుకదా!" అన్నాడు చలపతి.

"అత్తయ్య ఇంట్లో వుంటాం! వెడతాం అమ్మా!" అంది తల్లి. గిరిజ కళ్ళలో నీళ్ళుతిరిగాయి. "ఇంతవరకు నాతో బాగానే వున్నారు. మీరొచ్చాకే యిలా చేస్తున్నారమ్మా!" అనాలనుకున్న మాటలు గిరిజ నోట్లోనే వుండిపోయాయి.

చలపతి భార్యను తీసుకుని రాజేశ్వరమ్మగారి దగ్గరకు వచ్చే సాడు. చలపతి అక్కడి సంగతి చెబుతింటే రాజేశ్వరమ్మగారు నమ్మ

లేకపోయింది. "తడిగుడ్డతో గొంతులు కొయ్యడం అంటే ఇదే కాబోలు" అనుకుంది.

అంతలో అత్తమామలు కలిసి రాసిచ్చిన లిస్టు పట్టుకుని గిరిజ, సత్యంతో కలిసి వచ్చింది.

లిస్టులోవన్నీ కొనివ్వడానికి చలపతి, భార్యా సిద్ధపడ్డారు. కాని శివా అంగీకరించలేదు.

"ప్రేమ వివాహమని ఆదర్శంగా చేసుకున్న పెళ్ళిలో ఈ వర కట్నాలు, వేధింపులు ఏమిటి? ఏరా! సత్యం నీకు కూడా బుద్ధిలేదురా!" నిలదీసి అడిగాడు శివా.

"నాకేం తెలీదురా! మా అమ్మా, నాన్న కూడా యిలా చేస్తారని అనుకోలేదు. నేను సిగ్గుపడుతున్నారా!" అన్నాడు సత్యం.

"ఈ సామానంతా కొనిస్తే బోలెడంత డబ్బు ఖర్చవుతుంది. దీనివల్ల సత్యానికి, గిరిజకు మిగిలిందేమి వుండదు. మామయ్యా ఆ డబ్బు గిరిజ పేర బ్యాంకులో వేస్తే మంచిది: ఏం సత్యం ఏమంటావు?"

"ఒద్దురా శివా? వాళ్ళ దగ్గర నుంచి అంత డబ్బు ఎలా తీసుకోనురా! వద్దు! మాకేమి వద్దు!" అన్నాడు సత్యం.

"ఇప్పుడే ఇంత అల్లరి చేసారు. రేప్పొద్దుట గిరిజను ఇంకేం చేస్తారో" అన్నాడు శివా.

"అంటారు! అనకుండా వుండరు వాళ్ళు. అవసరమైతే మా యింటికి మేం వెళ్ళిపోతాం. మా యిల్లు సామాను అలాగే వున్నాయి కదా!" అన్నాడు సత్యం.

"ఒరే సత్యం! నువ్వు నిజంగా మంచివాడివిరా!" ఈ మాటమీదే నిలబడు. మిగిలిన సంగతి చూద్దాం" అన్నాడు శివా.

"సత్యం! నాయనా! నువ్వు వద్దన్నా గిరిజపేర 50 వేలు వున్నాయి. ఆమెకే యిస్తాం" అన్నాడు చలపతి.

"అప్పుడే వద్దండీ! అవి మీదగ్గరే వుంచండి. ఆ వడ్డీతో ఏమైనా కొనక్కుంటుంది గిరిజ" అన్నాడు సత్యం.

"నేను కూడా ఏదైనా వుద్యోగం చేస్తాను నాన్న. నాకు ఏదైన చూసి పెట్టండి" అంది గిరిజ.

చలపతికి మద్రాసులో పరపతి బాగానే వుంది. చాలా మంది తెలుసు.

అందుకే "అలాగే చూస్తానమ్మా" అన్నాడు.

సత్యం గిరిజను తీసుకుని యింటికి వెళ్ళాడు. అతన్ని చూడగానే ఆవిడ "మీ అత్తవారు ఏం కొనిచ్చారురా" అంటు అడిగింది.

జరిగిన సంగతి చెప్పాడు సత్యం.

తండ్రికి విపరీతమైన కోపం వచ్చింది. వెంటనే యింట్లోంచి వెళ్ళి పొమ్మని అరిచాడు.

"భోజనాలైనా చెయ్యకుండా అకలిపొట్టలతో సత్యం, గిరిజ పెట్టెలు చేతపట్టి అద్దె యింటికి బయలుదేరారు.

అంత ప్రేమగా ఉండే తల్లిదండ్రులు రాక్షసుల్లా మారిపోయి నందుకు బాధపడ్డారు. డబ్బు కోసం వాళ్ళు కన్నకొడుకునే యింట్లోంచి పొమ్మన్నారు. తాను కనుక వాళ్ళమీద వుండే ప్రేమతో వాళ్ళ మాట వినివుంటే గిరిజ సంగతి ఏమయ్యేదో? ఈనాడు పేపర్లొ ఎన్నో విష యాలు చదువుతున్నాం. కట్నకానుకల కోసం కోడల్ని చంపేవాళ్ళు, కోడలు ఆత్మహత్య చేసుకునే వరకు బాధపెట్టేవారు ఎన్నో రకాలు. అవన్నీ తలచుకుంటే సత్యాని భయమేసింది.

ఏదైనా తాను మంచిపని చేసాడు. గిరిజకు ఏ ప్రమాదం లేదను కున్నాడు.

అనుకున్నట్లుగానే గిరిజకు ఉద్యోగం వచ్చింది. గిరిజను ఆఫీసు దగ్గర దిగబెట్టి సత్యం తన ఆఫీసుకి వెళ్ళిపోతున్నాడు. తిరిగి సాయం కాలం ఆమెను తీసుకుని వస్తున్నాడు.

"ఇంక వాళ్ళ సంసారానికి ఏ భయం లేదనుకున్నారు" అంతా.

ఇంక శివా! ఓ యింటివాడవాలనకుంది రాజేశ్వరమ్మ.

రెండవ సంవత్సరంలో అడుగు పెట్టాడు శివా! శాంకరిని చూడా అని మనసులో వున్నా ఆవిషయం పైకి అనలేక ఎవరితోను చెప్పలేక తనలోతాను దాచుకున్నాడు.

# 49

శాంకరి రెండవ సంవత్సరంలో అడుగు పెట్టింది. మరింత శ్రద్ధగా చదువుతోంది. అపర్ణ కూడా శాంకరికి భయపడి కాస్త పుస్తకం తీస్తోంది, లత యింకా రాలేదు. కారణమేమిటో వాళ్ళకు తెలియదు, కాని లత బావ ఫారిన్‌నుంచి వచ్చి వుంటాడనుకున్నారు.

నెలరోజుల తర్వాత లత వైజాగ్ వచ్చి రూముకు చేరింది. లత ముఖం వాడిపోయి వుండటం శాంకరి, అపర్ణా కూడా గ్రహించారు. కాని యిద్దరు కూడా లతను అడగలేదు. ఆమే చెబుతుందని యెదురు చూసారు.

ఫ్లాస్కులో కాఫీ కప్పులో పోసి లతకు అందించింది అపర్ణ. గ్లాసుడు మంచినీళ్ళు తాగి తర్వాత కాఫీకప్పు అందుకుంది లత.

"శాంకరీ బాగున్నావా? అపర్ణ నువ్వెలా వున్నావు" లత అడిగింది.

"నువ్వెలా వున్నావు లతా? ఇంత ఆలస్యమైందే" శాంకరి మామూలుగానే అడిగింది.

లత కళ్ళలో నీళ్ళు తిరిగాయి. బలవంతంగా ఆపుకుంది.

"నేను బాగానే వున్నా! కాని నా పరిస్థితులు మాత్రం బాగా లేవు?"

"ఏం జరిగింది లతా! ఇంకా మాతో చెప్పడానికి ఆలోచిస్తున్నావా?" అపర్ణ అడిగింది.

"జరిగింది ఎలా చెప్పాలాని ఆలోచిస్తున్నా అపర్ణా! మా బావ అమెరికా నుండి వచ్చాడు. ఆ దేశం అమ్మాయిని పెళ్ళి చేసుకుని మరీ తీసుకొచ్చాడు."

"అతను పెళ్ళి చేసుకుంటే నీకేమిటి నష్టం లతా?" శాంకరి అడిగింది.

"అతని చదువుకి మా నాన్నగారే డబ్బు ఇచ్చారు. మేమిద్దరం ప్రేమించుకున్నాం. పెద్దలు కూడా చిన్నతనం నుంచి మా యిద్దరి పెళ్ళి చేయాలనుకున్నారు. పెళ్ళి చేసుకుని వెళ్ళమంటే మా నాన్నగారు మా బావ తిరిగి వచ్చాక చేసుకుంటానన్నాడుట. నిజమే అనుకున్నాం అదంతం. కాని అతనిలో అంత స్వార్థం వుందని తెలియలేదు.

సిటిజన్‌షిప్ కోసం ఆ పిల్లను పెళ్ళి చేసుకున్నాడు. పైగా నన్ను చూసి "బాగున్నావా లతా" అంటూ అడిగాడు.

"ఈమె మా మామయ్య కూతురు" అంటూ భార్యామణికి పరిచయం చేసాడు. లత గొంతులో బాధ ధ్వనించింది.

"బాధపడకు లతా!"

"నేను బాధపడటం లేదు అపర్ణా! కాని యిన్నాళ్ళు పెంచుకున్న ప్రేమలతని ఒక్కసారి కూకటివేళ్ళతో పెళ్ళగించాలంటే కొంతెం కష్ట పడాలి కదా!"

లత మాటలు విని శాంకరి ఆశ్చర్యపోయింది. ఎప్పుడూ నవ్వుతూ వుండే లత ఈ సంఘటనకు ఏడుస్తుందో, మొత్తుకుంటుందో, బావ మోసం చేశాడని ఆత్మహత్య చేసుకుంటానని పేచీ పెడుతుందో అనుకుంది శాంకరి. కాని సముద్రమంతా గంభీరంగా వుంది లత. ఆమెను అర్థం చేసుకోడానికి ప్రయత్నించింది శాంకరి.

"లతా! నువ్వు మీ బావని ప్రేమించావు! కాని మీ బావకు నీ మీద ప్రేమ లేదు. ఇన్నాళ్ళు డబ్బు కోసం నటించాడు. అతని గుణం ముందే బయటపడింది. లేకపోతే నువ్వు జీవితాంతం బాధపడవలసి వచ్చేది. ఇంక అతన్ని మర్చిపోయి హాయిగా చదువుకో! ప్రశాంతంగా వుండు" అంది శాంకరి.

"నువ్వు చెప్పింది నిజం శాంకరి. నా కళ్ళు తెరుచుకున్నాయి."

లత కాసేపు మంచంమీద నడుం వాల్చింది. తర్వాత కాసేపు నిద్రపోయింది. మెళకువ వచ్చినప్పటికి ఆమె మనస్సు మామూలు స్థితికి వచ్చింది. శాంకరి, అపర్ణలతో పాటు లత కూడా మామూలుగా చదువు కోవటం మొదలు పెట్టింది.

# 50

జయరాం అపర్ణతో కాస్త చనువుగా వుంటున్నాడు. కాని అతనికి శాంకరిపై మోజు మాత్రం పోలేదు.

శాంకరి కనపడితే చాలు 'హాయ్' అంటూ పలకరిస్తాడు. ఆమె ఒంటరిగా వెడుతుంటే వెంట నడుస్తూనే వుంటాడు. వీడి పీడ మాత్రం పోవడం లేదని శాంకరి విసుక్కుంటూనే వుంది.

అది విన్న లత, అపర్ణలు నవ్వుకునేవారు. శాంకరి మాత్రం జయరాంని తప్పించుకు తిరగడానికి ప్రయత్నం చేస్తోంది. సాధారణంగా లత, అపర్ణలు ఆమె వెంటే వుంటున్నారు.

ఆ రోజు హాస్పటల్లో పెద్ద గందరగోళమయింది. సీనియర్ డాక్టర్ ఒక స్టూడెంటు చెయ్యిపట్టుకున్నాట్ట. ఆమె గట్టిగా అరిచిందిట. ఆ అరుపులు విని కొందరు అక్కడికి వెళ్ళారు.

అతన్ని వెంటనే డిస్మిస్ చెయ్యాలని పట్టుపట్టారు. మొదట యాజమాన్యం వినిపించుకోలేదు. కాని తర్వాత ఎంక్వైరీ కమిటీని వేస్తామన్నారు. స్టూడెంట్సు కాస్త చల్లబడ్డారు.

శాంకరి, లత, అపర్ణలను వెంట పెట్టుకుని ఆ అమ్మాయి దగ్గరకు వెళ్ళింది. "జరిగిన సంగతేమిటని" అడిగింది. ఆమె నాల్గో సంవత్సరం చదువుతోంది. ప్రాక్టికల్ కోసం వాళ్ళు హాస్పటల్స్‌కి వెళ్ళాలి. అలా వెళ్ళినప్పుడల్లా ఆ డాక్టర్ ఆమెను పెళ్ళి చేసుకుంటానని బతిమాలుతున్నాడు. ఆమె అంగీకరించలేదు. ఆమె వెళ్ళిపోతుంటె చటుక్కున చెయ్యిపట్టుకున్నాడు. అతనికి యిదివరకే వివాహమయింది. ఇద్దరు పిల్లలు కూడా వున్నారు. ఇదివరకు కూడా ఆ డాక్టరు అలా లేడీ

స్టూడెంట్సుని ఏడిపించినట్లు అందరికీ తెలుసు. ఈ విషయాలన్నీ శాంకరికి విపరీతమైన కోపం వచ్చింది. అటువంటి డాక్టరుపై తీసుకోవాలి. మరెప్పుడూ అటువంటి పని ఆయన చెయ్యకుండాచేం శాంకరికి పంతం పెరిగింది. మరికొంత మంది ఆడపిల్లల్ని తీస యాజమాన్యాన్ని కలిసింది. అందులో ఆ లేడీ స్టూడెంటు సబిత వుంది.

ఛైర్మన్ సబితను వివరాలన్నీ అడిగాడు. సద్దుమణిగిన మళ్ళీ మొదటికి వచ్చినందుకు వాళ్ళకి కోపంగావుంది. పైకి ఏమీ లేకపోయారు. అందులో శాంకరి వచ్చిందంటే పరిష్కారం చూ వరకు వూరుకోదు.

సబిత చెప్పినదంతా ఆయన రాసుకున్నారు. తర్వాత ఆ డా గురించి శాంకరి సేకరించిన విషయాలన్నీ విన్నారు.

"అమ్మా! శాంకరీ అన్నీ పరిశీలించి నిజమని తేలితే అత తప్పకుండా డిస్మిస్ చేస్తాము, సరేనా!" అన్నాడు ఛైర్మన్.

"ఆ డాక్టర్ని డిస్మిస్ చేయ్యకండి. అలా చేస్తే కష్టాలు ప అపకారాలు జరిగేవి ఆయన భార్యాబిడ్డలకే. అందుకే ఆయ కొన్నాళ్ళు యింక్రిమెంట్సు ఆపడం, లేక ప్రమోషన్ ఆపడంచెయ్య అలా చేస్తే ఆయనకు పనిష్మెంట్ ఇచ్చినట్లు అవుతుంది. వాళ్ళ కు బం వీధిని పడకుండా వుంటుంది"

శాంకరి సమాధానం విని వాళ్ళు బాగా ఆలోచించారు. తెలివితేటలను, నిదానాన్ని మెచ్చుకున్నారు. ఇదివరలో ఆయన కంప్లైంట్సు వాళ్ళ దగ్గర వున్నాయి. అందుకే వెంటనే అతని యి మెంట్సు ఆపడానికి ప్రయత్నిస్తామన్నారు.

శాంకరి మనస్సు కుదుటపడింది. "నువ్వు మాత్రం యీ సం ఇంకెవ్వరితను చెప్పకు. పైగా నీ చెయ్యి పట్టుకున్న సంగతి కనబ వారికిల్లా చెప్పకు. అందరికీ లోకువవుతావు. జరిగిందేదో జరిగింది. వలసిన శిక్ష పడింది జాగ్రత్త. నింద నీమీద మచ్చలా పడనియ్యక

శాంకరి మాటలు అందరూ ఆశ్చర్యంగా విన్నారు. సవిత 'సరే'నంటూ తలూపింది. ఆమె ఆలోచన అందరికి నచ్చింది.

# 51

సూర్యం రాసిన ఉత్తరం చదువుకున్నాడు శివా, అతని మనస్సు సంతోషంతో రెపరెపలాడింది.

"అమ్మా! సూర్యం లెటర్ రాసాడమ్మా!"

"ఏమని రాసాడురా!"

"ఈ సంక్రాంతి శలవుల్లో వాళ్ళూరు రమ్మని రాసాడు. మనం వెడదామా."

"దానికేం తప్పకుండా వెడదాం"

శాంకరి శలవుల్లో అక్కడే ఉంటుందన్న విషయం అతన్ని తొందర పెడుతోంది.

వెంటనే సూర్యానికి వస్తున్నట్లు లెటర్ రాసాడు.

శివా మనస్సంతా శాంకరి మీదే ఉంది. సూర్యం పెళ్ళిలో చూసాడు. మళ్ళీ తర్వాత చూడ్డం కుదరనేలేదు. తను ఎంత తొందర పడుతున్నాడో అంత ఆలస్యమవుతోంది. ఈసారి ఆమెను తప్పకుండా చూడాలి. ఆమె తన ప్రణయదేవత. గోదావరిలో తన ఒడిలో ఒరిగి పోయింది ఆ దేవత. పన్నీరు పెళ్ళిలో చిలికింది ఆ దేవత. ప్రేమను పంచి యిచ్చింది ఆమె. అందినట్లే వుంటుంది. కాని అంతలో తనకు అందనట్లే వుంటుంది. ఏదైనా ఆమె తన ప్రాణం. తన హృదయం. తన శరీరం. తన సర్వస్వం. తన జీవితం. ఆమెను చూడాలి. అంత వరకు గతాన్ని తలుచుకుంటు కాలం గడపాలనుకున్నాడు. అప్పటికే రెండవ సంవత్సరం సగం పూర్తయింది. రెండవ సంవత్సరం పూర్తి కాగానే హైదరాబాదు వెళ్ళిపోవాలి. అక్కడే ఏదో ఉద్యోగం సంపాదించాలి. అది ఆంధ్రుల రాజధాని. అందరూ ఆ నగరానికే చేరు

కుంటున్నారు. తాను కూడా సాధ్యమైనంత త్వరలో తెలుగుగడ్డలో కాలు పెట్టాలి. అతని ఆలోచనలు అలా సాగిపోతున్నాయి.

అంతలో గుమాస్తాగారు వచ్చారు. అతని వెంట ఎవరో క్రొత్త వ్యక్తి కూడా వున్నాడు.

"ఈయన కామేశంగారు బాబూ! నాన్నగారికి పదివేలివ్వాం. మీకు ఆ పదివేలు అందజేయాలని వచ్చారు," గుమాస్తాయే పరిచయం చేశాడు.

"కూర్చోండి" అంటు శివా కుర్చీ చూపించాడు. ఆయన కుర్చీలో కూర్చుంటూనే పదివేల కట్ట శివా చేతిలో పెట్టారు.

"మా అమ్మాయి పెళ్ళికి తీసుకున్నాను. నాన్నగారు కాగితం కూడా లేకుండా నాకు 20 వేలు అప్పు యిచ్చారు. నిరుడు పదివేలు పట్టుకొచ్చి నాన్నగారికి యిచ్చేసాను. తర్వాత హైదరాబాద్ వెళ్ళి వ్యాపారం ప్రారంభించాను. అందులో కాస్త లాభాలే వస్తున్నాయి. ఇబ్బందులు లేకుండా జీవితం వెళ్ళిపోతోంది. అందుకే ఈ పదివేలు ఇచ్చిపోదామని వచ్చాను. కాని ఆ ధర్మాత్ముడు కాలధర్మం చెందారని ఇక్కడికి వచ్చాకే తెలిసింది బాబూ! ఇదంతా నాకు ఆయన భిక్షే బాబూ!"

రాజేశ్వరిదేవి లోపలనుంచే ఆ మాటలు వింది భర్తమీద వుండే గౌరవంతో ఆమె కళ్ళు చెమర్చాయి.

శివాకి తండ్రి మీద మరింత గౌరవం పెరిగింది. ఆ వచ్చిన వ్యక్తి నిజాయితీకి ఆశ్చర్యపోయాడు. "ఇంకా ఈ రోజుల్లో యిటువంటి నిజాయితీ పరులు వున్నారా?" అనుకున్నాడు.

రాజేశ్వరమ్మగారు ముగ్గురికి కాఫీలు మంచి నీళ్ళు పంపింది. గుమస్తాయే అందరికీ ఇచ్చాడు.

"నారాయణ మూర్తిగారి సంతానం నువ్వేకదా బాబు. పిల్లాపాపాలతో నువ్వు చల్లగా వుండాలి బాబూ" అంటూ ఆయన శివాకు మరోసారి కృతజ్ఞతలు చెప్పి బయలు దేరాడు.

అంతలో గిరిజా సత్యం వచ్చారు. గిరిజకు ఏడవ నెల వచ్చింది నడవలేక కాస్త ఆయాస పడుతోంది.

"ఏమ్మా గిరిజా ఎలా వున్నావు?" రాజేశ్వరమ్మగారు అడిగింది.

"నేను బాగానే ఉన్నా"

"మీ అత్తారు ఏమంటున్నారే?"

"ఏమంటారు? మళ్ళీ అక్కడికే రమ్మని పట్టుపడుతున్నారు. ఇదిగో మీ ఫ్రెండు మెత్త పడుతున్నారు. మళ్ళీ పొమ్మంటే ఎంత కష్టం. నీ ఫ్రెండుకి నువ్వైనా చెప్పు బావా?"

"ఎక్కడైనా బావ కాని వంగతోట్లో బావ కాదుట" అలాగా నీకు అవసరమైన చోట నేను సలహా లివ్వాలి.లేకపోతే నేను కనబడను"

"ఏరా! సత్యం నీకు బుద్ధి లేదురా" గిరిజ చెప్పినట్లు మసలు కోరా! కాస్త బాగుపడతావు?" అన్నాడు శివా.

"నిజమే అలాగే చేస్తా! ఎంత బాగుపడతానో చూస్తాగా" అన్నాడు నవ్వుతూ సత్యం.

"నీ ఫ్రెండు సూర్యం, రాజు ఎలా ఉన్నారు. నీ ఫ్రెండు శాంకరి వాళ్ళు ఎలా ఉన్నారు" గిరిజ అడిగింది.

"అందరూ బాగానే ఉన్నారు. సూర్యానికి కనకంతో పెళ్ళయింది. అదే వూళ్ళో వ్యవసాయం చేస్తున్నాడు."

"గిరిజా నువ్వు మరీ గట్టిదానివి. మా సత్యాన్ని కొంగున ముడేసుకుని తిరుగుతున్నావు."

శివా మాటలకి అందరికి నవ్వు వచ్చింది.

అప్పటికే భోజనాల సమయం అయింది. రాజేశ్వరమ్మగారు భోజనాలకు తెమ్మని తొందర చేసింది.

"ఇది సత్యం నీకు ఆఖరిసారి చెబుతున్నా! ఇంక నీ సమస్యలను నువ్వే పరిష్కరించుకోవాలి? మాటికి మాటికి పితూరీ చెప్పకూడదన్నా శివా కాస్త మందలించాడు.

"సరే నంటు" సత్యంతో పాటు గిరిజ కూడా తలూపింది.

శివాకు వెంటనే వెళ్ళి శాంకరిని చూడాలనే తొందర ఉం కాని వెళ్ళలేకపోయాడు. ఆమెకు లెటర్ రాయాలని ఉంది. స ధానం ఆమె రాయదని తెలుసు. అందుకే ఆ ప్రయత్నం మానేశాడు

# 52

ఆ రోజు రూములో శాంకరి చదువుకుంటోంది. అపర్ణా, ల కూడా శాంకరిలా కూర్చుని చదువుకోలేరు. ఒక గంట చదివితే ఆ ఇటు తిరిగి వస్తుంటారు. అలా తిరిగి వస్తూ శాంకరికి వచ్చిన లెట పట్టుకుని రూముకి వచ్చారు.

"శాంకరీ! ఈ మధ్య మద్రాసు నుంచి మీ అత్త లెటర్ రావడ లేదేమేః"

"మా అత్త ప్రస్తుతం మా వూళ్ళోనే ఉంది. అందుకే మద్రా లెటర్స్ లేవు."

"అలాగా! నా తల్లే అయితే ఇదిగో ఇప్పుడు మీ వూరి నుం రెండు లెటర్స్ వచ్చాయి. ఒకటి బహుశా మీ అత్త రాసిందేమోః"

"మా నాన్నగారి దగ్గర ఆవిడ ఉంటే ఎందుకు రాస్తుంది?"

శాంకరి కోపం చేసింది.

"అయితే ఈ కనకమ్మా, ఈ సుబ్బులమ్మా ఎవరుః"

"కనకమ్మ, సుబ్బులమ్మలు నా ఫ్రెండ్సు"

"నీ ఫ్రెండ్సా అదేమిటి ఆ ముసలమ్మల పేర్లు"

"ముసలమ్మలయ్యాక ఎవరికీ బారసాలలు చేసి పేర్లు పెట్టరు కాని కనకమహాలక్ష్మి, సుబ్బలక్ష్మి సింపుల్‌గా కనకం, సుబ్బు తెలిసిందా"

"అలాగా అయితే నువ్వే చదువుకో ఉత్తరాలు" అంటూ రెండు వుత్తరాలు శాంకరి మీదకి విసిరింది అపర్ణ.

శాంకరి కవర్లు విప్పి చదివింది.

సుబ్బులికి ఆడపిల్ల పుట్టిందట. పిల్ల చాలా ఆరోగ్యంగా వుందని రాసింది సుబ్బులు. అందులో కనకానికి నాల్గవ మాసమని కూడా రాసింది.

"పెళ్ళిళ్ళ పర్వం పూర్తయింది. ఇంక సంతాన పర్వం కాబోలు" శాంకరి మాటలకు అపర్ణ పకపక నవ్వింది.

"ఇంతకీ మీ కనకమహాలక్ష్మి ఏం రాసిందో చెప్పేస్తే చదువుకుంటాం. లత, అపర్ణ ఒకేసారి అన్నారు. అయితే ఇద్దరూ శ్రద్ధగా వినండి.

"డియర్ శాంకరీ!

నీ చదువు బాగా సాగుతోందా! ఇక్కడ సుబ్బులికి కూతురు పుట్టింది. పురుడు వచ్చేవరకు కూడా సుబ్బులు కుట్టు క్లాసులకు వచ్చింది. అందరు శ్రద్ధగా నేర్చుకుంటాన్నారో లేదో చూసింది. చిన్న పిల్లలు కూడా కుట్టు క్లాసుల్లో చేరారు. మీ అక్క అందరి కంటే బాగా కుడుతోంది. పిల్లల గౌనులు చాలా అందంగా, కొత్త రకంగా కుడుతోంది. మా అమ్మ, మొదలైనవాళ్ళు చేత్తో కుట్టడం, జాకెట్లు కత్తిరించడం మాత్రం నేర్చుకున్నారు. గవ్వలు అద్దం, చింతగింజలు అద్దం మనవూళ్ళో కనబడ్డం లేదు. ఎవరి చేతుల్లో చూసినా సూది దారం కనబడుతోంది. పొరుగూర్ల నుంచి కూడా కొందరు వచ్చి ఇక్కడ నేర్చుకుంటున్నారు.

ఇక మా స్కూలు బాగానే ఉంది. కాని పిల్లలు ఆడుకోడానికి ఆట స్థలం ఇక్కడ లేదు. ఊరు బయటకు తీసుకువెళ్ళవలసి వస్తోంది. అందుచేత ఊరు చివర తోటలో వున్న రాజారావుగారి బంగ్లా పాడుబడుతోంది. దాన్ని రిపేరు చేయించి చుట్టూ కొన్ని షెడ్లు వేయించి జనవరి నాటికి అక్కడకి స్కూలు మార్చాలని అనుకుంటున్నాము. నువ్వు ఎప్పుడు వచ్చేది తెలియజెయ్యి .

"ఏమిటి? ఆ పల్లెలో మీరు ఇంత సేవ చేస్తున్నారా? ఆశ్చర్యంగా వుందే? అక్కడ అన్నింటికి తప్పులు పడతారు, మూఢ నమ్మకాలు ఎక్కువ అంటారు. ఆడపిల్లలే యింతటి పనులు ఎలా చేస్తున్నారు శాంకరీ" లత ఆశ్చర్యంగా అడిగింది.

"మూఢనమ్మకాలు కొందరిలో ఎక్కువగా వుంటాయి. అందరూ అలాగే వుంటారని ఎలా అనుకుంటాము. భయపడుతుంటే వాళ్ళు తమ ప్రభావం యితరులమీద చూపించాలనుకుంటారు. కాని తనపని మాననప్పుడు వారి మాటలు లెక్క చెయ్యనప్పుడు వాళ్ళు మన జోలికిరారు. కాని కొందరు ఏ పనిచేసినా విమర్శిస్తూ, తప్పులు పడుతూ ఊరంతా చాటిస్తూ ఉంటారు. మరికొందరు లేనిపోని అభాండాలు కల్పించి చెబుతూ సంతోషపడుతూ వుంటారు. వీటన్నిటినీ లెక్కచేస్తే ఏ మనిషి ఏ పనీ చెయ్యలేడు. మనం మంచిపని చెయ్యాలనుకున్నప్పుడు మనతోపాటు నడిచే యిద్దరు స్నేహితులు చాలు. అది సక్రమంగా జరిగి పోతుంది. ఎన్ని ఆటంకాలనైనా దాటుకుపోతుంది. అయినా వీరందరి కంటే అతీతులు మంచివారు, పరోపకారులు ఆవూళ్ళో చాలా మంది ఉన్నారు ఆ వూళ్ళోనే కాదు ఎక్కడైనా ఉంటారు. వారిఅండదండలూ మనం తీసుకోవాలి. అంతే మావూళ్ళో అదే జరిగింది. ఈ ఆలోచనలన్నీ మా పిల్లలవే. మాకు పెద్దల అండదండ లున్నాయి మిగిలినవి మేం లెక్కించం."

శాంకరి చెబుతుంటే అపర్ణా, లతా ఆశ్చర్యంగా విన్నారు. ఆ పల్లెల్లో పుట్టిన ఆ పిల్లలకు అంతటి ఆలోచన, కార్యదీక్ష ఎలావచ్చాయా అనుకున్నారు. శాంకరి నిజాయితీ కార్యదీక్షా వాళ్ళకి తెలుసు. శాంకరి పుట్టిన ఊళ్ళో అటువంటి కృషి జరగడం ఆనందగా అనిపించింది. శాంకరి చెప్పేదంతా యదార్థమనిపించింది.

"శాంకరీ! ఈసారి మేము కూడా మీ ఊరు వస్తాము. నీతోపాటు మమ్మల్ని కూడా తీసుకెళ్ళు. మా మొద్దుతనాన్ని కాస్త ప్రక్షాళనం చేసుకుంటాము."

"దానికేం అలాగే! శాంకరి హృదయం ఆమె ఊరి చుట్టూ తిరిగి వచ్చింది. తాము తలపెట్టిన కార్యక్రమం సఫలీకృత మవుతున్నందుకు సంతోషించింది. సంక్రాంతికి తన ఊరు వెళ్ళాలని నిశ్చయించుకుంది.

శాంకరి సహచర్యంలో లత బాగా కోలుకుంది. తన ప్రేమ సంగతే మరచిపోయింది. చదువుధ్యాసలోకి వచ్చింది. శాంకరి స్నేహం లభించటం తన అదృష్టంగా భావించింది. ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలనుకుంది.

శాంకరి మాత్రం జయరాం బారి నుండి తప్పించుకోలేక పోతోంది. శాంకరి తిట్టినా ఆమె వెంటబడుతూనే వున్నాడు. అపర్ణ అతనితో స్నేహం చెయ్యాలని చాలా తాపత్రయ పడుతోంది. కాని అతని దృష్టి అంతా శాంకరి మీదే ఉంది.

ఒకరోజు శాంకరి క్లాసు నుంచి వస్తుంటే జయరాం ఎదురు పడ్డాడు. అపర్ణ అక్కడ లేనందుకు అతను చాలా సంతోషించాడు.

"శాంకరీ! నీతో ఒక్క మాట మాట్లాడాలి."

"దానికేం! అలాగే మాట్లాడండి"

"మిమ్మల్ని ప్రేమిస్తున్నా! పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నా"

"జయరాం? నువ్వు నన్ను ప్రేమిస్తున్నానన్నావు? ఏం చూసి నన్ను ప్రేమిస్తున్నావు? నా అందం చూసా? లేక నా మార్కులు చూసా? వాటివల్ల నన్ను ప్రేమిస్తున్నావను కుంటే ఆ ప్రేమ వ్యర్థమే అవుతుంది. అయినా నువ్వు ప్రేమిస్తే చాలుతుందా! నేను నిన్ను ప్రేమించడం లేదు. నువ్వు పెళ్ళిచేసుకోవాలనుకుంటే పెళ్ళి జరుగుతుందా? పెళ్ళి కాకుండా పడివున్నాననుకుంటున్నవా? అడిగిన వాడినల్లా పెళ్ళి చేసుకోడానికి నేను ఆటబొమ్మను కాను. నాకూ మనసుంది. ఆలోచన వుంది. పైగా నిన్ను పెళ్ళిచేసుకోవాలని నేను ఎప్పుడూ అనుకోలేదు. ఇద్దరి మనసులు కలసి, ఇద్దరూ పెళ్ళి చేసుకోవాలనుకుంటే పెళ్ళి అవుతుంది. అయినా ఇంకా రెండవ సంవత్సరం పూర్తికాలేదు. అప్పుడే ప్రేమలు పెళ్ళిళ్ళు. ఇక్కడ చేరింది ఇందు కేనా?"

"ఉత్తరం రాస్తే ప్రిన్సిపాల్‌కి చూపిస్తానన్నావు? అందుకే అడుగుతున్నా! నీ మనసు మార్చుకుంటావని ఆశిస్తున్నా! మరోసారి ఆలోచించు" "నువ్వు లెటర్ రాయడం నేను సమాధానం చెప్పడం పూర్తి అయింది. మళ్ళీ ఆ విషయం ఇంక ఎత్తకు. ఆడపిల్ల కనబడితే చాలు ప్రేమించానంటూ వెంటపడటమేనా? ఆడ పిల్లలకు కూడా మనసులు వుంటాయని మరిచిపోకు'' వడివడిగా నడుచుకుంటూ వెళ్ళిపోయింది శాంకరి.

ప్రేమను గురించి అంతగా ఆలోచించని జయరాం ఆమె మాటలు విని ఆశ్చర్యపోయాడు. ఆమె ఆలోచనలే వేరు. తనకేమి తక్కువ? తననెందుకు గుర్తించదు?" జయారాంలో కాస్త పంతం పెరిగింది.

"అలా మాట్లాడిన స్త్రీలు ఎందరో ఉంటారు. అందరూ ఒక ప్రేమలో పడ్డవాళ్ళే. తానే ఎందుకు కాకూడదు. అందుకే అలా ప్రయత్నం చేస్తూనే వుండాలి." అనుకున్నాడు జయరాం.

చాటునుంచి అపర్ణ వారి సంభాషణ వింటూనే వుంది. శాంకరి అభిప్రాయాలు ఆమెకు చాలా నచ్చాయి. అలాటి అమ్మాయిలు వుండడమే ఆశ్చర్యం. కాని జయరాం మనస్సే అపర్ణకు అర్థంకాలేదు. జయరాంని మాత్రం వదలకూడదనుకుంది అపర్ణ.

# 53

డిశంబరు శెలవలకి శివా తల్లిని తీసుకుని వచ్చాడు. సూర్యం, కనకం ఘనస్వాగతం పలికారు. జగన్నాథంగారు, భార్యా కూడా చాలా సంతోషించారు.

శివా, రాజేశ్వరమ్మగారు, సూర్యం తల్లి కనకం వెంట కుట్టు సెంటర్‌కి వెళ్ళారు. అక్కడ పిల్లలు, పెద్దలు తేడా లేకుండా మిషన్ కుట్టు, కటింగులు నేర్చుకుంటున్నారు. గౌనులు, జాకెట్లు, లంగాలు ఎంతో బాగా కుడుతున్నారు. అవన్నీ చూసిన రాజేశ్వరమ్మగారు నిజం

గానే ఆశ్చర్యపడింది. ఇంట్లో పనులే కాకుండా ఆడవాళ్ళు అటువంటి పనులు చెయ్యడం నిజంగా మంచి పని అనుకుంది. ఆడవాళ్ళు నిజం గానే మారుతున్నారు. మహాత్మాగాంధీ కోరుకున్నట్లుగా స్త్రీలు అభివృద్ధి చెందుతున్నారు అనుకుంది.

వచ్చేటప్పుడు కనకం వాళ్ళని శాంకరి యింటికి తీసుకువెళ్ళింది.

రామనాథంగారు, అన్నపూర్ణమ్మగారు ఎదురువచ్చి లోపలకు తీసుకువెళ్ళారు. శాంకరి సంగతి చెప్పి ఈవేళో, రేపో వస్తుందని చెప్పారు. తర్వాత సుశీల సంగతి చెప్పి బాధపడ్డారు. వాళ్ళ మర్యాదకు మంచి తనానికి రాజేశ్వరమ్మగారు చాలా సంతోషించింది.

శివా మనస్సు అల్లకల్లోలంగా వుంది. శాంకరి తలుపులు ఆత నికి విశ్రాంతి లేకుండా చేస్తున్నాయి. అతని మనస్సు ఆరాటపడ్తుంది. అతని చూపులు ఆమె కోసం ఎదురుచూస్తున్నాయి. ఆ రాత్రి అతనికి నిద్రే పట్టలేదు.

మరునాడు సూర్యం వాళ్ళని స్కూలుకు తీసుకువెళ్ళాడు. శ్రద్ధగా చదువుకుంటున్న ఆ పిల్లల్ని చూసి శివా రాజేశ్వరమ్మగారు కూడా అందతా సూర్యం చలవే అనుకున్నారు. ఆ పల్లెను సూర్యమే ముందుకునడిపిస్తున్నాడనుకున్నారు.

ఆ సాయంకాలం పొలాల వైపు బయలుదేరారు. శివాకు, శాంకరి ఆ చుట్టు ప్రక్కల నడుస్తున్నట్లే వుంది. శాంకరి తలపులు అతన్ని వుక్కిరి బిక్కిరి చేస్తున్నట్లే వుంది. శాంకరి ఎందుకలా దూర మవుతోందో అతనికి తెలియలేదు. పొలాలు, తోటలు చూస్తున్నా అతనిలో మునుపటి వుత్సాహమే లేదు.

"శాంకరి లేదని బాధపడుతున్నావా శివా" ఎవరు లేకుండా చూసి అడిగాడు సూర్యం.

"అదేం లేదు" శివా తడబడ్డాడు. అతని ముఖం పీక్కుపోయి వుండడం కనకం కూడా చూసింది. అంతమందిలో అడిగితే బాగుండ దని వూరుకుంది.

మరునాడు గోదావరి వైపు వెళ్ళారు. శాంకరి కళ్ళ ముందే నిలిచినట్లు అనిపించింది. శివా ఇంక నిలబడలేక యిసుకతో కూల బడ్డాడు.

"ఏరా శివా, కాళ్ళు నొప్పి పుట్టాయా? తల్లి అమాయకంగా అడిగింది.

"నీళ్ళతో నిండిన కళ్ళను తల్లి కంటబడకుండా తుడుచుకున్నాడు శివా.

"కాళ్ళు నొప్పులు లేవు. ఈ ఇసుకలో కూర్చుంటే మరింత చల్లగాలుల చల్లదనాన్ని అందుకోవచ్చామ్మా; పైగా చల్లని ఆనీటి తుంపరలు వచ్చి ఎలా మీద పడుతున్నాయో చూసావా అమ్మా" అన్నాడు.

రాజేశ్వరమ్మగారు కొడుకు మాటలు వింతగా వింది. తర్వాత తానుకూడా వెళ్ళి ఇసుకలో కూర్చుంది. కొడుకు చెప్పిన విషయాలు నిజంగా అనుభవించింది. ఆవిడ మనస్సు ప్రశాంతంగా మారిపోయింది. తెలియని పరమానందంతో నిండిపోయింది.

"ఇక్కడివారు నిజంగా ధన్యజీవులు" అనుకుంది.

"శాంకరి లేకుండా ఆ ఊళ్ళో వుండలేననుకున్నాడు శివా. సెలవులకి రావడం లేదని కనకానికి ఉత్తరం రాసింది శాంకరి. ఆ విషయం తెలిసిన శివా మనస్సు ఎవరో పిండినట్లయింది. కాళ్ళకింద భూమి అడుక్కు వెళ్ళినట్లుయింది. తెలియని నిరుత్సాహం ఆవరించింది. మరునాడు వుదయమే తల్లిని తీసుకుని ప్రయాణమయ్యాడు శివా. జగన్నాథంగారు ఆమెకు భార్యచేత చీర పెట్టించారు. కొబ్బరి, అరటి కాయలు, కూరగాయల మూటలు కట్టించారు. సూర్యం. ఏ నకం వుండ మని ఎంతో బ్రతిమాలారు.

కాని శివా అంగీకరించలేదు. పొద్దుటే బస్సుకి బయలుదేరాడు. బొబ్బర్లంక నుంచి వచ్చే బస్సు ఆగింది. సూర్యం వాళ్ళను బస్సు ఎక్కించాడు. సామానులన్నీ జాగ్రత్తగా పైన పెట్టించాడు.

"టా!టా!" అన్నాడు శివా బస్సు కదలబోయింది.

రావులపాలెం నుంచి వస్తున్న బస్సు ఆగింది. శాంకరి పెట్టె చేతపట్టి బస్సు దిగింది. శివా సూర్యం. ఒకేసారి శాంకరిని చూసారు.

శాంకరి కూడా వాళ్ళను చూసింది.

శివాను చూసిన శాంకరి అలాగే చూస్తూ వుండిపోయింది.

"అమ్మా శాంకరి" కంగారుగా అన్నాడు శివా. అతని కళ్ళు తళుక్కు మన్నాయి. అతని ముఖం తళతళ లాడింది. అతని మాట మాత్రం తడబడింది.

రాజేశ్వరమ్మగారు శాంకరి వైపు చూసింది.

"రాజేశ్వరమ్మగారు" శాంకరీ అటు చూడు అన్నాడు సూర్యం. శాంకరి అనుకోకుండా చేతిలో వున్న పెట్టె కింద పెట్టింది. రెండు చేతులు ఆమె వైపు జోడించింది.

"శాంకరి అందాన్ని అపురూపంగా చూసింది రాజేశ్వరమ్మ"

బస్సు కదిలింది. ఎవరూ గమనించలేదు.

"శివా! బస్సుదిగరా! రేపు వెడుదుగాని" సూర్యం మాటలు గాలిలో కలిసిపోయాయి. బస్సు రావులపాలెం వైపు పరుగెత్తింది.

"పిల్ల దీపంలా వుంది. ఎవరికి రాసి పెట్టి వుందో కాని గొప్ప అదృష్టవంతుడు" తల్లి మాటలు విన్న శివా మనసు ఉక్కిరి బిక్కిరి అయింది. కాని అంతలోనే ఆమెతో గడిపే అపురూప దినము దాటి పోయిందని బాధ పడ్డాడు.

"ఒక్కరోజు వుండిపోతే ఎంత బాగుండును" పదిసార్లు అనుకుని బాధపడ్డాడు. కాని ఆమె తనను చూసి తిట్టుకుంటూ వెళ్ళిపోక ఆగినందుకు, తల్లికినమస్కరించినందుకు మరింత సంతోషించాడు శివా.

"అయితే నేను రాసిన ఉత్తరాలు భద్రంగా దాచుకుందేమో?" అన్న నమ్మకం తిరిగి తలెత్తింది. ఆమెను తలచుకుంటూ రోడ్డు పక్కగా సాగిపోతున్న కాలువ వైపు చూస్తూ కూర్చున్నాడు.

జగన్నాథంగారి కుటుంబాన్ని, రామనాథంగారి కుటుంబాన్ని వాళ్ళ మర్యాదల్నీ వారి మంచితనాన్ని తలచుకుంది రాజేశ్వరమ్మ. అటు వంటి వారితో పరిచయం నిజంగా అదృష్టమనుకుంది ఆవిడ.

శాంకరి ఎంత మర్చిపోదామనుకున్నా శివాను మర్చిపోలేక పోతోంది. ఏదోవిధంగా అతను ఎదురుపడగానే మనసులో దాగున్న ఆమె తలుపులు చుట్టుముట్టాయి. బస్సు కదిలి వెళ్ళినట్లే ఆమెకు తెలియ లేదు.

"శాంకరీ! ఇక వెడదామా" సూర్యం పిలుపుతో మామూలు స్థితికి వచ్చింది శాంకరి.

పెట్టె రిక్షాలో పెట్టగానే వెళ్ళి రిక్షాలో కూర్చుంది. రిక్షా కదిలింది.

"నేను ఇక్కడే వుంటే ఏం ఘనకార్యం చేసేవాడో" తలపుకు వచ్చి శాంకరి నవ్వుకుంది.

"ఇదిగో మనస్కూలు తయారవుతోంది శాంకరి" రోడ్డుపక్కగా వున్న ఆ బంగ్లావైపు చూపించాడు సూర్యం.

"ఇది రిపేరు పూర్తయితే చాలా అందంగా వుంటుంది. అసలు పాఠశాలలు ఇలా ప్రశాంతంగా వుండేచోటే వుండాలి. మంచిగాలి పీల్చుకుంటారు. హాయిగా ఆడుకుంటారు. సూర్యం మంచిపని చేసారు."

రిక్షా ముందుకు నడుస్తూనే వుంది. ఇల్లు రాగానే రిక్షా దిగింది శాంకరి.

"పిన్ని వచ్చింది పిన్ని వచ్చింది" అంటూ అక్క పిల్లలు చుట్టు ముట్టారు. అసలు రిక్షా రాగానే ఆ చుట్టుపక్కల ఇళ్ళవాళ్ళంతా అరుగుల మీద వచ్చి నిలబడతారు. అంతకంటే పెద్ద వాహనాలు అక్కడికి ఎప్పుడోకాని రావు. ఎవరింటికి ఎవరు వచ్చినా అందరికి సందడే.

"లోపలికిరానీండి పిన్నిని" సుశీల పిల్లల్ని కోపం చేసింది. సుశీల ముఖం కాస్త నిండుగా కనబడింది "అక్క కాస్త కుదుట పడు తోంది" అనుకుంది శాంకరి. అక్క పెట్టె లోపల పెట్టాడు. రవి.

రామనాథంగారు అన్నపూర్ణమ్మ కూతుర్ని తృప్తిగా చూసుకున్నారు.

ఆ వార్త తెలిసిన కనకం వెంటనే వచ్చి శాంకరిని కౌగిలించుకుంది. "శివా వుండగా వస్తావనుకున్నా! కావాలనే ఆలస్యంగా వచ్చావా?" కోపం చేసింది కనకం.

"నీ కెప్పుడూ అదే గొడవ! కాస్త నోరు మూసుకుంటావా?"

"మూసుకోక ఏం చేస్తాలే తల్లీ! నువ్వో మొండిదానివి" కనకం పెద్ద ఆరిందలా మాట్లాడింది. ఆ మధ్యాహ్నం శాంకరి, కనకం, సుశీల కలిసి కుట్టు సెంటర్‌కి వెళ్ళారు.

పెద్దవాళ్ళంతా ఒకచోట, పిల్లలంతా ఒకచోట కూర్చుని తమ తమ పనులు నేర్చుకుంటున్నారు. కొత్తగా ఎంబ్రాయిడరీ మిషన్ వేరుగా తెప్పించారు. కొంతమంది ఆ పని చేస్తున్నారు. ఆ మంత్రసాని చెల్లెలే కాకుండా మరొకరు కూడా వచ్చి నేర్పుతోంది. ఆ వాతావరణం శాంకరికి చాలా సంతోషాన్ని కలిగించింది.అక్కలాటి వాళ్ళు ఆ వూళ్ళో ఎంతో మంది వున్నారు. వారికి చేతినిండా పని దొరికింది. మామూలు వాళ్ళకి కూడా ఎంతో ఉపయోగమైన పనిని నేర్చుకుంటున్నారు.

తరువాత శాంకరిని తీసుకొని కనకం కొత్తగా కట్టే బిల్డింగ్ వైపు తీసుకువెళ్ళింది. సూర్యం అక్కడే వున్నాడు.

"జనవరికి పూర్తి అవుతుందనుకున్నాం. కాని యింకా పూర్తి కాలేదు. ఇంక జూన్ నాటికి పూర్తి అవుతుంది" అంటూ వివరించాడు సూర్యం.

గుక్కతిప్పుకోకుండా అన్ని విషయాలు అలా చెబుతుంటే ఆశ్చర్యంగా వింది శాంకరి.

"ఎన్ని నేర్చుకున్నాడో సూర్యం" అనుకుంది మనస్సులో. దీపాలు పెట్టే వేళకి యింటికి చేరుకున్నారు.

ఆ రాత్రి ఎన్నో విషయాలు చర్చించుకున్నారు. సూర్యం, కనకం, శాంకరి మరునాడు లైబ్రరి వైపు బయలుదేరారు. శాంకరి,

కనకం పేపర్లు, వారపత్రికలు, ప్రాచీన గ్రంథాలు, ఆధునిక కావ్యాలు, నవలలు, నాటకాలు, కవితా సంకలనాలు అన్నీ వేరువేరుగా అమర్చి వున్నాయి.

కొందరు అక్కడ కూర్చుని చదువుకుంటున్నారు. మరికొందరు యిళ్ళకు పట్టుకెడుతున్నారు. కనకం వాళ్ళ మేనత్త అక్కడ బాధ్యత వహిస్తోంది.

ఆవిడ ఎక్కువ చదువుకోకపోయినా ఆవిడకు పుస్తకాలంటే ప్రాణం. కనపడిన పుస్తకం చదువుతూనే వుంటుంది. అందుకే ఆవిడ ఆపని చేస్తానని ముందుకు వచ్చింది.

పిల్లలకు సంబంధించిన పుస్తకాలే కాకుండా బాల రామాయణం, బాలభారతం మొదలైన బొమ్మల పుస్తకాలన్నీ కొనాలని దానికి కావలసిన కొంత ధనాన్ని చందాలు వేసి పోగుచేయాలనుకున్నారు. ఆ పని తీరుబడిగా వేసవి శలవుల్లో చెయ్యాలని నిశ్చయించుకున్నారు. శలవులు లేనందున మరునాడే ప్రయాణమయింది శాంకరి. సుబ్బులు కూతుర్ని చూడనేలేదు శాంకరి. కాసులు కూడా వచ్చివెళ్ళి పోవడంవల్ల ఆమెను కూడా కలుసుకోలేదు. అనుకున్నట్లుగానే ప్రయాణమై వెళ్ళింది శాంకరి.

ఈసారి ఆమె వెంట రాజమండ్రి వరకు రవి, సుశీల, కనకం బయలుదేరి వెళ్ళారు. పనుల వత్తిడివల్ల సూర్యం వెళ్ళలేక పోయాడు.

రైలు కదిలేవేళకు అందరి కళ్ళు చెమర్చాయి. సొంతవూరునూ, ఆత్మీయులనూ వదిలి వెడుతుంటే శాంకరి మనస్సు కాస్త చివుక్కుమంది. కాని తన చదువుని దృష్టిలో పెట్టుకుని కొండంత ఉత్సాహంతో రైల్లో కూర్చుంది శాంకరి.

## 54

శివకుమార్ మనస్సు చిచ్చుబుడ్డిలా వెలిగి ఒక్కసారి చల్లబడింది. శాంకరిని చూసాడు కాని, ఆమెతో మాట్లాడలేదు. ఆమెను

కలవలేదు. ఈసారి కలిసి మనసువిప్పి ఆమెతో మాట్లాడాలనుకున్నాడు కాని ఆ అవకాశమే కలుగలేదు. అసలు అందుకే అంత ఉత్సాహంతో వచ్చాడు. కాని నిరుత్సాహంతో ఇల్లు చేరాడు.

తల్లితో మాత్రం ఆ విషయం ఎప్పుడూ చెప్పలేదు. ఆవిడ కూడా శాంకరిని కోడలుగా చేసుకుంటే బాగుంటుందనుకుంది. శాంకరిని చూసిన తరువాత ఆమె మనసంతా ఆమె చుట్టూ తిరుగుతోంది. తన యింటికి దీపమే అవుతుంది శాంకరి అనుకుంది.

రోజులు గడుస్తున్నా శివా మనస్సు కుదుటపడలేదు. మునుపటిలా లెటర్ రాయలేక పోయాడు. ఆమె సమాధానం యివ్వదని తెలుసు. పైగా తన మనస్సు ఆమె ముందుంచాడు. కాని ఆమె ఎటువంటి సమాధానం యివ్వలేదు. కాని ఆమె కాదనలేదు. అదొక్కటే శివా ఆశ. పరీక్షలు దగ్గరకు వస్తున్నాయి. పరీక్షలు కాగానే తన అదృష్టం పరీక్షించుకోడానికి వైజాగ్ కూడా వెళ్ళి శాంకరికి కలుసుకోవాలనుకున్నాడు. తన భవిష్యత్తు నిర్ణయించుకోవాలనుకున్నాడు.

మధు రోజు చదువుకోడాని వస్తున్నాడు. ఇద్దరు కలిసి చదువుకుంటున్నారు.

వూరునుంచి వచ్చింది మొదలు శివా మొహం వాడిపోయి వుండడం యిట్టే గ్రహించాడు మధు.

"శివా! అలాగున్నావేం? ఏదైనా చెప్పకూడని విషయమా!"

"చెప్పకూడని విషయమేం కాదు కాని, అమ్మకు తెలియదు." అంటు శాంకరి సంగతి అంతా వివరించి చెప్పాడు శివా.

"ఇన్నాళ్ళు ఎవరితో చెప్పకుండా ఎలా దాచుకున్నావు శివా."

"దాచుకోడానికేముంది పైగా ఇందులో ఎవరు చేసేది ఏమీలేదు కదా! అసలు ఆమె అభిప్రాయమేమిటో తెలియడంలేదు."

పోనీ నువ్వు కాకపోతే మరెవరి చేతైనా అడిగించకపోయావా?

"దానివల్ల ప్రయోజనం లేదు. ఆమె మనసులో ప్రేమ లేకపోతే

ఎవరు ఏమీ చెయ్యలేరు? ఆమెకు పెళ్ళి చేసుకునే అభిప్రాయం లేన ప్పుడు ఎవరు ఏమి చెయ్యలేరు కదా!"

"అదీ నిజమే శివా! కాని ఏం చేద్దామిప్పుడు?"

"పరీక్షలవగానే వెళ్ళి కలుసుకుంటాను"

"ఆపని చెయ్యి శివా! ఇంతకీ సత్యం వాళ్ళు ఎలావున్నారో" తెలిసిందా!

"తెలీడానికేముంది. ఇద్దరూ హాయిగా వున్నారు. తండ్రి వాళ్ళను పిలిచినట్లే పిలిచి గొడవలు పెట్టాడు. ఇప్పుడు వేరుగా వున్నారు. బాగానే వున్నారు. మళ్ళీ ఎప్పటికైనా ఆ తండ్రీ కొడుకుల మధ్య గొడ వలు రావచ్చు."

"బాగుంది వరుస"

అంతలో చలపతీ, భార్యా వచ్చారు.

హఠాత్తుగా వచ్చిన వాళ్ళను చూసి ఆశ్చర్యపోయింది రాజేశ్వ రమ్మ.

"సత్యం తండ్రి చనిపోయారుట, సత్యం ఫోను చేసి చెప్పాడు." చలపతి మాటలు నమ్మలేకపోయాడు శివా!

అంతలో శివాకు కూడా వాళ్ళు ఫోను చేసి చెప్పారు.

"చనిపోయే సమయంలో సత్యం దగ్గరున్నాడుట. అతనే పెద్ద కొడుకు కదా! ఇంటి తాళాలు అతని చేతిలో పెట్టాడుట. చలపతి మాటలు అందరికి ఆశ్చర్యాన్ని కలిగించాయి." సత్యం జీవితం ఎప్పటి కైనా స్థిరపడుతుంద అనుకున్నాడు శివా.

## 55

శాంకరి మరింత శ్రద్ధగా చదువుతోంది అపర్ణ, లత ఆమె వెంటే తిరుగుతున్నారు.

జయరాంకి మాత్రం శాంకరిపై మరింత పంతం పెరిగింది. ఆమె విసుక్కుంటున్నా ఆమెను అవసరం లేకుండా పలకరిస్తున్నాడు. శాంకరి, అపర్ణ, లత ఎక్కడికి వెడుతున్నా వాళ్ళవెంట జయరాం కూడా బయలుదేరుతున్నాడు.

తన స్నేహితులతో శాంకరితో తనకుగల పరిచయాన్ని గొప్పగా వర్ణించి చెబుతున్నాడు.

"శాంకరీ! జయరాం మాటలు విన్నావా? అందరితో శాంకరి తాను పెళ్ళి చేసుకుంటున్నట్లు చెబుతున్నాట్ట" ఒకనాడు లత శాంకరితో చెప్పింది.

"ఏడవలేక పోయాడు." విసుక్కుంది శాంకరి.

ఆ జయరాంకి కొంచెం భయం చెప్పాలి శాంకరీ. లేకపోతే అవాకులు చవాకులు వాగుతూనే ఉంటాడు." లత మరింత పట్టుదలగా చెప్పింది.

"కాని శాంకరి ఆ మాటలు ఎక్కువగా పట్టించుకోలేదు."

"పరీక్షలు ముందు అతనితో గొడవలెందుకు లతా!"

"ఎప్పుడైనా యిలాంటి విషయాలు విని వూరుకోకూడదు వాటి పరిణామం చెడ్డగా వుండవచ్చు."

"చూద్దాం లతా! మనకు జయరాం మాటలు వినబడితే ఈసారి జయరాం అంతు చూద్దాం."

లతకు శాంకరి మాటలు సంతృప్తిని కలిగించాయి.

అనుకున్నట్లుగానే శివా పరీక్షలు పూర్తి అయ్యాయి. ఆ రాత్రే అతను వైజాగ్ ప్రయాణమయ్యాడు. తల్లితో మాత్రం ఆ మాట చెప్ప లేక పోయాడు. బెంగుళూరు పనిమీద వెడుతున్నానని చెప్పాడు.

"పనై పోగానే వచ్చేసెయ్యి బాబు" అంది తల్లి.

"సరేనమ్మా!" అంటూ బయలుదేరాడు శివా. స్టేషన్‌కి మధు వచ్చాడు.

'విష్ యు బెస్టు ఆఫ్‌లక్"

"థాంక్ యు" అన్నాడు శివా.

శివా ఒక హోటల్లోదిగి తిన్నగా మెడికల్ కాలేజీవైపు బయలు దేరాడు.

గుంపులు గుంపుగా నిలబడి విద్యార్థిని విద్యార్థులు కబుర్లు చెప్పుకుంటున్నారు.

"శాంకరి కావాలండి" ముగ్గురు అమ్మాయిలు ఒకేచోట నిలబడి వున్నారు. అందులో ఒక అమ్మాయిని అడిగాడు.

'ఆ సెకండియర్ అమ్మాయా?' "అవును" ఆ మాటలకు వాళ్ళు యిటు అటు చూశారు. అక్కడ నిలబడిన అబ్బాయిలు పకపకానవ్వారు. శివా వారివైపు ఆశ్చర్యంగా చూసాడు.

"శాంకరి ఇప్పుడే ఆమె ప్రియునితో యిలా వెళ్ళింది" అన్నాడు అందులో ఒక అబ్బాయి.

శివా ఆ మాటలు వినలేక పోయాడు. ఏం జరిగిందో అతనికి అర్థం కాలేదు.

"ఏం మాట్లాడుతున్నావు మిస్టర్ రావ్. శాంకరి చాలా మంచి పిల్ల" అంది ఒక అమ్మాయి.

"మంచిపిల్లే నాకు తెలుసు. కాని జయరాం నాతో చెప్పాడు. శాంకరి తను పెళ్ళి చేసుకుంటున్నట్లు ఈ పరీక్షలు కాగానే పెళ్ళిట!" అతనే తిరిగి అన్నాడు.

"శాంకరి పెళ్ళి చేసుకుంటుందా! నేను నమ్మను" తిరిగి ఆ అమ్మాయే అంది.

"నమ్మకపోతే మానేసెయ్యి నాకేమి? జయరాం వెంట ఆశాంకరి తిరగడం చూడ్డం లేదా?"

"చూడకే! చూస్తున్నా! ఆ శాంకరి ఎంత చెప్పినా వినకుండా ఆమెవెంట పడుతున్నాడా జయరాం. ఎన్నోసార్లు తిట్టింది కూడా! కానిఆ

జయరాంకి లెక్కలేదు. తిరిగి ఆమెవెంటే పడుతున్నాడు. పైగా ఈ మాటలన్నీ కల్పించి మీతో చెబుతున్నాడు. ఇంతకీ మాటలు ఎవరితో అనకు"

"ఆమెకు లేని పౌరుషం నీకెందుకు? శాంకరి మొదట్లో అలాగే వుంది. కాని ఇప్పుడీ సంగతి నేచెబుతున్నా! వాళ్ళిద్దరి పెళ్ళి జరిగి తీరుతుంది. వాళ్ళిద్దరు ఇప్పుడు సినిమాకి బయలుదేరారు.

"ఇంక ఆ పిల్ల వాదించలేక పోయింది. శాంకరి అటువంటిది కాదు. కాని వీళ్ళని నమ్మించడం తనతరం కాదు. శాంకరికి ఆ విషయాలన్నీ చెప్పాలనుకుంది ఆ అమ్మాయి.

కాని అంతసేపు అక్కడే నిలబడి వారి మాటలు వింటున్నాడు శివా. ఇంక అక్కడ నిలబడలేక పోయాడు. మనస్సు మొద్దుబారి పోయింది. అడుగు ముందుకు వెయ్యలేక పోయాడు.

అయినా ధైర్యం తెచ్చుకుని హాస్టలుకు వెళ్ళి అడిగాడు. అక్కడ కూడా వాళ్ళు "శాంకరి సినిమాకు వెళ్ళిందని" చెప్పారు. సూర్యాన్ని కాదన్న శాంకరి ఇంత త్వరగా జయరాంని పెళ్ళి చేసుకుంటుందంటే నమ్మలేక పోయాడు. ఏదైన శాంకరి తనకు దూరంగా వుండటానికి కారణం అదేనేమో అన్న అనుమానం అతనికి వచ్చింది. ఏమీ చెయ్యలేక క్రుంగిపోయిన మనస్సును నిలబెట్టుకుని తిరుగు ప్రయాణమయ్యాడు శివా.

పీక్కుపోయిన ముఖంతో మాసిన బట్టలతో మరునాడే తిరిగి వచ్చిన కొడుకును చూపి ఆతల్లి ఏమీ అడగలేక పోయింది.

కాని మధు మాత్రం గ్రహించగలిగాడు. కాస్త స్థిమితపడిన శివా, మధుతో జరిగినదంతా చెప్పాడు.

"అవన్నీ అబద్ధాలేమో! శివా! ఆమెను ఒకసారి కలవ వలసింది. ఆమెతో వివరంగా మాట్లాడవలసింది."

"కాని ఆమెకు యిష్టం లేనప్పుడు ఆమె ఆ అవకాశం మనకి

ఱువ్వాదు. అందుకే తప్పించుకు తిరుగుతోంది. ఇద్దరూ డాక్టర్లు కదా! బాగానే వుంటుది."

శివా యు.యస్.ఏ. వెళ్ళడానికి ప్రయత్నం ప్రారంభించాడు. హైదరాబాదు వెళ్ళడం సంగతి మానివేసాడు. తల్లికి తోడుగా గుమాస్తా గారి ఫామిలీని తన యింట్లో వుంచాలనుకున్నాడు.

పై చదువుకి వెళ్ళి వస్తే శివా మనస్సు కాస్త కుదుట పడుతుందనుకున్నాడు మధు. అందుకే శివాను మరింత ప్రోత్సహించాడు.

# 56

సినీమా నుంచి శాంకరి, అపర్ణ, లత తిరిగి వచ్చారు. ఆటోలో శాంకరి సీరియస్‌గా వుండటం చూసి అపర్ణ, లత పలకరించడానికే భయపడ్డారు. రూం తాళం తీసి శాంకరి మంచం మీద వాలింది.

"శాంకరీ! సినిమా ఎంత బాగుందో కాని నీకు నచ్చినట్లు లేదు" మెల్లిగా అంది అపర్ణ.

"సినీమా బాగానే వుంది అపర్ణా! కాని అసలు సంగతులే బాగుండలేదు. ఇంతకీ అతనికి ఎవరు చెప్పారు అపర్ణా! మనవెంటే వచ్చి కూర్చున్నాడు.?"

"అతనూ సినీమాకి వచ్చి వుండొచ్చు? సినీమా ఎవరైనా చూడొచ్చు"

"అపర్ణా! హాలు నా సొంతం కాదని నాకు తెలుసు? నువ్వే చెప్పుండాలి?"

"కావలసి వస్తే గుంజీలు తీస్తా కాని నేను జయరాంతో ఏదీ చెప్పలేను. నన్ను నమ్మ శాంకరీ?"

"నిజం శాంకరీ? అపర్ణ చెప్పేదంతా నిజం. పొద్దుట నుంచి అపర్ణ నాతోనే వుంది. అతను ఎవరితోనో సీట్లు మార్చుకుంటుంటే నేను చూశాను. అతన్ని తన సీటుకు పంపించి అతని సీట్లో జయరాం వచ్చి కూర్చున్నాడు. మన్ని వెంబడించి వుంటాడు?"

"ఛీ! ఛీ! చదువుకునే స్టూడెంట్సులో ఈ రౌడీ లక్షణాలేమిటో? వీడికి ఓ డోసు యివ్వాలి?"

"అవును శాంకరి? వీడి వెకిలితనం కట్టించాలి" లత మరోసారి శాంకరిని హెచ్చరించింది.

"శాంకరీ! శాంకరీ! వచ్చావా? నాలుగో రూంలో వున్న పద్మిని వచ్చింది.

"ఏం పద్మినీ?" ఆశ్చర్యంగా అడిగింది లత.

శాంకరి మంచం మీద పడుకునే వుంది. "ఇందాక శాంకరి కోసం ఎవరో ఒకతను వచ్చాడట. జయరాంతో కలిసి నువ్వు సినిమాకి వెళ్ళినట్లు అతని స్నేహితుడు చెప్పాడట. పైగా జయరాంకి, నీకు పెళ్ళని కూడా అతనితో చెప్పారట."

కాదని వాదించిన వందనను నానా మాటలు మాట్లాడారుట. అతను హాస్టల్‌కు వచ్చి అడిగితే కూడా ఇక్కడున్న జయరాం కజిన్ అదే సమాధానం చెప్పిందట".

ఒక్కసారి శాంకరి మంచంమీద లేచి కూర్చుంది. "ఇవన్నీ నీకెలా తెలిసాయి పద్మినీ?" అపర్ణ అడిగింది. "వందన చెప్పి చాలా బాధ పడింది. అతని పేరు శివకుమారట. చిన్నపుచ్చుకున్న మొహంతో అతను తిరిగి వెళ్ళిపోయాట్ట"

"అలాగే వందనతో నే మాట్లాడుతాలే" లత మాటవిని పద్మని తిరిగి రూంకి వెళ్ళిపోయింది. శాంకరి ముఖంలో మార్పురావటం అందరు గమనిస్తూనే వున్నారు?

"శాంకరీ అతను నీకు తెలుసా? ఇంతకీ అ శివకుమార్ ఎవరు?"

"లతా? అతను నాకూ తెలియదు? ఎంత ఆలోచించినా అతనెవరో తెలియడం లేదు?" మళ్ళీ శివా యింక విశాఖపట్టణం ఎలాగూరాడు. అందుకోసం తను బయటపడకూడదు. మనసులోని బాధను లోపలే దాచుకుంది.

"ఒక వేళ ఈ వూళ్ళో నీకు తెలిసిన వాళ్ళున్నారు కదా! అతనేమో?" అపర్ణ జ్ఞాపకం చేసింది.

"అతని పేరు శివకుమార్ కాదు? బహుశా యితను సూర్యం తాలూకేమో?" నిజాన్నే అబద్ధంలా చెప్పింది శాంకరి.

"ఎవరైతేనేం వెళ్ళాడుగా? బహుశా వీళ్ళ మాటలు విని మళ్ళీ రాడేమో లే?" అంది అపర్ణ.

అపర్ణకు, లతకు కూడా మనస్సులో అనుమానంగా వుంది. "బాహుశా ఈ శాంకరిని ప్రేమిస్తున్నాడేమో? లేకపోతే ఇంతదూరం ఎందుకు వస్తాడు? వీళ్ళు అలా చెప్పగానే ఎందుకు పారిపోతాడు?" అపర్ణ, లత గుసగుసలాడుకుంటూనే వున్నారు.

మళ్ళీ వాళ్ళే నిజంగా శాంకరికి అతను జ్ఞాపకం లేదేమో? ఉంటే కొంచమైన బాధపడదా? ఏదైన ఈ జయరాంని వదలకూడదు? అనుకున్నారు.

"ఆ జయరాం నీతో చనువుగా వుంటాడు కదా? మళ్ళీ శాంకరి వెంట ఎందుకు పడుతున్నట్లు?" లత అడిగింది అపర్ణని. "ఏం లేదు లత? అతని ప్రవర్తనే ఆశ్చర్యంగా వుంది? ఏ ఆడపిల్ల చనువుగా మాట్లాడినా అతను వెంటపడేటట్లున్నాడు. అతనికి అదే వీక్నెస్. అందుకే నేను దూరంగా వుంటున్నాను. కాస్త అబద్ధమాడింది.

అపర్ణ మాటలు లతకు ఆశ్చర్యంగా అనిపించాయి. ఆమె బావ గుర్తుకొచ్చాడు" ఆ ఫారిన్ అమ్మాయితో కులాసాగా వుంటే అంతే చాలు అనుకుంది మనస్సులో. ఆరోజు రాత్రి శాంకరి కంటికి కునుకురాలేదు. శివా మీద మనస్సు పొరల్లో సువాసనలా అంటుకుపోయివున్న ప్రేమ ఘుమ ఘుమలాడుతూనే వుంది.

"తనను గూర్చి శివా ఎంత నీచంగా వూహిస్తాడో?" అనే అనుమానం ఆమెను బాధించింది. అతనికి జరిగిన సంగతి లెటర్ రాయాలనుకుంది. కాని అంతలోనే ఎలాగా తనను మర్చిపోతాడు. మళ్ళీ

జ్ఞాపకం చెయ్యడం దేనికి అనుకుంది. కాని కలలో కూడా అతన్ని మర్చిపోలేకపోయింది.

లత మరునాడు కాలేజీకి వెళ్ళగానే ప్రిన్సిపాల్ గారిని కలుసుకుని జయరాం మీద కంప్లెంటు ఇవ్వాలనుకుంది. కాని శాంకరి అందుకు యిష్టపడలేదు. "శివకుమార్ ఎవరని అడిగితే సమాధానం చెప్పడం కష్టం. తానే జయరాంకి బుద్ధి చెప్పాలకుంది శాంకరి.

క్లాసువగానే శాంకరి, లతా, అపర్ణ రూం వైపు బయలుదేరారు. అది చూసిన జయరాం వారి వెంట బయలుదేరాడు. జయరాంని చూడగానే లతకు విపరీతమైన కోపం వచ్చింది. అపర్ణ కూడా పళ్ళు నూరింది.

"హలో రాం" పలకరించింది శాంకరి.

శాంకరి ప్రవర్తనను అర్థం చేసుకోలేకపోయారు లత, అపర్ణలు.

"హల్లో శాంకరీ" సంతోషంతో పలకరించాడు జయరాం.

"నువ్వు నాతో నిన్న సినిమాకు వచ్చావుట. మనిద్దరికి పెళ్ళిట, ముహుర్తాలు పెట్టించావా?" బిత్తరపోయాడు జయరాం. "శాంకరి అడిగినదానికి సమాధానం చెప్పు జయరాం?" రెట్టించింది లత.

అపర్ణ మాత్రం చూస్తూ నిలబడింది. అపర్ణకు జయరాం అంటే చాలా అభిమానముంది లోపల. ఎప్పటికైనా అతను మారుతాడని ఆమె ఆశ. "అవును ఆమె యిష్టపడితే పెళ్ళి చేసుకుంటాను" జయరాం సమాధానమిచ్చాడు.

"ఆమె యిష్టపడితే - అంటున్నావు, ఆమె యిష్టపడకుండానే నిన్న అందరితో పెళ్ళి పెళ్ళి అనివాగావుట?" లత కోపంగా అడిగింది.

జయరాం సమాధానమివ్వలేదు.

"మిస్టర్ జయరాం! శాంకరికి పెళ్ళంటే యిష్టంలేదు. ఎప్పుడో చెప్పింది కూడా నీతో, అయినా అల్లరి చేస్తున్నావు, ఇది మంచి పద్ధతి కాదు?"

"నేనేం అల్లరి చేశాను? నా ఫ్రెండ్స్‌తో ఆమెను పెళ్ళిచేసు కుంటానని చెప్పాను తప్పా?"

"జయరాం! ఇంకా తప్పాని అడుగుతున్నావు? ఆమె యిష్టా యిష్టాలు తెలుసుకోకుండా ఆమెను పెళ్ళిచేసుకుంటానని చెప్పడానికి నువ్వెవరవు? ఆమె సంగతి ఎత్తకు!" లత గట్టిగా అరిచినంత పని చేసింది.

"అందమైన వస్తువును ఎవరైనా కొనుక్కోవాలను కుంటారు! అందులో కొత్తేముంది?"

"ఇడియట్! నేను ఆట బొమ్మననుకున్నావా?" శాంకరి ఒక్క అడుగు ముందుకు వేసి ఆగిపోయింది.

అనుకోని సంఘటనకు నోట మాట లేకుండా నిలబడిపోయాడు జయరాం! ఎవరైన చూస్తారేమోనని అటు ఇటు చూశాడు. కాని ఎవరూ లేరు.

"ఈసారి యిటువచ్చావంటే!" లత మాటలు పూర్తికాకుండానే జయరాం అక్కడ నుంచి ముందుకు కదిలాడు.

"నువ్వేమిటి? అలా నిలబడి చూస్తున్నావు ఒక్కమాట అనవేం?" అపర్ణను కోపంగా అడిగింది లత.

"ఏం లేదు కాని ఇంక జయరాం మాత్రం శాంకరి వైపుకన్నెత్తి చూడడులే!" అంది అపర్ణ.

"మరోసారి యీ పని చేస్తే మాత్రం జయరాంని డిస్‌మిస్ చేయించవలసిందే! లత పళ్ళు నూరింది.

ఆ పని మాత్రం చెయ్యకే. అతని లైఫ్ అంతా పాడవుతుంది" అపర్ణ బతిమాలింది.

"అలాగా నా తల్లీ! అయితే అతను శాంకరి జోలికి రాకుండా చూడు. అంతేకాదు ఏ ఆడపిల్ల జోలికి వెళ్ళకుండా చూడు! లేకపోతే నిన్ను రూంలోంచి గెంటేస్తాను జాగ్రత్త" లత, అపర్ణను బెదిరించింది.

"అలాగే అతాదేవి తమ ఆజ్ఞ శిరసావహిస్తాను" రెండు చేతులూ జోడించింది అపర్ణ. అతా, శాంకరి ఆమెను చూసి పకపకా నవ్వారు.

# 57

శివకుమార్ మనస్సు అల్లకల్లోలంగా వుంది. అమెరికా వెళ్ళడానికి వీసా కూడా వచ్చింది. అంత హఠాత్తుగా శివకుమార్ ఫారిన్ ప్రయాణం ఎందుకు పెట్టుకున్నాడో అతని తల్లికి అర్థంకావేసు శివాను అర్థం చేసుకోలేక ఆ తల్లి వుక్కిరిబిక్కిరి అయింది.

ఇంట్లో సామానంతా సర్దించి మూడు గదులు ఖాళీ చేయించాడు శివా. సత్యాన్ని, గిరిజను అక్కడకు రమ్మని పట్టుపట్టాడు. గిరిజకు చాలా సంతోషమనిపించింది. గిరిజకు నెలలు నిండుతున్నాయి. మేనత్త సాయంగా ఉంటుంది. పైగా సొంత యింట్లో వున్నట్లే వుండొచ్చు. ఆ మాటే సత్యానికి చెప్పింది. గిరిజ మనస్సును నొప్పించలేదు సత్యం అందుకే వెంటనే సామాను తీసుకుని వచ్చేసారు. వాళ్ళు రాగానే యిల్లంతా కళకళలాడుతూ కనపడింది. రాజేశ్వరమ్మగారి మనస్సు కాస్త కుదుటపడింది.

శివాలో మాత్రం మునపటి ఉత్సాహం తగ్గిపోయింది. మనస్సులోనుంచి ఆమె రూపాన్ని ఎంత తీసివేద్దామనుకుంటున్నా అది మాత్రం సాధ్యపడడం లేదు. ఆమె మాటలు, ఆమె చేష్టలు తలచుకుంటే అతన్ని ఏదో లోకాలకు తీసుకుపోతున్నాయి. అలా మంచం మీద పడుకుని ఆమెనే తలచుకుంటూ పడుకోడం అతనికి కాస్త తృప్తినిస్తోంది. ఎన్నడూ లేని బద్దకమేదో అతన్ని ఆవరించింది.

"వారి మాటలు నిజమా? అబద్ధమయితే ఎంత బాగుండును ఆమె లేని జీవితానికి మరేదీ అక్కరలేదు!" కాని ఆ విషయాన్ని బయట పెట్టలేకపోతున్నాడు. లోపల బాధని దాచుకోలేక పోతున్నాడు.

"శాంకరి అటువంటిది కాదనే నమ్మకం అతనికుంది. ఇంకా అతనిలో ఏదో ఆశ మిణుకు మంటూనే వుంది. సూర్యానికి ఉత్తరం

రాయాలనిఎన్నో సార్లు ప్రయత్నం చేసాడు. కాని రాయలేకపోయాడు. అలా వుండగానే అతని ప్రయాణం దగ్గరకు వచ్చింది. చలపతీ భార్యా బయలుదేరి వచ్చారు. ఆరోజే గిరిజకు కొడుకు పుట్టాడు. రాజేశ్వరమ్మ గారి హడావుడి మరింత ఎక్కువయింది. తనకు మనవడు పుట్టినట్టు గానే సంబర పడింది. ఇల్లు కళకళలాడుతోంది. గుమ్మాలకు మామిడి తోరణాలు కట్టించింది. ఆ రోజే శివా ప్రయాణం, గిరిజ కొడుకుతో ఆమెడ అంత సంబరంగా వున్నా తీరా బయలుదేరే సమయానికి ఆవి డకు దుఃఖం ఆగలేదు. తల్లిని చూసేటప్పటికి శివా మనస్సు కూడా కరిగి నీరయింది.

"అనవసరంగా వెడుతున్నానేమో? మరోసారి శాంకరిని కలవ వలసిందేమో?" పదే పదే అనుకున్నాడు. దూరంగా వెడితే తప్ప మనస్సు కుదుట పడదు. పైగా తల్లి పెళ్ళి విషయం మరింత పట్టు పడుతోంది. అందుకే తప్పించుకోడానికి యిదో మార్గం అనుకుని సమర్థించుకున్నాడు.

"పెళ్ళి చేసి పంపించవలసింది" చలపతి కూడా రాజేశ్వరామ్మ గారికి సలహా యిచ్చాడు.

"శివాను ఎన్నో సార్లు అడిగాను చలపతీ! చదువు పూర్తికాందే పెళ్ళేమిటమ్మా! ఉద్యోగంలో స్థిరపడ్డాకే పెళ్ళి చేసుకుంటానమ్మా! అంటూ పట్టు పట్టి కూర్చున్నాడు. ఆలోచిస్తే అదే మంచిదనిపిస్తోంది చలపతీ".

రాజేశ్వరమ్మ మాటలు నిజమే అనిపించాయి చలపతికి. అందుకే ఆ ప్రసక్తి తీసుకు రాలేదు మళ్ళీ.

ఎర్‌పోర్టుకి శివా వెంట అందరూ బయలుదేరారు. తీరా శివా లోపలకి వెళ్ళే సమయానికి రాజేశ్వరమ్మగారికి దుఃఖం ఆగలేదు. వెక్కి వెక్కి ఏడుపు ప్రారంభించింది. శివా మాత్రం వెనక్కి తిరిగిచూడకుండా ముందుకు వెళ్ళి పోయాడు. విమానం ఆకాశం ఎత్తుకు లేచింది. ఎన్నో కొత్త ఆశలు అతనిలో చిగురించాయి. తాను తిరిగి వచ్చేటప్పటికి.

శాంకరి చదువు పూర్తవుతుంది. ఏవో కొత్త తలపులు అల్లిబిల్లిగా అతని మనసు నిండా అల్లుకున్నాయి. ఆ ఆలోచనలకి అతనిలో అతనే నవ్వుకున్నాడు.

రాజేశ్వరమ్మగారు బరువెక్కిన గుండెలతో ఇల్లు చేరుకుంది. ఆరోజల్లా మధుకి, సత్యానికి కూడా ఏమీ తోచలేదు. రాజేశ్వరమ్మగారిలో చెప్పలేని దిగులు ప్రారంభమైంది. ఏదో చెప్పలేని నిరాశ, తాను ఒంటరిదాన్ననే బాధ బయలుదేరింది. ఒక రోజు పిల్లాడిని తొట్లో వేసారు. తర్వాత బారసాల అలా నిత్యం ఏదో పండుగలు హడావిడి యింట్లో జరుగుతూనేవున్నాయి. కడుపులో వున్నబాధ పైకి రావడానికి సమయమే దొరకడం లేదు. ఖాళీగావున్న సమయంలో మాత్రం ఆవిడ ఎదురుగా వున్న వాళ్ళలో శివా సంగతే చెబుతోంది. ఏ కూర వండినా, ఏ పిండివంట వండినా "ఇది శివాకు యిష్టం" అని అనకుండా వుండలేకపోతోంది. అలా అన్నప్పుడల్లా ఆవిడ కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి.

"పిల్లాడిని అందుకో అత్తయ్యా!" గిరిజ ఆవిడను మరపించడానికి ప్రయత్నిస్తోంది.

"అమ్మా! బాగున్నావా? నేను బాగున్నా" అంటు శివా ఫోనులో మాట్లాడినప్పుడు మాత్రం కొడుకు దగ్గర వున్నట్లే తృప్తిపడుతోంది ఆ తల్లి.

# 58

ఆ సంఘటన అయిన తరువాత జయరాం దూరంగానే వుంటున్నాడు. చదువు హడావుడిలో శాంకరి అవేమి పట్టించుకోలేదు. అన్నీ మర్చిపోయింది. శివాకు కూడా ప్పుడోకాని జ్ఞాపకం రావడం లేదు అంతలో ఒకరోజు కనకం దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది.

"శాంకరీ! నీకు లెటర్" అంటూ శాంకరి చేతికిచ్చింది లత.

"ఎవరి దగ్గరనుంచి శివకుమారా?" అపర్ణ అడిగింది.

"ఆ శివకుమార్ ఎవరో! ఎందుకొచ్చాడో కాని మీరు నా ప్రాణం తీస్తున్నారే? అయినా ఇంతకీ అతను నాకెందుకు లెటర్ రాస్తాడే?"

"నీకు రాయకపోతే నాకు రాస్తాడా?" లత సమాధానమిచ్చింది. "ఇంతకీ లెటర్ చదువు శాంకరీ!" అపర్ణ బతిమాలింది. లెటర్ అటు ఇటు తిప్పి చూచిన శాంకరి "నువ్వే చదువు లతా" లెటర్ లతకి అందించింది.

లెటర్ తెరిచి చదవడం మొదలు పెట్టింది. "అబ్బా! కనకం గారి లెటర్" ఇంకేం చదవనే ఏ వేవిళ్ళో, ఏ జలుబులో, ఏ దగ్గులో, అంతకంటే ఏముంది? ఇందులో అంటూనే చదివింది ఉత్తరం. అందులో కనకానికి ౨వ నెల అని, ఆరోగ్యంగానే వుందని రాసింది.

"అబ్బా! శాంకరీ! చంపావు కదా? అందుకేనా తల్లి నన్ను చదవమందీ! ఇంతకంటే గుంజీలు తియ్యడం మంచిది" లత గుంజీలు తీసింది.

"కనకానికి వేవిళ్ళయితే నీకెందుకే ఈ వికారం. ఆపు ముందు గుంజీలు" శాంకరి మాటలకు ఆగిపోయింది లత.

"మన పరీక్షలు కూడా ఇప్పట్లో లేవు! కనకం కొడుకు బార సాలకి వెడుదువుగానిలే? అయినా ఆ శివా ఏమైనట్లు? ఆ శివకుమార్ ఎవరో తెలియకుండా పోయేకదా?" లతమాటలకి శాంకరికి విపరీతమైన కోపం వచ్చింది.

"ఇప్పుడా శివా సంగతి ఎందుకు? అతనెవరో తెలీదు. అతన్ని గురించి వార్తవస్తే తప్పకుండా చెబుతా?"

మధ్య మధ్యలో శాంకరి వాళ్ళని కోపం చేస్తూనే వుంది. లత, అపర్ణలు మాత్రం మధ్య మధ్యలో శివా సంగతి ఆలోచిస్తూనే ఉన్నారు.

అపర్ణ జయరాంని కలుసుకుంటూనే వుంది. రెండువ సంవత్సరం పరీక్షలు పూర్తి అయ్యేటప్పటికి జూన్ నెల వచ్చింది. శాంకరి వెంటనే ఊరికి బయలుదేరింది. లత, అపర్ణ తర్వాత వెడతా మన్నారు.

# 59

శాంకరికి వూరంతా మారిపోయినట్లు అనిపించింది. నెలలు నిండిన కనకం మెల్లగానడుచుకుంటూ వచ్చింది. అలా బరువుగా నడుచుకుంటూ తిరుగుతుంటే శాంకరికి ఆశ్చర్యంగా అనిపించింది. అన్నపూర్ణమ్మ, సుశీల కూడా శాంకరిని చూసి సంబరపడ్డారు. "పిన్నీ, పిన్నీ" అంటూ పిల్లలు చుట్టు ముట్టారు. పనులు మూలంగా సూర్యం సాయంకాలం వరకు శాంకరిని చూడలేకపోయాడు. ఆ రోజల్లా శాంకరి ఇల్లు కదల్లేదు. అందరితో మాట్లాడ్డంతోనే సరిపడింది. మరునాడు కుట్టు సెంటరు దగ్గరకు వెళ్ళింది.

కనకాన్ని రావద్దన్నా మానలేదు కూడా వచ్చింది. సుశీల అందరి కంటే బట్టలు బాగా కుడుతోంది. రాజమండ్రిలో రెడీమేడ్ షాప్ పెట్టిస్తే బాగుంటుందనే ఆలోచన వాళ్ళకి వచ్చింది. తర్వాత లైబ్రేరీవైపు వెళ్ళారు అక్కడ వాళ్ళు. పిల్లలు కూడా చదువుకుంటున్నారు. సుశీలను మెట్రిక్ కట్టిస్తే మంచిదేమో అనిపించింది శాంకరికి. రాజమండ్రి నుంచి పుస్తకాలు అవి పట్టుకొచ్చి యిస్తానన్నాడు సూర్యం.

"అక్కా నువ్వు మెట్రిక్ కడితే మంచిదేమో?" శాంకరి మాటలు పూర్తికాకుండానే.

"అవును శాంకరి! నాకూ చదువుకోవాలని వుంది? స్కూల్లో వుద్యోగం చేస్తాను" ఉత్సాహంగా అంది సుశీల.

శాంకరి అక్కవైపు తృప్తిగా చూసింది.

మరునాడు శాంకరి స్కూలు చూడాలనుకుంది. స్కూలు టైంకి కనకం బయలుదేరి వచ్చింది.

"నెలలు నిండినువ్వెందుకమ్మా! అంత దూరం వెళ్ళడం మంచిది కాదు" అన్నపూర్ణమ్మగారు మందలించింది.

"నాకేం భయంలేదు. వాకింగ్ వంటికి చాలా మంచిది. అందుకే వెడుతున్నాను పిన్నీ."

కనకం శాంకరిని వెంటబెట్టుకుని స్కూలుకి వెళ్ళింది.

స్కూలును కొత్త భవనంలోకి మార్చారు. విశాలమైన తోటలో వుంది. స్కూలు చుట్టూ పూల చెట్లు, గేటు నుంచి దారి కిరుప్రక్కలా రకరకాల క్రోటన్స్ మొక్కలు వేశారు. అప్పుడే కొత్తగా పెట్టడంవల్ల ఇంకా బాగా పెరగలేదు. ప్రశాంతమైన వాతావరణంలో ఆ స్కూలు ఆశ్రమాన్ని తలపుకు తెస్తోంది.

స్కూల్లో అడుగు పెట్టారు యిద్దరు. సూర్యం వాళ్ళకి యెదురు వచ్చాడు. ప్రతీ క్లాసుకి శాంకరిని తీసుకువెళ్ళాడు.

నీలం రంగు నిక్కర్లతో తెల్లని చొక్కాలతో పిల్లలంతా చూడ ముచ్చటగా వున్నారు.

ఒక క్లాసులో వేమనశతకం చెబుతున్నారు. ఒక క్లాసులో ఎక్కాలు చెబుతున్నారు. ఎంతో క్రమశిక్షణ ఆ పాఠశాలలో కనబడింది. కొందరు పిల్లలతో టీచర్లు డ్రిల్లు చేయిస్తున్నారు. కొందమంది వాలీబాల్ ఆడుతున్నారు.

"కనకం! మన చిన్నతనంలో యివేమి లేవుగా? మనమే ఆడు కునే వాళ్ళం. నిజంగా ఈ పిల్లలు అదృష్టవంతులు కదా!" అంటున్న శాంకరి మాటలను ఆశ్చర్యంగా వింది కనకం.

"నిజం శాంకరి! సూర్యం మూలంగా పిల్లలకి ఈ అదృష్టం పట్టింది. అసలు చీఫ్ సలహాదారినివి నువ్వేగా! ఈ పుణ్యం నీకే దక్కు తుంది. చుట్టుప్రక్కల వూళ్ళ నుంచి కూడా ఎంతో మంది ఇక్కడకు వస్తు న్నారు."

పుణ్య పాపాల కేమీ గాని కనకం "ఈ పిల్లల భవిష్యత్తు బాగుం టుంది."

"నా భవిష్యత్తు ఏమిటో కాస్త చెప్పు శాంకరీ!" నవ్వుతూ అడి గాడు సూర్యం.

"నీ భవిష్యత్తుకేం బంగారు బాట-అదే పిల్లలకు వెలుగుబాట."

"బాగా చెప్పావు శాంకరీ" కనకం, సూర్యం చప్పట్లుకొట్టారు.

శాంకరి మనస్సు ఎంతో ప్రశాంతంగా అనిపించింది.

శాంకరి, కనకం యింటికి బయలుదేరారు. సూర్యం అక్కడే వుండి పోయాడు. కనకం ఎందుకో నడవలేకపోయింది. అలసటగా అనిపించింది. ఇద్దరు రిషా ఎక్కి యిళ్ళకు వచ్చారు. ఆ గతుకుల రోడ్ల మీద రిషా మీద వచ్చిన కనకం వళ్ళు నొప్పులు చేసింది. రిషాలో కుదుపులకు 'అబ్బా' అంటూనే వుంది కనకం. మొదటిసారిగా ఆ గతుకుల రోడ్ల సంగతి ఆలోచించింది కనకం.

ఆ రాత్రి కనకానికి నొప్పులు ప్రారంభమయ్యాయి. గవర్నమెంటు డాక్టరు వచ్చి చూసి ఒక ఇంజక్షన్ ఇచ్చాడు. మంత్రసాని వచ్చి దగ్గరే కూర్చుంది. తెల్లవార్లు నొప్పులు పడుతూనే వుంది. ఎక్కడికైనా తీసుకెడదామన్నా అర్ధరాత్రి వేళ చాలా కష్టం. తెల్లారకట్ల పురుడు వచ్చింది. మగపిల్లవాడు పుట్టాడు. అందరికి చెప్పలేని సంతోషమనిపించింది. ఆ రాత్రిల్లా శాంకరి అక్కడే వుండి తగిన సహాయం చేసింది. "పిల్లవాడి నక్షత్రం మంచిది కాదు శాంతి చెయ్యాలి. తండ్రి చూడకూడ"దన్నారు పెద్దలు.

కాని ఎవరు చూడకుండా సూర్యం వెళ్ళి కొడుకుని చూసి ముద్దు పెట్టుకుని మరీ వచ్చాడు. సూర్యాన్ని చూసిన శాంకరి నవ్వుకుంది.

చంటి పిల్లాడు ఎంతో ముద్దుగా ఉన్నాడు. శాంకరి పొద్దుట, సాయంకాలం వెళ్ళి కనకం దగ్గరే కూర్చుంటోంది.

అంతలో ఒకనాడు సూర్యానికి లెటర్ వచ్చింది.

"ఇదేమిటి ఈ లెటర్ ఫారిన్ లెటర్ లా ఉంది" సూర్యం ఆశ్చర్యంగా అటు ఇటు తిప్పాడు. వెనకాల శివకుమార్ పేరు ఉంది. కంగారుగా లెటర్ తెరిచి చదివాడు.

"శాంకరీ" అంటు అరిచాడు.

చంటి పిల్లాడిని ఎత్తుకున్న శాంకరి పిల్లాడిని కనకానికిచ్చి కంగారుగా యివతలకు వచ్చింది.

"శాంకరీ! శివా దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. అతనిప్పుడు అమెరికాలో ఉన్నాడు."

"శాంకరి ఒక్కసారి ఉలిక్కిపడి సర్దుకుంది.

"అమెరికాలోనా?"

"అవును శాంకరీ! అమెరికాలో పి.హెచ్.డి చేస్తున్నాట్ట మనకి చెప్పనేలేదు. ఆశ్చర్యంగా ఉంది." సూర్యానికి కాస్త బాధనిపించింది.

"అతను అమెరికా వెడితే మనకు చెప్పాలని ఎక్కడుంది? మనకేం?" లేని వైరాగ్యం తెచ్చుకుని శాంకరి తిరిగి కనకం దగ్గరకు వెళ్ళిపోయింది.

"అంత చనువుగా ఉండే శివకుమార్ ఈ సంగతి ఎందుకు చెప్పలేదు?" సూర్యం కుర్చీలో కూర్చుని చాలా సేపు ఆలోచించాడు. ఎంత ఆలోచించినా అతనికి కారణం అంతుపట్టలేదు. పైగా మనసులోని బాధ తగ్గలేదు.

ఈ రాత్రి శాంకరి అదే విషయం ఆలోచిస్తూ పడుకుంది. ఎంత మరచిపోదామనుకున్నా అతని రూపం అలా మెదులుతూనే ఉంది. "కనీసం సూర్యానికైన చెప్పచ్చు కదా! చెప్పకుండా ఎందుకు వెళ్ళిపోయినట్లు బహుశా వైజాగ్‌లో జరిగిన సంఘటనే కావచ్చు." అనుకోగానే ఆమెకు ఏదో సంతృప్తి అనిపించింది.

"అతని దృష్టిలో ఎవరైనా ఉన్నారేమో? ఉంటే వైజాగ్ ఎందుకు వస్తాడు? కనబడకుండా ఎందుకు వెళ్ళిపోతాడు? తప్పకుండా అందుకే వెళ్ళి ఉంటాడు? అలా ఆలోచించుకుని మనస్సును సమాధాన పరచుకుంటోంది శాంకరి. అంతలోనే "అతనితో నాకేం పని అతను ఎక్కడికి వెడితే నాకేం" మధ్యలో అనుకుంటూనే ఉంది. ఆ రాత్రి ఎప్పటికో నిద్రపట్టింది శాంకరికి.

పదకొండవ రోజు పురిటి స్నానమయింది. ఆరోజే బారసాల చేశారు. సూర్యం కొడుక్కి 'చైతన్య' అని పేరు పెట్టాడు. తండ్రి

పేరు కలపమని పెద్దలన్నారు. "జగన్నాథ చైతన్య" అన్నాడు సూర్యం. "కనకం! నీకా పేరు నచ్చిందా?" శాంకరి అడిగింది. "సూర్యం సెలెక్షన్ చాలా బాగుంటుంది." కనకం ముసి ముసి నవ్వులు నవ్వింది.

"సూర్యం! కనకానికి నువ్వు పెట్టిన పేరు నచ్చలేదుట." శాంకరి కావాలనే అడిగింది.

"అలాగా! అయితే మీ స్నేహితురాల్ని మరో పేరు చెప్పమను. ఇప్పుడే యీ పేరు మార్చేస్తాను."

సూర్యం మాటలకి శాంకరితో పాటు కనకం కూడా నవ్వింది.

# 60

ఆ రాత్రి జగన్నాథంగారికి గుండెల్లో పోటు విపరీతంగా వచ్చింది. డాక్టరు వచ్చి చూసి పెద్దాస్పటల్లో చేర్పించడం మంచి దన్నాడు. ఎక్కడో పొరుగూరులో మునసబుగారికి కారు వుంది. దాని కోసం మనిషిని పంపించారు. ఈ లోపుగా డాక్టరు తనకు చేతనైన వైద్యం చేశాడు. అక్కడ ఆసుపత్రిలో ఏ సౌకర్యాలు లేవు. నాటు వైద్యులు కూడా చాలా మందే ఉన్నారు. కాని "మందు పట్టిస్తే బతుకు తారు లేకపోతే చనిపోతారు." అన్న తీరులో చాలామంది వైద్యాలు చేస్తున్నారు.

మునసబు గారింటి నుంచి కారు రానేలేదు. అది పట్నం వెళ్ళిం దట. ఇక్కడ జగన్నాథంగారు ఈ లోక సంబంధాలు వదిలివేసారు. ఆయన ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసి పోయాయి. సూర్యం చంటి పిల్లాడిలా ఏడ్చాడు. అతని తల్లి సంగతి చెప్పనే అవసరం లేదు. ప్రాణం లేని భర్త పాదాలు పట్టుకుని బావురుమంది. పదకొండు రోజుల కొడుకుని తీసుకొని అత్తింట్లో అడుగు పెట్టింది కనకం. మనవ డిని ఒళ్ళో పెట్టుకొని, కనకాన్ని పట్టుకుని మరింత ఏడ్చింది ఆవిడ.

"మనవడు తాత గండాన్ని పుట్టడు? తాతని బలితీసుకున్నాడు?" సూర్యం పెదనాన్న భార్య మాటలు విని అందరు ఆశ్చర్యపోయారు.

"అవేం మాటలమ్మా! మరో ఆవిడ సాగతీసింది.

"ఉన్నమాటండీ! లేకపోతే దుక్కలావున్న మనిషి గుటుక్కు మన్నాడు కదా?" ఆవిడ మరింత సాగతీసింది.

"నాకిలాటి నమ్మకాలు లేవండీ!" ఆవిడ చెల్లెలు పొడిపొడిగా అంది.

అలా అందరూ తలో మాటా అంటూనే వున్నారు.

ఆ మాటలు విన్ని శాంకరి వెళ్ళి అన్నవాళ్ళను దులిపి రావాలనుకుంది. దానివల్ల వారి మూర్ఖత్వం పోదు? మరింత పెరిగి పోతుంది. అందుకే ఆలోచించింది.

"ఇదిగో నాకిలాటి నమ్మకాలు లేవు? నా ఎదురుగా ఎవరూ నా మనవణ్ణి అలా అనటానికి వీల్లేదు. ఆయనకు వయస్సు వచ్చింది. వెళ్ళి పోయారు. ఈ పసికందుకు నూరేళ్ళ జీవితం వుంది. నా మనవణ్ణి ఎవరైనా పల్లెత్తుమాట అంటే భరించలేను" సూర్యం తల్లి అలా అంటుందని ఎవరూ అనుకోలేదు. ఆవిడ మాటలు విని ఆడవాళ్ళు పెదాలు కొరుక్కున్నారు. పైకి అనకపోయినా చెవులు కొరుక్కుంటూనే వున్నారు.

ఆడవాళ్ళని చదివించవచ్చు. మిషనుకుట్టులు నేర్పవచ్చు. కాని ఈ నేర గొంటితనం, ఈ తప్పుబట్టే స్వభావాన్ని మార్చేదెలా? శాంకరి చాలాసేపు ఆలోచించింది.

"ఈ ఆడవాళ్ళ స్వభావాలు మారితే తప్ప ఈ సమాజం బాగు పడదనుకుంది" శాంకరి.

"మా అత్తగారు మంచివారు కనక సరిపడింది. లేకపోతే నాగతి ఏమయ్యేదో? చూశావా శాంకరీ" శాంకరిని పట్టుకు ఏడ్చింది కనకం.

అసలే బాలింతరాలివి. వీళ్ళ మాటలు విని బాధపడకు. మీ అత్త దేవత. నీ భర్త దేవుడు. ఈ లోకుల మాటలకి నువ్వెందుకు బాధ

పడతావు? ఈసారి అనని వాళ్ళ సంగతి నేచూస్తా. వెళ్ళి నీ పని చూసుకో!"

శాంకరి మాటలతో కనకానికి నిజంగానే ధైర్యంవచ్చింది. ఈసారి ఎవరైనా ఏదైనా అంటే తానే సమాధానం యివ్వాలనుకుంది.

చంటిపిల్లాడు ఒకటే ఏడుపు ప్రారంభించాడు. అన్నపూర్ణమ్మ వెళ్ళి పిల్లాడిని తీసుకుంది.

"కనకం నామాట విను. పిల్లాడిని తీసుకునిలోపలికి వెళ్ళికూర్చో! పచ్చి బాలింతరాలివి. ఇవ్వన్నీ నువ్వు చూడకూడదు."

అన్నపూర్ణమ్మగారు బలవంతంగా కనకాన్ని తీసుకెళ్ళి లోపల కూర్చో పెట్టింది.

"కనకంతల్లి ఆ పని చెయ్యాలనుకుంది. కాని అందరు తన కూతురు కనక అలాచేసిందని" అంటారని భయపడింది.

అన్నపూర్ణమ్మగారిని మనస్సులోనె అభినందించింది.

శాంకరి మనస్సు జగన్నాధంగారి మరణం వైపు మళ్ళింది. ఆ పూళ్ళో తగిన వైద్య సదుపాయం లేదు. డాక్టరు వున్నా హాస్పటల్లో మందులు లేవు. "జగన్నాధంగారికి వెంటనే ఆక్సిజన్ పెట్టివుంటే బతికే వారేమో?" శాంకరి మనస్సులో అదే ఆలోచన.

"ఎంతమందికి తగిన సదుపాయం లేక మరణిస్తున్నారో?" ఇది నాకు తెలిసిన కేసు" శాంకరి మనస్సు విలవిల్లాడింది.

"తన చదువు ఎప్పుడు పూర్తవుతుందా! ఈ జనానికి ఎప్పుడు వైద్యం అందించ గలుగుతానా అనుకుంది" శాంకరి.

అంతలో ఆమె మనస్సు గతం వైపు మళ్ళింది. శివా కళ్ళలో నిలిచాడు. ఏదో మధురస్మృతి ఆమె మనస్సును కుదిపింది.

కిటికీ తలుపు తెరచి వుంది. ఆకాశం నిండా మబ్బులు, ఆ మబ్బుల బంధంలో చంద్రుడు అద్దం బిళ్ళలా తొంగి చూస్తున్నాడు.

ఎక్కడో దూరంగా ఒక నక్షత్రం మిణుకు మిణుకుమని చూసింది.

కర్మకాండలన్నీ యధావిధిగా జరుగుతున్నాయి. ఆ పది రోజుల్లో సూర్యం చిక్కి సగమయ్యాడు. ముఖం పీక్కుపోయింది. కళ్ళు వాచి వున్నాయి. మునపటి సూర్యంలా గేలేడు. దుఃఖం మనిషిని ఎంత కృంగ తీస్తుందో కదా! అన్నింటికంటే భయంకరమైన రోజు ఆ పదవరోజు. బతుకుండగానే ఆడదాన్ని చంపడానికి ప్రయత్నించే రోజు. బయటకు రాకుండా స్త్రీని మూఢాచారాల ముళ్ళకర్రతో చావబాదే రోజు.

మగవారంతా గుసగుసలాడుతున్నారు. ఆడవారు చెవుల్లో చెప్పుకుంటున్నారు.

సూర్యానికి ముందు అర్థం కాలేదు. వెళ్ళి రామనాధంగారిని అడిగాడు. ఆయన చెప్పింది విని సూర్యం గుండెలు బాదుకున్నాడు.

"నో! అలా జరగడానికి వీలులేదు" అంటూ అరిచాడు సూర్యం.

"ఇవన్నీ పూర్వాచారాలు బాబూ! స్త్రీల పాలిటి శాపాలు అవి."

"ఆ శాపానికి విముక్తి లేదా మామయ్యా!"

"పట్నాల్లో చాలామంది వీటిని వదిలి వేస్తున్నారు. నువ్వు గట్టిగా కాదంటే శాస్త్రిలు ఏమీ చెయ్యలేవు!"

"నిజమా మామయ్యా!"

"అవును సూర్యం."

రామనాధంగారి మాటలు అతనికి చాలా ధైర్యాన్నిచ్చాయి. అలా జరక్కపోతే అరిష్టమని, భార్య అలా చెయ్యకపోతే భర్తకు నరక మొస్తుందని చెప్పే మాటలు యదార్థం కాదని గ్రహించుకున్నాడు. తన తల్లి అలా ఉంటే తను చూడలేడు. అసలలా జరగడానికి వీల్లేదు. పెద్దలంతా ఎంత చెప్పినా వినలేదు సూర్యం. తన తల్లికి ఆ అన్యాయం జరగడానికి వీల్లేదన్నాడు.

శాంకరి ప్రోత్సాహంతో కనకం కూడా పట్టుపట్టింది. కొందరు బంధువులు "అలా జరిగి తీరాలన్నారు."

సూర్యం తాతగారు కూతురు అలా ఉంటే ఆమె చేతి మంచి నీళ్ళు తాగనన్నాడు.

"తాక్కపోతే మానేసెయ్యి తాతా" అన్నాడు సూర్యం మొండిగా! ఆ రోజే ఆయన మూట సర్దుకుని వెళ్ళిపోయాడు.

12వ రోజు ఊళ్ళో చాలా మంది భోజనాలకు రాలేదు. అయినా సూర్యం వాటిని లెక్క చెయ్యలేదు. కనకం కూడా ధైర్యంగా నిల బడింది.

కొందరు ఆడవాళ్ళు మొహం మీదే అంటున్నా కనకం తప్పించుకు పోతోంది. సూర్యానికి, కనకానికి వెనకాల శాంకరి ధైర్యాన్నిచ్చింది.

14వ రోజున వచ్చిన చుట్టాలంతా వెళ్ళిపోయారు. సూర్యం, కనకం వూపిరి పీల్చుకున్నారు. క్రమంగా గొడవ సద్దుమణిగింది.

"మామయ్యా! మీ ఋణం తీర్చుకోలేను. మీ మూలంగానే మా అమ్మకి యీ గండం గడిచింది" అన్నారు సూర్యం.

"అదేమిటి సూర్యం! అలా అంటావు? ఈ దురాచారాలన్నీ మధ్యలో పెట్టినవే! ఆచారమైనా, దురాచారమైనా కాలంతో పాటు మారాలి కదా! మనిషిని బాధించేది ఆచారమే కాదు."

రామనాధంగారి మాటలు ఆశ్చర్యంగా విన్నాడు సూర్యం. అంత సంస్కారవంతుడైన తండ్రికి పుట్టిన రత్నమే శాంకరి అనుకున్నాడు.

శాంకరి సెలవులు పూర్తికావడంతో తిరిగి వైజాగ్ బయలు దేరింది. వెళ్ళేముందు శాంకరి అక్కగారితో పిల్లల సంగతి ఎన్నోసార్లు చెప్పింది. వారిని కాస్త భయపెట్టమని, చదివించమని మరీ మరీ చెప్పింది. ఒక పక్క సుశీల మెట్రిక్ పరీక్షలు కట్టి శ్రద్ధగా చదువు తోంది.

సూర్యం అన్ని విషయాలు వివరంగా శివకుమార్‌కి లెటర్‌లో రాసాడు. ఆ వూళ్ళో అటు తరువాత తన తల్లినే వుదాహరణంగా తీసు కుంటున్నందుకు మాత్రం సూర్యం, కనకం తృప్తిపడ్డారు.

# 61

శివకుమార్ మనస్సు శాంకరి చుట్టూ తిరుగుతోంది. ఆమెను మర్చిపోడానికి అంత దూరం వచ్చాడు. కాని అతని ఆలోచనలన్నీ ఆమె చుట్టూ తిరుగుతున్నాయి. అలా వంటరిగా కూర్చుని ఆమెను తలచుకుంటే అతనికి ఎంతో తృప్తికలుగుతోంది. రిసెర్చి వర్కు మూలంగా అతనికి సమయమే దొరకడంలేదు. సమయం దొరికితే ఆమె ఆలోచనలతో గడిచిపోతోంది. ఈపాటికి శాంకరి పెళ్ళి జయరాంతో జరిగే ఉంటుందనుకున్నాడు.

అంతలో అతనికి సూర్యం రాసిన లెటర్ అందింది. చేతులు వణుకుతుంటే లెటర్ విప్పి చదివాడు. అందులో జగన్నాథంగారు చని పోయినట్టు వుంది పైగా ఆ సమయంలో శాంకరి కూడా అక్కడే ఉంది. ఎంతో సహాయం చేసినట్టు కూడా ఉంది.

జగన్నాథంగారు పోయినందుకు చాలా బాధ పడాడు శివ కుమార్. శాంకరి విషయం మాత్రం అతనికి అర్థంకాని విషయంలా మిగిలిపోయింది.

శాంకరి పెళ్ళి అయినట్లు అందులో లేదు. పైగా శాంకరికి పెళ్ళని కూడా అందులో లేదు.

సూర్యానికి ఆ విషయం తెలియదేమో అనుకున్నాడు శివా.

సూర్యం ఉత్తరం రెండు మూడుసార్లు చదువుకున్నాడు. శాంక రిని చూచినట్లే అనిపించింది. అతని మనస్సు శాంకరిపై తలపులతో నిండిపోయింది. శరీమంతా గగుర్పొడిచింది.

అంతలోనే తన నుండి శాంకరిని ఎవరో బలవంతంగా లాక్కు పోయినట్లు అనిపించింది.

"ఈ పాటికి శాంకరి ఎవరి భార్యో అయివుంటుంది. ఆమె గురించి ఆలోచించటమే తప్పనుకున్నాడు.

జగన్నాథంగారు చనిపోయినందుకు బాధపడుతూ సూర్యానికి లెటర్ రాసాడు. కాని అందులో శాంకరి సంగతి రాయలేకపోయాడు.

# 62

శాంకరి మూడో సంవత్సరంలో అడుగుపెట్టింది. అన్ని విషయాలు మర్చిపోయి శ్రద్ధగా చదువుతోంది. దానికి సాయం ప్రాక్టికల్స్ కూడా ఎక్కువుంటున్నాయి. శవాన్ని చూస్తేనే భయపడుతున్నారు లత, అపర్ణ. ఇంక శవాన్ని ముట్టుకోవాలంటేనే వణికి పోతున్నారు.

"అసలు మీరు వైద్యవృత్తికి ఎందుకు వచ్చారే? ఏ టీచర్ల కిందో వెళ్ళవలసింది. అయినా ఆ వృత్తికి మీరు పనికిరారు? పిల్లలకి చదువు లేం చెబుతారె? అన్నింటికంటే తేలికైన వుద్యోగం ఏదైనా చూసుకు వెళ్ళవలసింది" శాంకరి లతను, అపర్ణని కోపం చేసింది.

"అదే అనుకుంటున్నాం తల్లీ! బుద్ధిలేక ఇక్కడికి వచ్చాం!" లత, అపర్ణ లెంపలేసుకున్నారు.

"ఇంక వెనక్కి వెళ్ళలేరుగా! అందుకని తప్పదమ్మల్లారా! ధైర్యం తెచ్చుకోండి".

"తెచ్చుకోవాలను కుంటున్నాం! కాని గుండె దడ, గుండెను ఆప లేం కదా!" జాలిగా చూశారు శాంకరి వైపు.

"ఇలాంటి విద్యార్థులు కూడా వుంటారేమో?" శాంకరి జాలి పడింది.

మాలాటివాళ్ళే కాదు. చదువులు మానేసి వెళ్ళినవారు కూడా చాలా మంది వుంటారుట" అపర్ణ అంది.

"అయితే మీరేనయమన్నమాట" శాంకరి నవ్వింది.

"అవును శాంకరీ! మేం చాలానయం. మొన్న ఒక వీరుడు యుద్ధరంగంలో వుత్తరకుమారునిలా పారిపోయాడుట" లత మాటలకి అపర్ణ, శాంకరి పకపకా నవ్వారు.

"శాంకరీ! నా పెళ్ళికి రావాలి" ఒకరోజు అపర్ణ పిలుపు విని శాంకరి ఆశ్చర్యపోయింది.

"నీ పెళ్ళా! ఎవరితో? ఎప్పుడు?"

"అపర్ణా! శాంకరికి సమధానం చెప్పు. అలా దిక్కులు చూస్తావేం!" లత కసిరింది.

"జయరాం నేను పెళ్ళి చేసుకోవాలను కుంటున్నాం. రేపాది వారం సింహాచలం కొండ మీద పెళ్ళి"

"అపర్ణా! నేనిలా అంటున్నాని ఏమీ అనుకోకు. జయరాం మీద నాకు కోపం లేదు. నీ మీద అంతకంటే లేదు. కాని నువ్వు కొంచెం ఆలోచించవలసింది. తొందరపడ్డావని పిస్తోంది?"

"నేను కూడా అదే చెప్పాను శాంకరీ! కాని అపర్ణ వినడం లేదు? అందుకే నీ దగ్గరకు తీసుకొచ్చాను." లత మాటలు జాగ్రత్తగా వింది శాంకరి.

"అవును అపర్ణా! ఇప్పటికీ మించిపోయింది లేదు. ఇంకా ఆలోచించు. పైగా గుడిలో పెళ్ళికంటె రిజిష్టారు ఆఫీసులో చేసుకోవలసింది. అవసరమైతే సాక్ష్యమైన వుండేది?"

"జయరాం! చాలా మంచివాడు శాంకరీ.

"అలాగా అపర్ణా! అయితే అతనెందుకు నా వెంట పడ్డట్టు. పైగా ఇంతలోనే నీ వెంట ఎందుకు పడ్డట్టు? అందుకే రిజిష్టారు ఆఫీసులో చేసుకోండి?"

"రిజిష్టారాఫీసులో చేసుకోడం అతని కిష్టంలేదు శాంకరీ! సింహాచలం అప్పన్నస్వామి సమక్షంలో చేసుకుందామన్నాడు? అన్నింటికి అపార్థాలు చేసుకొకూడదు శాంకరీ?"

"అపర్ణా! అతను రిజిష్టారాఫీసులో వద్దంటే ఏదో ఉండి వుండాలి? తొందరపడకు శాంకరి మాట విను" లత సలహా యిచ్చింది.

"అయితే నన్నేం చెయ్యమంటారో చెప్పండి?" అపర్ణకు కూడా అనుమానం బయలుదేరింది.

"అయితే ఇంకో నెలరోజులు ఆగమను. పైగా రిజిష్టర్డ్ వివాహమైతేనే అంగీకరిస్తానని చెప్పు. ఈ లోపుగా అతన్ని గురించి బాగా తెలుసుకో? ఇక్కడ జయరాం కజిన్ వుందిగా, ఆమెతో స్నేహం చెయ్యి. ఆమెకు మీ పెళ్ళి సంగతి చెప్పకు!"

"నా కళ్ళు తెరిపించావు శాంకరీ! నువ్వు చెప్పినట్లే చేస్తా!" అపర్ణ మనస్సు కాస్త కుదుటపడింది.

అపర్ణ చన్నీళ్ళతో ముఖం కడుక్కుని వచ్చింది. తర్వాత ముగ్గురు టీ తాగడానికి బయలుదేరారు. తర్వాత రూముకు తిరిగి వచ్చారు.

ఏం జరగనట్టుగానే అపర్ణ పుస్తకం తీసి చదువుకోడం మొదలు పెట్టింది. శాంకరి తృప్తిగా చూసింది. లత ఆశ్చర్యంగా చూసింది.

శాంకరి మాటలు జాగ్రత్తగా ఆలోచించింది అపర్ణ. ఆమె మాటల్లో యదార్థముందనిపించింది. అందుకే జాగ్రత్తగా వ్యవహరించా లనుకుంది.

జయరాంకి అనుమానం రాకుండా అతనితో జాగ్రత్తగా మసులు కుంటోంది. పైగా రిజిస్ట్రారాఫీసులోనే ముందు రిజిస్ట్రేషన్ కావాలని తర్వాత సింహాచలంలో పెళ్ళి చేసుకుందామని పట్టు పట్టింది. జయరాం ముఖం వెలవెల పోవడం ఆమె గ్రహించింది కాని ఏమీ అడగలేదు.

జయరాం కూడా అపర్ణకు అనుమానం రాకుండా సర్దుకున్నాడు.

"అపర్ణా! నీ కోరిక నేనెందుకు కాదంటాను. అలాగే రిజిస్టర్ మ్యారేజే చేసుకుందాము. ఒకసారి మావూరు వెళ్ళి మా వాళ్ళకి చెప్పి వస్తాను."

అతని మాటలు పూర్తిగా నమ్మింది అపర్ణ. అతని కజిన్ ఉషతో స్నేహం ప్రారంభించింది. ఉష చాలా మంచి పిల్ల. పైగా చాలా శ్రద్ధగా చదువుకుంటోంది కూడా.

ఒకరోజు మాటల సందర్భంలో మెల్లిగా జయరాం సంగతి ఎత్తింది అపర్ణ.

"జయరాం తండ్రికి కొడుకును మెడిసిన్ చదివించేటంతశక్తిలేదు. జయరాం మేనమామ చదువు చెప్పిస్తున్నాడు. ఆయన కూతురుతో జయరాం పెళ్ళి ఎప్పుడో కుదిరి పోయింది. ఉష మాటలకు వులిక్కి పడింది అపర్ణ. అపర్ణ వెంటనే వచ్చి శాంకరికి, లతకి అన్ని విషయాలు వివరంగా చెప్పింది.

"అపర్ణా! ఎంత పని జరిగిందో చూశావా? నువ్వు తొందరపడితే చాలా ప్రమాదం జరిగేది?" ఇంకా ఏం వింటామో చూడు" శాంకరి మరోసారి చెప్పింది.

"శాంకరీ! నన్ను క్షమించాలి. పొరపాటు జరిగిపోయింది?" అపర్ణ వెక్కి వెక్కి ఏడుపు ప్రారంభించింది.

"అపర్ణా! ఏం జరిగిందో చెప్పు?" శాంకరి మంచంమీద లేచి కూర్చుంది. లత అపర్ణకు దగ్గరగా వెళ్ళి ఆమెను కుదిపింది.

"శాంకరీ! నువ్వూ, లతా లేనప్పుడు అతని మాటలు నమ్మి అతనితో అరకు వాలీకి వెళ్ళాను. అక్కడ రూములో అతనికి లొంగి పోయాను."

లత ఒక్కసారి ఆమె భుజం మీద చెయ్యితీసేసి నిల్చబడి పోయింది.

శాంకరికి మాత్రం పట్టరానికోపం వచ్చి మంచందిగి అపర్ణ చెంప చెళ్ళుమనిపించింది.

"శాంకరీ! కొట్టు! నన్ను కొట్టి చంపేసెయ్యి. అప్పుడు కాని నా పాపంపోదు." రెండు చేతులతో ముఖం కప్పుకుని అపర్ణ కుమిలి కుమిలి ఏడ్చింది.

"మెడిసిన్ చదివే పిల్లవి ఆ మాత్రం తెలీదా! నెల తప్పినట్టేనా" లత కోపం చేసింది.

"అవును" చంటిపిల్లలా తలూపింది అపర్ణ. శాంకరి మనస్సు కాసేపు మొద్దుబారిపోయింది. అంత చదువుకున్న పిల్లలు కూడా అంత తెలివి తక్కువగా ఎలా ప్రవర్తిస్తున్నారో ఆమెకు అంతుపట్టలేదు.

"జరిగిందేదో జరిగింది. జయరాం పెళ్ళికి ఒప్పుకుంటే చేసే సుకో! లేకపోతే ఆలోచిద్దాం. అంతవరకు ఎవరికి చెప్పకు జయరాంకి కూడా చెప్పకు?" శాంకరి హెచ్చరిక చేసింది.

నెల రోజుల తర్వాత జయరాం తిరిగి వచ్చాడు.

అపర్ణను చూసి కూడా జయరాం పలకరించలేదు. పైగా తప్పించుకు వెళ్ళిపోతున్నాడు. ఆ విషయం అపర్ణ గ్రహించింది. ఒకరోజు అతన్ని బలవంతంగా కలుసుకుని పెళ్ళి సంగతి అడిగింది.

"మీ కులం వేరు, మాకులం వేరు అపర్ణా! మావాళ్ళు మన పెళ్ళికి అంగీకరించడం లేదు. నేనేం చెయ్యను చెప్పు?"

"ఎవరి అంగీకారం తీసుకుని నన్ను ప్రేమించావు? పైగా ప్రేమించడానికి లేని కులాంతరం పెళ్ళికెందుకు?" అపర్ణ ఎదురు ప్రశ్న వేసింది.

"ఎమోషన్ తెచ్చుకోకు అపర్ణా! నిదానంగా ఆలోచించు. మా తల్లి తండ్రులకి నేనొక్కణ్నే కొడుకుని. వాళ్ళకోసం నా ప్రేమనే త్యాగం చేస్తున్నాను." త్యాగమూర్తిలా, ధర్మమూర్తిలా సమాధాన మిచ్చాడు జయరాం.

అతని మాటలు విని ఆశ్చర్యపోయింది అపర్ణ.

జయరాంలోని అమాయకత్వం మాటున అంత స్వార్థం, అంత మోసం ఉంటుందని ఆలోచించలేక పోయింది. అపర్ణకు పురుషుల మీదే ద్వేషం కలిగింది. అయినా జయరాం మీద వచ్చిన కోపాన్ని దాచుకుంటూ రూముకు వచ్చింది. శాంకరితో జరిగినదంతా చెప్పింది.

"అపర్ణా! నీకు అతని మీద యింకా నమ్మకముంటే ఈ పెళ్ళి ఎట్లాగైనా జరిపిస్తా! చెప్పు అపర్ణా!" శాంకరి కోపంగా అడిగింది.
"అవును అపర్ణా! ఆలోచించుకు చెప్పు." లత కూడా అదే మాట అంది.

"అతనొక జిత్తులమారి నక్క. అతన్ని పెళ్ళి చేసుకోడం కంటే ఉరెట్టుకోడం మంచిది." అపర్ణ సమాధానం విన్నారు శాంకరి, లత.

ముగ్గురూ చాలా సేపు ఆలోచించారు. అపర్ణకు ఎబార్షన్ చేయించ డానికి నిశ్చయించారు. ఆమె స్నేహితురాలు ఢిల్లీలో ఉంది. అపర్ణను అక్కడకు పంపించారు. ఆ విషయం అలా వారి ముగ్గురి మధ్యనే ఉండి పోయింది.

15 రోజుల తర్వాత అపర్ణ మామూలుగానే తిరిగి వచ్చింది. కాస్త నీరసపడింది జయరాంని ఎలా యిరికించాలా అని ఎదురు చూస్తు న్నారు ముగ్గురు.

అంతలో ఒకరోజు ఒకమ్మాయి జయరాంని వెతుక్కుంటూ వచ్చింది. ఆమెను చూసి విద్యార్థులంతగా పట్టించుకోలేదు.కాని శాంకరికి వాళ్ళకి అనుమానం పెరిగింది. ఆమెను హాస్టల్ రూముకు తీసుకెళ్ళి అడిగారు.

"సింహాచలం గుడిలో ఇద్దరం పెళ్ళిచేసుకున్నాం. ఆ విషయం మాయింట్లో వాళ్ళకి తెలియదు. మానాన్నగారికి తెలిస్తే చంపేస్తారు. అందుకే వేరుగా రూము అద్దెకు తీసుకుని కాపురం పెట్టాం. మావూరు వెళ్ళి వస్తానని చెప్పి యింతవరకు తిరిగి రాలేదు. అందుకే యిక్కడికి వచ్చాను?" ఆమె కళ్ళలో నీళ్ళు లేవు. ఆమె జయరాం సంగతి తెలి యక ధైర్యంగానే ఉంది.

"ఏం చదువుకున్నావు?" లత అడిగింది.

"బి. ఏ. పాసై బి.ఇడి చేసాను. ఇప్పుడు ప్రైవేటు స్కూల్లో టీచరుగా పనిచేస్తున్నాను."

"అయితే! మీ పెళ్ళికి ఇంకా ఎవరైనా వచ్చారా?" శాంకరి అడిగింది.

"ఆ! వచ్చారండీ! మాస్కూల్లో హెడ్ మాష్టరు వచ్చారు. జయరాం వద్దంటున్నా నేనే తీసుకువచ్చాను. జయరాం క్లాస్‌మేటు రజనీకాంత్ కూడా వచ్చాడు. వాళ్ళిద్దరూ ఉండగా మా పెళ్ళి జరిగింది! చెప్పడం మరిచిపోయాను నాపేరు రాధ."

మంచి పేరే అనుకున్నారు ముగ్గురు.

"జయరాం వాళ్ళ పూరు నుంచి వచ్చి అప్పుడే నెల రోజులయింది. మీకు తెలియదా!" లత అడిగింది.

"అలాగా! ఆమె మాటలు తడబడ్డాయి. మీకు జయరాం బాగా తెలుసా?" కంగారుగా అడిగింది.

"తెలీకేం తెలుసు. మా క్లాస్‌మీటే" అపర్ణ సమాధానమిచ్చింది. ఉష ఎందుకో తెలీక అపర్ణ వెంట వచ్చింది.

"ఈమె పేరు రాధ. ఈ వూళ్ళో ఒక స్కూల్లో టీచరుగా పని చేస్తోందిట. ఈమెని సింహాచలం కొండమీద జయరాం పెళ్ళి చేసుకున్నాట్ట" లత వివరంగా చెప్పింది.

"అదేమిటే! జయరాం భార్యా?" ఆశ్చర్యంగా అడిగింది ఉష. మేనమామ కూతురుతో పెళ్ళికి ముహూర్తాలు కూడా పెట్టారు అన్న విషయం పైకి చెప్పలేక పోయింది.

"మా అంకుల్‌కి లెటర్ రాస్తా"నంటూ ఉష వెళ్ళిపోయింది. ఇదే సమయమనుకున్న శాంకరి వాళ్ళు రాధను తీసుకుని ప్రిన్సిపాల్‌గారి దగ్గరకు వెళ్ళి జరిగిన సంగతంతా చెప్పారు. వెంటనే జయరాంని పిలిపించాడు.

రాధ సంగతి తెలియని జయరాం పరుగు పరుగున వచ్చాడు.

ఈమె నీకు తెలుసా?

"తెలీదండీ! నేనెప్పుడు చూడలేదు!" మొండిగా ప్రిన్సిపాల్‌గారికి సమాధానమిచ్చాడు.

జయరాం మాటలకి ఆయన ఆశ్చర్యపోయాడు. తర్వాత రాధ హెడ్‌మాస్టర్‌తో ఫోనులో మాట్లాడింది. ఆయన చూసినదంతా చెప్పారు. తర్వాత ప్రిన్సిపాల్‌గారు రజనీకాంత్‌కు కబురుచేశారు. అతను వెంటనే వచ్చి తాను విన్నది, చూసింది చెప్పాడు. రాధని జయరాం పెళ్ళి చేసుకున్నట్లుగా వేరుగా కాపురం పెట్టినట్లుగా ఋజువయింది.

జయరాం తండ్రితో ఫోనులో మాట్లాడాడు. రాధతో కాపురం చెయ్యని పక్షంలో కాలేజీనుంచి డిబార్ చేస్తామని బెదరించారాయన.

జయరాం భయపడి రాధతో కాపురం చెయ్యడానికి అంగీక రించాడు.

ఇప్పటికైనా జయరాం ఆటలు కట్టినందుకు శాంకరి, లత, అపర్ణ చాలా సంతోషించారు.

"మీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేనండీ. నా కాపురం నిల బెట్టారు. లేకపోతే ఆత్మహత్య చేసుకునేదాన్ని" అంది రాధ.

"అంత మాటనకు రాధా! అతని కోసమే కాదు నీ బ్రతుకుకోసం నువ్వు బ్రతుకటం నేర్చుకోవాలి. ఈ సమాజం కోసం బతకడం నేర్చు కోవాలి" శాంకరి సమాధానమిచ్చింది.

"మన కంటె గట్టిది రాధ! తన పని తాను సాధించుకుంది" శాంకరి మాటలకు "నిజమే!" అన్నారు, లత అపర్ణా ఒకేసారి.

"ముగ్గురం ఒకే పడవలో పయనిస్తున్నాం" అన్న శాంకరి మాటలు అపర్ణా, లతలకు అర్థంకాలేదు.

తన మనస్సులో మాట వారితో చెప్పలేక శాంకరి ఉక్కిరి బిక్కిరి అయింది.

"శివా సంగతి మళ్ళీ అడగాలనుకున్న అపర్ణా, లత శాంకరికి భయపడి వూరుకున్నారు. ఇద్దరి మధ్య ఏదో వుందని మాత్రం వారిద్ద రికి అనుమానముంది.

జయరాంకు చెప్పలేని కోపం వచ్చింది. అపర్ణను చంపాలన్నంత కోపం వచ్చింది. కాని చేసేదిలేక శాంకరిని చూసి పళ్ళు నూరుకున్నాడు. ప్రిన్సిపాల్‌గారు డిస్‌మిస్ చేస్తారన్న భయంతో రాధతో కాపురం చెయ్యడానికి అంగీకరించాడు. ఆ విషయం తెలిసిన జయరాం తండ్రి మసిగెత్తుకుంటూ వచ్చాడు.

"అప్రాచ్యుడా! ఎంత పని చేసావురా! మేనమామ డబ్బుతో చదు వుకుంటూ వాళ్ళ పిల్లను పెళ్ళి చేసుకుంటానని చెప్పి దాని గొంతు కోస్తావుకదరా! నీలాంటి వాళ్ళని ఏం చేసినా పాపం లేదురా!" అంటూ నానా తిట్లు తిట్టాడు.

అలాంటి వాటిని లెక్క చెయ్యని స్థితికి ఎదిగి పోయిన జయరాం తండ్రికి ఎదురు సమాధానం కూడా చెప్పలేదు.

ఆ తండ్రి కోపంతో మరింత రెచ్చిపోయి తిట్టినంత సేపు తిట్టాడు. చివరకు విసుగు వచ్చి తానే మొత్తుకున్నాడు. విసుగెత్తి వచ్చిన దారినే వెళ్ళిపోయాడు. కోపం వచ్చిన మేనమామ చదువుకు డబ్బు పంపించడం మానేసాడు. జయరాం ఫీజు రాధ కట్టడం ప్రారంభించింది.

ఆ విషయం తెలిసిన శాంకరి వాళ్ళు చాలా సంతోషించారు. పైగా ఒక ఆడపిల్ల కాపురం నిలబెట్టినందుకు మరింత సంతోషించారు.

మూడవ సంవత్సరం పరీక్షలు దగ్గరకు రావడంతో శాంకరి చదువులో నిమగ్నమయింది. ఈసారి శాంకరితో పాటు అపర్ణ, లత కూడా శ్రద్ధగా చదవడం మొదలు పెట్టారు.

## 63

రామనాధంగారి దగ్గరనుంచి ఒక రోజు ఉత్తరం వచ్చింది. అందరూ కులసాగానే వున్నారని శాంకరి పరీక్షలు కాగానే రమ్మని రాసారు.

పరీక్షలయినా ఎప్పుడు బయలు దేరేది తెలియదని శాంకరి తిరిగి సమాధానం రాసింది.

జగన్నాథంగారు చనిపోవడంతో సూర్యం వంటరివాడయ్యాడు. ఒక పక్క వ్యవసాయం, ఒకపక్క స్కూలు. అతనికి క్షణం తీరిక లేకుండా అయిపోయింది. కుట్టుమిషన్ క్లాసులు, లైబ్రేరి సంగతి పూర్తిగా కనకమే చూసుకుంటోంది.

కనకం చంటిపిల్లాడిని పూర్తిగా అత్తగారే చూసుకుంటోంది.

"కనకం! స్కూలు సంగతి కూడా నువ్వే చూసుకోవాలి, నాకు తీరిక దొరకడంలేదు" సూర్యం ఒక రోజు కనకంతో చెప్పాడు.

"అలాగే దానికేం! నేను చూసుకుంటా! కనకానికి మరింత సంతోషమనిపించింది.

"ఏమిటో! ఈ ఆడవాళ్ళు ఈ తిరగడాలు! ఈ రోజుల్లో ఆడవాళ్ళకి సిగ్గులే లేవు" కొంతమంది ఆడవాళ్ళు బుగ్గలు నొక్కుకుంటూనే వున్నారు.

"పనిపాటలు లేని ఆడవాళ్ళ ఆక్షేపణలని కనకానికి బాగా తెలుసు. పైగా బాధ్యత తెలియని అమ్మలక్కల పుక్కి మాటలని కనకం గ్రహించింది. అందుకు వాటిని లెక్క చెయ్యలేదు.

సుశీలకు కబురు చేసి కుట్టు మిషన్ క్లాసుల బాధ్యత అప్ప చెప్పింది. సుశీలకు చాలా సంతోషమనిపించింది. సుశీలకు మెట్రిక్ పరీక్షలు దగ్గరకు వచ్చాయి. రాత్రి పగలు చదువుతూనే వుంది. వయస్సు మరీ పైబడకపోయినా సమస్యల వలయంలో ఆమె మనస్సు చిక్కుకుపోయింది.

ఆసలే మొద్దు బుర్ర మూలంగా జ్ఞాపకశక్తి మరెంత తగ్గిపోయింది. అందుకే మరింత శ్రద్ధగా చదివింది. ఆరోజే రాజమండ్రి ప్రయాణం. రామనాధంగారు కూడా వెంట వెడుతున్నారు.

అప్పుడే కనకం అక్కడకు వచ్చింది సుశీలా! ఒక్క నిమిషం ఆగు అంది. కనకం గబగబ యింటికి వెళ్ళి తిరిగి వచ్చింది.

కనకం ఎందుకు ఆగమందో సుశీలకు తెలియలేదు. అన్నపూర్ణమ్మగారు కూడా తెలియక నిలబడింది.

కనకం సుశీలకు దగ్గరగా వెళ్ళి చేతిలో ఉన్న తిలకం సీసా తీసి ఆమె నుదుట బొట్టు పెట్టింది.

సుశీల చటుక్కున చేత్తో తుడుచుకోపోయింది. ఆమె చెయ్యి గట్టిగా పట్టుకుంది కనకం.

"సుశీలా బొట్టు చెరపకు. నువ్వు పరీక్ష రాయడానికి పట్నం వెడుతున్నావు. అంతమందిలో నువ్వు భర్త లేని దానివని తెలియాలా? అక్కడెవ్వరూ నీలా ఉండరు. సుశీలా! అంతమందిలో కలిసిపోయేటట్టు వుండాలి! తెలిసిందా! బొట్టు చెరుపుకుంటే నామీద ఒట్టే! ఇదిగో ఇది దగ్గర పెట్టుకో!" సుశీల చేతిలో పెట్టింది తిలకం సీసా.

సుశీల వెక్కి వెక్కి ఏడ్చింది. అన్నపూర్ణమ్మగారికి కూడా దుఃఖం ఆగలేదు.

"సుశీలా! ఏడవకు! నువ్వు చేసింది తప్పేమి కాదు! నీళ్ళుపోసుకుంటున్నావు, అన్నం తింటున్నావు, చదువుకుంటున్నావు, మిషను కుడుతున్నావు. అతను లేడని ఏది మానేశావు? అతనితో నీ నుదుటి బొట్టురాలేదు! అతనితో ఎందుకు పోతుంది? ఈవేళ కొత్త! రేపు మామూలైపోతుంది. బాధపడకు" కనకం దగ్గరకు వెళ్ళి సుశీల భుజం మీద చెయ్యి వేసి నచ్చచెప్పింది.

"అవునమ్మా! కనకం చెప్పింది నిజం. అలాగే చెయ్యి. కాదనకు" రామనాథంగారు కూడా కనకం మాటలు సమర్థించారు. తనకంటే చిన్నదైనా తనకంటే ఎన్నోరెట్లు ఎదిగిపోయిన కనకాన్ని మనస్సులోనే అభినందించింది సుశీల.

అన్నపూర్ణమ్మగారు కనకాన్ని వింతగా చూసింది. తనకు తెలియని విషయాలు కూడా ఆ పిల్లకు ఎలా తెలిసాయో? ఆ పిల్లలో సంస్కారం, తెగింపు ఉంది. తనలో అవి లేవు అనుకుంది.

నుదుట తిలకం బొట్టుతో సుశీల ముఖం కళకళలాడింది. చేతిలో పుస్తకాల సంచితో రిక్షా ఎక్కుతున్న సుశీలకు మంచిరోజులు వస్తున్నాయనుకుంది ఆ తల్లి. ఆ కడుపు తీపి ఎవరు అర్థం చేసుకోగలరు?

పరీక్షలు బాగా రాసి వచ్చింది సుశీల. ఆమెలో కొత్త ఉత్సాహం మొలకెత్తింది. సుశీలకు మరో జన్మ ఎత్తినట్లయింది. పిల్లలను మరింత శ్రద్ధగా చదివిస్తోంది. పినతల్లిని చూస్తే భయపడే పిల్లలు తల్లిని చూసి కూడా భయపడుతున్నారు. పిల్లల విషయంలోనే కాదు ఇంటి విషయంలో కూడా జాగ్రత్త పడింది సుశీల. పొదుపుచెయ్యడం నేర్చుకుంది. పైగా అన్ని పనుల్లోను తల్లికి చేదోడువాదోడుగా ఉంటోంది. అన్నపూర్ణమ్మగారికి విశ్రాంతి దొరికింది.

# 64

పరీక్షలు కాగానే శాంకరి బయలుదేరి వచ్చింది. యింటి పరిస్థితిని చూసి చాలా సంతోషించింది. అప్పటికే జూన్ నెల రావడంవల్ల కనకం స్కూలు తెరిచింది. "శాంకరీ! సుశీలక్కని స్కూల్లో క్లర్కుగా వేస్తాను. స్కూలు లెక్కలు, వ్యవహారాలన్నీ చూసుకుంటుంది." కనకం మాటలు ఆశ్చర్యంగా వింది శాంకరి.

"నువ్వన్నది నిజమే కనకం. రేపటినుంచి రమ్మని చెబుదాం!" శాంకరికి చాలా సంతృప్తి అనిపించింది.

ఒక పక్క బట్టలు కుట్టి రాజమండ్రి పంపిస్తోంది. మరో పక్క ఉద్యోగం! వయసు వస్తున్న తండ్రికి యిబ్బంది లేదనుకుంది శాంకరి. మరునాడు స్కూలుకు వెళ్ళింది సుశీల. ఆమెకు చెప్పలేని సంతోషం కలిగింది. కుర్చీలో కూర్చుని పక్కనున్న సీనియర్ క్లర్కు చెప్పినట్లుగా వర్కు ప్రారంభించింది.

సుశీల చెల్లెలు శాంకరిని చూసి ఆరోజు సిగ్గు పడింది. తనతో పాటు ఒకే తల్లి కడుపున పుట్టింది శాంకరి. తనకంటే వయస్సులో చిన్నది. కాని తనకంటే ఎన్నో రెట్లు తెలివైంది. చురుకైంది. అంత తెలివితేటలు తనకు లేకపోయినా ఆమె చేసేపనికి సహకరించాలని నిర్ణయించుకుంది.

"కనకం! నువ్వు బి.ఎ. ప్రైవేటుగా చదవచ్చు కదా!" శాంకరి సీరియస్‌గా అడిగింది.

"చదవచ్చు! నాకూ చదవాలనే ఉంది. పైగా సుశీలను ఇంటర్ చదవమందాం!"

"అలాగే కనకం! అదే మంచి పద్ధతి. మా అక్కకి కూడా చదవాలనే ఉంది. చదువుతుంది కూడా!"

శాంకరి వచ్చిందని తెలిసిన కాసులు, సుబ్బులు రెక్కలు కట్టుకువాలారు. సుబ్బులు కూతుర్ని ఎత్తుకుని వచ్చింది.

"సుబ్బూ! నీ కూతురు పేరేమిటే? మర్చిపోయాను" శాంకరి అడిగింది.

"ఈ రోజు నా కూతురు పేరు మర్చిపోయావు? రేపు నా పేరే మర్చిపోయానంటావు?"

"ఇంతకీ నీ కూతురు పేరు చెబుతావా లేదా?" శాంకరి కోపం చేసింది.

"చెప్పకేం చేస్తాను. చెబుతాను. నా కూతురు పేరు నీలిమ?"

నీకే కూతురు పుట్టిందని మురిసిపోకే? తల్లి! ఏదీ నీ కూతుర్ని యిలాతే?" కాసులు పిల్లను అందుకుంది.

"నీ కొడుకుని తీసుకు రావేమే? అరిగిపోతాడా?"

"అరిగిపోతాడని కాదు సుబ్బూ! మన్ని అరగ తీసేస్తాడని" కనకం మాటలకి అందరికీ నవ్వు వచ్చింది.

నలుగురు స్కూలు వైపు బయలు దేరారు.

"పిల్లని యిలా ఇచ్చి వెళ్ళమ్మా! ఊరంతా ఆ పిల్లను ఎందుకు తిప్పుతారు?" అన్నపూర్ణమ్మ అలా అనగానే సుబ్బులు ఆమెకు పిల్ల నందించి బయలు దేరింది.

"త్వరగా వచ్చేద్దామే! మా అమ్మాయి ఏడుస్తుంది"

"సుబ్బూ! నువ్వసలు మాతోరాకు. నువ్విక్కడే వుండు" కాసులు మాటలకి సుబ్బులు నవ్వి వాళ్ళ వెంట బయలుదేరింది.

అప్పటికే వర్షాలు ప్రారంభమయ్యాయి. ఊరంతా బురద బురదగా ఉంది. వేసిన కంకర రోడ్లు ఎప్పుడో కొట్టుకుపోయాయి.

"కనకం! ఈ రోడ్ల సంగతి చూడాలే! ఈసారి పంచాయతీ ఎన్నికలతో సూర్యాన్ని గెలిపించాలి. అప్పటివరకు రోడ్లు బాగుపడవు?" శాంకరి మాటలకు అందరు చప్పట్లు కొట్టారు.

సూర్యాన్ని పంచాయతీ బోర్డు ఎన్నికలలో నిలబడాలని టుప వట్టారు.

"నాకు తీరిక లేదు శాంకరీ" సూర్యం తప్పించుకోవాలని ప్రయత్నించాడు.

సూర్యం వ్యవసాయంలో మునిగిపోయాడు. తండ్రిపోయిన తరువాత ఒక్కడూ వ్యవసాయం చేయడం కష్టంగానే వుంది. రామనాథం గారు కూడా అతనికి సహాయం చేస్తున్నారు? సూర్యం భూములు, శివ భూములు, రామనాథంగారి భూములు కలిపే వ్యవసాయం చేస్తున్నారు. దాని మూలంగా సూర్యానికి తీరికే లేదు.

రామనాథంగారు కూడా సూర్యాన్ని ఎలక్షన్స్‌లో నిలబడలాని సలహా యిచ్చారు.

"నువ్వు ఎన్నికల్లో నిలబడనంటే చెప్పు. కనకాన్ని నించో పెడతాం" శాంకారి బెదిరించింది.

"అలాగే! నేనే నిలబడతాలే?"

"ఇదిగో ముందు రోడ్డు వెయ్యాలి. లేకపోతే ఈ పంచాయితీ బోర్డు వేస్టు"

"అలాగే శాంకరీ! తప్పకుండా ముందు రోడ్లే వేయిస్తా!"సూర్యం వాగ్దానం చేశాడు.

కనకం, సుశీల చదువుల సంగతి సూర్యానికి మరోసారి చెప్పింది శాంకరి.

తప్పకుండా చూస్తానన్నాడు సూర్యం.

అందరిని వైజాగ్ రమ్మని చెప్పింది శాంకరి. శలవులు అయి పోవడంవల్ల వైజాగ్ బయలుదేరింది శాంకరి.

అన్నపూర్ణమ్మగారి కళ్ళలో నీళ్ళు నిలిచాయి. సుబ్బులు, కాసులు ఆమె వెంటే బయలుదేరారు.

రాజమండ్రిలో శాంకరిని రైలు ఎక్కించారు. అదే రైల్లోకాసులు కాకినాడ బయలుదేరింది. సుబ్బులు మాత్రం బస్సు ఎక్కింది. శాంకరి వెళ్ళిన తరువాత యిల్లంతా చిన్నబోయిందని బాధ పడింది సుశీల.

"అసలు పూరే చిన్నబోయింది" ఆ మాట అంటుంటే కనకం కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

# 65

"శాంకరీ! రోజులు ఎలా గడిచిపోతున్నాయో చూసావా? అప్పుడే నాలుగో సం॥లోకి వచ్చేసాం" "ఏం! అపర్ణా! నాలుగో సం॥లోకి వచ్చేమని బెంగగా వుందా? ఓ సంవత్సరం ఫెయిలై ఏ రెండో సం॥లోనో ఉంటే బాగుండేదా" లత అడిగింది.

"అదికాదు లతా నేననేది. మనం కలుసుకుని నాలుగు సం॥లు అవుతోంది కదా! నాలుగేళ్ళు ఈ రూములోనే ఉన్నాం. ఆ రూముల వాళ్ళు కూడు అటునుంచి ఇటుకి, ఇటునించి అటుకి మారిపోతూ ఉంటారు. అందుకని అంటున్నా."

"అయితే వాళ్ళలా మనంకూడా కొట్లాడుకోవాలనా!"

"నీతో ఏం మాట్లాడినా తంటాయే? చూసావా శాంకరీ! ఈ లత ఎలా అంటోందో"

"లతా, పుస్తకం తీసి చదువు? ఆ అపర్ణతో వాదనెందుకూ? అయినా అపర్ణా! చదువుకోక ఇప్పుడు ఆ గొడవలన్నీ ఎందుకు" శాంకరి ఇద్దరిని కోపం చేసింది.

ఇద్దరూ బుద్ధిమంతుల్లా పుస్తకాలు తీసి చదవడం మొదలు పెట్టారు.

"శాంకరీ! కొంపమునిగింది." ఉష పరుగెత్తుకుంటూ వచ్చింది.

"ఉషా! ఏం జరిగింది?" శాంకరి మంచం మీద నుంచి దిగింది.

"రాధ ఆత్మహత్య చేసుకుంది."

"ఆత్మహత్యా! ఎందుకు?" లత, అపర్ణ చేతిలో పుస్తకాలు పక్కన పడేసి కంగారుగా అడిగారు.

"ఇంకా తెలియదు. అందరు అక్కడికే వెడుతున్నారు. మనం కూడా వెడదాం" ఉష తొందర చేసింది.

"ఉషా! జయరాం మీ కజినే కదా! నీ కేమీ తెలియదా!" శాంకరి అడిగింది.

బహుశా జయరాం మూలంగానే చనిపోయివుంటుంది. రాధ చాలా మంచి పిల్ల" మనసులో అనుకుంది శాంకరి.

"నాకూ తెలియదు శాంకరీ! అసలు జయరాం నాకి మధ్య కలవ లేదు. మొన్న రాధ కలిసింది. బాగానే ఉన్నామంది. కాస్త చిక్కింది. అంతే"

నలుగురు కలిసి అటువెళ్ళారు. ఇంటి చుట్టూ పోలీసులు. జయరాం శవం దగ్గర కూర్చుని ఏడుస్తున్నాడు. అతని వెనక మేన మామ, తండ్రి కూర్చుని జయరాంని ఓదార్చుతున్నారు. రాధ తండ్రి మాత్రం పిచ్చిగంతులు వేస్తు ఏడుస్తూ.

"వీడి అంతు తేలుస్తా! వీణ్ణి జైలుపాలు చేస్తా. వీణ్ణి కోర్టు కెక్కిస్తా" అంటూ అరుస్తున్నాడు.

"బతికుండగా కూతురు ముఖం చూడని నువ్వు అతని అంతేం తేలుస్తావయ్యా! అసలు నీకేం అధికారముందయ్యా!" ఇంటావిడ తండ్రి మీద అరిచింది.

"నా కూతురు పోయి నేనేడుస్తుంటే నువ్వెవరి వమ్మా! గట్టిగా వాగావంటే నీ అంతు తేలుస్తా"

"ఉండవయ్యా! మధ్యలో నీగోలేమిటి?" పోలీసులు కోపం చెయ్య దంతో అతను నోరు మూసుకున్నాడు.

"డబ్బుకోసమండి. అతని చేతిలో 5 వేలు పడేయండి. కేసు లేదు ఏమీ లేదు? అతను వెళ్ళిపోతాడు" అంటున్నారు ఒకరు.

అసలు అతను నిజంగా రాధకి తండ్రేనా!" మరొకరు అడిగారు.

"ఆ తండ్రేనండి. ఈ రోజుల్లో ఉద్యోగం లేని తండ్రులకి ఇదో సంపాదన. కూతురు బతికుండగా మొహం చూడరు. చచ్చిన తరువాత కేసు పెడతామని బెదిరించి డబ్బులు గుంజుతారు." మరొకరి సమా ధానం.

ఆ మాటలు విన్న శాంకరి ఆశ్చర్యపోయింది.

"ఉషా ఆ మాటలు నిజమా! అలాంటి తల్లితండ్రు లుంటారా?"

"శాంకరీ! ఎందుకుండరు. వాళ్ళూ మనుష్యులేగా!" ఉష సమాధానం విని శాంకరి "ఛీ! ఛీ! వీళ్ళు తల్లిదండ్రులేనా! కూతురు శవాన్ని కూడా అమ్ముకుంటున్నారు నీచులు" చీదరించుకుంది.

శవాన్ని పోస్టుమార్టంకి తీసుకెడుతున్నారు. జనం చాలా మంది వెంట కదులుతున్నారు. జయరాం గొల్లుమన్నాడు.

"పోలీసుల చేతుల్లో ఓ 5 వేలు పడేయండి కేసు ఉండదు" ఒకతను జయరాం తండ్రికి సలహా యిచ్చాడు.

ఆ మాటలు విని మరింత ఆశ్చర్యపోయింది శాంకరి.

ఆయన లేచివచ్చి పోలీసు వాళ్ళతో మాట్లాడడం కూడా శాంకరి వాళ్ళు చూసారు. శాంకరి చూస్తూ వుండలేక పోయింది.

"ఏమండీ రాధ చనిపోతూ ఏమైనా చెప్పిందా" పోలీసు ఇన్‌స్పెక్టర్ని కలిసి అడిగింది.

"అవునమ్మా! నామరణానికి నేనే కారణమని చెప్పింది"

"మీరు నమ్ముతున్నారా! ఇన్‌స్పెక్టరుగారు?" శాంకరి తిరిగి అడిగింది.

"మాకూ నమ్మకంలేదు. కాని ఆమెమాటలు నమ్మాలికదమ్మా!" ఆయన చేతుల్లో ఏమీ లేనట్టు సమాధానమిచ్చాడు.

"ఆమె మీద కిరసనాయిలు పోసి అగ్గిపుల్ల గీస్తుంటే మేం చూసాం" పక్కింటి అబ్బాయి గట్టిగా అరిచాడు.

"నేనసలు యింట్లో లేను. ఇప్పుడే వచ్చాను. నేను వచ్చేటప్పటికి ఈ దారుణం జరిగిపోయింది" వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు జయరాం.

"ఏంనాయనా! కిరసనాయిలు పోసింది యితనా!"

ఇన్‌స్పెక్టరు ఆ పక్కింటి అబ్బాయిని అడిగాడు.

"అతను కాదండి. అతను ఫాంటు షర్టు వేసుకుని వున్నాడు. ఆ పిల్ల అరుపులువిని పరుగెత్తుకుంటూ వచ్చాం! అతను గేటు తీసుకు వెడుతుంటే మేం చూసాం" తిరిగి అబ్బాయి వివరంగా చెప్పాడు.

పోలీసు ఇన్‌స్పెక్టరు అయోమయంలో పడ్డాడు.

కేసు అంతు చిక్కలేదు. పోస్టుమార్టం రిపోర్టు వచ్చింది.

"ఎవరో బలవంతంగా విషం తాగించి చంపారు. తర్వాత అనుమానం రాకుండా కిరసనాయిలు పోసి అంటించారు."

శాంకరి వాళ్ళు కోపంతో పళ్ళునూరుకున్నారు. కాని ఏమీ చెయ్యలేక పోయారు. అంతలో రాధ తల్లి ఏడుస్తూ వచ్చింది.

కూతురు శవం మీద పడి బావురుమంది.

"తల్లీ! పెళ్ళికూతురుగా సారె పెట్టి పంపవలసిన నిన్ను నీ తండ్రి కట్టు బట్టలతో యింట్లోంచి తరిమేశాడే! అయినా దొంగచాటుగా వచ్చి నిన్ను చూసిపోతున్నానే తల్లీ! నువ్వు బావిపడ్డావంటే నేనెలా బతికి వుండాలే" అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది. ఆ ఏడుపుకి బండ లాంటి జయరాం తండ్రి కళ్ళలో నీళ్ళు నిలిచాయి. పెద్దపులిలాంటి మేనమామ గుడ్లలో నీళ్ళుకారాయి.

శాంకరి కన్నీళ్ళు తుడుచుకుంది. ఉష, లత, అపర్ణలు వెక్కి వెక్కి ఏడ్చారు.

జయరాం చంపించాడేమో అనుకున్నారు కొందరు. ఒకవేళ జయరాం లేకుండా వాళ్ళ మామ, నాన్న కలిసి ఎవరిచేతనైనా చంపించి వుండాలనుకున్నారు శాంకరి వాళ్ళు.

శాంకరి వాళ్ళు రూముకు తిరిగి వచ్చేశారు. ఆరాత్రి శాంకరి వాళ్ళు నిద్రపోలేదు. రాధను గురించి కథలు చెప్పుకుంటూనే వున్నారు.

"జయరాం ఆరాత్రి వూళ్ళోనే వున్నాడుట. ఎవరికో డబ్బిచ్చి చంపించాడుట. వాళ్ళనాన్న జయరాంని తిడుతుంటే విన్నారుటండీ!" ఎవరో వచ్చి చెప్పారు.

శాంకరి ఆ మాటలు నమ్మలేక పోయింది.

"కాదు శాంకరి! జయరాం చంపాడుట. ఆమెకు విషపు ఇంజక్షన్ ఇచ్చాడుట. తర్వాత అనుమానం రాకుండా కిరసనాయిలు పోసాడుట."

శాంకరి కోపంతో కనిపించింది. మహిళా సంఘాలు ముందుకు వచ్చాయి. కేసుపై ఎంక్వైరీ చేయించాలన్నారు. కమీషన్ వేయించా అన్నారు.

"రాధను చంపిన జయరాంకు శిక్షపడాలి. హంతకుణ్ణి శిక్షించాలి" అంటూ పోలీసు స్టేషను ఎదురుగా నినాదాలు చేసి సమ్మె చేసారు.

కేసు మొదటికి వచ్చింది. పోస్టుమార్టం రిపోర్టు రాసిన డాక్టర్ని పట్టుకున్నారు. ఆయన తాను రాసిచ్చిన రిపోర్టు వేరుగా వుందన్నారు. విషంవల్లే ఆమె మరణించిదన్నారు. డబ్బుకు కక్కుర్తిపడ్డమధ్య వారెవరో కేసును తారుమారు చేశారు. జయరాం తండ్రి దోషిగా నిరూపించబడ్డాడు. రాధ చనిపోతూ ఏమీ చెప్పలేదు. ఆమె ముందుగానే చనిపోయింది. అందరి వూహాగానాలు తారుమారు అయ్యాయి. జయరాం తండ్రిని అరెస్టు చేసి తీసుకెడుతుంటే ఆ పక్కింటి అబ్బాయి పరుగెత్తుకుంటూ వచ్చాడు.

"ఈయనేనండీ! ఆరోజు గేటు తీసుకు పారిపోయింది" అన్నాడు.

"ఆ రోజు ఎందుకు గుర్తుపట్టలేదు" ఇన్స్పెక్టరు అడిగాడు.

"ఆ రోజు ఆయన పైజామాలాల్చీ వేసుకున్నారు అందుకు గుర్తుపట్టలేదు. ఈ రోజు ఫాంటులో వున్నాడు. పారిపోయిన రోజున కూడా ఇలాగే వున్నాడు. అందుకే గుర్తు పట్టాను"

కేసు విచారణ జరిగింది. జయరాం తండ్రి చంపినట్లు నిర్ధారణయింది. ఆయన కాఫీలో విషం కలిపి ఆమెచేత బలవంతంగా తాగించాడు. ఆమె వాంతులు చేసుకుంది. చనిపోదేమోనని భయపడి కిరసనాయిలు పోసి అంటించినట్లు ఆయనే కోర్టులో ఒప్పుకున్నాడు. కోర్టువారు ఆయనకు యావజ్జీవకారాగార శిక్ష విధించారు. మహిళా సంఘాలవారు విజయం సాధించినందుకు సంతోషించారు.

"రాధ బతికిరాదుగా! చనిపోయాక ఈ కేసులన్నీ ఎందుకు?" మహిళా సంఘాల వారిని ప్రశ్నించారు.

"మరెవరు? ఎప్పుడు? ఇటువంటి నేరం చెయ్యకుండా విధిగా శిక్ష ఉంటే అదుపులేని సింహాలు కూడా దారికివస్తాయి."

వారి సమాధానం అందరికీ తృప్తినిచ్చింది.

ఆ రాత్రి శాంకరి వాళ్ళు మహిళా సంఘాల విజయాన్ని తలుచుకుంటూ పడుకున్నారు. కాని అంతలోనే వారికి రాధ గుర్తుకు వచ్చింది. బాధతో గుండెలు బరువెక్కాయి.

"జయరాం ప్రమేయం లేకుండా రాధను చంపడం కష్టం. జయరాం రాధ కోసం ఏడవడం నటనై ఉంటుంది." శాంకరి మాటలు. మిగిలిన వారు సమర్థించారు.

"వాళ్ళ మేనమామ కూతురు నిచ్చి పెళ్ళి చెయ్యడానికే ఈ పని చేసుంటారు."

"అదే నిజమై ఉంటుంది. ఏదైనా అపర్ణ అతని బారినుండి తప్పించుకుంది. అయినా జాగ్రత్తగా ఉండడం మంచిది. పైగా అతనికి చాలా దూరంలో ఉండాలి?"

"ఇంకా అతనితో స్నేహమా శాంకరి! అతను మేక వన్నె పులి? పయోముఖ విషకుంభము?"

"అబ్బా అపర్ణా! ఇంకా నీకు చిన్నయసూరి మిత్రలాభం గుర్తుందన్న మాట."

"గుర్తుంది లతా! జీవితంలో బాగా గుర్తుంచుకోవలసిన పాఠాలు అవి" అపర్ణ తల వంచుకుంది. ఆమె కళ్ళమ్మట నీళ్ళు కారాయి.

"అదేమిటి అపర్ణా! ఛా! ఛా! చిన్నపిల్లలా ఆ ఏడుపేమిటి?" శాంకరి మందలించింది.

"ఇది చిన్నపిల్లల ఏడుపుకాదు శాంకరీ! పెద్దదానిలాగే ఏడుస్తున్నాను. పైకి నవ్వుతూ తిరుగుతున్నాను. ఎందుకో తెలుసా? ఏడవలేక ఎంత బాధపడుతూ ఎబార్షన్ చేయించుకున్నానో తెలుసా? లోకంతో బ్రతికి రాజీపడలేక? అక్రమ సంబంధాన్ని నా కడుపులో మోస్తూ సమా-

జాన్ని ఎదిరించి బ్రతకలేక? జీవితాంతం ఈ సమాజాం నన్ను చంపుకు తింటుంది కనుక. చచ్చి బతుకుతున్నాను. బతికి చస్తున్నాను. ఇది నిజం శాంకరి?''

నవ్వుతూ తిరిగే అపర్ణ అంత లోతుగా ఆలోచిస్తుందని శాంకరి, లత వూహించలేకపోయారు. ఆమెను ఓదార్చడం తెలియక తికమక పడ్డారు. అయినా ఏదో ఒకటి అనకుండా వుండలేరు కదా?

"అపర్ణా! జరిగిన దానికి బాధపడుతూ కూర్చుంటే చేసేదేమి లేదు కదా? అందుకే నీ తప్పులేదు కదా! అతను మోసకాడని నీకు తెలియదు కదా!''

"అందులో నా తప్పు ఉంది శాంకరి. అతనికెంత బాధ్యతఉందో నాకూ అంతే బాధ్యత ఉంది. పెళ్ళి కాకుండా పరాయి మగవాడితో తిరగడం నాదే తప్పు. ఏదో తెలియని కోరిక నన్ను తొందర పెట్టింది? కాలుజారినందుకు ఫలితం అనుభవిస్తున్నా''

"పిచ్చిదానా! అనుభవం ఇద్దరికీ ఒకటే! అతనికి లేని బాధ నీకెందుకు''

"అతనికి బాధ ఉండదు. అతను కావాలని మోసం చేసాడు. నేను తెలియక మోసపోయాను. అందుకే బాధ''

"పశ్చాత్తాపాన్ని మించినది మరొక్కటి లేదు. అదే పాపానికి ప్రక్షాళనం. మనిషి తిరిగి మనిషిగా నిలబడతాడు. నీ విషయంలో కూడా అంతే? ఆడపిల్ల లెవరు ఈ తప్పు చెయ్యకుండా వారికి తెలియ చెప్పాలి? అది మన బాధ్యత అపర్ణా!''

"శాంకరీ నువ్వు భ్రమపడుతున్నావు! ఆడపిల్లలు తెలియకకాదు. తెలిసే చేస్తారని నా నమ్మకం. లోకానికి తెలియదని వారి నమ్మకం. వయసులో ఉన్న ఆడ మగా కలిస్తే తొందర బాట్లు తప్పవేమో? పైకి వచ్చేవి కొన్ని పైకి రానివి కొన్ని. కాని కొందరు అవకాశాన్ని జాగ్రత్తగా ఉపయోగించుకుంటారు. కొందరు తొందరబడతారు. నా విషయంలో అదే జరిగింది. అందుకే ఈ బాధ.''

"అపర్ణా! నీబాధ చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్లుంది. ఇంక గతం మర్చిపో! వర్తమానంలో నుంచి భవిష్యత్తు వైపు కదులు. వెలుగు వాకిలి సృష్టించుకో?"

"అందుకే ప్రయత్నం చేస్తున్నా శాంకరి!"

"అపర్ణా! ఎక్కువ ఆలోచించకు! చదువు సంగతి చూసుకో!"

"ప్రయత్నిస్తా!" నిట్టూర్పు విడిచింది శాంకరి.

ఎప్పటికో నిద్ర పట్టింది ముగ్గురికి.

జయరాంని వాళ్ళ మేనమామ వాళ్ళ వూరు తీసుకు వెళ్ళిపోయాడు. అంతా మర్చిపోయి శాంకరి వాళ్ళు క్లాసులకు ప్రాక్టికల్స్‌కు వెళ్ళి వస్తున్నారు. ఆ చదువులో పడి శివా సంగతే మర్చిపోయింది శాంకరి.

"శాంకరీ! జయరాం మామయ్య కూతురు ఎవరినో పెళ్ళి చేసుకుందిట. ఏమైనా సరే జయరాంని పెళ్ళి చేసుకోనందిట." ఒక రోజు ఉషా వచ్చి చెప్పింది.

"ఆడవాళ్ళను మోసం చెయ్యడంలో మొనగాడని ఆమెకు బాగా తెలిసుంటుంది ఉషా."

"అది నిజమేయ్యై ఉంటుంది శాంకరి"

"అలాంటి వాళ్ళకి అలాగే జరగాలి ఉషా. లత పళ్ళు నూరింది.

అపర్ణ మాత్రం వాళ్ళ మాటలు వింటూ అలాగే వుండిపోయింది.

# 66

సూర్యం పంచాయతీ ఎలక్షన్స్‌లో ఓడిపోయాడు. ఓడిపోతానని అతనూ అనుకోలేదు. పైగా అతనికి పోటీ చెయ్యాలని లేక పోయినా అందరూ కలిసి బలవంతంగా నుంచోపెట్టారు. తీరా ఓడిపొయ్యేటప్పటికి అతనికి చాలా బాధనిపించింది. ఒకపక్క వ్యవసాయం

మరింత కష్టంగా ఉంది. పెట్టుబడికే చాలా అవుతోంది. పెట్టుబడికి తగినంత పంట చేతికి అందడంలేదు. వానలు, వరదలు, గాలివానలు దాటి చేను పంటకు వస్తే ఏదో ఒక తెగులుపట్టుకుని పంట నాశనమవు తోంది. దానితో అతనికి మరింత చికాగ్గా ఉంది. అయినా లేని ఉత్సాహం తెచ్చుకుని వ్యవసాయం చేస్తున్నాడు. రామనాథంగారు కూడా సూర్యానికి కుడి భుజంలా నిలబడి సహాయం చేస్తున్నాడు. శివా భూములు, సూర్యం భూములు, రామనాథంగారికి భూములు కలిపే వ్యవసాయం చేస్తున్నారు. రామనాథంగారి రెండు, మూడు ఎకరాలు మాత్రమే భూమి ఉంది. అప్పుకూడా బాగానే వుంది. ఏ అవసర మొచ్చినా సూర్యమే డబ్బు సర్దుబాటు చేస్తున్నాడు.

"అప్పుకు ఆస్తికి సరి పడుతుంది. ఆ ఉన్న భూమికూడా స్వార్థం పరమే అవుతుంది." అని చెప్పుకోడం రామనాథంగారి చెవిని పడుతూనే వుంది.

అలాంటి వాటిని లెక్కచెయ్యడం ఆయన ఎప్పుడో మానేసాడు. అందుకే హాయిగా తిరుగుతున్నాడు.

వెనక ఆస్తి మిగిల్చి పిల్లలకి యివ్వాలనే కోరిక అయనకు లేదు. పైగా ఒక్కడే మగ పిల్లాడు. వాడికి పెద్ద చదువు చెప్పిస్తే మంచి ఉద్యోగం దొరకుతుందని ఆయన ఆశ. పైగా శాంకరి పెద్ద చదువు చదువుతోంది. ఆ పిల్ల సంసారాన్ని ఆదుకోక పోయినా హాయిగా బతుకుతుందని ఆశ. అమాయకురాలైన సుశీలకి తగని కష్టం వచ్చినా ఆ పిల్ల ఓదారికి వస్తున్నందుకు అతనికి లోపలకాస్త సంతృప్తిగానే వుంది. అందుకే జీవితాన్ని నెట్టుకొస్తున్నారు.

కనకం బి.ఎ. పరీక్ష కట్టింది కానీ రాయలేకపోయింది. ఒక పక్క చంటి పిల్లాడు, అత్తగారు మనవడిని చూసుకుంటున్నా కనకానికి యింట్లో పని ఎక్కువగానే వుంది. పిల్లాడిని ఎత్తుకోడానికి వేరుగా మనిషిని పెట్టారు. అయినా ఒకపక్క స్కూలు. ఒకపక్క కుట్టు క్లాసులు మరొపక్క లైబ్రేరీ. కనకానికి వీటిని చూడ్డానికే సమయం

చాలడం లేదు. సుశీల ఆమెకు అన్ని విధాల సహకరిస్తోంది. స్కూల్లో, కుట్టు మిషనుదగ్గర కూడా చేదోడుగా వుంటోంది. అయినా కనకానికి పని ఎక్కువగానే వుంది. అందుకే ఒకేసారి అన్ని సంవత్సరాల పరీక్షలు రాయాలనుకుంది. కాని తీరిక తెచ్చుకుని చదువుకోలేకపోయింది. అత్తగారు పిల్లవాడి సంగతి పూర్తిగా చూసుకుంటోంది. వంటలో కూడా కోడలికి సహకరిస్తోంది. సుశీల కూడా ఆ సంవత్సరం ఇంటర్ పరీక్షలు రాయలేక పోయింది. రెండు సంవత్సరాలకి కలిపి ఒకేసారి యివ్వాలనుకుంది. వీళ్ళను చూసిన కొందరు ఆడపిల్లలు కూడా బి.ఏ. ప్రవేటుగా కట్టి చదువుతున్నారు.

కాసులు, సుబ్బులు సంక్రాంతికి వచ్చారు. పండక్కి శాంకరి తప్పకుండా వస్తుందని వారి ఆశ. కాని శాంకరి రాలేదు. వాళ్ళకి చాలా నిరుత్సాహమొచ్చింది. కాసులు కూడా బి.ఎ. ప్రవేటుగా చదువుతోంది, సుబ్బులు కుతూరు మాత్రం చాలా ముద్దుగా వుంది. సుబ్బులికి, కాసులుకి కూడా మిషను కుట్టురాదు. వచ్చినప్పుడల్లా వెళ్ళి కటింగ్స్, కుట్టడం నేర్చుకుంటున్నారు. సుబ్బులు కూతురు గౌనులు కుట్టడం, జాకెట్లు కుట్టడం నేర్చుకుంది.

"కనకం! శివా సంగతి ఏమైనా తెలిసిందా!" కాసులు అడిగింది.

"తెలీ కేం! ఫారిన్‌లో వున్నాడుగా పి. హెచ్.డి చేస్తున్నాడు"

"అదిసరే కనకం! శాంకరి శివాల పెళ్ళి సంగతేమిటని."

"అదే నాకు తెలీడం లేదు. ఎవరికీ చెప్పకుండా శివా ఫారిన్ వెళ్ళిపోయాడు."

"శాంకరి పైకి అనకపోయినా శివా అంటే లోపల యిష్టమే! చదువు అయ్యాక పెళ్ళి చేసుకుంటుందేమో?"

"అనే అనుకోవాలి! ఈ లోపుగా అతను కూడా చదువు పూర్తి చేసుకుని ఫారిన్ నుంచి రావచ్చు"

"ఆ ఫారిన్‌లో ఎవర్తీ దొరక్కుండా వుండాలి! అందులో కాస్త అందగాడు. మన వాళ్ళని చూస్తే అక్కడి అమ్మాయిలకి మోజు ఎక్కువట?"

"నోరుమూసుకోవే సుబ్బులూ! నువ్వెప్పుడూ అలాటి కబుర్లే చెబుతావు! శివా అలాంటి వాడు కానేకాదు. అతను తప్పకుండా శాంకరినే పెళ్ళి చేసుకుంటాడు."

అన్నీ నీకు తెలుసున్నట్లు చెప్పకు కనకం! శాంకరి వెంటబడిన వాడు చెప్పాచెయ్యకుండా ఫారిన్ ఎందుకు వెళ్ళి పోతాడే! ఇదంతా చూస్తుంటే నాకు ఏదో అనుమానంగానే వుంది. వీళ్ళిద్దరు కొట్లాడుకోలేదు కదా!"

"నీకన్నీ అనుమానాలే సుబ్బులూ! లేనిపోని అనుమానాలు ఎందుకే సుబ్బులూ! వాళ్ళిద్దరు పెళ్ళి చేసుకోడం నీకిష్టం కాదా?"

"నువ్వు నోరు మూసుకో కనకం! నాకెందుకిష్టముండదు? ఈవిడ గారు ఓ మొండిఘటం. అతనో పెంకిరకం. ఈవిడగారు ఎవరి మాట వినదు కదా! అదే నా బాధ."

"ఆ! వినకేం చేస్తుంది సుబ్బూ! వయస్సులో వున్న వాలికెవరికీ ప్రేమ చేదుకాదే! శివా ఫారిన్నుంచి రానీ దాని పని చెబుదాం!"

"అదీ! అలా అన్నావు బావుంది. ఎలాగో అలాగ దాని పెళ్ళి చేసి పుణ్యం కట్టుకోవే? అంతటి మంచి కుర్రాడు మళ్ళీ దొరకడు!"

"అలాగే చూద్దాం సుబ్బూ! దాని పెళ్ళి అందరం కలిసేచేద్దాం" కనకం మాటలకి ముగ్గురు నవ్వుకున్నారు.

ఆ మరునాడే కాసులు, సుబ్బులు వెళ్ళిపోయారు. కనకం తన పనుల్లో మునిగిపోయింది.

# 67

రాజేశ్వరమ్మగారికి షుగర్, బి.పి. ఎక్కువయ్యాయి. నరసమ్మ గారు వంటచేసి పెడుతోంది. ఇంట్లో గిరిజ, సత్యం వున్నారు. గిరిజ కొడుకు ఆవిడ దగ్గర చాలా అలవాటయ్యాడు. మధ్యమధ్యలో చలపతీ, శాల్యా వచ్చి చూసి వెడుతూనే వున్నారు. ఉన్న ఒక్క కొడుకు

దూరంగా వుండడంవల్ల కాబోలు ఆమె మనస్సు పీకుతూనే వుంది. ఒక పక్క తనకు వయస్సు వచ్చేస్తోంది. కొడుకు ఒక యింటివాడుకాలేదు. ఆమెకు మరో బెంగ. కొడుకు పెళ్ళి రెండేళ్ళు అయింది. కొడుకును చూడాలని ఆమె మనస్సు తొందర పడుతోంది.

ఒక రోజు కొంచెం గుండెలో నొప్పిలా వచ్చింది. గిరిజ, సత్యం హాస్పటలికి తీసుకెళ్ళాడు.

వెంటనే యి.సి.జి. తీసి అన్ని పరీక్షలు చేసారు. జబ్బేమి లేద న్నారు. కాని విశ్రాంతి చాలా అవసరమని చెప్పారు.

"విశ్రాంతి కాక నాకేముంది. నా మనసులోని బాధ వీళ్ళకేం తెలుసు?" అనుకుంది రాజేశ్వరమ్మ.

ఎందుకేనా మంచిదని గిరిజ తండ్రికి కబురుచేసింది. వెంటనే భార్యతో బయలుదేరి వచ్చాడు చలపతి.

"ఒరే శివా! ఎప్పుడొస్తున్నావురా! అమ్మ నీ కోసం కలవరి స్తోంది. మొన్న కాస్త జ్వరం వచ్చి తగ్గింది కూడా" రాజేశ్వరమ్మగారు ఎంత వద్దంటున్నా వినకుండా శివాకు ఫోను చేశాడు.

"ఒక్క సంవత్సరం మామయ్యా! చదువు పూర్తైపోతుంది. త్వరలో రావడం కష్టం. అయినా అమ్మను మాట్లాడమను" అన్నాడు.

"బాబూ! శివా! ఎలా వున్నావు" తల్లి ఫోనులో అడిగింది.

"నేను బాగానే వున్నా! యిప్పుడు నువ్వెలా వున్నావు? నీకు వంట్లో బాగులేదంటున్నాడు మామయ్య. వెంటనే వచ్చేయ్యనా అమ్మా!"

"చదువు పాడు చేసుకుని రాకురా! చదువు పూర్తి చేసుకునిరా! నాకేం భయం లేదు. గిరిజ, సత్యం, బాబు వున్నారు కదా! మామయ్య అలా కంగారు పడుతూనే వుంటాడు."

"ఒక్క సంవత్సరంలో వచ్చేస్తానమ్మా! నాకు అవసరమైతే ఫోను చేయుచు. నువ్వు బెంగ పెట్టుకోకుండా వుంటానంటేనే వుంటా నమ్మా! లేకపోతే వచ్చేస్తానమ్మా!"

శివా కంఠం గాద్గదికమైంది. రాజేశ్వరమ్మగారు కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి.

"నాకేం భయం లేదురా! నువ్వు ధైర్యంగా వుండు నాయనా! ఇక్కడ నన్ను చూడ్డానికి చాలామంది వున్నారురా!" ఆమె కంఠం పూడుకుపోయింది.

"ఇక్కడ నాకు కావలిసినమంది స్నేహితులు. నా ఫ్రెండ్స్ కూడా వున్నారమ్మా! నాకోసం భయపడకు. అన్నీ వివరంగా వుత్తరం రాస్తా!" ఫోను పెట్టేశాడు శివా.

రాజేశ్వరమ్మ గారి ప్రాణం కాస్త కుదుటపడింది. శివా మనస్సు శాంకరి వైపు మళ్ళింది. ఆమెను గురించి తలుచుకోకూడదు. అని ఎన్నోసార్లు అనుకున్నాడు. కాని వుంటబట్టలేక మళ్ళీ ఆమెనుగురించేఆలోచిస్తున్నాడు. ఆమె జ్ఞాపకాలు తలపునకు వచ్చినప్పుడల్లా అతని మనస్సు ఆనందంతో సంచరిస్తాడు. వెన్నెట్లో హాయిగా తిరుగుతాడు. ఆ లోకం నుంచి బయటకురాగానే ఊపిరి సలపని బాధ, భరించలేని వేడి. అన్ని విషయాలు సూర్యానికి ఉత్తరం రాయాలని ఎన్నోసార్లు అనుకున్నాడు. కాని తాను మళ్ళీ బయటపడటానికి యిష్టంలేక వూరుకున్నాడు. కాని ఎందుకో ఆ రోజు మరింత తొందరపెట్టింది అతని మనస్సు. అందుకే సూర్యానికి వుత్తరం రాయాలని మొదలు పెట్టాడు శివా! అన్ని విషయాలు మామూలుగానే రాసాడు. అందులో "శాంకరి ఎన్నో సంవత్సరం చదువుతోంది" అని మాత్రం రాయగలిగాడు. రామనాధంగారికి, మీ అమ్మగారికి నమస్కారాలు. నేను బహుశా ఇంకో సంవత్సరంలో చదువు పూర్తి చేసుకొని వచ్చేస్తాను" అని రాసాడు.

అందుకే అతనికి ఏదో తృప్తిగా ఉంది. అక్కడ తనతో చదువుకుంటున్న రోజీని మాత్రం తప్పించుకుని తిరుగుతున్నాడు శివా!

"రోజీకి శివాతో మాట్లాడ్డం చాలా సరదా! కాని శివా ఆమె పలకరిస్తేనే చికాకు పడుతున్నాడు."

# 68

నాలుగో సంవత్సరం పరీక్షలు దగ్గరకు వచ్చాయి. ఒక పక్క ప్రాక్టికల్స్ మరోపక్క చదువు. ఒక క్షణం తీరిక లేకుండా ఉంది శాంకరి. లత కూడా శాంకరితో పాటు చదువుతూనే ఉంది. అపర్ణ మాత్రం కాస్త నిరుత్సాహంగా వుంది. జయరాంని గురించే ఆలో చిస్తోందని అనుకున్నారు శాంకరి, లతా కూడా.

"అపర్ణా! అలా వున్నావేం? వంట్లో బాగుండలేదా?" ఒకరోజు శాంకరి అడిగింది.

"తలనొప్పిగా వుంది శాంకరి!"

శాంకరి తలనొప్పి మాత్ర యిచ్చింది మరునాడు కాస్త జ్వరం తగిలింది. మందులు వాడితే తగ్గిపోయింది.

ప్రాక్టికల్స్ సరిగా చెయ్యలేకపోయింది. థీరీ పరీక్షలు కూడా సరిగా వ్రాయలేదు అపర్ణ. పరీక్షలు అయిన తరువాత ఎక్కువ శెలవలు లేకపోవడంవల్ల అపర్ణ, లత, శాంకరీ కూడా అక్కడేవుండి పోయారు.

"శాంకరీ! అలా ఎక్కడికైనా వెళ్ళి తిరిగి వద్దామా?" అపర్ణ అడిగింది "ఎక్కడికైనా అంటే" లత ప్రశ్నించింది.

"అందరికీ దూరంగా హాయిగా తిరగాలని వుంది"

"సింహాచలం వెళ్ళి వద్దమా!" లత అడిగింది.

"హాయిగా ఉంటుంది వెళ్ళి వద్దామె? అయినా శాంకరి ఏమం టుందో!"

"అపర్ణ మామూలుగా లేదని గ్రహించింది శాంకరి. అందుకే అలా తిరిగి వస్తే కుదుటపడుతుందనుకుంది.

"మీరంతా వెడదామంటె అలాగే వెడదాం"

మరునాడే శాంకరి, లత, అపర్ణలతో పాటు ఉష, వందన మొదలైన వాళ్ళంతా బయలుదేరారు. మొత్తం పదిమంది వున్నారు.

సింహాద్రి అప్పన్నను స్మరించుకుంటూ మెట్లు ఎక్కుతున్నారు జనం. అక్కడ కొండలనిండా సంపెంగ వృక్షాలు. బంగారు రంగులో సంపెంగపూలు స్వాగతం పలుకుతున్నాయి.

వాటి పరిమళాలు నాసికా పుటాలను తాకి తీయని లోకాలలో విహరింపచేస్తున్నాయి. పచ్చని చెట్లమీద పక్షులు కలకలా రావాలు చేస్తున్నాయి. చల్లని గాలులు అలసిన శరీర స్వేద తీరుస్తున్నాయి. ఆ వాతావరణంలో నడుచుకుంటూ దేవ సన్నిధికి చేరారు. ఒక పక్క వేద మంత్రాలతో భక్తిగీతాలతో భక్తుల ప్రార్థనలతో ఆ ప్రదేశమంతా కల కలలాడుతోంది. ఎంతటి వారైనా పరవశించే వాతావరణమది. శరీరాలను, మనసులను కూడా తన్మయత్నం చెందే సమయమిది.

అపర్ణ చాలా సంతోషంగా వుంది. ఆమెను చూసిన శాంకరి ముఖం వికసించింది. సింహాద్రి అప్పన్న దేవుని శరీరానికి మంచి గంధం పూతకై గంధాలు నూరుతున్నారు.

ఎప్పుడూ అటువంటివి చూడని అపర్ణ పరవసించి పోయింది. దేవదర్శనం చేసుకుని ఆ చుట్టు పక్కలంతా తిరిగారు.

"హాయిగా యిక్కడో కుటీరం కట్టుకుని వుండిపోతే ఎంత బాగుండును శాంకరీ"

"సన్యాసం పుచ్చుకుంటే మరింత బాగుంటుంది అపర్ణా!" అంది లత.

"ఇప్పుడు సన్యాసులం కాక సంసారులమా!"

అపర్ణ మాటలకి అందరూ నవ్వుకున్నారు.

అంతలో ఎక్కడనుంచో వచ్చినట్టున్నారు మగపిల్లలు. శాంకరి వాళ్ళని చూడగానే ఈలలు వేసి వారి దగ్గరలో చేరారు.

"ఏమి అందాలురా! ఇప్పుడే వికసించిన పారిజాత సుమాల్లా వున్నారు"

"అయ్యో కాదురా! ఇప్పుడే వికసించిన పద్మాలా వున్నారు" అన్నాడు మరొకడు.

బీచికి వెళ్ళినప్పుడు జయరాం వాళ్ళు వెంటపడడం గుర్తుకు వచ్చి నవ్వు వచ్చింది అందరికి. అపర్ణ హృదయం మాత్రం విలవిల్లాడింది.

"అయ్యో! చెట్టుకు వేళ్ళాడే గబ్బిలాల్లా వున్నాయే ముఖాలు" లత మాటలకి వులిక్కి పడ్డారు మగపిల్లలు.

శాంకరి వాళ్ళు పకపకనవ్వారు.

"అదేమిట్రా మనం పొగుడుతూ అంత మంచి సమాసాలు వాడితే ఇదేమిట్రా వీళ్ళు దుష్ట సమాసాలు వదులుతున్నారు" మెల్లిగా అన్నాడు ఒకడు.

"ఆడవాళ్ళ మాటలకి అర్థాలే వేరులే! అందుకని" మరొకడు మెల్లిగా సమాధానమిచ్చాడు.

"ఆహా ఏమి దర్శనమిది! కిన్నెర కాంతల మేలు కలయిక యిది" మరొకడు అన్నాడు.

"ఆ దేవకామినులు భూలోకానికి దిగి వచ్చినట్లున్నారు" ఇంకొకడు పరవశంతో పలికాడు.

"అయ్యో! లైబ్రెరీ పుస్తకాల్లో పేజీలు చింపుకుపోయే ముఖాలు" సాగతీసింది లత.

"కాదు! కాదు పక్కరూములో నుంచి కాసెట్లు ఎత్తుకు పోయే ముఖాలు" ఉష సన్నగా అంది.

"కొత్త ప్రయోగాలురా! బాబా!" గొణుక్కున్నారు మగపిల్లలు.

శాంకరి వాళ్ళు అక్కడనుంచి లేచి వచ్చారు.

తర్వాత కొనుక్కోవలసిన వస్తువులు చిన్నచిన్నవి కొనుక్కొని చీకటి పడకుండా బస్సులు ఎక్కారు. అపర్ణలో మునుపటి వుత్సాహం మళ్ళీ కనపడింది. వచ్చిన పని నెరవేరింది అనుకున్నారు శాంకరీ వాళ్ళు.

ఆరోజు నాల్గవ సంవత్సరం రిజల్ట్సు తెలిసాయి. శాంకరికి అందరికంటె ఎక్కువ మార్కులు వచ్చాయి. ప్రొఫెసర్లు అందరూ

కూడా ఆమెను అభినందించారు.

తన కోరిక నెరవేరే సమయం దగ్గరలోనే వుందనుకొంది శాంకరి.

"అప్పుడే 5వ సంవత్సరంలోకి వచ్చాను. ఇంకొక సంవత్సరం తర్వాత హౌస్ సర్జన్. తర్వాత తన వూరులో ప్రాక్టీసు. తన జీవిత ధ్యేయమదే" శాంకరి అలా వేళ్ళు లెక్క పెట్టుకుంటూనే వుంది. అంతలో యింటి నుంచి వుత్తరం వచ్చింది.

సుశీల ఇంటర్ పరీక్షలు రాస్తోంది. కనకం బి.ఎ. పరీక్షలు రాస్తోంది.

వాళ్ళకి పరీక్షల్లో సహాయంగా వుండచ్చని బయలుదేరింది శాంకరి.

వద్దన్నా వినకుండా శాంకరి వెంట స్టేషన్‌కి వచ్చారు లత అపర్ణ.

"మీరు కూడా మా వూరురండ"ని ఎన్నోసార్లు అడిగింది శాంకరి.

"ఇప్పుడు పని మీద వెడుతున్నావుగా ఈసారి వస్తాములే" అన్నారు. సింహాద్రి ఎక్స్‌ప్రెస్ ఎక్కింది శాంకరి.

"త్వరగా వచ్చేసెయ్యి శాంకరీ" బండి కదిలే వరకు చెబుతూనే వున్నారు లత, అపర్ణ.

"అపర్ణని జాగ్రత్తగా చూసుకో లతా!" శాంకరి మరీమరీ చెప్పింది.

"నేను అపర్ణని చూస్తా! మరి నన్నెవరు చూస్తారు?" లత అడిగింది.

"నేను చూస్తాగా! నీకేం భయం లేదు" అభయ హస్తం చూపించింది శాంకరి.

"తథాస్తు!" అంది అపర్ణ.

ముగ్గురు నవ్వుకున్నారు. అంతలో బండి కదులుతున్నట్లు ఎనౌన్స్ చేశారు. గార్డు విజిల్ వేశాడు. లత, అపర్ణల గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. బండి కదిలింది.

"టా!టా!" అంటూ చెయ్యివూపారు. శాంకరి చెయ్యి తిరిగి వూపింది. ముగ్గురి కళ్ళలో నీళ్ళు నిలిచాయి. గుండెల్లో నుంచి పొంగి వచ్చే ఆత్మీయతకు సంకేతాలు అవి. మనసున్న గుండెకే తెలుసు మరో గుండెలోని మమకారాన్ని అందుకోడం.

లత, అపర్ణ నీరసంగా రూముకు చేరుకున్నారు. శాంకరి లేకుండా ఆ రూములో వుండటమే కష్టమయింది వాళ్ళకి. శాంకరి ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూడటం ప్రారంభించారు.

# 69

కనకం, సుశీలలతో శాంకరి రాజమండ్రి వెళ్ళింది. పరీక్షలు ప్రారంభమయ్యాయి. ఇద్దరిచేత దగ్గరుండి చదివించింది. రోజూ రాత్రి వారికి మరునాటి పేపరు సిలబస్ చెప్పేది. ఆమెకు బి.ఏ. సబ్జక్టులు కొత్త. అయినా చెబుతూంటే వాళ్ళకి ఎంతోబాగా అర్థమయ్యేటట్టువుండేది. మొత్తం మీద పరీక్షలు బాగారాసి యింటికి తిరిగి వచ్చారు. పంచాయితీ ఎలక్షన్స్‌లో ఓడిపోయిన తరువాత సూర్యం కొంచెం దిగాలుగా కనపడ్డాడు.

"అదేమిటి సూర్యం అలా వున్నావు!"

"ఏం లేదు శాంకరి! మామూలుగానేవున్నా" సూర్యం మాటలు పొడిపొడిగా వున్నాయి.

"ఎలక్షన్స్ అయినది మొదలు యిలాగే వున్నారు. అసలు నుంచోకుండా వున్నా బాగుండేది!" కనకం ఓడిపోయినందుకు కాకుండా అసలు నుంచోడమే పొరపాటని బాధపడింది.

"జయాపజయాలు తప్పవు? ఓడిపోతామని ప్రయత్నం మానకూడదు. మళ్ళీ యింకో ప్రయత్నం చెయ్యాలి అంతే? ఓడిపోయానని బాధపడుతున్నావా సూర్యం" శాంకరి అడిగింది. సమాధానం చెప్పలేక పోయాడు సూర్యం.

"ధైర్యంగా మళ్ళీ నుంచో! మరో ఛాన్సు లేకపోతే మరో ఛాన్సు! ఈ మాత్రం దానికి బాధపడితే ఎలా?" శాంకరి కోపం చేసింది.

"నువ్వన్నది నిజమే శాంకరి! మళ్ళీ ప్రయత్నం చేస్తా!" ఉత్సాహంగా చెప్పాడు సూర్యం.

"మళ్ళీ ఐదు ఏళ్ళనాటి మాట కదా!" నిరుత్సాహంగా అంది కనకం.

"ఈ లోపుగా ఏంమార్పులు వస్తాయో చూద్దాం!" అంది శాంకరి.

ఆ సాయంకాలం కాసులు వూరునుంచి వచ్చింది. ఆమె ముఖం వాడిపోయి వుండటం గమనించారు అందరు. ఎందుకో ఎవరికీ కారణం తెలియలేదు.

మధ్యాహ్నం స్కూలు వైపు బయలుదేరారు కనకం, కాసులు, శాంకరి. పిల్లలకి పరీక్షలవుతున్నాయి.

కనకం పనిలో మునిగిపోయింది. శాంకరి, కాసుల్ని తీసుకుని వెళ్ళి ఓ చెట్టుకింద కూర్చుంది.

"చూసావా! నా జీవితం ఎలా అయిపోయిందో" కాసులు వెక్కి వెక్కి ఏడ్చింది.

"ఏం జరిగింది కాసులు?" శాంకరి అడిగింది.

"నాకు పిల్లలు పుట్టలేదని మా అత్తగారు నానా మాటలు అంటోంది శాంకరీ! ఆ మాటలు నేను భరించలేకపోతున్నా" కాసులు మరింత ఏడ్చింది.

ముందు ఏడుపుమాను. ఎప్పుడో మీ అత్తగారు అంటని ఇప్పుడు ఏడిస్తే ఎలా? ముందు వూరుకో!"

కాసులు పమిటకొంగుతో కళ్ళు తుడుచుకుంది.

"లేడీ డాక్టరుకి చూపించుకున్నావా?"

"ఆ చూపించుకున్నాను, చిన్న ఆపరేషన్ కూడా చేసింది. పైగా ఏవో మందులు కూడా వాడుతున్నాను. అయినా ఏం ప్రయోజనం లేకపోయింది. దాంతో మా అత్తగారు మరీ తిడుతోంది."

"ఈ అత్తలకేం పనిలేదు! కోడళ్ళను తిట్టటం తప్ప! ఆవిడ మాటలకేం లే!"

"అదికాదు శాంకరీ! ఆవిడ చెప్పినట్లల్లా విన్నాను. గుడులు గోపురాలు తిప్పింది. ఎన్నో నోములు పట్టించింది చేశాను. కాని అవి చాలవుట! ఇంకా చెయ్యాలట. ఆ వుపవాసాలతో నాకు నీరసం వస్తోంది. ఇంక నా వల్లకాదన్నాను. అయితే యింట్లోంచి పొమ్మంటోంది!"

"మీ ఆయన సుబ్బారావేమంటాడు?"

"మా అమ్మ అలా అంటూ వుంటుంది! నువ్వేమీ లెక్క చెయ్యకు" అంటాడు. కాని లెక్క చెయ్యకుండా ఎట్లా?"

"కాసులు! మీ ఆయన్ని డాక్టర్లు చూసారా?"

"లేదు!"

"ఎందుకని?"

"ఆయన గారిని వెళ్ళద్దంటుంది మా అత్త. వాళ్ళబ్బాయికి ఏ రోగం లేదుట!"

"ఏ రోగం లేకపోవచ్చు! ఏ లోపమైనా వుండచ్చుగా! నువ్వు వెంటనే కాకినాడ బయలుదేరి వెళ్ళు? నేను ఎల్లుండి వైజాగ్ వెడుతున్నా! నేను వెళ్ళాక మీ ఆయన్ని తీసుకుని రా! అక్కడ డాక్టరికి నీతోపాటు అతన్ని కూడా చూపిద్దాం. అవసరమైతే అతనికి కూడా వైద్యం చేస్తారు."

శాంకరి మాటలు విన్నాక కాసులికి ధైర్యం వచ్చింది. తన సంసారానికి మంచిరోజులు వచ్చాయనుకుంది. అంతలో మళ్ళీ భయం వేసింది.

"శాంకరీ! మా అత్త ఆయన్ని రానివ్వదేమో?"

"పిచ్చి కాసులూ! మీ అత్తకి యివన్నీ ఎందుకే చెప్పడం? నువ్వే పెద్ద డాక్టరికి చూపించుకుంటానని బయలుదేరు? ఆ మాత్రం తెలివి లేకపోతే ఎలా గే?" శాంకరి కోపం చేసింది

అంతలో కనకం అక్కడకి వచ్చింది.

కాసులు సంగతి విని బాధపడింది.

"శాంకరి చెప్పినట్లు చెయ్యి కాసులు! తప్పకుండా నీకు పిల్లలు పుడతారు! అనవసరంగా బాధపడకు!" కనకం ధైర్యం చెప్పింది.

తర్వాత ముగ్గురు యింటికి బయలుదేరారు.

చిన్న పిల్లల మూలంగా స్కూల్లో పిల్లలు ఒకటే అల్లరి చేస్తున్నారు.

వాళ్ళు పరీక్షలు రాయడంలేదు. టీచర్లు దగ్గరుండి రాయిస్తున్నారు. కొందరు పరీక్షంటే భయపడి ఏడుస్తున్నారు కూడా! ఆయాలు వారిని సముదాయిస్తున్నారు. అవన్నీ చూసిన శాంకరికి ఆమె చిన్నతనం గుర్తుకొచ్చింది. "ఇంత చిన్న వయసులో మేం స్కూలుకి వెళ్ళలేదు. ఆడుకోడం తప్ప, అసలు చదువంటేనే తెలియదు. ఈ పిల్లలు ఎంత భవిష్యత్తుందో ఇంత పల్లెలో పుట్టినా వీళికి ఎంత అవకాశం లభించిందో!" అనుకుంది. తనకు లేని అవకాశం వీరికి లభించింది. మనస్సు ఉత్సాహంతో నిండింది.

అడుగులు వేగంగా వేసింది. ఆమె వెంట కనకం, కాసులు నడిచారు.

శాంకరి మాట ప్రకారం కాసులు మరునాడు కాకినాడ బయలుదేరి వెళ్ళిపోయింది.

ఆ మరునాడు శాంకరి ప్రయాణం.

"ఎప్పుడొస్తావమ్మా! శాంకరీ" రామనాధంగారు అడిగారు.

"ఇంకేంత నాన్నగారు ఒక్క సంవత్సరం. ఈ లోపుగా ఎప్పుడు వస్తానో తెలియదు. చదువు పూర్తి చేసుకునే వస్తాను."

ఆ మాట వినగానె ఆ తల్లిదండ్రులు నోట్లో అమృతం పోసినట్లయింది. సుగంధాన్ని పీల్చుకున్న దానికంటే సంతోషమనిపించింది.

"రవి యింటర్‌లోకి వచ్చాడు నాన్న! వాణ్ణి శ్రద్ధగా చదివించండి." "వాడు శ్రద్ధగానే చదువుకుంటున్నాడు." అంది అన్నపూర్ణమ్మ. "ఒరే రవీ! నువ్వు బాగా చదివి ఇంజనీరు కావాలి తెలిసిందా." తమ్ముణ్ణి దగ్గరకు తీసుకుంది శాంకరి.

"ఓ అలాగే" అన్నాడు రవీ. తర్వాత అక్కడి పిల్లలకి కూడా శ్రద్ధగా చదువుకోమని చెప్పింది అలాగే పిన్నీ అన్నారు సుశీల పిల్లలు. కనకానికి, సూర్యానికి రాజమండ్రిలో ఏదో పనుందని శాంకరి వెంట వాళ్ళు కూడా బయలుదేరారు.

వాళ్ళు వెడుతుంటే వీధుల్లో నిలబడి టా! టా! చెప్పాడు కనకం కొడుకు. వాడికి నాయనమ్మ దగ్గర చాలా అలవాటు. తల్లి బాధ లేదు.

నీ కొడుకు అచ్చు సూర్యమే! నీలా గడ్డుగాయి కాడు." శాంకరి మాటలకు కనకం సంతోషంతో మెలికలు తిరిగింది. సూర్యం పోలికలంటే ఆమెకు చాలా యిష్టం. తనకంటే సూర్యం అందగాడని కనకానికి తెలుసు. ఆమెకు సూర్యం అంటే ప్రాణం. సూర్యుని వెంట వెలుగులా తిరుగుతుంది కనకం.

# 70

శాంకరిని చూడగానే లత, అపర్ణల ప్రాణాలు లేచి వచ్చాయి.

ఎంతో ఉత్సాహంగా కాలేజీకి బయలుదేరారు. ప్రాక్టికల్స్ ముగ్గురికి వేరు వేరు టైమింగ్సులో వున్నాయి. ముగ్గురికి ఒకేసారి ఒకే చోట వుండాలని ప్రయత్నించారు కాని కుదరలేదు.

"జయరాం తిరిగి కాలేజీకి వచ్చాడు. వాళ్ళమ్మగారు తిట్టి పంపించారుట." వందన వచ్చి చెప్పింది.

"అడుగో! అడుగో! జయరాం! లత చూపించింది.

ఆడపిల్లలంతా అతన్ని వింతగా చూస్తున్నారు.

"రండే పోదాం!" అక్కడ వుండడం యిష్టం లేనట్లు కంగారు పడింది.

అపర్ణ భావాన్ని గ్రహించింది శాంకరి.

"జయరాం వస్తే మనకేం! రాకపోతే మనకేం రండి పోదాం" శాంకరి కోపం చేసింది.

జయరాం కూడా మునపటిలా వాళ్ళ దగ్గరకు రాలేదు. దూరం నుంచే తప్పించుకు వెళ్ళిపోయాడు.

"రోగం కుదిరినట్టుంది. జాగ్రత్తగా వున్నాడు."

"కుదరకేం చేస్తుంది లతా: పోలీసులు యితన్ని కూడా బడితపూజ బాగానే చేసినట్టున్నారు." వందన విన్న విషయం చెప్పింది.

మెడిసిన్ చదవడానికి వచ్చిన వారిలో కూడా ఈ విషపులక్షణాలేమిటో" అనుకుంది శాంకరి.

మరునాడు కాసులు, సుబ్బారావు బయలుదేరి వచ్చారు. సుబ్బారావు దగ్గర బంధువులు అక్కడ వున్నారు. వారింటికి వచ్చి స్నానాల్చు భోజనాలు ముగించుకుని శాంకరి రూముకు వచ్చారు. అక్కడ శాంకరి లేదు. కాలేజీకి వెళ్ళారు.

తెల్లని కోటు వేసుకుని మెడలో స్టెతస్కోపు తగిలించుకుని వున్న శాంకరి వాళ్ళకంట పడింది. ఎవరితోనో ఏదో విషయం డిస్కస్ చేస్తోంది శాంకరి. ఆమెను అలా చూడగానే కాసులు సంతోషాన్ని పట్టుకోలేక పోయింది.

'శాంకరీ! అంటూ వెళ్ళి కౌగిలించుకుంది.

"కాసులూ వచ్చావా! నువ్వు వచ్చి యిబ్బంది పడతావనే రూముకు వస్తున్నానే" అంది.

ఆ యిద్దరి స్నేహాన్ని చూస్తూ నిలబడ్డ సుబ్బారావు. "నిజంగా యిటువంటి స్నేహితులుంటారా" అనుకున్నాడు.

శాంకరి అటునుంచి యిద్దరిని డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళింది.

ముందుగానే డాక్టరు దగ్గర అపాయింట్‌మెంట్ తీసుకుంది. కాసుల్ని, సుబ్బారావుని కూడా జాగ్రత్తగా అన్ని పరీక్షలు చేసారు.

మరునాడు రిపోర్టుకోసం మళ్ళీ రమ్మన్నాడు.

కాసుల్ని, సుబ్బారావుని రూముకు తీసుకొచ్చి అపర్ణ, లతలకి పరిచయం చేసింది. కాసులు వాళ్ళతో కలిసిపోయింది. కాసులు మంచి తనం వాళ్ళని బాగా ఆకర్షించింది. శాంకరి అందరికంటే అందగత్తె. పైగా అందరికంటే బాగా చదువుతోంది. ధైర్యం, సాహసం, ఆలోచనా గుణం అందరికంటే ఎక్కువగా వున్నాయి. అయినా స్నేహితురాళ్ళకి ప్రాణం యిస్తుంది. కాసులు వాళ్ళకి ఆమె అంటే ఈర్ష్య లేదు. ఆమెలో వుండే ఆ గుణాలను గౌరవిస్తారు వాళ్ళు అందుకే వారి స్నేహం మూడు పువ్వులు ఆరు కాయలుగా సాగుతోంది.

కాసుల్ని అక్కడే వదలి సుబ్బారావు వెళ్ళిపోయాడు. జగదాంబా బజారుకెళ్ళి కాసులుతోపాటు కావలసినవి కొనుకున్నారు. లత, అపర్ణ శాంకరి తర్వాత సినిమా చూసారు. వచ్చేటప్పుడు హోటల్లో భోజనం చేసి తిరిగి రూముకు వచ్చారు. ఆ రోజుల్లా పండగలాగే వుంది వాళ్ళకి. ఆ రాత్రి రూములోనే పడుకుంది కాసులు. వాళ్ళ కబుర్లకి అంతేలేదు.

మరునాడు సుబ్బారావు వచ్చాడు. తిరిగి డాక్టరు దగ్గరకు వెళ్ళాడు.

"కాసులుకి ఏ లోపం లేదు. కాని సుబ్బారావుకి పిల్లలు పుట్టే అవకాశం లేదు" డాక్టరు స్పష్టంగా చెప్పి రిపోర్టు చేతిలో పెట్టాడు.

సుబ్బారావు ముఖంలో కత్తివాటుకు నెత్తురు చుక్కలేదు. కాసులు ముఖం ఉదయ సంధ్యలో కలువలా ముడుచుకుపోయింది. ఎండకు కరిగిన మంచు బిందువుల్లా కన్నీళ్ళు జారాయి.

శాంకరి వాళ్ళను చూసి జాలి పడింది. "తాను డాక్టరు చదివి ఎంతమందినో ఉద్ధరించాలనుకుంది. కాని ఇలాంటి అవాంతరాలుంటే తాను వైద్యమేమి చెయ్యగలదు? ఎవరిని ఆదుకోగలదు." ఆమె ఆలోచనలు పడుగు పేకల్లా అడ్డదిడ్డంగా అల్లుకున్నాయి.

కనకాన్ని చెయ్యిపట్టుకు లేవతీసి బయటకు నడిచింది. ఒక్క మాటంటే ఆమె దుఃఖం పొంగిపొర్లుతుంది. అందుకే పలకరించలేదు.

వారి వెంట సుబ్బారావు నడిచాడు.

"చూశావా! శాంకరమ్మా! ఎలాచేసిందో ఆ తల్లి?" ఎదురువచ్చిన ఒక ఆయా చెప్పింది.

"ఏమిటి మరియమ్మా?" శాంకరి అడిగింది.

"బంగారు బొమ్మలా వుందమ్మా పిల్లా! వదిలేసి ఆ తల్లి వెళ్ళిపోయింది. ఆమె తల్లికాదమ్మా, రాక్షసి!"

"అలాగా? ఆ పిల్ల ఎక్కడుంది?"

"ఏం చెయ్యాలా అని చూస్తున్నాం. మా దగ్గరేవుంది."

"ఎక్కడుందో చూపించు!" శాంకరి మనస్సులో ఏదో ఆలోచన తళుక్కున మెరిసింది.

కాసుల్నీ, సుబ్బారావును తీసుకుని ఆమె వెంట నడిచింది నేల మీద ఓ తెల్లని దుప్పటి మడిచి వేశారు. అందిమీద అభం శుభం తెలియని ఆ పిల్ల నిద్రపోతోంది. నేల తల్లి ఒడిని కన్నతల్లి ఒడిని పసికట్టలేని పసికందు ఆ పిల్ల.

దగ్గరగా వెళ్ళిచూసింది శాంకరి. నిజంగానే చాలా అందంగా వుంది. రెండు చేతులతో తీసి ఎత్తుకుంది

"ఏ అభాగ్యురాలు కన్నదో ఈ పిల్లను. కాసులూ! నువ్వు ఈపిల్లని భాగ్యరాలిని చెయ్యాలి" శాంకరి ఆ పిల్లను కాసులు చేతికి అందించింది.

అనుకోకుండానే కాసులు రెండు చేతులు చాచింది. పిల్లను రెండు చేతులతో పట్టుకుని గుండెలకు హత్తుకుంది. ఆమె శరీరం పులకించింది. ఆమె గుండెలో ఆశాలత తళుక్కుమంది. తలెత్తి సుబ్బారావు వైపు చూచింది. ఆమెలో మాతృత్వం తొణికిసలాడింది. సుబ్బారావుకి ఏం చెయ్యాలో తోచలేదు. ఆమెను చూస్తూ అలా వుండిపోయాడు.

శాంకరి చూస్తూ నిలబడింది. తొందర పెట్టకూడదు. బలవంతంగా అంటకట్టకూడదు. వాళ్ళే ఆలోచించుకుని ఒక నిర్ణయానికి రావాలనుకుంది.

కాసులు సంతోషం పట్టలేక చంటిపిల్లను సుబ్బారావు చేతికి అందించింది. ఆ పిల్లను ఎత్తుకోగానే అతనిలో చెప్పలేని ఆనందం కలిగింది. పితృత్వం పొంగివచ్చింది.

ఆ పసికందును తదేకంగా చూసాడు. పచ్చని శరీరం, పాలు కారే బుగ్గలు. ఎఱ్ఱని పెదాలు. కోలముక్కు, వుంగరాల జుట్టు. గుప్పిళ్ళు బిగించి వున్న లేత చేతులు, ఎర్రని పాదాలు. అందరి ఎదురుగా ముద్దు పెట్టుకోలేక గుండెలకు హత్తుకున్నాడు. అంతవరకు లేని సంబంధమేదో నాది అనుకోగానే అతనిలో మమకారం మొలకెత్తింది. భర్త ముఖంలోకి చూసి కాసులు అతని హృదయాన్ని పసికట్టింది. ఆమె సంతోషానికి అంతులేదు.

"మనం తీసుకెళదామాండీ?"

"అవును కాసులు. ఈ పిల్ల మనకోసమే పుట్టింది" అన్నాడు.

"శాంకరీ! నీఋణం తీర్చుకోలేనే" కాసులు, శాంకరి చేతులు పట్టుకుంది. ఆనందంతో ఆమె కళ్ళు మెరిసాయి. శాంకరి తృప్తిగా చూసింది. సుబ్బారావు 200 రూ॥లు తీసి ఆయాలకు ఇచ్చాడు. "మీ కానుక" అన్నాడు. మరియమ్మ సంతోషించింది.

# 71

ఆ రోజు సూర్యం దగ్గర నుంచి తిరిగి సమాధానం వచ్చింది. శివా ఆతురతగా విప్పాడు. ఉత్తరంలోని విషయాలన్నీ గబగబా చదువుకుంటూ వెళ్ళాడు. శాంకరి సంగతి రాగానే ఆగిపోయాడు

"శాంకరి మెడిసన్ 5వ సం.ము చదువుతోంది. చదువు పూర్తి కాగానే మా ఊళ్ళో ప్రాక్టీస్ పెడుతుంది. రామనాథంగారు కూడా చాలా తొందరపడుతున్నారు. కూతురు ఎప్పుడు చదువు పూర్తి చేసుకు వస్తుందాని ఎదురు చూస్తున్నారు."

అందులో పెళ్ళయితే యిక్కడెందుకు ప్రాక్టీసు పెడుతుంది బహుశా పెళ్ళి కాలేదు, ఒకవేళ చదువయ్యాక అతనినే చేసుకుంటుం

దేమో? అనేక విధాల ఆలోచించాడు శివా! శాంకరి తనదే అన్న ఆశ ఏదో అతని హృదయంలో మెరుపులా మెరుస్తోంది.

ఆ ఆశే అతనికి ఊపిరిపోస్తోంతుది. పాత సంఘటనలన్నీ తలపుకొచ్చాయి. ఆ తీపి తలపుల్లో మునిగిపోయి వున్నాడు.

"హలో శివకుమార్" రోజీ వచ్చి అతని మీద చేతులు వేస్తూ అతని పక్కనే కూర్చుంది.

ఆమెను చూస్తూనే విసుక్కున్నాడు శివా! తన తీయని తలపులకు తెరవేసింది రోజీ! అందుకే ఆమెంటే మరింత కోపం. ఆమె చనువు నచ్చదు.

శాంకరి స్పర్శకోసం తన హృదయం పలవరిస్తోంది. తన శరీరం ఎదురు చూస్తోంది. రోజీ ముట్టుకుంటే తనలో చలనం లేదు. ఆమె చేతులు తీసి పక్కకు పెట్టాడు.

"నేను ముట్టుకోకూడదా! ముట్టుకుంటే అరిగిపోతావా?"

"అబ్బా! రోజీ! దూరంగా కూర్చో! మీదపడకు! నాకు తల నొప్పిగా వుంది" విసుక్కున్నాడు శివా.

"అలాగా! అంటూ డ్రింక్ గ్లాసులోకి పోసి అందించింది రోజీ!"

"ఇప్పుడొద్దు" అంటున్నా వినిపించుకోలేదు రోజీ!

తాగక తప్పలేదు శివాకు.

"దీని పోరు పడలేకుండా వున్నా అనుకున్నాడు మనస్సులో"

"అలా బయటకు వెళ్ళి తిరిగి వద్దాం?" పేచీ పెట్టింది రోజీ.

"ఎక్కడో థియేటర్‌లో ప్రోగ్రాముంది" రమ్మని బలవంతం చేసింది.

తలనొప్పిగా ఉందని తప్పించుకున్నాడు శివా!

"నువ్వు బండరాయివి! రేపు మళ్ళీ కలుస్తా" రోజీ కళ్ళు కోపంతో నిప్పులు తిరిగాయి.

శివాకు జాలివేసింది. మెత్తబడితే మళ్ళీ వదలదు. అందుకే చూడ నట్టే వూరుకున్నాడు శివా!

అనుకున్నట్టుగా అతని చదువు పూర్తయింది అక్కడే రెండేళ్ళు పని చేయడానికి ఎగ్రిమెంట్ రాసాడు. ఇండియాలో పదేళ్ళలో సంపాదించేది అక్కడ రెండేళ్ళలో మిగల్చవచ్చని అతని ఆశ. అందుకే తల్లికి అనారోగ్యంగా వుందని తెలిసినా బయలుదేరలేదు. "వెళ్ళి ఏం చెయ్యాలి? కనీసం శాంకరి చదువు పూర్తయినా పెళ్ళి సంగతి తేలుతుంది. అంతవరకు ఇండియా వెళ్ళకూడదనుకున్నాడు శివకుమార్.

ఆ రోజు తల్లిదగ్గర నుంచి ఫోను వచ్చింది. గిరిజ మాట్లాడింది. రాజేశ్వరమ్మగారికి జ్వరం వస్తోందని, శివాను చూడాలని బెంగ పెట్టుకుందని చెప్పింది.

శివాలోని ధైర్యం నీరుకారింది.

"అలాగే! గిరిజా! అయితే నేను బయలుదేరివస్తున్నా! అంతవరకు అమ్మని జాగ్రత్తగా చూడండి"

"అలాగే శివా! అమ్మకేం భయంలేదు. మేంవున్నాముగా! నువ్వు వీలుచూసుకునిరా!" అంది గిరిజ.

అంతవరకు వెళ్ళకూడదనుకున్న శివా వెంటనే బయలుదేరాలను కున్నాడు.

తిరిగి వచ్చాకే జాబ్‌లో చేరాలనుకున్నాడు. వెంటనే ఏర్పాట్లు చూసుకోడం మొదలు పెట్టాడు. రోజీకి తెలియనివ్వకూడదనుకున్నాడు. తెలిస్తే మరి వదలదు. వచ్చి మీదపడుతుంది. తిరిగి వచ్చాక ఈ చుట్టుపట్ల మాత్రం వుండ కూడదనుకున్నాడు. అమెరికాలో ఎంతమంది ఇండియన్ ఆడపిల్లలు చదువుకుంటున్నారు. కాని మగపిల్లలతో అంత చనువుగా తిరిగే ఆడపిల్లలు చాలా తక్కువ? ఇండియా నుంచి వచ్చిన మగపిల్లలు ఎంతోమంది ఎంజాయ్ చేస్తూనే వుంటారు. కాని తనకి గిట్టదు. అందుకే రోజీకి తెలియకుండా బయలుదేరాలను కున్నాడు. మరునాడు శివా ప్రయాణమవగా రోజీ యూనివర్సిటీలో కలిసింది.

"హాయ్! శివా!" అంటూ చెయ్యి పట్టుకుంది. అతను ఎక్కడకు వెడితే అక్కడకు తిరుగుతూనే వుంది. ఆ చెయ్యి మాత్రం వదలలేదు.

"నువ్వంటే నాకు చాలా యిష్టం" అతని మీద పడుతూ చెప్పింది.

"అలాగా?" మామూలుగా అన్నాడు

"నేను నిన్ను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నా?"

"అలాగా?"

"అలాగా? అంటే ఏమిటర్థం?" రోజీకి కోపం వచ్చింది.

"నువ్వు చెప్పింది విన్నాను అని అర్థం"

"నీ సమాధానం కావాలి నాకు?"

"రోజీ! అన్నీ నువ్వే అనుకుంటున్నావు? నా సమాధానంతో పనేముంది?"

"నీ సమాధానం కోసమే అడుగుతున్నా?"

"అయితే నో!" కోపం పట్టంలేని రోజీ అతని గుండెల మీద కొట్టింది. తర్వాత ఏడ్చుకుంటూ వెళ్ళిపోయింది. ఏమీ జరగనట్టే కదిలాడు శివకుమార్.

# 72

అపర్ణకు 4 సం॥లో కొన్ని పేపర్లు ఉండిపోయాయి. 5 సం॥రం మరింత కష్టంగా వుంది. మునుపటిలా చదవలేకపోయింది. రెండు పరీక్షలు రాసి మూడో రోజు ముసుగుకప్పి పడుకుంది అపర్ణ.

''లే అపర్ణా! పరీక్షల్లో కూడా చదవలేకపోతే ఎట్లా? లతకోపం చేసింది.

'నాకు తలనొప్పిగా ఉంది లతా! నేను చదవలేకపోతున్నా!"

శాంకరి లేచివచ్చి అపర్ణ వంటిమీద చెయ్యివేసి చూసింది.

"అయ్యో! అపర్ణా! వళ్ళు కాలిపోతోందే?

"లతా! హాస్పటల్‌కి తీసుకువెళదాం రా!" లత కంగారుగా వచ్చి చూసింది.

"ఇంత జ్వరమా? చూడకుండా తిట్టానుకదే?"

"వెంటనే అంబులెన్స్ కబురుచెయ్యి?"

"శాంకరి మాటలు విని పరుగెత్తింది లత. అంబులెన్స్ వచ్చింది. ఆ విషయం తెలిసిన వందన, ఉషా కూడా అక్కడకు వచ్చారు.

అపర్ణను తీసుకెళ్ళి హాస్పటల్లో జాయిన్ చేసారు.

పెద్ద డాక్టర్లు వచ్చి చూసారు. మొదట వైరల్ ఫీవరని వైద్యం చేశారు. తర్వాత పేరా టయిఫాయిడని వైద్యం చేసారు. అన్నిరకాల పరీక్షలు చేసారు. జ్వరం కాస్త తగ్గింది. బాగా నీరసంగా వుంది.

శాంకరి వాళ్ళ నాన్నగారికి టెలిగ్రాం యిచ్చింది. వెంటనే ఆయన, తమ్ముడు బయలుదేరి వచ్చారు. రెండు రోజులకి పూర్తిగా జ్వరం తగ్గింది. వాళ్ళ ఊరు తీసుకెళ్ళి నీరసం తగ్గాక పంపిస్తా మన్నాడు తండ్రి.

"అయిదవ సం॥రం కూడా అయిపోతోంది. కాని వైద్యం వచ్చినట్టు లేదే?"

లత మాటలకి నవ్వింది శాంకరి.

"శాంకరీ నవ్వుతావెందుకు? అపర్ణకి అంత జబ్బు చేసిందా! మనకి తెలియలేదు చూసావా?"

"ఏం తెలుస్తుంది నీ మొహం? అయిదు సంవత్సరాలు పూర్తయ్యాక అనుభవంవల్ల తెలుస్తుందిలే"

"అంతేనంటావా?"

"సందేహం లేదు లతా?"

తర్వాత కూడా లత ఆ విషయం ఆలోచిస్తూనే వుంది.

"అపర్ణకు జబ్బు చేస్తే తనకు ఎలా తెలియలేదు." అదే లతను బాధించిన విషయం. వైద్య వృత్తి మామూలు విషయంకాదు. పరీక్షలు

పాసవడం ఒక ఎత్తు. ప్రాక్టీసు ఒక ఎత్తు అనుకుంది లత. అప్పటి నుంచి కాస్త శ్రద్ధ పెంచింది.

వారం రోజులు తిరక్కుండానే తిరిగి అపర్ణను తీసుకువచ్చారు. ఆమెకు జ్వరం మళ్ళీ ప్రారంభమయింది. శాంకరి, లత భయంతో వణికిపోయారు. ఈసారి మరిన్ని పరీక్షలు చేసారు. ఎవరికి ఏమీ అర్థం కాలేదు. చివరకు స్పెషలిస్టులు పరీక్షించారు. 'బ్లడ్ క్యాన్సర్' అని తేల్చారు.

అపర్ణకు తెలియనివ్వలేదు. వైద్యం జరుగుతోంది మూడు నెలలు మించి బతకదని చెప్పారు.

ఆమెకు చావు సమీపిస్తున్నట్లు అనిపించింది. తాను తిరిగి బతుకు తాననే ఆశ అపర్ణకు లేదు. ఆమె మనసు ఎందుకో జయరాం వైపు మళ్ళింది. అతనిని చూడాలనే కోరిక కలిగింది.

"శాంకరి, లత, అపర్ణ జబ్బు సంగతి తెలిసి వెక్కి వెక్కి ఏడ్చారు. తండ్రి సంగతి చెప్పనవసరం లేదు.

శాంకరి, లత, అపర్ణను చూడడానికి వెళ్ళారు. వాళ్ళనుచూడగానే అపర్ణ వెక్కి వెక్కి ఏడ్చింది. "నాలుగు రోజుల్లో తగ్గిపోతుంది? ఏడుస్తా వెందుకు? మేము వచ్చి చూసిపోతాంగా?" శాంకరి దగ్గర కూర్చుని ఓదార్చింది. కాని ఆమె మనసును మాత్రం ఓదార్చుకోలేకపోయింది శాంకరి. ఆమె చూడకుండా కళ్ళు తుడుచుకుంది.

లతకు అసలు నోటమాట రావడం లేదు. దుఃఖంతో కంఠం పూడుకుపోయింది.

"శాంకరీ! ఒక్కసారి జయరాంని చూడాలని వుంది?" అపర్ణ కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

'అలాగే! నే తీసుకొస్తా! ఇంత మాత్రానికి ఏడవాలా?'

అపర్ణ కళ్ళు తుడిచింది శాంకరి.

ఉషా! వందన అక్కడకు వచ్చారు. వాళ్ళిద్దరిని అక్కడకూర్చో మని చెప్పి జయరాం కోసం శాంకరి లత బయలు దేరారు. హాస్పటల్లోనే

ఎదురు వచ్చాడు జయరాం.

'అపర్ణకు ఎలా వుంది? తలవంచుకుని అడిగాడు. శాంకరీ, లత ఆశ్చర్యపోయారు.

'నీకు తెలుసా?'

'నాకన్నీ తెలుసు. ఆమెను చూడాలని ఉంది. కాని ఆమె నన్ను చూస్తే చీదరించుకుంటుందని వెళ్ళడం లేదు? అతని కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

శాంకరి, లత కూడా కన్ను తుడుచుకున్నారు.

'నిన్ను చూడాలంటోంది అపర్ణ! ఆమె బతకడం కష్టమంటున్నారు డాక్టర్లు' లత వెక్కి వెక్కి ఏడ్చింది.

'నో! నో! నా అపర్ణ చావడానికి వీల్లేదు" జయరాంని అర్థం చేసుకోలేకపోయారు శాంకరి, లతా కూడా!

శాంకరి, లతల వెంట జయరాం వచ్చాడు. అతన్ని చూడగానే అపర్ణ వెక్కి వెక్కి ఏడ్చింది. ఆమెను చూడగానే అతను ఏడ్చాడు.

అపర్ణా! అంటూ ఆమె రెండు చేతులు పట్టుకున్నాడు.

"ఎంత వైద్యమైనా నేను చేయిస్తా! నిన్ను బతికించుకుంటా!"

బెడ్ పక్కనే కుర్చీలో కూర్చుని ఓదార్చాడు జయరాం. "నీ ప్రేమని అర్థం చేసుకోలేకపోయాను. శాంకరిని వేడిపించడానికి వెంట పడ్డాను. రాధతో చనువుగా ఉన్నాను. నిజమే. మామేనమామ కూతుర్ని కాదని నిజంగా ప్రేమించింది నిన్నే అపర్ణా! కాని నన్ను అపార్థం చేసుకున్నావు. ఆ రాధకి అంటకట్టావు? అపర్ణా! ఇప్పటికైనా నన్ను అర్థం చేసుకో?" జయరాం వెక్కి వెక్కి ఏడ్చాడు. శాంకరి వాళ్ళు అతని మాటలు విని ఆశ్చర్యపోయారు. అపర్ణ తండ్రి కూడా అతన్ని చూసి జాలిపడ్డాడు.

వైద్యం జరుగుతూనే ఉంది. అయినా రోగం తగ్గుముఖం పట్టలేదు. ఒక రోజు జయరాం పుస్తైలు కొనుక్కొచ్చి బెడ్ మీదనున్న

అపర్ణ మెడలో కట్టాడు. అతని ఒడిలో పడుకుని అపర్ణ వెక్కి వెక్కి ఏడ్చింది.

ఆ దంపతుల్ని చూసిన డాక్టర్లు కూడా కళ్ళు ఒత్తుకున్నారు.

"శాంకరీ! గుర్తుపెట్టుకోవే!"

"లతా! నన్ను మర్చిపోకేం!"

అపర్ణ మాటలకి శాంకరి, లత నోట మాటరాక తలలూపారు.

జయరాం! అంటూ అతని ఒడిలో తలపెట్టుకుంది.

"నాన్నా! వెళ్ళిపోతున్నా" అపర్ణ మాట పడిపోయింది. కళ్ళు గాజు కళ్ళలా వుండిపోయాయి. ఆమె మెడ వరిగిపోయింది. ఆమెలోని ప్రాణవాయువు అనంతవాయువుల్లో కలిసి పోయింది.

జయరాంని ఎవరు ఓదార్చలేకపోయారు. భర్తగా ఆమె దహన సంస్కారాలన్నీ అతనే చేశాడు. జయరాం ప్రేమని మాత్రం ఎవరూ సరిగా అర్థం చేసుకోలేకపోయారు. అతన్ని నమ్మిన అపర్ణ మాత్రం అతని ఒడిలో ప్రాణాలు వదిలింది.

శాంకరీ, లత ఆ రూములో ఉండలేకపోయారు. ఎక్కడ చూసినా వారికి అపర్ణే కనబడుతోంది. అపర్ణ మాటలే వినబడుతున్నాయి. ఆ రూము వదిలి మరో రూముకు వెళ్ళిపోవాలనుకున్నారు.

"అపర్ణ లేకపోయినా, ఆమె జ్ఞాపకాలు ఈ గదినిండా ఉన్నాయి. ఇక్కడే వుందామే" శాంకరి మాట కాదనలేకపోయింది లత.

"నేను కూడా మీతో వుంటానే" వందన వచ్చి ఆ రూములో చేరింది.

రోజు అపర్ణ విషయం చెప్పుకోకుండా వుండలేకపోతున్నారు. ఏదో సమయంలో కథలా చెప్పుకుంటూనే వున్నారు.

"అమ్మా! శాంకరీ! నా బిడ్డను ఈ విశాఖ సముద్రానికి అప్ప చెప్పి వెళ్ళిపోతున్నానమ్మా! అంటూ ఏడుస్తూ వెళ్ళిన తండ్రి కళ్ళ ముందు నిలుస్తూనే వున్నాడు.

వైద్యశాస్త్రం ఎంత పెరిగినా రోగాలు అంతకు మించి పెరుగుతున్నాయి. అన్నీ తెలిసినా మానవ ప్రయత్నం తప్పదు! ఎందుకో నీకు తెలుసా లతా?

"నాకేం తెలుస్తుంది శాంకరీ! నేను అయోమయంలో పడివున్నా? చావాలో బాతకాలో తెలీడం లేదు"

"అవేం మాటలే లతా! మన ఆత్మీయురాలు పోయిందని మనకు బాధగా వుంది" కాని రోజుకు ఎంత మంది చనిపోతున్నారో? వారి సంగతి ఆలోచించు? మశూచిని లేకుండా చేశారు? టైఫాయిడ్ మరణాలు లేకుండా చేశారు. కేన్సర్ కి కూడా తగిన మందులు రావచ్చు. గుండెతీసి గుండె పెడుతున్నారు. ఇదే వైద్య శాస్త్రాభివృద్ధి" అర్థమయినట్లు తలూపింది లత.

# 73

శివకుమార్ ని చూడగానే తల్లికి లేని బలం వచ్చింది. ఎదురు వెళ్ళి కొడుకుని కౌగిలించుకుంది. పొంగి వచ్చిన దుఃఖాలూ కన్నీళ్ళ రూపంలో కారిపోగా ఇద్దరు స్థిమిత పడ్డారు.

శివకుమార్ తల్లికి పట్టుకొచ్చిన కానుకలు యిచ్చాడు. తర్వాత గిరిజకు, పిల్లవాడికి బట్టలు ఇచ్చాడు. సత్యానికి వాచీ, జేపు రికార్డురు యిచ్చాడు. చలపతికి, భార్యకు కూడా బట్టలు దాచి వుంచాడు. సూర్యానికి వస్తూన్నట్లు కూడా రాయలేదు. శాంకరి చదువు పూర్తయితే తప్ప ఆమెను కలవాలను కోలేదు.

మధుకి ఢిల్లీలో ఉద్యోగం రావడం వల్ల అతను ఊళ్ళోలేడు. శివకూమార్ కు ఏమీ తోచలేదు. ముళ్ళ మీద వున్నట్లే వున్నాడు.

ఒక రోజు తల్లి పక్కలో కూర్చుని మెల్లిగా మొదలు పెట్టాడు.

"ఏం అమ్మా! నేను ఇంకో రెండేళ్ళు అక్కడే వుద్యోగం చెయ్యాలనుకుంటున్నా! కాని నీ అనారోగ్యం వల్ల భయపడుతున్నా"

"శివా! భయమెందుకురా! నీ భవిష్యత్తు కైలాస శిఖరం వంటిది. నా ఆరోగ్యం చిన్న కొండ వంటిది. నాకోసం నీ వుద్యోగం వదులుకోకు. పైగా నాకిప్పుడేమంత అనారోగ్యమని" తల్లి మాటలకు ఆశ్చర్యపోయాడు శివా. తల్లి అలా అనుకుంటుందని అతను అనుకోలేదు. అతని మనస్సు కుదుటపడింది.

"కాని నా మాట ఒక్కటే వినాలిరా!"

"అలాగేనమ్మా! చెప్పు"

"ఏం లేదురా! నువ్వు పెళ్ళి చేసుకువెడితే నేనేమైన ఫరవాలేదురా! నీ చదువు పూర్తయిందని అంటున్నావు కదా!"

"చదువు అయింది నిజమే. కాని రెండేళ్ళ తరువాతే చేసుకుంటానమ్మా! ఎందుకంటే ఇప్పుడే పెళ్ళి చేసుకుంటే పిల్లని తీసుకెళ్ళడానికి సుమారు 18 నెలలు పడుతుంది. ఆ అమ్మాయి ఇక్కడ? నేనుఅక్కడా! నువ్వే చెప్పమ్మా! అందుకే ఏకంగా తిరిగి వచ్చాక నువ్వు చెప్పిన పిల్లనే చేసుకుంటాను.

కొడుకు మాటల్లో యదార్థముంది. అందుకే ఆ తల్లి అంగీకరించి "సరే నాయనా!" అంది.

తిరుగు ప్రయాణమయ్యాడు శివకుమార్. అతని మనసంతా శాంకరి మీద వుంది. కాని బలవంతంగా మరల్చుకొని ప్రయాణమయ్యాడు.

ప్రయాణమనగానే రోజీ గుర్తుకు వచ్చింది. భయంతో గజగజ వణికాడు. ఎలాగైనా ఆమె కంట పడకుండా తప్పించుకోవాలనుకున్నాడు. అందుకే ఉద్యోగం ఇంకో స్టేటులో సంపాదించాడు.

"అమ్మా! నీ ఆరోగ్యం జాగ్రత్త! నువ్వు జాగ్రత్తగా చూసుకుంటానంటేనే నేను వెడతాను. లేకపోతే ప్రయాణం మానుకుంటా" కొడుకు మాటలకు ఆ మాతృమూర్తి హృదయం కరిగిపోయింది.

"అలాగేరా! తప్పకుండా జాగ్రత్తగావుంటా! నువ్వు రెండేళ్ళదాటి

ఒక్క క్షణం అక్కడ ఉండకూడదు. ఈ మాట నువ్వు నిలబెట్టుకోవాలి! తెలిసిందా!" ఆమె కళ్ళు తుడుచుకుంది.

"అలాగేనమ్మా!" అంటూనే గిరిజకు, సత్యానికి తల్లిని గురించిన జాగ్రత్తలు, మందువేళలు అన్నీ చెప్పాడు. తీరాకొడుకు వెళ్ళే టైముకు ఏడ్చింది. అనుకోకుండా గుమస్తాగారు కూడా వచ్చాడు. ఆయన సత్యం శివకుమార్ వెంట ఎయిర్‌పోర్టుకి బయలుదేరాడు. గిరిజ మేనత్తను చూస్తూ ఉండిపోయింది.

శివకుమార్ అమెరికా చేరగానే ఉద్యోగంలో చేరాడు. రోజీకి తెలియనందుకు సంతోషపడ్డాడు శివకుమార్. రెండేళ్ళను వేళ్ళమీద లెక్కపెట్టుకోడం మొదలుపెట్టాడు. అక్కడకి వెళ్ళగానే శివకుమార్ సూర్యానికి విషయాలు వివరంగా రాసాడు. అతను వచ్చి కనపడనందుకు మాత్రం సూర్యం చాలా బాధపడ్డాడు.

# 74

అయిదవ సంవత్సరం పరీక్షలు పూర్తి అయ్యాయి. ఆ సాయంకాలం శాంకరి లత, వందన సామానులు సద్దుకున్నారు. ఎవరి ఊరు వాళ్ళువెళ్ళిపోవాలని.

"హాయ్ లతా! మన చదువు పూర్తయింది. ఈరోజు ఎంత హాయిగా వుందే" లత చేతులు పట్టుకుని వందన గిరగిరా తిప్పింది.

"అబ్బా! చదువు పూర్తయిందని సంతోషమే లేదు నాకు! తర్వాత వైద్యం చెయ్యాలంటేనే భయంగా వుంది. ఈ రోగాలంటేనే భయం. ఇంజక్షన్స్, ఆపరేషన్స్, దెబ్బలు కట్లు, ఒకటేమిటి గోల! అవే నాకు భయం. తలచుకుంటేనే గుండెదడ!"

"లతా! మరెందుకు చదివావే? తెల్లకోటు వేసుకుని తిరుగుదామనా?"

"అబ్బో! అదన్నా భయమే నాకు? ఎవడొచ్చి ఇంజక్షన్ చెయ్య

మంటాడో! నాలికే చూడమంటాడో? అయినా అసలు ఈ ఎ.పి.తో శోగాలెక్కువనుకుంటాను?"

ఆమె మాటలకు శాంకరి, వందన పకపక నవ్వారు.

"శాంకరీ! ఈ రోజు హాయిగా వూరంతా తిరిగి వద్దామే?"

"నాకు బండి శ్రైం అవుతోంది, నువ్వెళ్ళి తిరిగిరా!"

"రేపు వెడదామే? ఈ రోజు ఏంముంచుకు పోయింది చెప్పు. ఈ రోజు అలా తిరిగి వద్దామే!"

"తిరిగి రావడం బాగానే ఉంది. కాని మా అక్క ఇంటర్ పరీక్షలు రాస్తోంది. కనకం బి.ఏ. రాస్తోంది. ఇద్దరు నిరుడు ఫేలయ్యారులే. మళ్ళీ రాస్తున్నారు. నేను దగ్గరుండి రాయించాలి. మా నాన్నగారు, అమ్మ ఎదురు చూస్తూ వుంటారు? ఏం నీకు తొందరలేదా లతా?"

"మా అమ్మా! నాన్నా ఎదురుచూస్తారే! కాని అక్కడికి వెళ్ళాలని ఉండదు. నేను పెంచుకున్న ఆశాలత ఎప్పుడో మాడిపోయింది. ఇంక చిగురించదు" లత కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"అంత చిలిపిగా ఉండే లత కళ్ళలో నీళ్ళా! నవ్వుతూ ఉండే లత గుండెల్లో అంత ఆవేదనా?" శాంకరి ఆశ్చర్యపోయింది.

"లతా! లేనిపోని ఆశలు కల్పించుకుని నూరేళ్ళ జీవితం వాడిపోయిందనుకుంటావేమే? నీదే తప్పు. అతను నిన్ను ప్రేమించనప్పుడు నువ్వింతగా బాధపడకూడదు. ప్రేమ ఒక్కటే జీవితం కాదు. జీవితంలో ఒక భాగం ప్రేమ అంతే! చీర అంచు నీళ్ళలో ముంచితే చీరంతా ఆ రంగు పట్టుకున్నట్టు కాదే జీవితం. అయినా చదువుకునే ప్రతివారికి ఈ ప్రేమ గోలలేమిటే? చదువుకోడానికి వస్తున్నారో ప్రేమించుకోడానికి వస్తున్నారో తెలీడం లెదు" శాంకరి విసుక్కుంది.

"నాకే గోలలు లేవు? బాబూ! హాయిగా ఉన్నా" వందన చేతు లెత్తి చెప్పింది.

"అందరి గోలలు నీ గోలలే. మరి నీకింకా వేరు గోలలెందుకు?" లత విసుక్కుంది.

"ఇంతకీ శాంకరి వస్తావా లేదా?" లత కోపంగా శాంకరిని అడిగింది.

"రాక తప్పుతుందా! ప్రయాణాల బద్ధం. ప్రసాదాలు నిబద్ధి అంటారు అవునా శాంకరి."

"కాదు చదువుల బద్ధం. షికార్లు నిబద్ధం" శాంకరి మాటలకు లత, వందన నవ్వుకున్నారు.

ముగ్గురు రూముకు తాళం పెట్టి సినిమాకి బయలుదేరారు. అది తెలిసి మిగిలిన రూం వాళ్ళు కూడా బయలుదేరారు.

సినిమా ఏమీ నచ్చలేదు శాంకరికి. ఒకటే కొట్లాట. అంతలో కరెంటు పోయింది. అందరు యింటి ముఖం పట్టారు. మరునాడు ప్రయాణాలు.

"శాంకరి మనకి ఎడబాటు తప్పదా!" నీరసంగా అడిగింది లత.

ఎడబాటు కేముంది. మళ్ళీ హౌస్‌ర్జన్ చెయ్యాలిగా! నెల తిరక్కుండా ఇక్కడే ఉంటాం. కాని మన అపర్ణను మాత్రం ఈ వూరికి అప్పజెప్పి వెళ్ళిపోతున్నామే" శాంకరి కళ్ళు తుడుచుకుంది.

లత, వందన వెక్కి వెక్కి ఏడ్చారు. సొంత సోదరి కంటే ఎక్కువగా కలిసిమెలసి ఉండే అపర్ణలేని లోటు వారి గుండెల్ని బాధిస్తూనే వుంది, కాలంతో పాటు ఆ గాయం మానాలి. కాని తలచుకున్నప్పుడల్లా ఆ గాయం రేగుతూనే ఉంది. మరునాడు శాంకరి స్వగ్రామం వచ్చింది.

"శివా! ఇండియా వచ్చి వెళ్ళాడు. ఉత్తరం రాసాడు" సూర్యం మాటలు విని ఒక్కసారి ఉలిక్కి పడింది శాంకరి. తను మర్చిపోయాననుకుంది. కాని పాత జ్ఞాపకం మనసులో ఉంది.

"అలాగా! వాళ్ళమ్మగారు ఎలా ఉన్నారు?" ఏదో అడగాలని అడిగింది.

"ఆవిడ అలాగే ఉన్నారుట. గిరిజా, సత్యం ఇంట్లోనే వున్నారుగా! చూస్తున్నారుట." సమాధాన మిచ్చాడు సూర్యం.

అంతలో కనకం, సుశీల అక్కడికి రావడంతో ఆ విషయం మారిపోయింది. ఇద్దరికి ట్యూషన్ ప్రారంభించింది శాంకరి. తర్వాత రాజమండ్రి పరీక్షలకు బయలుదేరి వెళ్ళారు. వారి వెంట శాంకరి వెళ్ళింది.

"ఈసారి బాగా రాసాను. పాసయిపోతాను శాంకరీ!" కనకం సంతోషంగా చెప్పింది.

"అవును శాంకరీ! నేను కూడా బాగా రాసాను. ఈసారి పాసయిపోతాను" సుశీల కూడా సంతోషంగా చెప్పింది. ముగ్గురు రాజమండ్రి వరకు తిరిగి బయలుదేరి వచ్చేసారు.

ఆరోజే కాసులు చంటిపిల్లను తీసుకుని వచ్చింది. ముద్దబంతి పూవులా ఉంది. కాసులు సంతోషమంతా ముఖంలోనే కనబడుతోంది.

"నీ కూతురు పేరేమిటే" పిల్లను ఎత్తుకుంటూ అడిగింది.

"కోమల" మెలికలు తిరుగుతూ చెప్పింది కాసులు.

మీ అమ్మాయి పేరడిగితే నువ్వు సిగ్గుపడతావేమే?" శాంకరి మాటలకు కాసులు పకపకా నవ్వింది. అదే సమయానికి చంటిపిల్లకూడా నవ్వింది. అప్పుడు చూసింది శాంకరి నవ్వుతుంటే ఇద్దరి బుగ్గలు సొట్టలు పడటం.

కాసులూ! ఈ పిల్ల నీ పోలికే! చూసావా బుగ్గలు సొట్టలు పడటం" కాసులు పిల్లను ఎత్తుకుని "నా చిట్టి తల్లీ" అంటూ ముద్దులు పెట్టుకుంది.

"మీ అత్తగారు ఏమంటుందే?" శాంకరి అడిగింది.

"ఏమంటుంది. ముందు నానాతిట్లు తిట్టింది. అడ్డమైన వాళ్ళను కొంపకు తీసుకొచ్చి ఆచారాలన్నీ మంట కలిపారనీ తిడుతూనే వుంది. మా ఆడబడుచు కూతుర్ని కాని, కొడుకుని కాని పెంచుకోవాలని ఆవిడ కోరిక. వాళ్ళను పెంచుకుంటే మన చెప్పుచేతల్లో వాళ్ళు పెరగరు. అందుకే మా ఆయనకు యిష్టం లేదు."

"మీ అత్తగారు పెద్ద రాజకీయ వేత్తలా వుందే?"

"బుర్రలు తీసి బుర్రలు పెడుతుంది. కాని ఇప్పుడు పిల్ల యింత అందంగా ఉండటంతో 'మా బంగారు తల్లి అంటూ' ముద్దులు చేస్తోంది. ఆ కూతురు పిల్లలు ఏం బాగుండరు. కొండముచ్చుల్లా ఉంటారు.

"అయినా నా కూతురు ముందు వాళ్ళెంతే?" శాంకరి వైపు గర్వంగా చూసింది కాసులు. అంతలో సుబ్బులు పిల్లను తీసుకుని బయలుదేరింది.

శ్రీశైలం రమ్మని పట్టుపట్టింది సుబ్బులు. మూడు రోజులున్న తరువాత అందరూ నిజంగానే శ్రీశైలం బయలుదేరారు. శ్రీశైలం ప్రాజెక్టును చూసి మల్లికార్జున స్వామి దర్శనం, భ్రమరాంబికా దేవి దర్శనం చేసుకున్నారు.

ఇంట్లో వంటపనంతా సుబ్బులు అత్తగారే చేస్తోంది.

"అదేమిటే మీ అత్తగారు ఇక్కడుందీ!" శాంకరి ఆశ్చర్యంగా అడిగింది.

"కొన్నాళ్ళు రాకపోకలు లేవు. తర్వాత మా మామగారు కోపం తగ్గించుకున్నారు. ఇప్పుడు ఇక్కడే వుంటున్నారు. నాతో చెప్పకుండా ఆయన ఇంటి విషయాలు ఏమీ చెయ్యరు. మా అత్తగారు మొదటినుంచి బాగానే వుంది. కాని మా నాన్నగారు, మా మామగారు మాత్రం మాట్లాడుకోడం లేదు."

శాంకరి వాళ్ళు ఆశ్చర్యంగా విన్నారు. అక్కడ రెండు రోజులున్నారు. కాసులు కూతురుతో సహితంగా బయలుదేరి వచ్చింది. ఎంత బ్రతిమాలినా సుశీల శ్రీశైలం రాలేదు. తన పిల్లలతో తల్లితండ్రులు వేగలేరని భయం. కనకం కొడుకుని అత్తగారి దగ్గరే దిగబెట్టింది. అందుచేత నిశ్చింతగా వుంది. రెండురోజులు చాలా సరదాగా గడిచి పోయాయి.

"మీరంతా వైజాగ్ రండే! నా చదువు పూర్తవకుండా రావాలి, శాంకరి మరీమరీ చెప్పింది. శ్రీశైలం నుంచి తిరిగి రాగానే కాసులు చంటిపిల్లను తీసుకుని కాకినాడ వెళ్ళిపోయింది. శాంకరి విశాఖపట్టణం బయలుదేరింది. ఒక్క సంవత్సరం హౌస్‌సర్జన్ చేస్తే సంసారం

గట్టెక్కుతుందనుకున్నాడు రామనాథంగారు. కూతురు డాక్టరవుతోందని అన్నపూర్ణమ్మగారు సంబరపడింది.

# 75

శాంకరి రూములో అప్పుడే అడుగుపెట్టింది. అప్పటికే లత వచ్చివుంది.

"శాంకరీ! వచ్చావా!" అంటూ ఎదురువచ్చి కౌగిలించుకుంది లత.

"నువ్వెప్పుడొచ్చావు లతా?"

"నిన్ననే వచ్చాను"

"వందన రాలేదా?"

"వారం పదిరోజుల వరకు రానని కబురు చేసింది"

అయిదు సంవత్సరాల మెడిసిన్ కోర్సు పూర్తి చేసుకుని హౌస్ సర్జన్స్‌గా హాస్పటల్లో అడుగుపెడుతున్నారు. ఆ యువతుల గుండెల్లో ఏదో ఆనందం. చెప్పలేని తడబాటు. ఇంక డాక్టర్ల మవుతున్నామనే ధైర్యం వారిలో కనబడుతోంది.

మరునాడు హాస్పటల్లో శాంకరి, లత అడుగుపెట్టారు. తెల్లని కోట్లు తగిలించుకొని మెడలో స్టెతస్కోపు పెట్టుకొని హాస్పటల్ వార్డ్సులో తిరుగుతుంటే చాలా సంతోషంగా అనిపించింది వాళ్ళకి.

"లతా! అలా కంగారుపడుతున్నావెందుకే?" ఇంజక్షన్ చేస్తుంటే వణుకుతున్న లత చెయ్యిని చూసి అడిగింది శాంకరి.

"కొత్తకదా! కాస్త భయం అంతే! అయినా ఈ ఇంజక్షన్ బాధ లేకుండా వుంటే ఎంత బాగుండును!"

లత మాటలు విని శాంకరి నవ్వింది.

"ఇంక నువ్వేం ఆపరేషన్స్ చేస్తావే! ఆడవాళ్ళ డెలివరీ కేసులేం చెయ్యగలవు?"

"అలాటివి నాకొద్దుతే! ఏదో ఈ స్టెతస్కోపుతో పరీక్షించడం, నోట్లో థర్మామీటర్ పెట్టి జ్వరం చూడడం, మందులివ్వడం అంతే. నా పని!"

లత మాటలకి మిగిలినవాళ్ళు కూడా నవ్వుకున్నారు.

శాంకరి చాలా తెలివిగా రోగులను పరీక్షిస్తోంది. మాటలో ప్రేమ, చేతలో నిదానం. వైద్యంలో చురుకుతనం చూసి పెద్ద డాక్టర్లకు కూడా ఆమె అంటే చెప్పలేని అభిమానం ఏర్పడింది. ఆమె తెలివితేటలకి మరింత ప్రోత్సాహం లభించింది శాంకరికి. అన్ని రకాల రోగాలను జాగ్రత్తగా పరీక్షచేసి తెలుసుకుంటోంది.

వార్డుల్లో శాంకరితో లత కూడా వెళ్ళేది.

"ఆ అమ్మను చూడమనమ్మా! నువ్వొద్దు" రోగులు అలా అంటే లత మనసులో శాంకరిని మెచ్చుకునేది. పైకి మాత్రం కోపం ప్రదర్శించేది.

"నాకు మరీ మంచిది. చాకిరీయేనా తప్పుతుంది. ఆవిడగారికే చూపించుకోండి" అనేది.

"అదేం కుదురదు. రా! నేదగ్గరుంటా!" అంటూ లతచేత ఒక సీనియర్ డాక్టర్లా పనిచేయించేది శాంకరి. లత తెలివైందే కాని కాస్త బద్ధకం ఎక్కువ. సరదాయైన మనిషే కాని, కాస్త తేడా వస్తే చికాకు పడుతుంది. ఆ చికాకును మనసులో దాచుకునే శక్తిలేదు. పైకి వెంటనే కనబడుస్తుంది. ఒకరోజు హాస్పటల్లో ఒక డెలివరీ కేసు వచ్చింది. సీనియర్ డాక్టర్లు లేరు. నర్సు వచ్చి శాంకరిని, లతని పరీక్ష చెయ్యడానికి పిలిచింది. శాంకరి, లత వార్డులో అడుగుపెట్టారు. ఆవిడ నెప్పులతో బాధపడుతోంది. మూలుగుతోంది. గావుకేకలు పెడుతోంది. డెలివరీ కావడానికి యింకా టైం వుంది. డాక్టరు రాసిన చార్టు ప్రకారం టైంకి ఇంజక్షన్ యివ్వాలి.

ఆ నలుగురు ఆమెను నర్సు బలవంతంగా పట్టుకుంటే శాంకరి

ఇంజక్షన్స్ చేస్తోంది. ఆమె మొదటి కాన్పు పిల్ల. ఆమె ఒకటే మారాం చేస్తోంది. ఏడుస్తోంది. అరుస్తోంది. మొత్తుకుంటోంది.

శాంకరి ఆమెకు నచ్చజెబుతోంది. అయినా ఆమె వినడంలేదు. మళ్ళీ ఇంజక్షన్ చేసే టైం అయింది. ఆమె చేయించుకోనని మొరాయించింది. నర్సు కోపం చేసింది. శాంకరి నచ్చచెప్పింది. ఆమె వినలేదు. లతకు చెప్పరాని కోపం వచ్చింది.

"నోరు మూసుకుంటావా లేదా?" అంటూ దవడ పగిలేటట్టు కొట్టింది.

శాంకరికి నోటమాట రాలేదు. నర్సులు కంగారుపడిపోయారు. ఆ నెలలు నిండి బాధ భరించలేక ఏడుస్తున్న పిల్ల ఒక్కసారి కెవ్వుమంది. పన్ను పెదానికి నొక్కుకుని రక్తం వచ్చింది.

ఆమె కెవ్వుమనడంతో నెప్పులు ఎక్కువై వెంటనే డెలివరీ అయిపోయింది.

శాంకరి, నర్సులు కలిసి పురుడు పోసారు. లతకు మాత్రం ఏడుపు వచ్చినంత పనయింది.

అది తెలిసిన సీనియర్ డాక్టర్లు వచ్చి సమయస్ఫూర్తిగా డెలివరీ కేసు చేసినందుకు శాంకరిని అభినందించారు. లత తల వంచుకుని నిలబడింది.

"లతా! నువ్వు కోపంలో కొట్టినా ఎంతపని జరిగిందో చూసావా! నెప్పులు ఎక్కువై డెలివరీ అయిపోయిందికాని, నువ్వు అలా కోపం వచ్చి పేషెంటును కొట్టడం చాలా తప్పు. నువ్వు వైద్యవిధానం తెలిసి అవసరమైతే కొన్ని పద్ధతుల్ని అనుసరించే స్థితికి ఎదగాలి. అప్పటి వరకూ తొందరపడి ఇలాంటి పలును చెయ్యకూడదు." అన్నారు. లత మాత్రం వంచిన తల ఎత్తలేదు.

తర్వాత కోపం తగ్గించుకోవడానికి, ఓర్మి పెంచుకోవడానికి ప్రయత్నం చేసింది. అప్పటినుంచి రోగులు లత పేరు చెబితేచాలు,

"అమ్మబాబోయ్! ఆవిడా! మాకొద్దు బాబోయ్!" అనడం మొదలు పెట్టారు.

సీనియర్ డాక్టర్లు కూడా ఆమె వార్డుకు వెళ్ళవలసివస్తే నలుగుర్ని వెంటపంచేవారు. శాంకరి మాత్రం మరింత మంచిపేరు తెచ్చుకుంటోంది. అటు డాక్టర్ల అభిమానం, ఇటు పేషెంట్ల అభిమానం అందుకుంటోంది.

కాస ఆలస్యంగా వచ్చినా వందన, ఉషా కూడా చాలా శ్రద్ధగా అన్ని విషయాలు తెలుసుకుంటున్నారు.

"జయరాం మెంటల్ హాస్పటల్‌లో ఉన్నాడుట" ఒకరోజు ఉష వచ్చి చెప్పింది.

"అదేమిటి ఉషా!" శాంకరి ఉలిక్కిపడి అడిగింది.

"అవును శాంకరీ! అపర్ణమీద బెంగతో అలా అయిపోయాడనుకుంటున్నారు.

అయినా అసలు అదేకాదు, రాధ చనిపోవడం, మేనమామ కూతురు మరొకరిని పెళ్ళిచేసుకోవడం, అపర్ణ చనిపోవడం, ఇంట్లో ఆర్థిక ఇబ్బందులు అతన్ని కుంగదీసాయి."

"అది అంతా అతను చేతులారా చేసుకున్నదే కదా!"

"నిజం శాంకరీ! మేనమామ కూతుర్ని చేసుకుంటానని మాట యిచ్చి యిటు నీవెంట పడ్డాడు. రాధను పెళ్ళి చేసుకున్నాడు. అందుకే ఆమె అలా చేసింది. చేసుకున్న పాపం అనుభవించాలి కదా! ఇంత మందిలో తెలివిగా తప్పించుకున్నది నువ్వే శాంకరీ!"

"తప్పించుకోడానికేముంది లతా! చిన్నతనంలో కొందరికి అలాంటి పిచ్చిచేష్టలుంటాయి. వయసు వస్తే తగ్గుతాయి. కాని తప్పించుకోలేని తప్పులు చేసాడు జయరాం. అంతేకాదు, అసలు ప్రేమించిన అపర్ణ చనిపోవడమే అతన్ని కుంగదీసింది."

శాంకరి మాటలకు లత, ఉషా, వందనా కూడా తలలూపారు.

"అపర్ణ మనలను వదలి వెళ్ళిపోవడం చాలా అన్యాయ శాంకరీ!"

అపర్ణ తలపుకు రాగానే అందరి మనసులు బరువెక్కాయి అందరి కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

అంతలో సూర్యం వాళ్ళ దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది.

సూర్యం, కనకం విశాఖపట్నం చూడ్డానికి వస్తున్నట్లు రాసారు. సుబ్బులు కూడా వస్తుందనుకున్నారు. కాని రానని రాసింది. వాళ్ళాయ నకు ఆ ప్రాంతానికి ట్రాన్స్ఫరయినప్పుడే వస్తామని రాసింది.

శాంకరి కంటే కూడా లత, ఉష, వందన చాలా హడావిడి పడుతున్నారు. కనకం వస్తోందంటే వారికి చాలా సరదాగా ఉంది.

వాళ్ళతోపాటు హాయిగా తిరగవచ్చని వాళ్ళవుద్దేశం. కనకం, సూర్యం హోటల్లో దిగారు. కనకం ఎప్పుడు వైజాగ్ రాలేదు. పైగా పుట్టాక ఎప్పుడూ హోటల్లో భోజనం చెయ్యలేదు. ఆమె సరదాతీరడా నికే సూర్యం హోటల్లో రూం తీసుకున్నాడు.

ఆ సాయంకాలం బీచ్, బీమ్లీ చూడడానికి బయలుదేరారు. తర్వాత అందరూ కలిసి విజయనగం వెళ్ళారు. గజపతి రాజుల గత వైభావాన్ని ప్రదర్శించే ప్రదర్శనాశాలను చూసారు. వారు వాడిన కవచాలు చూసి ఒళ్ళు గగుర్పొడిచింది వాళ్ళకి. కనకం హడావిడి చెప్పనవసరం లేదు. కనకానికి లతతో స్నేహం బాగాకుదిరింది. వాళ్ళి ద్దరి స్వభావాలు ఒక్కలా ఉన్నాయి.

"ఏమ్మా! మీ అబ్బాయిని తీసుకురాకుండా టింగురంగాని బయలు దేరారు?" శాంకరి అడిగింది.

"మన మధ్యలో వాడెందుకే అయినా నా కొడుకు నలిగిపోతాడె?"

"నువ్వొకత్తివే కన్నావులే కొడుకుని!

"వాడు కూడా నీతోపాటు చూసి సంతోషించును కదా?" అబ్బా! సంతోషం కాదే నన్ను పీక్కుతినేస్తాడు. వాడి పేచీలు నేనెట్లా

తీర్చనే?" కనకం మాటలకి అందరు నవ్వుకున్నారు. తర్వాత అందరు కలిసి బొబ్బిలి కోటను చూడాలని బయలుదేరారు.

కోటను చూసారు. మల్లమ్మ దేవి అంతఃపురంలో మరణించిన ప్రదేశం చూసి విలవిల్లాడారు. ఆమె సాహసానికి ఆశ్చర్యపోయారు. తాండ్ర పాపారాయుడి వీరగాథ కళ్ళముందు నిలిచింది. అందరి కళ్ళు చమర్చాయి.

తర్వాత అందరూ కలిసి అరసవిల్లి వెళ్ళి ప్రత్యేక దేవతా స్వరూపుడైన సూర్య దేవాలయాన్ని చూసివచ్చారు. అందరి మనస్సులు ఆనందంతో నిండిపోయాయి. సింహాచలం, సూర్యం, కనకం మాత్రమే వెళ్ళి వచ్చారు.

"తనకు తెలుసున్న ఆలోకానికి ఈ లోకానికి ఎంత తేడావుందో!" ఎన్ని విషయాలు తెలుసుకున్నానో? ఇప్పటికైన గుమ్మం కదిలాను" అనుకుంది కనకం.

"మన చదువు? మన పనులు. మన లాభాలు - మన నష్టాలేకాదు లోకాన్ని చూసి నేర్చుకోవలసింది చాలా ఉంది. అందుకే లోకజ్ఞానం అన్నారు" అనుకున్నాడు సూర్యం.

"అయిదేళ్ళ నుంచి యిక్కడవున్నాం కాని ఏమీ చూడలేదు. మీ కనకం ధర్మమాని అన్నీ చూసాం శాంకరీ" అంది లత.

"ఇంక మన చదువులు పూర్తి అవుతున్నాయి. మనకి ఈ ప్రాంతానికి యింక ఋణం తీరిపోతుందేమో?" ఉష కాస్త బాధగా అంది.

అన్నీ చూడ్డం పూర్తయింది. ఇంక హౌస్ సర్జన్ కూడా పూర్తయితే హాయిగా యిళ్ళకి పోవచ్చులే" వందన మాటలకి అందరికి నవ్వు వచ్చింది.

తర్వాత కనకం, సూర్యం ప్రయాణమై వెళ్ళిపోయారు. వాళ్ళు వచ్చేటప్పుడు పట్టుకొచ్చిన జంతికలు, పాలకోవా, పూతరేకులు అరటి పళ్ళు వాళ్ళు వెళ్ళే వరకు తింటూనే ఉన్నారు.

"మా వూరువస్తే మరిన్ని పెడతాను. మీరంతా మావూరు రావాలి" కనకం అందరిని అహ్వానించింది. సూర్యం కూడా ఎన్నో సార్లు చెప్పాడు. కాని అంతమంది ఆడవాళ్ళ మధ్యలో సూర్యం వంటరి వాడయ్యాడు. వారితో ఫ్రీగా తిరగలేక కాస్త బెరుకుగానే ఉన్నాడు.

కనకం వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత శాంకరి వాళ్ళకి ఏమీ తోచలేదు. తర్వాత మళ్ళీ రొటీను వర్క్‌లోకి దిగారు.

విద్యార్థులందరిలో శాంకరి మంచి పేరు తెచ్చుకుంది. ఉషా, వందనా కూడా చాలా చురుగ్గానే వున్నారు. లత మాత్రం పెద్దగా మెరిట్ చూపించలేకపోయింది. సంవత్సరకాలం యిట్టే పూర్తిఅయింది. చివరి నెలలో శాంకరి మరింత శ్రద్ధగా పనిచేసింది.

"ఏం శాంకరీ! ఫర్‌దర్ ఏం చేద్దామనుకుంటున్నావు?" పెద్ద డాక్టర్ అడిగారు. ఆయన ప్రొఫెసర్ రాధాకృష్ణమూర్తిగారు.

"మా వూళ్ళో ప్రాక్టీసు పెట్టాలనండి ఇంత కష్టపడి చదువు కున్నాను."

"అలాగా! అయితే ఇంకా సర్జరీ అదీ బాగా నేర్చుకోవడం చాలా మంచిది. కొన్నాళ్ళపాటు ఎక్కడైన పని చెయ్యమ్మా?"

"అంటే ఎంతకాలమంటారు?"

"కనీసం ఒక్క సంవత్సరం. ఎక్కడైన పెద్ద డాక్టర్ దగ్గర పనిచేస్తే మంచిది. ఒక పెద్ద నర్సింగ్ హోంలో"

"ఒక్క సంవత్సరం చాలాండి! అయితే ఆ నర్సింగ్ హోం కూడా మీరే చెప్పండి?"

"మద్రాసులో చాలా పెద్ద నర్సింగ్ హోం వుంది. నా స్నేహితుడే అతను. అతని దగ్గర ప్రాక్టీస్ చెయ్యి"

"అలాగే నండి" శాంకరికి అతను లెటర్ రాసిచ్చాడు.

"థాంక్‌యూ! వెరీమచ్ సర్" శాంకరి అతన్ని పలకరిస్తుంటే ఆమె కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

"అదేమిటే? శాంకరీ! ఏడుస్తున్నావా?" లత, వందన అదుర్దాగా అడిగారు.

"ఏడవడంలేదే! ఇటువంటి మహానుభావుల దగ్గర పని చేసే అదృష్టం మనకి ఎలాదొరుకుతుందే! ఇంక మనకి ఆ అదృష్టం లేదు. ఈవాల్టితో పూర్తయింది." శాంకరి మాటలు విన్న తరువాత వారి కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

ప్రయాణాలకి సామానులు సర్దుకుంటున్నారు. వారి చేతులు వణుకుతున్నాయి. వారి మాటలు తడబడుతున్నాయి.

ఒకసారి వెళ్ళి కాలేజీని చుట్టివచ్చారు. హాస్టలంతా తిరిగి పేషంట్లని పలకరించి వచ్చారు. దూరమవుతున్నామనుకోగానే వారిలో ఆలోచనా శక్తి తగ్గిపోయింది. ధైర్యానికి బదులు అధైర్యం ప్రవేశించింది. తమతోటి క్లాసుమేట్సును, సీనియర్సును, జూనియర్సును, నర్సులను, ఆయాలను, సీనియర్ల డాక్టర్లను, సర్జన్సును, ప్రొఫెసర్సును కలుసుకుని అందరి దగ్గర వీడ్కోలు తీసుకోడానికే నాలుగు రోజులు పట్టింది?

నలుగురు హాస్పటల్ బయటకు వస్తుంటే శాంకరి ఒక్కసారి నేలంతా చూసుకుంది. ఎన్ని వందలసార్లు ఆ వరండాల్లో, ఆ గదుల్లో, వార్డుల్లో నడిచిందో ఎన్నిసార్లు ఆ నేలమీద తన పాదాల గుర్తులు పడ్డాయో? బయటకు వచ్చి నేలంతా కలియచూసింది శాంకరి. ఆ మట్టిలో తన అడుగు జాడలు ఎక్కడైనా ఉన్నాయోమోనని? దాని పక్కన ఉన్న చెట్ల దగ్గరకు వచ్చి ఆగింది. ఆకుల మీద తన చేతి ముద్రలున్నాయేమోనని తడిమి చూసుకుంది.

"శాంకరికి పిచ్చిపట్టలేదు కదా!" అని లతా వాళ్ళు భయపడ్డారు.

"శాంకరీ? ఏమిటే అలా చూస్తున్నావు?". లత అడిగింది.

"ఏం లేదు లతా! ఈ ప్రాంతమంతా ఎన్ని వందలసార్లు తిరిగామో? మళ్ళీ తిరగవీలులేదు. అదిగో మనకు వైద్యం నేర్పిన హాస్పటల్

తల్లిలాంటిది. మనకు విద్య నేర్పిన మెడికల్ కాలేజీ మనపాలిట దేవత! జీవితంలో వీటిని ఎలా మర్చిపోతాం చెప్పు"

"నిజమే శాంకరీ" అన్నారు వాళ్ళు.

తర్వాత రూముకు వచ్చారు నలుగురు. రూమును ఒక్కసారి చూసుకుంది. "ఇక్కడ ఋణం తీరిపోతోంది లతా!" శాంకరి మాటలు వారికి వింతగా అనిపిస్తున్నా అవి యదార్థాలని వారికి తెలుసు.

"జయరాంని ఒకసారి చూసి వద్దాము ఉషా"

"వాడు త్రిరోగ్! వాడిని చూడ్డం దేనికి? పైగా రాధను పొట్టన పెట్టుకున్నాడు"

"లతా! నిజమే కాని చావుబతుకుల్లో అపర్ణను చేరతీసి ప్రేమ నందించాడు. అంత రోగంతో ఉన్నా అతని సహచర్యంతో అపర్ణ బాధలు మర్చిపోయింది. అపర్ణకు అప్తుడైనప్పుడు మనకు అప్తుడు కాడా?"

"నిజం శాంకరీ! నువ్వన్నది నిజం! మనం వచ్చింది వెళ్ళింది కూడా అతనికి తెలీదు. అయినా మనకోసం చూసి వద్దాం"

అతన్ని చూడగానే అందరికి జాలి వేసింది. బాధపడిన మనస్సు లతో రూముకి తిరిగి వచ్చారు.

అందరికంటే ముందు శాంకరి ట్రైన్ వుంది. నలుగురు బయలు దేరేముందు వెక్కి వెక్కి ఏడ్చారు. ఒకరినొకళ్ళు కౌగిలించుకున్నారు.

"మన ఆప్యాయతకు, మన స్నేహానికి, మన సహవాసానికి తెర పడిపోయింది శాంకరీ! మళ్ళీ ఈ రోజులు మన జీవితంలో తిరిగి రావు?" లత శాంకరిని పట్టుకుని వెక్కి వెక్కి ఏడ్చింది.

"లతా! ఏడవకు? మీరంతా మావూరు ఎప్పుడు వస్తున్నారు" శాంకరి మాట మార్చింది.

"నువ్వు ప్రాక్టీసు పెట్టాకా! ఇప్పుడు మాత్రం కాదు?" లత సమాధానమిచ్చింది.

నలుగురు స్టేషన్‌కి వచ్చారు. శాంకరిని రైలు ఎక్కించారు. ఉష, లత, వందన వెక్కి వెక్కి ఏడ్చారు. రైలు కదులుతుంటె కళ్ళు తుడుచుకున్న శాంకరి వాళ్ళవైపు దీనంగా చూసి చెయ్యి వూపింది. రైలు వేగం అందుకుంది. దాటిపోతున్న రైలు స్టేషన్, వైజాగ్ పూరును ఆప్యాయంగా చూసుకుంది శాంకరి.

## 76

సామానుతో బస్సు దిగింది శాంకరి.

“డాటరమ్మ వచ్చింది. డాటరమ్మ వచ్చింది” అంటూ తెలుసుకున్న వాళ్ళంతా ఒకటే హడావిడి చేసారు.

“రిక్షా కట్టమంటారా!” రిక్షా వాళ్ళు అడిగారు.

ఒక రిక్షాలో ఎక్కింది శాంకరి. సామాను అందులో పెట్టి తొక్కడం ప్రారంభించాడు.

“మీ ప్రాక్టీసు పెట్టారనుకోండి ఈవూళ్ళో గవర్నమెంట్ డాటర్ హడలెత్తి పారిపోతారమ్మా! మీరు కేసులు చూడ్డానికెడితే నా రిక్షాలోనె వెళ్ళాలి! అమ్మాయిగారూ!”

“అలాగె! తప్పకుండా! నీ రిక్షాలోనే వెడతా?” అతన్ని నిరుత్సాహపరచడం యిష్టం లేక అంది!

ఎవరో తెలుసున్న పిల్లలు శాంకరిని చూసారు. రిక్షాకంటే ముందు అడ్డదారిన వచ్చి “డాటరమ్మా వస్తోందని” శాంకరి యింట్లో చెప్పారు. ఇంట్లో వాళ్ళంతా వీదుల్లోకి వచ్చారు. అది చూసి ఇరుగుపొరుగు వాళ్ళు బయటకు వచ్చి నిలబడ్డారు. కనకం పిల్లాడిని చంకనేసుకొని వచ్చింది. సూర్యం కూడా వచ్చాడు.

రిక్షా దిగ్గానె చుట్టుపక్కలలో వారంతా! “డాక్టరమ్మా వచ్చావా?” అంటు పలకరించారు.

"ఏంలేదు? ఫ్రీగా వైద్యం చేస్తావని పలికరింపులు. నీ కాంపౌం డరు నేనేనని వాళ్ళకు తెలియదు" కనకం విసుక్కుంది.

"పోనీవే కనకం" శాంకరి నవ్వింది. "నువ్వు ముందు లోపలికి నడు. అందరి కళ్ళ దిష్టి నీకే తగులుతోంది" కాసులు శాంకరి చెయ్యి పట్టుకుని లోపలికి లాక్కు వెళ్ళింది.

"రేపటి నుంచి దిష్టి తగలకుండా మీ అబ్బాయిలాగే దిష్టిబొట్టు పెడుదువుగానిలే" శాంకరి మాటలకి పిల్లలంతా నవ్వారు.

"పిన్ని వచ్చింది పిన్ని వచ్చింది." అంటు పిల్లలు చుట్టు ముట్టారు.

"ఇంటర్ ఫైనల్ పరీక్షలు బాగా రాసావా రవీ?"

"ఓ!" అన్నాడు రవి!

కూతుర్ని చూసుకుని రామనాధం గారు పొంగిపోయారు. తల్లి అన్నపూర్ణమ్మ హడావిడి చెప్పనవసరం లేదు. సుశీల చెల్లెల్ని కౌగి లించుకుంది.

నుదుట తిలకం బొట్టుతో మామూలుగా తిరుగుతున్న అక్క గారిని తృప్తిగా చూసింది శాంకరి.

"మీ స్కూలెలావుంది అక్కా"

"మా స్కూలుకేం బ్రహ్మాండంగా వుంది. చుట్టుపక్కల వూళ్ళ పిల్లలందరు ఇక్కడికే వస్తున్నారు సూర్యం రెసిడెన్సియల్ స్కూల్‌గా మార్చాడుగా!"

"డబ్బు కూడా బాగానే వస్తున్నట్టుంది?

"ఆ బాగానే వసూలు చేస్తున్నాడు. ఎంట్రెన్స్ టెస్టు పెట్టి అందులో పాసయిన వాళ్ళకే సీటు కాని ఉన్నవాళ్ళకే డొనేషన్‌లు వసూలు చేస్తున్నారు. ఆదాయాన్ని బట్టి వసూలు"

అన్ని విషయాలు నేర్పిన అక్కగారిని వింతగా చూసింది శాంకరి. శాంకరి వచ్చింది మొదలు కనకం నీడలా తిరుగుతూనేఉంది.

ఆ సాయంకాలం వూళ్ళో వున్న హాస్పటల్ని ఒకసారి చూసిరావాలను కున్నారు శాంకరి, కనకం.

మధ్యాహ్నం కాసేపు పడుకుని లేచింది శాంకరి. ప్రయాణపు అలసట కాస్త తీరినట్లయింది. వేసవి ఎండ వేడిమికాస్త తగ్గింది.

సుశీల చెల్లెలకి అరటికాయితో బజ్జీలువేసి పట్టుకొచ్చి యిచ్చింది.

"బాగున్నాయి అక్కా" అంటు తింటోంది శాంకరి.

"అమ్మా! శాంకరమ్మా! నువ్వే నాబిడ్డను రక్షించాలి తల్లీ" రైతు రామయ్య పరుగెత్తుకుంటూ వచ్చాడు. తింటున్న ప్లేటు పక్కన పెట్టి పీధుల్లోకి వచ్చింది శాంకరి.

"ఏం జరిగింది రామయ్యా!" శాంకరి అడిగింది.

"నా చిన్న బిడ్డకి రాత్రినుంచి నెప్పులొస్తున్నాయమ్మా! ఇంత వరకు కాన్పు కాలేదమ్మా! నెప్పులు బాధపడలేక పోతోందమ్మా నా తల్లిని నువ్వే బతికించాలమ్మా!"

"రాత్రి నుంచి ఏం చేస్తున్నారు రామయ్యా!" శాంకరి కోపంగా అడిగింది.

"డాక్టరు బాబు వూళ్ళోలేడు. మంత్రసానిని పిలిపించానమ్మా! ఇదిగో వస్తుంది అదిగో వస్తుంది. కంగారు పడకండని అంటూనే వుందమ్మా! గంటనుంచి పిలిచినా పలకడం లేదు. కాళ్ళు చేతులు కొట్టు కుంటోంది. నువ్వే ఆదుకోవాలి తల్లీ!"

"రామయ్యా: నువ్వు ముందు యింటికెళ్ళు, నేను వస్తున్నా!"

రామయ్య యింటివైపు పరిగెత్తాడు.

శాంకరి కనకానికి కబురు చేసింది, కనకం వెంటనే వచ్చింది.

ఏవరి కోసమో వస్తున్న రిక్షాను ఆపి ఎక్కారు ఇద్దరు.

రామయ్య యింటి వైపు రిక్షా పరుగు తీసింది.

ఊరి చివర వుంది ఆ యిల్లు.

ఆ ప్రాంతమంతా చెత్తా చెదారాలతో నిండి వుంది. చుట్టూ మురికి గుంటలు మధ్య మధ్య గుడిసెలు. అక్కడ అక్కడ తాటాకుల ఇళ్ళు ఎత్తుగా కనబడుతున్నాయి. అందులో ఒక యింటి ముందు రిక్షా ఆగింది. శాంకరి, కనకం తలవంచుకుని ఆ యింట్లో అడుగుపెట్టారు. ఆ యింటికి ఒకటే ద్వారముంది. ఒక చిన్న కిటికీ ఎత్తుగా ఉంది. పగలు కూడా దీపం వెలిగించుకోవాలి. లేకపోతే కళ్ళు కనపడవు. అక్కడి మురికి వాసన భరించలేక శాంకరి, కనకం ముక్కుకి పమిట కొంగులు అడ్డుపెట్టుకున్నారు.

లోపల కుక్కి నులక మంచం మీద పడున్న అచ్చమ్మ అరుపులకు అటు చూసారు. పైకి పొట్టమాత్రమే కనబడుతోంది. కాళ్ళు చేతులు కూడా కర్రల్లా వున్నాయి. లోతుకు పోయిన కళ్ళు పావినీటిలో మెరిసే చుక్కల ప్రతిబింబాల్లా ఉన్నాయి. ఎండిపోయిన చెక్కిళ్ళు మాసిన చిగురుల చీర తైల సంస్కారం లేని ఎర్రని జుట్టు పేదతనానికి వారసురాలిగా వుంది. కాళ్ళు చేతులు, తల కొట్టుకుంటున్నాయి.

శాంకరి స్టెతస్కోపుతో పరీక్ష చేసింది. తర్వాత కడుపంతా నొక్కి చూసింది. కడుపులో వున్న శిశువు పొజిషన్‌కి రాలేదని యిట్టే గ్రహించింది.

"ఎలా వుందమ్మా! నా తల్లిని రక్షించమ్మా" అంటూ అచ్చమ్మ పక్కనే నిలబడి ఏడుస్తోంది తల్లి.

"ఆ పిల్లకేం భయంలేదు. నువ్వు అనవసరంగా ఏడ్చి ఆమెను భయపెట్టకు ధైర్యంగా ఉండు" శాంకరి ఆ తల్లికి చెప్పింది.

కన్నకూతురి ప్రాణాలకోసం వచ్చే దుఃఖాన్ని బలవంతంగా అపుకుంది ఆ తల్లి.

శాంకరి మరోసారి పరీక్షించింది. లేని ధైర్యం తెచ్చుకుంది.

అంతలో సూర్యం అక్కడకు వచ్చాడు.

"సూర్యం నువ్వెళ్ళి డాక్టర్ని హాస్పటల్‌కి తీసుకురా! అచ్చమ్మని అక్కడికి తీసుకువస్తాం!"

సూర్యం తిరిగి సైకిలు మీద డాక్టర్ కోసం బయలుదేరాడు.

"రామయ్యా ! అచ్చమ్మని హాస్పటల్‌కి తీసుకురండి. నేను అక్కడ వుంటాను."

"అలాగేనమ్మా!" అంటూ రెండెడ్ల బండి ఏర్పాటు చేసాడు రామయ్య.

శాంకరి, కనకం వచ్చిన రిక్షాలోనే మళ్ళీ ఎక్కి కూర్చున్నారు.

మంత్రసాని అచ్చమ్మతో బయలుదేరింది.

"శాంకరీ! అచ్చమ్మ అంత సీరియస్‌గా ఉంటే భయం లేదంటావేమిటి?" కనకం అడిగింది.

"ఆమె కండిషన్ క్రిటికల్‌గానే ఉంది. పిల్ల పొజిషన్ సరిగా లేదు. ఆమెకు మామూలు డెలివరీ కాదు. ఆపరేషన్ చేయ్యాలి. కాకపోతే చచ్చిపోతుంది."

"ఆపరేషనే? అమ్మబాబోయ్ నువ్వు చేస్తావా?"

కనకం భయంగా అడిగింది.

"అవును కనకం"

"ఆ" అంటు నోరు తెరించిది.

"అంతలో హాస్పటల్ వచ్చింది. ఇద్దరు రిక్షా దిగి లోపలికి నడిచారు. అప్పటికే సూర్యం డాక్టర్ని తీసుకువచ్చారు.

హాస్పటల్ ఊరికి మధ్యలోనే వుంది. డాక్టరు చాలా తెలివైన వాడు. వైద్యం జాగ్రత్తగానే చేస్తున్నాడు. కాని హాస్పటల్లో తగిన మందులు, పరికరాలు, బెడ్స్‌లేవు. దానికి సాయం జనం కూడా అతనికి తగిన అవకాశం యివ్వరు. ప్రాణం పోతుంటే తప్ప డాక్టర్ని పిలవరు.

శాంకరి అచ్చమ్మ కేసు సంగతంగా వివరించింది.

అంతలో అచ్చమ్మను బండిలో అక్కడకు తీసుకువచ్చారు.

ఆమెతోపాటు మంత్రసాని కూడా అక్కడకు వచ్చింది.

అచ్చమ్మను తీసుకువెళ్ళి లోపల బెడ్ మీద పడుకోపెట్టారు. తగిన సామగ్రి లేకపోయినా ఉన్నా వాటితోనే ఆపరేషన్ ఏర్పాట్లు చేసాడు డాక్టరు. శాంకరి డాక్టరుకు సహాయంగా నిలబడింది అనడం కంటే శాంకరికి సాయంగా డాక్టరు నిలబడ్డాడు. సూర్యం, కనకం అచ్చమ్మ తల్లిదండ్రులను ఓదార్చుతున్నారు. ఇద్దరు కలిసి ఆపరేషన్ పూర్తి చేసారు. కడుపులో చావు బతుకుల్లో ఉన్న పిల్లను బయటకు తీసారు. తల్లికి, పిల్లకు జాగ్రత్తగా వైద్యం చేసారు. ప్రాణ గండం దాటింది.

అచ్చమ్మ తల్లితండ్రుల సంతోషానికి హద్దులేవు.

వారం రోజులు పేషెంటును హాస్పటల్లోనే వుంచాలన్నారు.

వాళ్ళు మొదట ఎంత చెప్పినా వినలేదు శాంకరి కోపం చేస్తే ఎదుట చెప్పలేక పోయారు.

"తల్లీ! నువ్వు ఏది చెబితే అదే వింటాము" అన్నారు.

కనకాన్ని యింటికి పంపించి శాంకరి అక్కడే ఉండిపోయింది.

"అమ్మా! శాంకరమ్మా! దేవతలా వచ్చి నా బిడ్డను కాపాడావమ్మా! నీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేనమ్మా!" అంటూ రామయ్య, భార్య, ఆమెకు చేతులెత్తి దండాలు పెట్టారు.

ఆ వార్త వూరంతా తెలియడమే కాదు. చుట్టుపక్కల గ్రామాల వారికి కూడా తెలిసింది. అందరు తమ పిల్లే బతికినంత సంబరపడ్డారు. అందరూ అచ్చమ్మను, పిల్లను చూసి శాంకరిని కూడా చూసి వెడుతున్నారు.

శాంకరికి మనస్సులో చాలా తృప్తిగా ఉంది. రామనాధంగారి, అన్నపూర్ణమ్మగారి సంతోషానికి హద్దులేవు. శాంకరి తన కడుపున పుట్టడమే తమ అదృష్టమనుకున్నారు. సూర్యం, కనకం కనపడ్డవారికి కథ కింద చెబుతున్నారు. సుశీల సంతోషానికి అంతులేదు.

ఏడవ రోజు కుట్లు విప్పింది శాంకరి. బాలింతరాలు తీసుకోవలసిన జాగ్రత్తలెన్నో చెప్పింది. ఆ ప్రకారం తప్పకుండా నడచుకోవాలని చెప్పింది శాంకరి.

అప్పమ్మ తల్లితండ్రులు శాంకరిని ఒక దేవతగా పూజించారు. "చల్లగా నూరేళ్ళు బతుకమ్మా" అంటూ. దీవించారు. తర్వాత పిల్లను యింటికి తీసుకువెళ్ళారు.

డాక్టర్ చంద్రం శాంకరి నేర్పరితనానికి, ఆమె చురుకుతనానికి ఆశ్చర్యపోయాడు. తెలివి ఉండటమే కాదు, వాటిని ఎలా ఉపయోగించు కోవాలో శాంకరికి బాగా తెలుసనుకున్నాడు. శాంకరిలా తనకు చొరవ లేనందుకు సిగ్గుపడ్డాడు. డా॥ చంద్రానికి కళ్ళు మూసినా, తెరిచినా కళ్ళ ముందు శాంకరే కనబడుతోంది. ఆమెను పెళ్ళి చేసుకుంటే ఇద్దరం కలిసి వైద్యం చేయవచ్చనే ఆలోచన అతనికి కలిగింది.

మరునాడు సాయంకాలం ఆరుగంటలయింది.

హాస్పటల్ వెనక చిన్న పార్కులో కుర్చీలు వేయించాడు డా॥ చంద్రం. అంతలో "హల్లో డాక్టర్" అంటూ శాంకరి అక్కడకు వచ్చింది.

"హల్లో డాక్టర్" అన్నాడు చంద్రం తడబడుతూ.

కూర్చోమని కుర్చీ చూపించాడు.

అప్పుడే సన్నజాజులు, చంపేశీలు విచ్చుకుంటూ సువాసనలు వెదజల్లుతున్నాయి. పక్షులు గూళ్ళకు చేరుతూ కలకలరావాలు చేస్తు న్నాయి.

ఆ వాతావరణంలో ఇబ్బందిగా కదిలింది శాంకరి. అంతలో ఆయా పళ్ళు, బిస్కట్లు అందించింది.

"ఇవన్నీ ఎందుకండీ!"

"ఏంలేదు? వట్టి పళ్ళే కదా! ఏదో చిన్న పార్టీ యిద్దామని"

"ఓ! అదా! అయితే సూర్యాన్ని, కనకాన్ని కూడా పిలిచేదాన్ని" అంది శాంకరి నవ్వుతూ.

అయితే ఈసారి వాళ్ళని కూడా పిలుద్దాం! ఇప్పటికి మీరు తీసుకోండి"

"తప్పదంటారా!" అంటూనే శాంకరి తీసుకుని తినడం ప్రారం భించింది.

ఆయా ప్లాస్కులో కాఫీ కప్పుల్లో పోసి అందించింది.

"టీ పార్టీ పూర్తి అయినట్టేనా?" శాంకరి నవ్వుతూ అడిగింది.

"ఆ! అయినట్టేనండి. మీరు యిక్కడ ప్రాక్టీసు పెడితే బాగుం టుంది." మనసులో మాట పైకి అనలేక మరోమాట చెప్పాడు.

"ఇంకా ఏదీ అనుకోలేదు. ఒక ఏడాది మద్రాసు వెళ్ళి పెద్ద హాస్పటల్లో పని చేసి వద్దామనుకుంటున్నా ఇంక వస్తానండి."

శాంకరి ఇంటికి తిరిగి వచ్చేసింది.

"నేను మద్రాసు వెళ్ళి ఒక సంవత్సరం పెద్దాసుపత్రిలో పని నేర్చుకుందామను కుంటున్నానునానా" అంది తండితో.

"పూరికాని వూరు అక్కడ కష్టమవుతుందేమో? అయినా అక్కడ తెలుసున్న వాళ్ళెవరమ్మా!"

"మా ప్రొఫెసర్‌గారిక్లాసుమీట్‌గారికి పెద్ద నర్సింగ్‌హోం ఉందట. ఆయనకు లెటర్ రాసిచ్చారు నాన్నా! అక్కడ ఏ ఇబ్బంది వుండదు''

''పెళ్ళిచేసుకు పెడితే బాగుంటుందమ్మా?'' అన్నపూర్ణమ్మ అడిగింది.

''పెళ్ళి చేసుకుని, సంసారాన్ని మోసుకుని ఎక్కడికి వెడతా? ఇన్నాళ్ళు లేని తొందర ఇప్పుడెందుకమ్మా?"

''అదికాదమ్మా! డాక్టరు చంద్రం నిన్ను చేసుకునే వుద్దేశంతో ఉన్నట్లు తెలిసింది. అతను చాలా బుద్ధిమంతుడు. మాకా వయస్సు వచ్చి మీద పడుతోంది. ముందు కుదుర్చుకుంటే పెళ్ళి తర్వాత చేసు కోవచ్చు కదమ్మా!"

'ఇప్పుడు నేను ఏ నిర్ణయం తీసుకోలేను. శివకుమార్ గుర్తుకు వావ్చడుఅ'త.నికి బహుశా పెళ్ళి అయిపోయి వుంటుంది' అనుకుంది.

అంతలోనే పెళ్ళికాకుంటే "ఏదో కొత్త ఆలోచన, సరికొత్త తడబాటు. ఆమెను వుక్కిరిబిక్కిరి చేసాయి."

ఒక పక్క మద్రాసు వెళ్ళాలని వుంది. మరో పక్కనే పెద్దవాళ్ళైన తల్లితండ్రులు. అయినా భవిష్యత్తు కోసం వైద్య వృత్తికోసం అంతదూరం వెళ్ళడానికే నిశ్చయించుకుంది.

అంతలో రవి రిజల్ట్సు వచ్చాయి. పైగా కాకినాడలో బి.యి. ఇంజనీరింగ్‌లో సీటు వచ్చింది. రామనాథంగారితో పాటు శాంకరి కూడా కాకినాడ వెళ్ళి రవిని ఇంజనీరింగ్ కాలేజీలో చేర్చి వచ్చారు.

ఆరోజు రామనాథంగారికి, అన్నపూర్ణమ్మకు ఎంతో తెరిపిగా అనిపించింది.

"శాంకరి చాలా తెలివైంది. దాన్ని పెళ్ళి కోసం, మనం తొందర చెయ్యకూడదు" అనుకున్నారు ఆ దంపతులు.

శాంకరి మద్రాసుకు బయలుదేరింది. రాజమండ్రిలో మద్రాసు మెయిలు ఎక్కగానే ఉషా కనబడింది. ఆమె కూడా మద్రాసు వెడుతోంది. ఇద్దరి ప్రాణాలు కుదుట పడ్డాయి.

ఆ రోజే సూర్యం శివకుమార్‌కు లెటర్ రాశాడు. అందులో తన స్కూలు, వ్యవసాయం, తన కొడుకు సంగతులు రాశాడు. తర్వాత శాంకరి సంగతి వివరంగా రాశాడు.

ఉత్తరంలో పైభాగం శాంకరి సంగతి రాస్తే, కింద భాగంలో వున్న తన సంగతి అతను చదవడని అతని భయం.

పైగా శాంకరి మద్రాసులో ఎక్కడ వున్నదీ వివరంగా తెలియదు. తెలియగానే మళ్ళీ తెలియజేస్తానని రాసి తృప్తిపడ్డాడు.

శాంకరి వెళ్ళిపోయాక ఊళ్ళో సందడే లేదనుకున్నారుఅందరూ! అసలు యింట్లో కదలిక లేదనుకున్నారు శాంకరి ఇంట్లోవాళ్ళు. "ఎవరు ఏమనుకున్నా శాంకరి అందరి తలలో నాలుక" అనుకున్నారు కనకం, సూర్యం. శివకుమార్ తల్లి అక్కడే వుందని శాంకరికి గుర్తులేదు. సూర్యం కూడా ఆ విషయం ప్రస్తావించలేదు.

# 77

ఒకరోజు శాంకరి అప్పుడే హాస్పటల్ నుంచి వచ్చి బట్టలు మార్చుకుంటోంది. ఉష యింకా రూముకి రాలేదు.

"డాక్టరమ్మా! డాక్టరమ్మా!" అంటూ ఎవరో తలుపు కొడుతున్నారు.

హడావిడిగా చీర కట్టుకుని వచ్చి తలుపుతీసింది శాంకరి.

"మా అమ్మగారు జ్వరంతో మూల్గుతున్నారమ్మా! మీరు వెంటనే రావాలి"

"ఎక్కడ వుంటారు?"

"ఈ లైన్‌లోనే చివరి యిల్లు రండమ్మా!"

శాంకరి కాసేపు ఆలోచించింది. తర్వాత లోపలికి వెళ్ళి జాకెట్టు మార్చుకుని వచ్చింది. మందుల బేగ్ ఆమెకు అందించింది. స్టెతస్కోపు తీసుకుని బయలుదేరింది.

"రండమ్మా! రండి!" తలుపుతీసి పనిమనిషి కోటోలు లోపలికి పిలిచింది

మంచం మీద పడుకుని మూలుగుతోంది ఆవిడ. వయస్సు సుమారు 55 సం॥లు వుండచ్చు. కొంచెం లావుగానే ఉంది. కాస్త ఖరీదైన నేత చీరలో వుంది.

శాంకరి వెళ్ళి ముందు స్టెతస్కోప్‌తో అన్ని భాగాలు చూసింది. తర్వాత థర్మామీటర్‌తో జ్వరం చూసింది 103 వుంది.

"నువ్వు ఏమవుతావు?" కూడా వచ్చినామెను అడిగింది.

"నేను ఈ యింట్లో వంటచేసి పెడతానమ్మా! నా పేరునర్సమ్మ"

"ఊ! ఊ! ఎవరూ లేరా?"

"ఉన్నారమ్మా! అబ్బాయి ఫారిన్‌లో వుంటారు. మేనకోడలు యిక్కడే వుంటారు. సమయానికి వూళ్ళో లేరమ్మా!"

"అలాగా! ఇదిగో మందులు పట్టుకొచ్చి జాగ్రత్తగా వేయండి-

ఇదిగో ఈ ఇంజక్షన్ కొని పట్టుకురా! ఇప్పుడే చేస్తాను" శాంకరి కుర్చీలో కూర్చుంది.

నర్సమ్మ కాఫీ కలిపి పట్టుకొచ్చి యిచ్చింది. మందులు తేవడానికి వెళ్ళింది.

మందులు రాగానే ఆమెకు ఇంజక్షన్ చేసింది. పాలు, బ్రెడ్ పెట్టమని చెప్పింది. మందులు ఎప్పుడెప్పుడు వెయ్యాలో నర్సమ్మకి మరోసారి చెప్పింది. తిరిగి రూముకు వచ్చింది శాంకరి.

"మళ్ళీ ఎప్పుడు వస్తారమ్మా" నర్సమ్మ అడిగింది.

"రాత్రి వచ్చి చూస్తాను"

నర్సమ్మ తిరిగి వెళ్ళిపోయింది.

శాంకరి తిరిగి వచ్చేటప్పటికి ఉష రూములోనే ఉంది.

"శాంకరీ! ఎక్కడికి బయలుదేరి వచ్చావు?"

జరిగిన సంగతి చెప్పింది శాంకరి.

"నువ్వెందుకు వెళ్ళావు? వాళ్ళ డాక్టర్ని పిలుచుకోమని చెప్పకపోయావా?" ఉష కోపం చేసింది.

"ఎవరో పెద్దావిడ? ఇంట్లో ఒకర్తె ఉంది."

'సరేలే ఇక రేపెళ్ళకు? అనవసరంగా జాలి చూపిస్తే ఈ డాక్టర్లు బతకలేరు తెలిసిందా!"

"ఆ తెలిసింది. నీతో వాదనెందుకు?" శాంకరి వంట చెయ్యడానికి లేచింది.

"కూర నేచేస్తా" ఉషకు కూర చెయ్యడమంటే చాలా యిష్టం. కుర్చీలో కూర్చుని కూర తరగడం మొదలు పెట్టింది.

భోజనాలు చేసి ఇద్దరు తెలుసున్న వాళ్ళింటికి బయలుదేరి వెళ్ళి వచ్చారు. వచ్చేటప్పటికి చీకటి పడింది. శాంకరి దారిలో వాళ్ళింటికి వెళ్ళి ఆవిడను చూడ్డానికి బయలుదేరింది.

జ్వరం తీవ్రతకాస్త తగ్గింది. ఆవిడ మూల్గులేకుండా పడుకుంది.

"ఆ మందులే వాడమని చెప్పి శాంకరి రూముకు వచ్చింది."

"ఎలా ఉందే నీ ముసలి పేషెంటు. జ్వరం తగ్గేటట్టువుందా? లేక ———"

"ఊరుకో ఉషా! డాక్టర్లకి చికాకు వుండకూడదే! ఓర్పు ఉండాలి!"

"ఆ వుంటుంది. ఇదిగో రేపు కూడా తగ్గలేదనుకో! నీ కెందు కొచ్చిన బాధ! నర్సింగ్ హోంలో పడెయ్యమను. ఆ నర్సులే చూస్తారు" ఉష మరింత విసుక్కుంది.

"అబ్బా! ఉషా! నువ్విలా ఉంటె వైద్యమేం చేస్తావే? పెళ్ళి చేసుకుని కాపురమేం చేస్తావే?"

"వైజాగ్‌లో అంత జాగ్రత్తగా అన్నీ తెలుసుకునేది. దీనికి ఇంత చికాకు ఎందుకో" శాంకరి ఉష సంగతే ఆలోచించింది. మరునాడు తెల్లవారింది మొదలు ఉష ఒకటే కంగారుగా ఉంది. మధ్యాహ్న మయింది. అంతలో పోస్టుబాక్సు చప్పుడినపడింది. శాంకరి కిటికీలోంచి చూసింది. పోస్టుమాన్ బాక్సులో లెటర్స్ వేసి వెళ్ళిపోయాడు. ఉష వెళ్ళి లెటర్స్ తీసుకొచ్చింది.

"శాంకరీ నాకు లెటర్" ఉష లెటర్ అందించింది తనకు వచ్చిన లెటర్ చింపి చదివింది.

"శాంకరీ! శాంకరీ! అంటూ అరిచింది"

"ఏమైంది ఉషా" కంగారుగా అడిగింది శాంకరి.

"శ్యాం చంద్ర ఈరోజే వస్తున్నాడు!"

"శ్యాంచంద్ర ఎవరు ఉషా"

"మనతో పనిచేస్తున్న డాక్టర్. నేను అతను పెళ్ళి చేసుకోవాలనుకున్నాం. అతను వాళ్ళ వూరువెళ్ళి వారం రోజులయింది. ఇంక రాడనుకున్నా!"

"అదా సంగతి! నీ చికాకు అందుకనా?"

ఉష బుగ్గలు కెంపులయ్యాయి.

"ఈరోజు వస్తున్నాడు. రాగానే రిజిస్టర్ మారేజి చేసుకుందామని రాశాడు"

"చాలా సంతోషం ఉషా! ఇద్దరి చదువులు పూర్తయ్యాయి. ఎక్కడైనా ప్రాక్టీసు పెట్టుకోవచ్చు"

"నీ చేతిలో ఉత్తరం చదువు శాంకరీ! మళ్ళీ నేను శ్యాంచంద్ర కోసం వెళ్ళిపోవాలి" శాంకరి లెటర్ విప్పి చదివింది.

సూర్యం, కనకం వస్తున్నారుట? ఎందుకో రాయలేదు.

"వాళ్ళకేం పని లేదనుకుంటా! తిరగటం తప్పా!"

ఉష బట్టలు మార్చుకుని శ్యాంచంద్ర కోసం వెళ్ళిపోయింది.

అంతలో నర్సమ్మ వచ్చి తలుపు కొట్టింది. శాంకరి తలుపు తీసింది.

"అమ్మగారికి తల నొప్పిగా వుందమ్మా! ఒక్కసారి వచ్చి చూడ మన్నారు."

"అలాగా నర్సమ్మా! జ్వరం లేదుగా?"

"జ్వరం లేదమ్మా! వాళ్ళబ్బాయి రేపు అమెరికా నుంచి వస్తున్నారు. ఒకటే హడావిడి? అందుకే అలసటై తలనొప్పి అంటున్నారు" శాంకరి రూముకు తాళం పెట్టి నర్సమ్మతో బయలుదేరింది.

"రామ్మా! రా డాక్టరమ్మా!" అంటూ ఆవిడ శాంకరికి ఎదురు వచ్చింది. కొడుకు వచ్చే సంగతి సంతోషంగా చెప్పి పక్కనే కూర్చో పెట్టుకుంది.

తర్వాత పక్కనున్న ప్యాకెట్టు అందుకుంది.

"తీసుకో అమ్మా! ఏదో చిన్న కానుక. నా కొడుకు వచ్చేవరకు నన్ను కాపాడావు" అంటూ పట్టుచీర, జాకెట్టు, పళ్ళు శాంకరి చేతితో పెట్టింది. శాంకరి మొహమాట పడింది. ఆవిడ మరింత బలవంత పెట్టింది. ఇంక తప్పదనుకొని శాంకరి అవి తీసుకొని రూముకి తిరిగి

వచ్చింది. శాంకరి వచ్చేటప్పటికి శ్యాంచంద్ర, ఉషా మెడలో పూల దండలతో కూర్చుని ఉన్నారు.

"శాంకరీ! కంగారుపడి తిట్టకు. గుళ్ళో పెళ్ళి చేసుకుని వచ్చాం" ఉష మాటల్లో సంతోషం తొణికిసలాడింది.

స్వీట్సు శాంకరి నోట్లో కుక్కింది. ఉష పక్కన శ్యాంచంద్ర నిండుగా కనపడ్డాడు. తృప్తిగా చూసింది. శాంకరి చేతిలో వున్న పట్టుచీర, పళ్ళు ఉష చేతిలో పెట్టింది. ఆ రాత్రి హోటల్లో రూం తీసుకున్నామని వెళ్ళిపోయారు కొత్త దంపతులు.

మద్రాసు వచ్చి సంవత్సరం పూర్తయింది. వెంటనే తన ఊరు వెళ్ళిపోవాలనుకుంది శాంకరి. రామనాథంగారు త్వరగా వచ్చెయ్యమని ఎన్నో ఉత్తరాలు రాస్తున్నారు.

ఆ రాత్రి శాంకరికి నిద్ర పట్టలేదు. మగత నిద్రలోనే తెల్లవారింది. ఎక్కడో దూరంగా సాధన చేస్తున్న సంగీతరాగాలు మధురంగా వినబడుతున్నాయి. ఎత్తుగా పెరిగిన చెట్లమీద నుండి పక్షుల కలకలారావాలు వినబడుతున్నాయి. తూర్పు కొండ మీంచి వెలుగు రేఖలు నగరమంతా పరుచుకుంటున్నాయి. అప్పటివరకు వున్న చీకటి వెలుగులో కలిసిపోతోంది. క్షణంలో దుఃఖం. క్షణంలో సంతోషం. మధ్యలో చీకటి-వెలుగు. క్షణంలో మగత నిద్ర- క్షణంలో అంతులేని చైతన్యం. శాంకరి మనస్సులో ఎగసిపడుతున్నాయి ఆలోచనలు.

పాలు పోయించుకుని కాఫీ చేసుకు తాగింది. ఆరోజు హాస్పటల్ కి చివర్రోజు. రేపే స్వంత ఊరు ప్రయాణం. ఉత్సాహంగా స్నానం చేసి డ్రస్ చేసుకుంది. వంట చేసుకోవాలని లేదు. "హోటల్లో తిని రావచ్చు" అనుకుంది. అంతలో తలుపుకొట్టారు ఎవరో. వెళ్ళి తలుపు తీసింది. ఎదురుగా సూర్యం, కనకం.

శాంకరిని అమాంతం కౌగిలించుకుంది కనకం.

"సామాను ఏది?"

"చుట్టాలింట్లో పెట్టాం"

శాంకరి కాఫీ కలపబోయింది. కనకం బలవంతగా ఆపేసింది.

"రేపే మా ప్రయాణం. చూడవలసినవి చాలా వున్నాయి. బయలుదేరు" సూర్యం తొందర చేసాడు. శాంకరి రూముకి తాళం వేసి బయలుదేరింది.

నరసమ్మగారు గుమ్మం ముందు నిలబడి వున్నారు.

'రండి! రండి" అంటు ముగ్గురిని లోపలకి ఆహ్వానించింది.

ఇల్లంతా సందడిగా వుంది. ఎదురుగా రాజేశ్వరమ్మగారు కుర్చీలో కూర్చుని వుంది.

"రామ్మా!" నవ్వుతూ పలకరించారు.

"ఈమె శివకుమార్ మదర్. రాజేశ్వరమ్మగారు" సూర్యం మాటలు విని ఉలిక్కిపడింది శాంకరి.

"గిరిజా, సత్యం, వాళ్ళబ్బాయి.

శాంకరి చేతులెత్తి నమస్కరించింది.

బూట్ల చప్పుడైతే తల తిప్పిచూసింది. పచ్చని రంగుతో, ఆరోగ్యవంతమైన శరీరంతో, ఫుల్ సూటులో మేడమెట్లు దిగుతున్నాడు శివకుమార్.

ఇద్దరి చూపులు కలిసి తళుక్కుమన్నాయి. ఇద్దరి శరీరాలలో తెలియని స్పందన. వాళ్ళిద్దరిని చూస్తున్న వారికి కూడా నోట మాటరాలేదు.

అందరు కూర్చున్నాక సూర్యం మాటలు కలిపాడు. ఆ పూట అందరి భోజనాలు అక్కడే! శివకుమార్ పక్కన శాంకరి కూర్చుంది. అందరు తింటున్నారు. పదార్థాలను మెచ్చుకుంటున్నారు. వారిద్దరికి మాటలు లేవు. మనసులే మాట్లాడుకుంటున్నాయి. వాటితోనే కడుపు నిండిపోయింది. భోజనం చెయ్యలేకపోయారు.

తర్వాత సూర్యం వంటరిగా వుండగా అడిగింది శాంకరి "నా సంగతి వీళ్ళకెలా తెలుసు"

"నేనే శివకుమార్‌కి వివరంగా రాసాను. అతను సిక్కోసం ఇండియా వచ్చాడు. ఇంక అడ్డు చెప్పకు. నేను ముందు వెళ్ళి పెళ్ళి ఏర్పాట్లు చేయిస్తాను" శాంకరి సమాధానం చెప్పలేక పోయింది.

"ఇంకేం చెబుతుంది కానీయండి." కనకం సూర్యాన్ని తొందర చేసింది.

"ఎంత చదువుకున్నా!, ఎన్నేళ్ళు వచ్చినా పెళ్ళంటే గాభరాపాటు ఎందుకో" అనుకుంది శాంకరి.

అంత చదువుకున్న శివకుమార్‌లో కూడా ఆతడబాటు ఎందుకో ఇవిప్రకృతిధర్మాలు.శాంకరి మనస్సుమధురస్మృతులలోవూగిసలాడింది.

శివకుమార్‌తో, రాజేశ్వరమ్మ గారితో మాట్లాడి ఆ సాయంకాలమే వాళ్ళ ఊరు బయలుదేరారు. శాంకరిని ఉండిపొమ్మని శివకుమార్, రాజేశ్వరమ్మగారు పట్టుపట్టారు. కాని శాంకరి సూర్యం, కనకం వెంట బయలుదేరింది. శాంకరితో మాట్లాడాలనుకున్నాడు శివా. కాని అవకాశం దొరకలేదు. రైలు కదులుతుంటే శాంకరి చెయ్యి అందుకుని షేక్‌హాండ్ ఇచ్చాడు. ఇద్దరి శరీరాలు పులకరించాయి. మధురభావాల సువాసనలతో మనసులు నిండిపోయాయి.

## 78

శాంకరి ఊళ్ళో అడుగు పెట్టింది. "డాక్టరమ్మ వచ్చింది, డాక్టరమ్మ వచ్చింది" అంటూ దారి పొడుగునా జనం అంటూనే వున్నారు.

"వచ్చేసావా డాక్టరమ్మా! ఇదంతా మా అదృష్టం" సమాధానంగా శాంకరి నవ్వింది.

రామనాథంగారి సంతోషానికి అంతులేదు.

"అన్నపూర్ణా! అమ్మాయి వచ్చింది" రామనాథంగారికంటే మరింత సంతోషించిది అన్నపూర్ణమ్మ. వీధిలో జనమంతా ఆ యింటి ముందే వున్నారు. శాంకరి చేతిలో ఆర్డర్సు పెట్టాడు సూర్యం.

"ఏమిటిది" విప్పి చూసింది శాంకరి.

"ఆ డాక్టరు నీకు భయపడి ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వెళ్ళి పోయాడు. ఆ ప్లేస్‌లో నిన్ను వేయించాను. ధవళేశ్వరం ఆనకట్ట దగ్గర శివాని ఇంజనీరుగా వేయించమంటున్నాడు."

శాంకరి మనస్సు సంతోషంతో ఊగిసలాడింది.

పెళ్ళి ఏర్పాట్లు సింపుల్‌గా చేయాలంది శాంకరి. ఆమె మాట ఎవరూ వినిపించుకోలేదు. భారీఎత్తున చేయించాడు సూర్యాం.

కలకల్లాడుతున్న కళ్యాణ మండపంలో శాంకరి మెడలో తాళి కట్టాడు శివకుమార్. రతీ మన్మధుల్లా వున్నారన్నారు పెద్దలు. సినిమా పెళ్ళిలా వైభవంగా వుందని పిన్నలు పొగిడారు.

"శాంకరీ! నీ ముక్కుకు తాడు వేసాడులే శివకుమార్" కాసులు వేళాకోళం చేసింది.

"లేదండీ బాబూ! నా ముక్కుకే తాడువేసి యిక్కడకు లాక్కొచ్చింది" అన్నాడు శివా. అందరూ నవ్వుకున్నారు.

ఆరోజే హాస్పటల్లో జాయిన్ అవడానికి బయలుదేరింది శాంకరి. కూడా కనకం, కాసులు, సుబ్బులు, సుశీల పిల్లలతోపాటు ఆ వూళ్ళో పెద్దలు, ఆడవారు అందరూ వచ్చారు.

"రోడ్లమీద ఈ హడావిడి ఏమిటి?" శాంకరి ఆశ్చర్యంగా అడిగింది.

"సూర్యం పంచాయితీ ప్రెసిడెంటుగా అందుకని" కాసులు చెప్పింది.

"అయితే రోడ్డుమీద పడ్డాడన్నమాట" శివా మాటలకి అందరు నవ్వుకున్నారు.

శాంకరి హాస్పటల్లో అరుగు పెట్టింది. గుమ్మానికి ఎర్ర రిబ్బన్ కట్టివుంచాడు.

"ఇదేమిటి సూర్యం?" "అంతా మామూలే" అన్నాడు సూర్యం. కనకం కత్తిరి అందించింది. శాంకరి కత్తిరి అందుకుని రిబ్బన్ కత్తి

రించింది. వచ్చిన వాళ్ళంతా చప్పట్లు కొట్టారు. శాంకరి వెళ్ళి కుర్చీలో కూర్చుంది. అప్పుడే అక్కడకు వచ్చిన యిద్దరు ముగ్గురు రోగులను పరీక్షించి మందులిచ్చింది. శివకుమార్ కళ్ళు జ్యోతుల్లా వెలిగాయి.

శాంకరి హాస్పటల్ గదులన్నీ చూసింది. హాస్పటల్‌లో ఒకటే బెడ్ వుంది. మరికొంత మంది రోగులకి బెడ్స్ అవసరమనుకుంది. తర్వాత ఆపరేషన్‌కి అవసరమయ్యే పరికరాలన్నీ చూసింది. కొత్త పద్ధతుల్లో వాడే పరికరాలు లేనేలేవు. వాటిని కూడా వెంటనే తెప్పించా లనుకుంది. ఆ విషయాలన్నీ సూర్యంతో మాట్లాడింది. వాటిని సమ కూర్చుకోడాని అపూటే ప్రయత్నం ప్రారంభించారు. అప్పుడే భోజనాల సమయం కావడంతో అందరు యిళ్ళకు తిరిగి వచ్చారు.

ఆ సాయంకాలం సూర్యం, కనకం, శాంకరి, శివకుమారులతో గ్రామ పెద్దలను కలిసి హాస్పటల్ సంగతి వివరంగా మాట్లాడారు. శాంకరి తెలివి, చురుకుతనం వాళ్ళు ఇదివకే వినిఉండడంవల్ల ఆమె చెప్పేదంతా శ్రద్ధగా విన్నారు. ఆ గ్రామంతో పాటుగా చుట్టుపక్కల గ్రామ వాసులకి కూడా మంచిరోజులొచ్చాయనుకున్నారు. అందరికీ వైద్యం అందుబాటులో వుంటుందని సంబరపడ్డారు. అందుకే చందాలు వసూలు చేసి డబ్బు సమకూరుస్తామన్నారు. హాస్పటల్ అనుకుని వెనుక భాగంలో రోగులు ఉండడానికి రేకుల షడ్డులు వేయించాలని నిర్ణయించారు. ఆపరేషన్‌కి పనికివచ్చే పరికరాలు కొనడానికి కూడా డబ్బు సమకూరుస్తామన్నారు, శాంకరి వాళ్ళు సంతోషంగా తిరిగివచ్చారు.

ఆ రాత్రి నిండు చంద్రుడు ఆకాశ రాజ్యంలో అడుగుపెట్టాడు. ఊరంతా చల్లని వెండి వెలుగులు నిండుకున్నాయి. ఇళ్ళలో జనమంతా నిద్రపోతున్నారు. ఆ నవ దంపతులు నిద్రపోలేదు. శివా శాంకరిని రెండు చేతులతో దగ్గరకు తీసుకున్నాడు. అతని ఒడిలో వాలిపోయింది శాంకరి.

శుభం

# రచయిత్రి ఇతర గ్రంథాలు

1. అమ్మ 2. ఆలాపన 3. జగతి ప్రగతి 4. మానవ తాశిఖరం
5. కాటుక కంటి నీరు - (కవితా సంపుటాలు)
6. న్యాయం గుడ్డిది - (కథల సంపుటి)
7. సంఘం చేసిన భిక్షుకి - (నాటిక)
8. పరివర్తన - (నాలుగు ఏకాంకిలు)
9. రష్యాతో స్నేహ యాత్ర - (రష్యా పర్యటన - అనుభవాలు)
10. కళాతపస్వి రావూరు -
(కళాప్రపూర్ణ రావూరు వేంకట సత్యన్నారాయణగారి జీవితచరిత్ర)
11. ఆంధ్ర సాహిత్యములో హరిశ్చంద్రోపాఖ్యానము (పి.హెచ్.డి. గ్రంథము)
13. చైతన్య స్రవంతి - స్త్రీ సమస్యలపై వ్యాసములు)